# రావిశాస్త్రి నవలానుశీలన

(A critical Analysis on Ravi Sastry Novels)


## డాక్టర్ తాటి శ్రీకృష్ణ

లెక్చరర్; పి.బి.సిద్ధార్థ కళాశాల, విజయవాడ-10



**బసవపూర్ణ పబ్లికేషన్స్**

విజయవాడ-10

**RAVI SASTRY NAVALANUSEELANA**

Dr. TATI SRIKRISHNA


First Edition : January, 1997

Copies : 1000

Price : Rs. 100/-



*for Copies :*
Smt. T. BASAVA PURNA
Kaveri Apartments, F-1,
Mogalrajpuram,
Vijayawada - 520 010.
Phone : 478272



*Sole distribution :*
VISALAANDHRA PUBLISHING HOUSE
Vignan Bhava, 4-1-435,
Bank Street,
Hyderabad - 500 001
and all VISALAANDHRA BRANCHES

Printers : BHAVANA OFFSET PRINTERS



అశేష మట్టి బిడ్డలకూ....

జన్మనిచ్చి; బతుకు తెరువును చూపించి, జీవితమంతా శ్రమించటానికే
పుట్టిన మా అమ్మ శ్రీమతి బాపమ్మ; నాన్న శ్రీ నాగయ్యకూ....

ప్రేమతో-

మీ

# ఆదర్శ మహర్షి

మానవతా మణిదీపం. ఆచరణలో ఆణిముత్యం. నేటి కాలుష్య వాతావరణంలో కారుణ్యమూర్తి శ్రీ సోమూరి వెంకట్రామయ్యగారు.

'కమ్యూనిస్టు కారు'లో టిక్కెట్టులేని ప్రయాణీకులు. శ్రీ సోమూరి వారి గుప్త దానమన్నా అందని సాహిత్య, సాంస్కృతిక సంస్థ విజయవాడలో లేదనేది రెండు రెళ్ళు నాలుగన్నంత నిజం. మనదేశంలో ప్రప్రథమంగా కారల్ మార్క్స్ జయంతిని యాభైవేలతో ప్రతి ఏటా నిర్వహిస్తున్న ఆదర్శవంతులు. కోటీశ్వరులున్న విజయవాడలో 'పామీదత్ భవనా'నికి లక్షలాదిగా విరాళమందించిన వదాన్యులు.

శాంతి-స్నేహ ఉద్యమ సారథిగా జి.డి.ఆర్.-భారత మిత్రమండలి (జర్మనీ) పక్షాన బంగారు పతక విజేత సోమూరి; ఎమ్మెస్సార్, ఎర్నేని అంకినీడుల స్నేహత్రయం మరువలేనిది. భారత-జి.డి.ఆర్. మిత్రమండలితో ప్రారంభమైన మా ఇద్దరి అనుబంధం, ఆత్మీయానురాగ బంధంగా పరిమళిస్తూ, నాపట్ల ఎనలేని వాత్సల్యాన్ని చూపిస్తూ, ఈ గ్రంథం ఇంత ముచ్చటగా వెలువడటానికి తానొక్కరే 'కాడి మొత్తాన్ని మోసినా'-కొండంత సహాయపడ్డా గోరంతగూడ తెలియనియ్యని మర్మజ్ఞాని; కర్మధ్యాని -

ఆ మహాత్మునికి; ఆ మహర్షికి; ఇవే నా కృతజ్ఞతాంజలులు.

**తాటి శ్రీకృష్ణ**

*17-01-1997*

# విషయసూచిక

# కృతజ్ఞతలు

వాళ్ళనీ, వీళ్ళనీ పరిచయం చెయ్యటం, చేర్పించటం, ఇవేనా, నువ్వేమన్నా రీసెర్చి చేసేదుందా? అని కాలయాపన జేస్తున్న నన్ను దాదాపు దశాబ్దినాడే రీసెర్చిలో చేరటానికి మార్గం చూపించినా, కారణాంతరాలవల్ల చేరలేకపోయాను మళ్ళీ నాకు 'రావిశాస్త్రి నవలల'పై పరిశోధన చెయ్యటానికి అవకాశం కల్పించి; చాప్టర్స్ డివిజన్ దగ్గర్నుండి, చివరివరకు మార్గదర్శకులుగా నన్ను నడిపించి 'అభినందన'న నందించిన పూజ్యులు, అర్ధశత గ్రంధకర్త; నిరంతర సాహితీ కృషీవలుడు, శ్రేయోభిలాషులు, గురువర్యులు ఆచార్య యస్ గంగప్పగారికి మొదటిగా నా నమోవాకాలు.

నేను పరిశోధన చేసుకుంటానికి అనుమతించిన మా సిద్ధార్థ అకాడమీ పాలక మండలికి నా నమస్సులు. సహకారాన్నందించిన మా కళాశాల ప్రిన్సిపల్ శ్రీ కె ప్రసాదరావుగారికి, డిగ్రీ కళాశాల ప్రిన్సిపల్ శ్రీ యస్వీయస్. శాస్త్రిగారికి, విలువైన గ్రంధాల నందించిన మా సిద్ధార్థ కళాశాల గ్రంధాలయాధికార్లకి, సోషల్ సైన్సెస్ గ్రందాలయానికి, రాగూర్ గ్రంథాలయం వారికి 'తల్లిలాంటి' మా సిద్ధార్థ కళాశాలకి సర్వదా కృతజ్ఞుణ్ణి.

మా ఆంధ్రశాఖ సహోదరులకు; కళాశాల అధ్యాపక మిత్రులకు కృతజ్ఞుణ్ణి.

నా శ్రేయస్సుని, మా కుటుంబ క్షేమాన్ని కాంక్షిస్తూ నిరంతరం మాకు సహాయ. సహకారాన్నందిస్తున్న ఆత్మీయ శ్రేయోభిలాషులు, మానవతామూర్తులైన; డిస్ట్రిక్ట్ గవర్నర్ 324 సి.1, లైన్ శ్రీ చిగురుపాటి వరప్రసాద్; శ్రీమతి మంజువాణీ దంపతులకు నా నమస్సులు.

నా జీవన స్థిరత్వానికి సహాయపడిన పెద్దలు పూజ్యులు శ్రీ కరారి సత్యనారాయణరావుగారికి నా నమస్సులు మిత్రులు శ్రీ కరారి ఈశ్వరకుమార్‌గారికి; సోదరులు ఆచార్య కడప రమణయ్యగారికి నమస్సులు. మిత్రులు, విజయవాడ పడమర శాసనసభ్యులు శ్రీ కె సుబ్బరాజుగారికి నమస్సులు.

నన్ను ప్రోత్సహిస్తూ; సోదరుడిలా ఆదరించే; శ్రీ సిహెచ్ సత్యనారాయణమూర్తి; శ్రీ టి. సత్యనారాయణ, శ్రీ డి వి వై.ఎన్.శాస్త్రి; శ్రీ బి.వి రెడ్డి; శ్రీ బి. తిరుపతిరావు; శ్రీ ఎం వి.ఎన్ పద్మారావు; శ్రీ జి.చలం, శ్రీ వై వెంకటేశ్వరరావు; శ్రీ పి సుబ్బారావు (విజయ లేబ్); శ్రీ ఎ. నాగేశ్వరరావు (విశాఖ); డా॥ బి. సాంబశివరావు; డా॥ టి. కృష్ణమోహన్; శ్రీ ఎం.ఎం కొండయ్య (ఆర్ కె.); శాంతి ఉద్యమ నాయకులు శ్రీ పి. రాఘవయ్య, శ్రీ జేసుపాదం (డి.ఇ.ఓ.); సోదరుడు డా॥ జి. సాంబశివరావు; శ్రీమతి పి సత్యవతి, శ్రీమతి సోమూరి ప్రమీల (ప్రిన్సిపల్) గార్లకు కృతజ్ఞుణ్ణి. కవర్ పేజికి సహకరించిన మిత్రులు శ్రీ పి వి రమణకు కృతజ్ఞతలు.

పరిశోధనా సమాచారాన్నందించి, సహకరించి విలువైన అభిప్రాయం "రావిశాస్త్రి"ని రాసినందుకు విరసం చలసాని ప్రసాద్‌గారికి; రావిశాస్త్రి కుటుంబ సభ్యులకు; శ్రీ కాళీపట్నం రామారావుగారికి; శ్రీ పతంజలి గారికి; శ్రీమతి బి. సుందరమ్మ (బీనాదేవి) గారికి నమస్సులు గురుమిత్రులు శ్రీ వేగుంట మోహనప్రసాద్‌గారికి నమస్సులు. శుద్ధ ప్రతిని సిద్ధంజేసిన శ్రీమతి బి. లక్ష్మికి కృతజ్ఞుణ్ణి.

నేను ఈ విద్యావంతుడి జీవితం గడపటానికి పునాదివేసి ఆశీర్వదించిన మా అమ్మమ్మ స్వర్గీయ శ్రీమతి కందుల గంగమ్మగారికి జీవితాంతం కృతజ్ఞుణ్ణి.

నేను విద్యావంతుణ్ణి కావటానికి సహకరించి, ఆశీర్వదించిన గురువులందరికీ సర్వదా కృతజ్ఞుణ్ణి.

నన్ను ఎంతగానో అభిమానించి, ఆదరించే మా మామయ్య శ్రీ ఆదిన సాంబయ్య; అక్కయ్య శ్రీమతి సామ్రాజ్యంగార్లకు నా నమస్సులు.

నన్ను ప్రేమతో చూసుకొనే నా తమ్ముడు శేషగిరిరావు; మా పి. వెంకట నారాయణ, ఎ. శ్రీవెంకటేశ్వరరావు; కె. తిరుపతిరావుగార్లకు కృతజ్ఞుణ్ణి.

'ఆ రీసెర్చిపని చూసుకోండి'అని నిరంతరం నాకు గుర్తుజేస్తూ; నన్ను ప్రాణంగా జూసుకునే నా శ్రీమతి బసవపూర్ణ, నాకు చేదోడు, వాదోడుగా వున్న మా అమ్మాయి సుజాత; అబ్బాయి ప్రశాంత్; సహకారాన్నందించిన మా లక్ష్మి అభినందనీయులు.

సాహిత్య; సామాజిక మార్పుకు అంకితమైన శ్రీ వరవరరావు (వి.వి.)గారు మిత్ర వాత్సల్యంతో రాసిన "Blurb"ని గౌరవంగా భావిస్తూ; ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఇంకా పరోక్షంగా-ప్రత్యక్షంగా సహకరించిన మాన్యులందరికీ అభివందనాలు.

- తాటి శ్రీకృష్ణ

# భూమిక

తెలుగు వచన సాహిత్యంలో అత్యంత ప్రతిభావంతులు వస్తుపరంగా శిల్పదృష్ట్యా నవలా సాహిత్యాన్ని వినూత్న పద్ధతిలో నడిపించిన, ఉత్తరాంధ్ర పేద ప్రజల జీవద్భాషా రచనా శిల్పి, పీడిత ప్రజలకు కొండంత అండ, రాచకొండ విశ్వనాథశాస్త్రి. వచన రచనా వైవిధ్యంలో శాస్త్రి గురజాడ వారసులు. వామపక్ష ఉద్యమాల ఐక్య భావస్ఫూర్తిగల ప్రగతి కాముకులుగా విప్లవ రచయితల సంఘం (వి.ర.సం) వ్యవస్థాపక ప్రముఖునిగా బాధా సర్పదష్టుల పక్షాన నిలిచిన న్యాయవాదిగా రావిశాస్త్రి సుప్రసిద్ధులు. నిబద్ధత నిమగ్నతలను ముద్రలుగా గాకుండా నిజాయితీ; చిత్తశుద్ధితో; రచనలు జేసి పాలకవర్గ, పెట్టుబడి దారీ వ్యవస్థలని ఎండగట్టి, పాలిత పేద ప్రజల పక్షాన నిలిచిన రావిశాస్త్రి నవలలు, ఆయన జీవితం నన్నాకర్షించాయి. అందుకని రావిశాస్త్రి నవలలపై పరిశోధన చేసాను. "రావిశాస్త్రి నవలానుశీలన" సిద్ధాంత వ్యాసానికి నాగార్జున విశ్వవిద్యాలయం 1996లో డాక్టరేట్‌ను ప్రదానం చేసింది. గతరెండు దశాబ్దులు, తెలుగు సాహిత్య దశను, దిశను మలుపు దిప్పాయి. అందుకు ప్రపంచ పరిణామాలు కూడా దోహదపడ్డాయి. రావిశాస్త్రి గూడ 1970 తరువాత స్పష్టమైన వర్గ దృక్పథం గల ఉత్తమ నవలలు రాయటం దీనిలో భాగం. సాహిత్యం సమాజాన్ని ప్రతిఫలింప జెయ్యాలి. ఇతర ప్రక్రియల కన్నా నవలా సాహిత్యమే జీవితాన్ని విస్తృతంతగా ఫోటో దియగలుగుతుంది; లోటు పాటుల్ని చూపించి మార్పుకు దోహద పడగలుగుతుంది. సామాజిక వాస్తవికతతో అభ్యుదయ ప్రగతి కాముక భావ జాలంతో నిండిన రచన సామాజిక మార్పును వేగవంతం జేస్తుందనేది యధార్థం. వస్తు, శిల్ప పరంగా రావిశాస్త్రి నవలలకి, మరీ ముఖ్యంగా 'గోవులోస్తున్నాయి జాగ్రత్త', 'సొమ్ములుపోనాయండి' కీ ఈ శక్తి ఉందని నా నమ్మకం. అణచి వేతకు గురవుతున్న ప్రజానీకంలో ఆలోచనను, ఆత్మవిశ్వాసాన్ని పెంచి, "అన్యాయాన్ని ఎదిరించేవాళ్ళు, చిట్టచివరకు అన్యాయాల వల్ల బాధ పడేవాళ్ళవుతారు గాని మరొకరు అవరు." అసె సత్యానికి అద్దం పడతాయి రావిశాస్త్రి రచనలు. అతి సాధారణ అట్టడుగు పాత్రలు, అద్భుత అలంకారిక శైలి, మాండలిక భాషా విన్యాసం; దైనీయ స్త్రీల జీవితాలు, పోలీస్, కోర్టుల యథార్థస్థితి సామాజిక, రాజకీయ దురన్యాయం- ఇవి ఆయన నవలల్లో దర్శనీయమవుతాయి.

కొన్ని పరిమితులతో ఈ పరిశోధనను రావిశాస్త్రి నవలలకే పరిమితం జేసుకున్నాను. ఆయన సమగ్ర రచనలపై ఇంకా విస్తృతంగా పరిశోధన జరగవలసి ఉంది.

విజయవాడ

18-1-97

తాటి శ్రీకృష్ణ

# అభినందన

ఆచార్య యస్. గంగప్ప, ఎం.ఎ., పిహెచ్.డి.
నాగార్జున విశ్వవిద్యాలయ
ఆంధ్రాశాఖాధ్యక్షులు (రిటైర్డ్)

ఆధునిక సాహిత్యంలో తెలుగుగడ్డపై వెలసిన ఉత్తమ నవలాకారుల్లో-అందునా వామపక్ష భావజాలానికి నిబద్ధుడై చేసిన రచనా వ్యాసంగంలో-ప్రముఖులు రావిశాస్త్రి. న్యాయవాదిగా వృత్తి సాగించినా, స్వేచ్ఛా జీవనానికనుగుణమైనరీతిలో తన ప్రవృత్తిననుసరించి రచయితగా ప్రసిద్ధి పొందడం మరో విశేషం. తన ప్రవృత్తికి తన వృత్తి సహకరించింది, రచనకు దోహదం చేసింది. రావిశాస్త్రి నవలలపై సంపూర్ణావగాహనతో విశిష్ట విశ్లేషణాత్మకమై, రావిశాస్త్రి హృదయావిష్కరణకుద్దిష్టమైన రచనలు రాలేదనే చెప్పవచ్చు. ఆ లోటు తీర్చడానికే ప్రస్తుత సిద్ధాంత వ్యాసం రావిశాస్త్రి నవలానుశీలన పరిశోధకుడు శ్రీ టి. శ్రీకృష్ణ.

వాస్తవానికి వామపక్షభావాన్నిగూర్చి మంచి అవగాహన గలిగిన టి.యల్.కాంతారావు జీవించేవుంటే 'రావిశాస్త్రి కథా ప్రపంచం' అనే అంశంపై నా పర్యవేక్షణలో ఇంతకుముందెప్పుడో మంచి సిద్ధాంత వ్యాసం వచ్చి ఉండేది. ఈ సందర్భంలో అది విషయాంతరమే అయినా ప్రస్తావించడం అవసరమని భావిస్తున్నాను.

ఏమైనా నా పర్యవేక్షణలో జరిపిన పరిశోధనాంశాల్లో ఎంతో వైవిధ్యముంది ప్రాచీన సాహిత్య ప్రక్రియలతోపాటు ఆధునిక సాహిత్య ప్రక్రియాలైన కవిత, కథ, నవల, నాటకం మొదలైనవేగాక జానపద సాహిత్యం, జానపద ప్రదర్శన కళారూపాలపై పరిశోధన జరిగింది ఆధునిక సాహిత్యంలో ప్రత్యేకించి వామపక్షభావజాలానికి సంబంధించిన అనేకాంశాలపై సుమారు సగానికి సగం సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి. తెలుగులో వచన కవితావిర్భావ వికాసాలు, కొడవటిగంటి కుటుంబరావు కథాసాహిత్యానుశీలన, తెలుగు నవలా సాహిత్యంలో హరిజనాభ్యుదయం, తెలుగునాటకరంగం-నూతన ధోరణులు ప్రయోగాలు, తిరునగరి రామాంజనేయులు-జీవితం, సాహిత్యం; ఆచార్య ఆత్రేయ నాటకాలు, చలం నాటక సాహిత్యం, నరసరావుపేట తాలూకా జానపద గేయాలు, వేమూరు మండలం జానపద గేయాలు, తెలుగులో బుర్రకథలు. బుర్రకథా పితామహ పద్మశ్రీ షేక్ నాజర్ మొదలైన పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసాలేగాక, నార్ల కొత్తగడ్డ జి.వి.కృష్ణారావు నాటికలు, కొడవటిగంటి కుటుంబరావు నాటికలు, బైరాగి నూతిలో గొంతుకలు మొదలైనవి ఎం.ఫిల్. డిగ్రీ లఘు సిద్ధాంత వ్యాసాలు వచ్చాయి.

ప్రస్తుతం శ్రీకృష్ణ సిద్ధాంత వ్యాసం రావిశాస్త్రి నవలానుశీలన! పట్టా ప్రదానం కాగానే ఈ సిద్ధాంత వ్యాసం అచ్చుకావడం విశేషం. ఇది వెలుగుచూడడానికి కారణభూతులు వామపక్షభావజాలాన్ని వెదజల్లాలన్న బద్ధకంకణులు, వితరణశీలురు, అపరకర్ణులు, సాహిత్యాభిమానులు, స్వాతంత్ర్య సమరయోధులు పూజ్యులు శ్రీ సోమూరి వెంకట్రామయ్యగారు. వారి ఉదార స్వభావం అందరికీ తెలిసిందే.

శ్రీకృష్ణ వామపక్షభావాలచేత ఆకర్షితుడై, ఇండో జి.డి.ఆర్. రాష్ట్ర కార్యదర్శిగా పనిచేసి, తదనుగుణంగా మంచి కార్యకర్తగా అనుభవం గడించి, మార్క్సిస్టు సిద్ధాంతాలను

అవగాహన చేసుకొన్నవాడు. కనుకనే రావిశాస్త్రి నవలలపై పరిశోధించి సమర్పించిన సిద్ధాంత వ్యాసానికి డాక్టరేట్ పొందారు.

ఈ సిద్ధాంత వ్యాసంలో ఏడు ప్రకరణాలున్నాయి. మొదటి ప్రకరణం రావిశాస్త్రి జీవనరేఖలను, రెండో ప్రకరణం నవలేతివృత్తాలను, మూడోది పాత్ర చిత్రణను, నాల్గోది సామాజిక వాస్తవికతను, అయిదోది మార్క్సిస్టు దృక్పథాన్ని, ఆరోది రావిశాస్త్రి ప్రభావాన్ని, ఏడోది చివరిది రావిశాస్త్రి నవలాకారుడిగా సాధించిన స్థానాన్ని వివరిస్తాయి. ఇందులో ప్రధాన ప్రకరణాలు రెండు. అవి నాలుగు, అయిదు; రావిశాస్త్రి నవలల్లోని సోషలిస్టు వాస్తవికతను, మార్క్సిస్టు దృక్పథాన్ని అభివ్యక్తీకరిస్తాయి. ఈ ప్రకరణాల్లో సిద్ధాంతాలను వివరించి, వాటిలో రావిశాస్త్రి నవలల్లోని అంశాలను సమన్వయించిన తీరు అత్యంత నవ్యంగా జరిగిన కృషి; ఆ పరిశోధనలో శ్రీకృష్ణ కృతకృత్యుడయ్యాడనడం సముచితం. ఆరో ప్రకరణంలో రావిశాస్త్రి పూర్వ, సమకాలికులవల్ల పొందిన ప్రేరణ, తదుచిత రచన విశేషాలను, రావిశాస్త్రిని అనుసరించి, ప్రేరణ పొంది తెలుగులో రచనలు చేసినవారికి, వారి రచనలను వివరించి, కళ అందరి సొత్తు అనే అంశాన్ని నిరూపించాడు. అంతేగాక కళ కళకోసంకాదు, సమాజ సముద్ధరణకోసమనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నిరూపించి వివరించాడు, నిబద్ధతగల రచయితగా రావిశాస్త్రి రచనా వ్యాసంగాన్ని వామపక్ష భావజాలానుగుణమైన రీతిలో ఆవిష్కరించిన శ్రీకృష్ణను మెచ్చుకోకతప్పదు. ఈ రచనకు అనుబంధాలు వన్నె తెచ్చాయి. సిద్ధాంత వ్యాసం శాస్త్రీయంగా సాగింది చక్కటి ప్రణాళికలో. అయితే అన్నీ ప్రశంసలేనా? ఏమైనా ఈ రచనను మరింతగా రూపొందించుకోడానికి సూచనలున్నాయంటే, సద్విమర్శక దృష్టితో చూసినప్పుడు ప్రశంసతోపాటు దోషపరిహారానికీ సూచనలివ్వడం అవసరమనే భావిస్తాను. 1 ఇతివృత్త పాత్రచిత్రణల ప్రకరణాల్లోని విషయాన్ని మరింతగా క్లుప్తీకరిస్తే బాగుండేది. 2. రచన మరింత పటుత్వంలో సాగితే సముచితంగా ఉండేది. 3. అచ్చుదోషాలు, అస్తిత్వపోరు, మానసిక వత్తిడి, సామాజిక పోకడలను, సామాజిక కట్టుబాట్లు, వేశ్యరికం, ముఖ్య సపోర్టర్, శాంతివంతంగా, వస్త్రకొలత, నూతన మార్పు, సంపన్న పెట్టుబడిదారీవర్గ పాత్రలు, ప్రాపంచిక పోకడపై, సామాజిక లోతుపాతులు, మానవ విలువలు, అధికార జులుం, నవలా ఎదుగుదల, శ్రామిక అట్టడుగు మొదలైన సమాస దోషాలు లేకుంటే సిద్ధాంత వ్యాసానికి వన్నె చేకూరేది. ఈ ముద్రణలోనే వీటిని తొలగిస్తే సొగసుగా ఉండేది. కాకపోయినా బావికాలంలో మరో ముద్రణలో-పొందే అవకాశముంటే-చేయడం ఎంతైనా అవసరం. ఈ సూచనలు సిద్ధాంత వ్యాసాన్ని మరింత ప్రమాణికం చేయడానికేనని గ్రహించడమవసరం.

నా పర్యవేక్షణలో రావిశాస్త్రి నవలలపై ఇంత మంచి పరిశోధనచేసి డిగ్రీ పొందడమేగాక ప్రకటిస్తూన్న డా॥ టి.శ్రీకృష్ణను మనసారా అభినందిస్తూన్నాను. ఇంతటితో సంతృప్తిపడక ఇతోధిక కృషిచేసి మరిన్ని రచనలను వెలువరించాలనీ ఆశిస్తున్నాను. కారణమేమంటే ఈనాడు పరిధోధకులు డిగ్రీ పొందడమే పరమావధి అన్నట్లు తదనంతరం పరిశోధన సాగించడం లేదు. అందరిలాగాక ప్రత్యేకించి శ్రీకృష్ణ బోధనతోపాటు పరిశోధన సాగిస్తారని ఆశిస్తూ మరోసారి అభినందిస్తున్నాను.

**ఎస్. గంగప్ప**

19-1-97

# రావిశాస్త్రి

పది మృతభాషలనీ, ఇరవైమంది ముసిలి ప్రొఫెసర్లని పోషించడానికి ఒక యూనివర్శిటీ పెట్టమని ఓహెన్రీ ఛలోక్తి, పాతని నెత్తికెత్తుకుని, పాండిత్యానికి నివాళి పట్టేకన్నా, కొత్తని ఆహ్వానించి, జ్ఞానాన్ని పెంపొందించడం మిన్న. పాండిత్యభారం పెరిగితే సాటి మనిషిమీదా, సమాజంమీద చులకనభావం, తృణీకారం ఏర్పడ్తాయి. పాండిత్యం ఒక స్వీయ ప్రయోజనం (వెస్టెడ్ ఇంటరెస్ట్) అయ్యే ప్రమాదం వుంది. దీన్ని ఒక కంట కనిపెట్టి వుండాలి. ఏనాటి నుంచో జ్ఞానసముపార్జన సమాజాన్ని ముందంజ వేయించడం వాస్తవమే. నీ జ్ఞానానికీ, సమాజానికి సంబంధం లేనప్పుడు ఆ జ్ఞానాం నిరర్ధకం.

సమాజ హృదయమే సాహిత్యం అన్నాడు గోర్కి. సమాజానికి సాహిత్యం ప్రతిబింబం అన్నారెందరో. సాహిత్యం అనేది మంచికి హాని, చెడ్డకి సాయం చేయకుండా జాగ్రత్త పడాలని రావిశాస్త్రి గారు పదేపదే హెచ్చరించేవారు. పైగా మంచి చెడ్డలని నిర్ణయించుకోవడంలోనే మానవ చరిత్ర సాగుతుందనీ, మంచి చెడ్డల సంఘర్షణలోనే మానవ చరిత్ర ఇమిడి వుందనీ కూడా రావిశాస్త్రిగారి గట్టినమ్మకం. ఆయన సాహిత్య దృక్పథం కూడా అదే.

సమాజం నుంచి సాహిత్యం పుట్టినట్టే, సాహిత్యం నుంచి సాహిత్య పరిశోధన పుట్టింది. పరిశోధన కేవలం ఎకడమిక్‌గా సాగడం వల్ల ఆట్టే ప్రయోజనం వుండదు. అయితే రచనల గురించీ రచయితల గురించి ఎన్నో అంశాల పట్ల ఎందరెందరికో ఎంతో ఆసక్తి వుంటుంది. ఇది సహజం. సాహిత్య పరిశోధకులు ఈ సంగతి బాగా గుర్తుంచుకోవాలి. రాతల్లోనూ, రాసేవారిలోనూ అవ్యక్తంగావున్న అంశాలని విశదీకరించాల్సింది పరిశొధకులే. అంతేకాదు, రచయితల మీద వుండే వివిధ ప్రభావాలు వెల్లడించడం కూడా పరిశోధన పనే. రచయితలకి దృక్పథం ఎలా అలవడిందో, ఆ దృక్పథం పాత్ర ఏమిటో కూడా విప్పిచెప్పాలి పరిశోధన. సాహిత్యేతర వ్యక్తులూ, శక్తులూ సాహిత్యంలో చొరబడకుండా వుండడం సాధ్యంకాదు, వాంఛనీయంకూడా కాదు. కవిత్వం పూజాద్రవ్యం కానట్టే, సాహిత్యం ఒక పరిశుద్ధ పేటికకాదు. అది ఒక జల ప్రవాహం. ప్రవాహం అనగానే ఎన్నో కలుస్తాయి. ఎన్నెన్నో వచ్చిచేరతాయి. ఈక్రమాన్ని పరిశీలించి, ప్రవాహవేగాన్ని పసిగట్టవలసింది కూడా పరిశోధనే. అందువలన పరిశోధనలో నిజానికి చాలా పెద్ద పనులే వున్నాయి. అవి అంతసులువైనవీ కావు, తేలికయినవి కావు. వీటికి శ్రమ, పరిశ్రమ కావాలి. కనక పరిశోధకులను ఒకరకం శ్రామికులనవచ్చును కూడా. శ్రామికులకి శక్తి, ఆసక్తి, నిజాయితీ, చిత్తశుద్ధి వుంటాయని నమ్ముతాం, ఉండాలని కోరుకుంటాం.

సాహిత్యంలో జీవిత చిత్రణ వుంటుంది. రచయిత దృక్పథం అంతర్లీనంగా వుంటుంది. జీవిత చిత్రణలోని వెలుగు నీడల మీదా, రచయితల దృక్పథంలోని

లోటుపాట్ల మీదా సాహిత్య విమర్శ బాధ్యతాయొతమైన అంచనాకి రావలసి వుంటుంది. అందుకు తోడ్పడ గలిగేదే నిజమైన సాహిత్య విమర్శ అనిపించుకుంటుంది. అలాగే సాహిత్యంలో వ్యక్తయమ్యే రచయిత దృక్పథం మీద వీలయినంత విశాలమైన పరిశీలనకి సాహిత్య విమర్శలో చోటుండాలి. అప్పుడే ఆ విమర్శకి సమగ్రత వుంటుంది. సాహిత్య పరిశోధనలొ సాహిత్య రచన, సాహిత్య విమర్శ కలగా పులగంగా వుంటాయి. పరిశోధన పరిధిలోకి చరిత్ర, రాజకీయ, ఉపరితల అంశాలెన్నో వస్తాయి. ఈ అంశాల విస్తృతి కూడా చాలా ఎక్కువగా వుంటుంది. అందువల్ల సాహితీ పరిశోధన విశ్వవ్యాప్తమంత విశాలమైంది. ఒకరకంగా అందులోకి అన్నీ చొరబడతాయి. దేనినీ నిరోధించలేము. నిరోధించకూడదు. మడులు,దడులు విధినిషేధాలు అనేవి సాహిత్య పరిశోధనలో వుండవు. అయితే సాహాత్య పరిశొధనకి అవకాశాలు, వెసులుబాటు, వనరులు ఇలాంటివి ఎన్నెన్నో కావాలి.

అందువల్ల సమాజానికి సాహిత్యంప్రతిబింబం అయినట్టే సామాజిక అభివృద్ధికి కొలబద్ధగా మనం సాహిత్య పరిశోధనని పరిగణించవచ్చు. ఈ 20 ఏళ్ళుగా సాహిత్య పరిశోధన చాలా ఎక్కువగా జరుగుతోంది. ఇందుకు ముఖ్యంగా తోడ్పడినవి మన జీవితంలో పెరిగిన వనరులు. వీటి ఆసరా లేనిదే పరిశోధన ఇంత పెరిగి వుండేది కాదు. జీవితంలో మనకి ఒనగూడినవన్నీ మొత్తంగా తిరిగి సమాజానికి వినియోగపడినప్పుడే వాటి సార్ధకత.

సాహిత్య పరిశోధనా రంగంలో కృషి చేసేవారు చాలా ఓపిగ్గా సమాచార సేకరణ చేయాలి. అలా పోగుపడిన విషయం అంతా ముందుంటుంది. దాన్ని ఒక క్రమ పద్ధతిలో పెట్టుకోవాలి. సాహిత్య రచనలోని అన్ని అంశాలని విశదీకరించడానికీ, పాఠకుల అవగాహన పెంచడానికి ఈ సమాచారం తోడ్పడుతుంది. ప్రపంచంలో దేనికయినా అడ్డదోవ వుంటుంది గాని జ్ఞానాని (knowledge)కి మాత్రం అడ్డదోవ లేదన్నాడు మావో. ఈ మాట మరీ మరీ మనం మననం చేసుకోవాలి. సాహిత్య పరిశోధన సాహిత్య స్థాయిని అందుకోవడానికి ప్రతి పిహెచ్.డి పట్టా ఒక మెట్టుకావాలని కోరుకునే వాళ్ళలోనేనొకడిని.

అలాగే ఈ శ్రీ కృష్ణగారి పట్టా కూడా ఒక మంచి మెట్టుగా పనికొస్తుందని ఆశిస్తూ....

విజయవాడ
15-1-1997.

**చలసాని ప్రసాద్**

# 1. రావిశాస్త్రి జీవన తరంగాలు

## 1. మహోదయం

1922 జులై 30న, తెలుగు సంప్రదాయం ప్రకారం దుందుభినామ సంవత్సరం, శ్రావణ సప్తమినాడు రాచకొండ విశ్వనాథశాస్త్రి పుట్టారు. నవయుగ దిక్సూచి గురజాడ అప్పారావు కూడా దుందుభిలోనే పుట్టారని తెలిసిన తరువాత రావిశాస్త్రి పరమానందం చెందారు. శాస్త్రిగారి తల్లి సీతారామలక్ష్మి, తండ్రి నారాయణ మూర్తి. శ్రీకాకుళంలోని మేనమామల ఇంట శాస్త్రి జన్మించారు. అచ్చట, ముచ్చట, ఆట-పాట, కొద్దోగొప్పో చదువు, సంధ్యలతో కాలం గడిపింది అనకాపల్లి దగ్గరలో ఉన్న తుమ్మపాలలోనే. అనకాపల్లికి షుమారు మూడు కిలోమీటర్ల దూరంలో ఉంది తుమ్మపాల. చిన్నప్పుడే పుస్తకాలు చదవాలనే ఆసక్తితో అనకాపల్లి నడిచివెళ్ళి శారదా లైబ్రరీలో పుస్తకాలు తిరగేసే వారు. రాచకొండ వెంకటప్రసాద విశ్వనాథశాస్త్రి అనేది ఆయన చిన్ననాటి పేరు.

శాస్త్రి కుటుంబం, బంధువర్గమంతా విద్యావంతులే. తండ్రి న్యాయవాది. తల్లికి భారత, రామాయణాది గాథలతో బాగా పరిచయముంది. అన్న మహదేవ శాస్త్రి ఇంజనీర్. తమ్ముళ్ళు నరసింహశాస్త్రి డాక్టర్, సుబ్బారావు ఏజి. బియ్యస్సీ., చెల్లి నిర్మల డాక్టర్.

"అటు మూడు తరాలు, ఇటు మూడు తరాలు కూడా వారి కుటుంబంలో న్యాయవాదులే"[1] నని తాతా శ్రీరామమూర్తి మెచ్చుకోలు.

"మాతామహ వంశంలో శాస్త్రిగారికి సాక్షాత్తు మాతామహుడు తెన్నేటి విశ్వనాథశాస్త్రిగారు. శ్రీకాకుళంలో అగ్రశ్రేణి క్రిమినల్ లాయరుగా ఆరోజుల్లో ప్రసిద్ధులు. శాస్త్రిగారికి వారి పేరే పెట్టారు. క్రిమినల్ ప్రాక్టీసులో వారంత పేరు వీరు తెచ్చుకున్నారని అంటారు"[2] అని తన దగ్గర షుమారు దశాబ్దికాలం జూనియర్‌గా, సహచరునిగా కలిసి పనిచేసిన శాస్త్రి గురించి తాతాశ్రీరామమూర్తి కితాబు.

సీతారామలక్ష్మి శాస్త్రీయ సంగీతం క్షుణ్ణంగా నేర్చుకున్నారు. ఆరోజుల్లోనే ఇంగ్లీషు నవలల్ని ఒక స్త్రీ ఆసక్తిగా చదవగలిగే జ్ఞానం సంపాదించటం ముదావహం.

## 2. విద్యాభ్యాసం

రావిశాస్త్రి పాఠశాల విద్యాభ్యాసమంతా ఏ.వి.ఎన్. (శ్రీమతి అంకితం వెంకట నరసింహారావు) కాలేజి-హైస్కూల్లో విశాఖలోనే గడిచింది. ఏ.వి.ఎన్. కాలేజన్నా, హైస్కూలన్నా, రావిశాస్త్రికి పడిచచ్చేటంత అభిమానం. అందుకనే 'ఏ.వి.ఎన్. కాలేజీ అంటే నాకెంతో ఇష్టం. "ఏ గురువో ఒకరు అభిమానించకపోతే, ఏ కొద్ది మందికో తప్పిస్తే చాలా మందికి సరిగా చదువు రాదని నా నమ్మకం. ఏ.వి.ఎన్. కాలేజీలో నేను చదువు రాక

తన్నులు తిన్నాను. అక్కడే మాస్టర్లని శ్రమపెట్టి వాళ్ళవల్ల నేను కొంత చదువు నేర్చుకున్నాను''[3]. గురువులన్నా, స్నేహితులన్నా ఆయనకు అమితప్రేమ.

"శాస్త్రవేత్త సి.వి.రామన్‌గారు చదివిన తావుల్లోనే నేనుకూడా చదివినందుకు నేను గర్విస్తుంటాను. మహాకవి శ్రీశ్రీగారు చదివిన ఆలయంలోనే నాక్కూడా చదువు కొంత వచ్చినందుకు నేను గర్విస్తాను. అంతేకాదు, నావంటి ఎంతోమంది చిన్నలతోపాటు కలసి నేమ చదువుకోగలిగినందుకు కూడా నేను గర్విస్తాను. అక్కడ నేను దెబ్బలు తిన్నాను. తన్నులు కాసేను. బెంచీలెక్కేను. కన్నీళ్ళు కార్చేను. కేరింతలు కొట్టేను. కొద్దిపాటి చదువులు చదవగలిగేను''[4] అని తన చిన్ననాటి విద్యా వ్యాసంగాన్ని గురించి, వాస్తవంగా, నిజాయితీగా వివరించారు. సి.వి.రామన్ కంటే గూడ, శ్రీశ్రీ అంటే శాస్త్రికి మొదట్లో విపరీతమైన అభిమానం. మొదట్లో హెడ్‌మాస్టారి అబ్బాయిగా ప్రజా కవిగా శ్రీశ్రీ రావిశాస్త్రికి గుర్తు. ఆ తరువాత మహాకవిగా శ్రీశ్రీని జన్మాంతం హృదయాంతరాళాలలో పదిలపరచుకున్నారు. "శ్రీశ్రీ తమ్ముడు నాకు క్లాస్‌మేట్''[5] అని చెప్పారు.

రావిశాస్త్రి చిన్నతనంలో చదువులో అంత తెలివితేటలు ప్రదర్శించినట్లు ఆధారాలు లేవు. చిన్నతనంలో నాకు చదువు సరిగా అబ్బలేదని అయనే చెప్పుకున్నారు. అయితే "స్కూల్లోగాని, కాలేజీలోగాని శాస్త్రి ఎన్నడూ తెలుగు చదవలేదు. ఇంగ్లీషు ఫస్టు లాంగ్వేజిగా వుండిన ఆ రోజుల్లో మేమందరం సెకండు లాంగ్వేజి తెలుగు చదివాంగాని, అతను మాత్రం సంస్కృతమే చదివారు. తెలుగులో నాలుగు వాక్యాలు కూడా సరిగ్గా వ్రాయలేడేమో అని అనుకునేవాళ్ళం''[6] శాస్త్రి క్లాస్‌మేట్ మామిడిపూడి పట్టాభిరామ్ ఆయన్ని గురించి వ్యక్తంచేసిన అభిప్రాయం. "ఫస్టుఫారమ్‌లో ఫెయిలయి మాకు క్లాసుమేట్‌అయినప్పుడు మొదటిసారిగా అతనితో పరిచయం కలిగిందని''[7] పట్టాభిరామ్ వివరణ. ఫస్టుఫారం నుండి ఇంటర్మీడియట్ వరకు వీళ్ళిద్దరూ క్లాస్‌మేట్స్. ఫస్టుఫారం ఫెయిల్ అయినంత మాత్రాన శాస్త్రిని మరోలా ఊహించుకోనవసరం లేదు. ఆయన నిస్సందేహంగా ప్రతిభావంతులే. ఇంటర్ ఫైనల్ పరీక్షల్లో ఇండియన్ హిస్టరీలోని ఐదు ప్రశ్నలకు జవాబులు తెలిసికూడా, మూడింటికే ఆన్సర్లు వ్రాసి గంటకే పరీక్ష హాలు నుండి బయటకొచ్చి, అదేమని మిత్రులడిగితే పాస్ మార్కులకు ఆ మూడు ప్రశ్నల ఆన్సర్లు చాలుగదా అని జవాబిచ్చే తత్వం శాస్త్రిది.

1939 నాటికి రావిశాస్త్రి ఇంటర్మీడియట్ పూర్తిగావించి, ఆంధ్రా యూనివర్శిటీ లోని ఆర్ట్సు కాలేజీలో బి.ఏ. ఆనర్సు కోర్సులో చేరారు. "ఇంటర్‌లో హిస్టరీ తీసుకొని చదివాను. నేను క్రాక్‌నని, సైకాలజీ చదివితే బాగుపడతానని మానాన్న ఫిలాసఫీ ఆనర్సులో చేర్పించాడు. ఇదీ వంటబట్టలా''[8] అని తన విద్యా వ్యాసంగాన్ని, నైజాన్ని గురించి నిజాలే వెల్లడిచేసారు రావిశాస్త్రి. కాని ఆ రోజుల్లో, యీ రోజుల్లో కూడా ఫిలాసఫీని సబ్జెక్టుగా తీసుకొని చదివేవాళ్ళు పెద్దగా లేరు. అయితే రావిశాస్త్రికి యీ సబ్జెక్టు కొంత మానవ స్వభావం అర్థం చేసుకుంటానికి తోడ్పడి ఉండవచ్చు.

ఆంధ్రా యూనివర్శిటీ కంటే యూనివర్శిటీ లైబ్రరీని ఎక్కువగా అభిమానించే వారు రావిశాస్త్రి "ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని లైబ్రరీ ఎవరికి ఏమేమి ఉపకారాలు చేసిందో నాకు తెలియదు. కాని ఆ లైబ్రరీ నాకుమాత్రం తెలియని లోకాలని చూపెట్టింది'[9] అని రావిశాస్త్రి కృతజ్ఞతతో ఆ లైబ్రరీని స్మరించారు." దేశమన్న తిరుగు అథవా కోశమన్నా చూడు" అన్నట్లు మనసుకు పదునుపెట్టి ప్రపంచాన్ని వీక్షింప జేయగలిగేది పుస్తకం. ఆ పుస్తకాలయమైన యూనివర్శిటీ గ్రంధాలయం తనలో కొత్త ఆలోచనలు రేకెత్తించటమే గాకుండా, భయపెట్టి కలవరపరచిందనిగూడా ఆయన చెప్పుకున్నారు. పుస్తకజ్ఞానం, నిరంతర లోకజ్ఞాన పరిశీలన రావిశాస్త్రి ఆలోచనలకు కొత్త పదునుపెట్టింది. తన తాత, తండ్రులు, బంధువర్గం, కొన్ని తరాల నుండి న్యాయవాద వృత్తిలో జీవిస్తుండటం, రావిశాస్త్రిలో అలజడిని రేపింది. తానుకూడా న్యాయవాద పట్టా పుచ్చుకోవాలనే ఆశ, ఆకాంక్ష ఆయనలో బయలుదేరి, చివరకు మిలటరీ గుమస్తా ఉద్యోగానికి రాజీనామాచేసి, మద్రాసులో 1946 సంగలో లా కాలేజీలో చేరారు. అప్పటికే ఆయనకు వివాహమైంది (1945). 'మద్రాస్ లా కాలేజీ కళకళ్ళాడుతూ ఉండేది. మా తండ్రి తాతలు, బంధువులు, స్నేహితులు ఎంతోమంది అక్కడ చదివి వుండటం చేత నాకా కాలేజీ కొత్తగా తోచలేదు. నేనక్కడ 'లా' అట్టే చదవలేదు. కాని లోకం గురించి మాత్రం కొంత నేనక్కడ తెలుసుకున్నానని అనుకుంటాను"[10] అని శాస్త్రి తన లా కాలేజీ అనుభవాన్ని వివరించారు. పుస్తక జ్ఞానం కన్నా, లోకజ్ఞానం, సామాజిక జీవనాడిని, వాడిని, వేడిని మనిషి పసిగట్టగలిగితే ఈ సమాజానికి ఒక దిక్కు, దోవ చూపించటానికి, మార్గం సుగమమవుతుంది.

నేను కొంచమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించానంటే అది గురువుల ఆశీర్వాదంవలనేనని వినయంగా, వినమ్రంగా శాస్త్రి చెప్పుకున్నారు. ఆయన సంస్కారం యిలాంటి విషయాల ద్వారా అవగతమవుతుంది. సి.పి.బ్రౌన్ కూడా చిన్నతనంలో అతి సాధారణ విద్యార్థిగా వుండి, అనంతరం తెలుగు సాహిత్యంలో ఏ విదేశీయుడు చేయలేని, కొన్ని విషయాలలో తెలుగువాళ్ళు కూడా అతి కష్టంమీదగాని చేయలేని (బ్రౌణ్యాలు) అద్భుత సాహిత్య కృషిచేశారు. రావిశాస్త్రిగూడా విద్యార్థిగా సాదాసీదాగానే వుండి, సాహితీకారునిగా తెలుగు కథ; నవలా లోకానికి అరుణ కిరణంగా నిలిచారు. "చదవడంవల్ల సంస్కృతం రాలా, చదవకపోవడంవల్ల తెలుగు వచ్చింది. తెలుగు నేను చదివి నేర్చుకోలా. విని నేర్చుకున్నా జీవితం పెద్ద బాలశిక్ష. మంచి పుస్తకాలు చిన్న బాలశిక్ష"[11] అని విద్య, సాహిత్య రచనా నేపథ్యం, క్రమాభివృద్ధి గురించి రావిశాస్త్రి వ్యక్తంజేసిన భావజాలాన్ని శ్రీ చలసాని ప్రసాద్ క్రోడీకరించిన తీరు అక్షరాల యధార్థం.

"కష్టపడి పాఠాలు మాత్రం చదివేవారు. మిగతా విద్యార్థులతో పోల్చిచూస్తే మామూలు విద్యార్థిగా కనబడే వారేగాని, ఎక్కువ ప్రతిభా విశేషాలు ప్రదర్శించినట్లు, నాకు జ్ఞాపకం లేదు"అని శాస్త్రిని గురించి తెలిసిన మా ఆనందం అంచనా.

## 3. సహాధ్యాయులు - సహచరులు

రావిశాస్త్రి స్నేహశీలి. ఒకసారి పరిచయమైన వ్యక్తిని ఆయన జీవితాంతం మరిచిపోరు. అతనితోపాటు బంధువర్గాన్ని అతని స్నేహితులను గూడ క్రమేపి తన

పరిచయం చేసుకుంటారు. స్నేహమంటే ఆయనకు ప్రాణం. స్నేహితులే ఆయనకు ఆస్తిపాస్తులు, ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాసలు. వారే ఆయనకు అండదండ, ఆలన, పాలన, 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయ్' అనే సూక్తికి ఆయన ఆదర్శం.

మార్గాన అప్పారావు, సలాది జగ్గారావు, ఇమంది అప్పారావు, అల్లబోయిన అప్పలస్వామి, అక్కరబోయిన అప్పలస్వామి, చిన్న నరసింహులు, వై. బాలాజీ, రామచంద్ర పండా, రామచంద్ర పండాల్, శివదయాల్ సాహినీ, మున్షీ అబ్దుల్ గఫార్ ఖాన్, పబ్లియాండర్ పిళ్ళ, బలభద్ర శతవస్తి, రౌతు రాముడు, గోపరాజు శివుడు, కొల్లా రామమోహను, పన్యాల రంగనాథ్, మోచర్ల అనంత పద్మనాభరావు, ఉప్పల వెంకటేశ్వరరావు, చట్టి రామచంద్రరావు, సోమయాజుల సోమేశ్వరరావు, తన ఆది గురువు అబ్బూరి వరద రాజేశ్వరరావు - వీళ్ళంతా రావిశాస్త్రికి ఏవి.ఎన్.కాలేజీ - హైస్కూల్లో క్లాస్‌మేట్స్, స్నేహితులూను.

"మార్గాన అప్పారావు ఆడినంత బాగా, సలాది జగ్గారావు ఆడగలిగినంత చక్కగా నేను ఫుట్‌బాల్ ఆట ఆడలేను"-రావిశాస్త్రి మంచి ఫుట్‌బాల్ ప్లేయర్. అయినా తన చిన్ననాటి శక్తి సామర్థ్యాల గురించి వాస్తవంగానే వివరించారే తప్ప వక్రీకరించలేదు. "అల్లబోయిన అప్పల స్వామంత తెలివిగా నేను లెక్కలు చేయలేను. శివదయాల్ సాహినీలా, చిన్న నరసింహులులా, అక్కరబోయిన అప్పల స్వామిలా, అమలకంటి అప్పారావులా, ధైర్యంగా దెబ్బలాడలేను. మామిడిపూడి పట్టాభి, వెంకటేశ్వర్లులా పరీక్షల్లో పస్టు మార్కులు తెచ్చుకోలేను... అబ్బూరి వరద రాజేశ్వరరావులా గేయాలు రాయలేను. భగవంతుణ్ణి తిట్టలేను.... కొల్లా రామ్మోహనుళ్ళా, సోమయాజుల్లా, సోమేశ్వరుల్లా, కల్మషం లేకుండా వుండలేను"[12] తనలోని లోటుపాట్లని, తన మిత్రుల, సహాధ్యాయుల విద్యా, క్రీడాధిక్యతను, మంచితనాన్ని యధార్థంగా వివరించుటలోనే రావిశాస్త్రి స్వభావాన్ని మనం అంచనా గట్టవచ్చు. మల్లెపూవులాంటి స్వచ్ఛత, మలయ పవనంలాంటి మంచితనం ఆయనలోని సుగుణాలు. ఎప్పుడో బాల్యంనాటి విషయాలనుగూడా అంత యధార్థంగా విపులీకరించడం ఆయన నిజాయితీకి, చిత్తశుద్ధికి నిదర్శనం. తన సహాధ్యాయుల నుండి స్నేహితుల నుండి జీవితంలో మరిచిపోలేని ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్నానని తద్వారా తనకు ఆనందం, సదాలోచన కలిగాయని అందుకని వారంత మందిని నేనెల్లప్పుడు స్నేహభావంతో చూసుకుంటాను, గురుతుల్యులుగా తల్చుకుంటాను అని కృతజ్ఞతా భావాన్ని శాస్త్రి వెల్లడించారు.

అక్కడి సముద్రం, యారాడకొండ, ఏ.వి.యన్.కాలేజీ, ఆంధ్రా యూనివర్శిటీ-ఇవన్నీ నాకు, స్నేహితులకి, అమితానందాన్ని కలిగించినవని ఆయన చెప్పుకున్నారు.

రావిశాస్త్రి మొదట్లో కొంతకాలం "తెల్లపంట్లాం", తెల్లచొక్కాతో, ముఖాన పెద్ద కుంకుమ బొట్టుతో ఒక చేతిలో కొబ్బరికాయ చెక్క చెవులో పువ్వులతో"[13] ప్రతి గురువారము కనకమహాలక్ష్మిని పూజించే భక్తునిగా దర్శనీయమవుతున్నారు అని ఆకెళ్ళ

కృష్ణమూర్తి తెలియజేశారు. అయితే ప్రతి వ్యక్తిలో ఆలోచనా క్రమ పరిణామదశలున్నట్లే ఆ తర్వాత రావిశాస్త్రిలో గూడా యీ పద్ధతిలో మార్పు వచ్చింది. అయినప్పటికీ దేవుడు, జ్యోతిష్యం యిలాంటి విషయాలలో శాస్త్రికి కొన్ని నమ్మకాలున్నమాట వాస్తవం.

భారత కమ్యూనిష్టు పార్టీ సభ్యులైన ఆకెళ్ళ కృష్ణమూర్తి, వాసిరెడ్డి వెంకటప్పయ్యలు శాస్త్రితో వన్‌వే ట్రాఫిక్ పద్ధతిలో మార్క్సిష్టు సిద్ధాంత చర్చలు జేసేవారు. డి.డి.కోశాంబి రచనలు, అమెరికన్ 'మంత్లీ రివ్యూలు', పత్రికలు, సోవియట్ ప్రచురణ 'న్యూ టైమ్స్'- ఇలాంటివెన్నో విజ్ఞాన సంబంధమైన వాటిని మిత్రులు తెప్పిస్తే వాటిని క్షుణ్ణంగా చదివి, చర్చలు, గోష్ఠులు నిర్వహించి, తను ఎదుగుతూ, తోటి సహచరులను విజ్ఞానవంతులుగా చేసేవారు శాస్త్రి.

'విశాఖ నాటక కళామండలి' వ్యవస్థాపక ప్రముఖులు గణపతిరాజు అచ్యుతరామ రాజు, సంకు పాపారావు, జగన్, గొప్ప నటకులు చాగంటి సన్యాసిరాజు, ఆకెళ్ళ; రావిశాస్త్రి మొ॥న మిత్రులంతా తరచూ విశాఖలోని లీలామహల్ టీస్టాల్ దగ్గర కలుసుకోవటం ఆనవాయితీ. మంగిపూడి శాస్త్రి, పుల్లగుర్ర శ్రీహరి వాళ్ళుగూడ అప్పుడప్పుడు యీ బృందంతో చేరేవారు. గ్రామస్థాయి నుండి అంతర్జాతీయ, అంతరిక్ష స్థాయి వరకు "కాదేదీ వీళ్ళ చర్చకనర్హం". 'విశాఖ నాటక కళామండలి' వారి నాటకాల రిహార్సల్స్‌కు శాస్త్రి హాజరై, వారికి విలువైన సూచనలివ్వటమేగాక, కొన్నిసార్లు నాటక దర్శకత్వ బాధ్యతలు స్వీకరించేవారు. 'తిరస్కృతి', 'విషాదం', 'నిజం' నాటకాలకు ఆయనే దర్శకత్వం నిర్వహించటమే కాకుండా, పలుసార్లు నటుడుగా దర్శనమిచ్చిన సందర్భాలున్నాయి. 'కన్యాశుల్కం' నాటకంలోగూడ శాస్త్రి నటించారు. మంచి నటనా కౌశలం గూడా వుంది.

కింగ్ జార్జి హాస్పటల్ జంక్షన్ దగ్గర్లోని ఒక కారు షెడ్డుని అద్దెకు తీసుకొని, అందులో "గురజాడ కళాకేంద్రం"ను శాస్త్రి, ఆకెళ్ళ కృష్ణమూర్తి ప్రభృతులు స్థాపించారు. దీనిలో పదవుల పంపకాలేవీ పెట్టుకోకుండా, అందరూ సాధారణ సభ్యులుగా నమోదయ్యారు. చాగంటి, మంగిపూడి శాస్త్రి, సంకు పాపారావు, కోరాడ జగన్నాథరావు, శ్రీహరి, వాసిరెడ్డి తదితరులు దీనిలో సభ్యులు, అబ్బూరి, రావిశాస్త్రి తదితర మిత్రబృందం యిక్కడే పెద్దపెద్ద సాహిత్య చర్చలు నిర్వహించేవారు. కేవలం సాహిత్య చర్చలేగాక జాతీయ, అంతర్జాతీయ, ఆర్థిక, రాజకీయ విషయాలపై గోష్ఠులు, సభలు నిర్వహించేవారు యీ మిత్రులు. వీటన్నింటికి ఇరుసు రావిశాస్త్రి.

"పండిత జవహర్‌లాల్‌నెహ్రూ 1946లో రాజ్యాంగ సభలో యిచ్చిన ఉపన్యాసాలు, అంతకు పూర్వం దాదాపు 15 సం॥ల క్రితం 'చాణుక్య' అన్న కలం పేరుతో "నెహ్రూజీ వ్రాసిన వ్యాసాలు, కటాంగా హత్యలో సామ్రాజ్యవాద కుట్ర మొదలుగా గల విషయాలన్నిటిమీదా సునిశితమైన వివరణ యిచ్చేవారు"[14] చాణుక్యుని 'కపట కలహాల' ను సమకాలీన సమస్యలతో సమన్వయ పరచి శాస్త్రి అద్భుతంగా వివరించేవారని ఆకెళ్ళ ప్రశంస. పేట్రిస్ లుముంబా హత్యను ఖండిస్తూ శాస్త్రి చొరవతో విశాఖలో పెద్ద సభను

నిర్వహించారు. కేవలం సాహితీకారుడుగాను, న్యాయవాదిగాను తన పని తాను చేసుకుపోవటంతోనే తృప్తిపడకుండా, దేశ విదేశాలలో జరుగుతున్న పరిణామాలను పరిశీలిస్తూ అరాచకాలను, అకృత్యాలను ఖండిస్తూ బాధ్యతగల పౌరునిగా తన పాత్రను పోషించుకొచ్చారు. సంకల్ప బలం, సహచర మిత్ర బృందం తోడ్పాటు ఆయనకు కార్యదీక్షలో సహకరించాయి.

ఒకసారి రాత్రంతా మిత్రులతో కాలక్షేపం, సరదాలు వివిధ విషయాలపై చర్చలు, వేకువజామున ఎప్పుడో యింటికి వెళ్ళడం లేకపోతే ఒక్కొక్కప్పుడు రోడ్డున పుల్లట్ల దుకాణంలో మొఖాలు కడుక్కొని పుల్లట్లు తిని కాఫీలు తాగి యిల్లు చేరుకోవటం' 'ఇలా సాగిపోయేది; ఆయన జీవితం. అతి సాధారణంగా, అంతస్థులు, భేషజాలు ఏమీ ప్రదర్శించకుండా నిర్మలంగా ఉండేవారాయన.

రావిశాస్త్రి వట్టి 'భోళా శంకరుడు', రఘురామయ్య, బడే గులాం ఆలీ ఖాన్ మొదలగువాళ్ళ పాటలన్నా, సంగీతమన్నా శాస్త్రికి చాలా యిష్టం.

"తన మిత్రులెవరైనా మాట్లాడినప్పుడు ఇంగ్లీషులో తప్పులు ఉపయోగిస్తే వెంటనే సరిదిద్దేవారు"[15] అని శాస్త్రి గురించి శ్రీ కోరాడ జగన్నాథరావు (జగన్) అనుభవం. ఆ సరిదిద్దడం సదుద్దేశంతో, సౌమ్యంగా చేసేవారేగాని, ఎదుటి వ్యక్తిలోని కంతలు వెతకటం రావిశాస్త్రి స్వభావానికి విరుద్ధం.

కష్టాల్లో యిరుక్కున్న వాళ్ళ బాధల్ని ప్రేక్షకునిలా చూస్తూ వూరుకోక తాను వాటిలో పాలుపంచుకొని పరిష్కరించటానికి ప్రయత్నించేవారు. తన సొంత ఖర్చులతో మద్రాసులాంటి మహానగరాలకు కూడా వెళ్ళి 'నిజం' నాటక ప్రదర్శనలో పాత్రధారణ చేశారు. తన అనుమతి తీసుకొనే నాటక ప్రదర్శన నిర్వహించాలనే పట్టింపులు శాస్త్రికి వుండేవికావు.

"గురువుగారికి కొన్ని రాగాలంటే వల్లమాలిన అభిమానం. ముఖ్యంగా హిందూస్తానీ రాగాలంటే మరీ మితిమీరిన అనురాగం, ముసిరి శ్రీనివాస అయ్యర్, బడే గులాం ఆలీఖాన్ సైగల్, కనన్‌బాల, సాలూరు రాజేశ్వరరావు, బెంగుళూరు తాయి, పసుపులేటి కన్నాంబ, వైణిక విద్వాన్ వాసా కృష్ణమూర్తి, బాల గంధర్వ, ఈలపాటి రఘురామయ్య, షంషాద్‌బేగం, లతామంగేష్కర్, గద్దర్, యస్.పి.బాలు (కొన్ని పాటలు మాత్రమే) వీళ్ళందరూ అనేక రాగాల్లో పాడిన పాటలు, జానపదగీతాలు, ముఖ్యంగా "ఓరోరి బండివాడా! వగలమారి బండివాడా, ఎలకమ్మ ఎలకా! చిన్నారి సిలుకా! గుజ్జారి గులక! నేనేంజేతు నేనేంజేతునో"అంటూ గురువుగారి పాటతీరు విని తీరాల్సిందే"[16] అని అత్తిలి కృష్ణ రావిశాస్త్రి గానాభిలాషని మెచ్చుకున్నారు. ఇంత సంగీతజ్ఞానం మీకెలా అబ్బిందని ఎవరన్నా ఆశ్చర్యపోతే కన్యాశుల్కంలోని "అంతా తమవంటివారి దయవల్లగురూ" అనే డైలాగ్‌ని వల్లించేవారు. సంగీత సాహిత్యాలు రెండింటికి ప్రాధాన్యమిచ్చేవారు. జానపద బాణీ పాటలంటే ఆయనకు ప్రాణం. పౌరాణిక పద్యాలన్నా యిష్టపడేవారు.

గరళాన్నిమింగి అందరికి అమృతాన్ని పంచగల సహనశీలి, ఆదర్శమూర్తి శాస్త్రి అని, శాస్త్రి సహన్యాయవాది, మిత్రులు శ్రీ యం. కోటి తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు.

"రెండో ఫారం నుంచి ఆనర్సుదాకా కలిసే చదివేంకదా. అతనాకాలంలో కలం పట్టిన పాపాన పోలేదు." అని రావిశాస్త్రికి ఆత్మీయ మిత్రులు, సాహితీ గురువు అయిన 'వరద' ఉద్దేశం. శాస్త్రి ఇంటర్మీడియట్ చదివే రోజుల్లోనే గుడిపాటి వెంకటచలంని 'వరద' ఒకసారి చూపించారు. దస్తవ (డోస్టా) యస్కీ, తర్జనీవ్, చెహోవ్, లారెన్స్ నవలలు చదవమని వరద రాజేశ్వరరావు శాస్త్రిని ప్రోత్సహించారు.

"శాస్త్రికొక విశిష్ట గుణం ఉంది. ఏది చూసినా వెయ్యి కళ్ళతో చూసేవారు. ప్రత్యంశాన్ని నిశితదృష్టితో పరిశీలించేవారు. అంచేతనే యదార్థమైన దైనందిన జీవనాన్ని కూలంకషంగా అవలోకించి ఆకళింపు చేసుకొని దానికొక పరిశుద్ధ సాహిత్య రూపాన్ని ఆపాదించేవారు శాస్త్రి"[17] అని 'వరద', శాస్త్రి స్వభావాన్ని, ఆయన సాహితీ విశిష్టతని విశదం చేసారు.

చిన్నప్పటినుండి కూడా రావిశాస్త్రి తాను రాస్తున్నానని గాని, రచయితననిగాని ఎవరికీ చెప్పే స్వభావం గాదాయనది. అందుకే విద్యార్థి దశలోనే కొన్ని రచనలు చేసినా, 'వరద'లాంటి మిత్రులుకూడా గమనించలేకపోయారు. తన మనసులోని ఆలోచనలను ఒకొకసారి ఇంట్లో వారందరిని ఒకచోట చేర్చి ఒక సీరియల్ కథలాగా చెప్పి, ఆసక్తి కలిగించే అలవాటు ఆయనకు విద్యార్థిగా వున్నప్పుడే వుండేదని రావిశాస్త్రి మేనల్లుడు శ్రీ జి.ఆర్.శ్రీధర్ ద్వారా తెలుస్తుంది. చివరకు ఉత్తరాలను కూడా కథల మాదిరి ఆసక్తి కలిగించేట్టుగా వ్రాసేవారట.

"రావిశాస్త్రి గారిని విమర్శించి, ఇబ్బందులు కల్పించిన వాళ్ళయినాసరే అవసరం వచ్చి అడిగీఅడగగానే వారికాయన స్వంత ఖర్చుతో సాయం చేయటం నేనెరుగుదు నని"[18] శాస్త్రికి ఆత్మీయ మిత్రుడైన శ్రీ తుమ్మల వేణుగోపాలరావు చెప్పిన విషయం అక్షర సత్యం. ఆయన సహనశీలి, స్నేహశీలి.

## 4. వృత్తి - న్యాయవాద వృత్తి

రావిశాస్త్రి ఏ.వి.యన్. కాలేజీ-హైస్కూల్లో ఇంటర్ పూర్తిచేసిన తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1939లో బి.ఎ. ఆనర్సు చేసారు. 1932లోనే రావిశాస్త్రి తండ్రి న్యాయవాద వృత్తిని విడిచిపెట్టి వాళ్ళ స్వగ్రామం తుమ్మపాలలో వ్యవసాయం మొదలుపెట్టడం, యితర కారణాలవల్ల రావిశాస్త్రి బి.ఎ. అనంతరం ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టారు. అది రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న కాలం, అప్పుడే యువ పట్టభద్రునిగా అడుగు బయటపెట్టి ఉద్యోగ ప్రయత్నంలో తిరుగుతున్న శాస్త్రికి మిలటరీ ఎకౌంట్సు డిపార్టుమెంటులో గుమస్తా ఉద్యోగం దొరికింది. చేసింది కొద్దికాలమైనా ఉత్తర, దక్షిణ ధృవాలు యీ ఉద్యోగ పరంగా శాస్త్రి దర్శించారు. బెంగుళూరు,

సికింద్రాబాదు, పూనా, హరిద్వార్‌లలో రావిశాస్త్రి పనిచేశారు. ఆయన ప్రవృత్తికి ఈ వృత్తి అట్టే సరిపడినట్టు లేదు. అందుకే ఆ ఉద్యోగం మానేసి 1946లో మద్రాసు లా కాలేజీలో చేరారు. 1948లో 'లా' పూర్తిచేసుకొని బయట ప్రపంచంలోనికి అడుగుబెట్టారు.

1945 ఏప్రిల్ నాటికే రావిశాస్త్రికి లక్ష్మీ సోదెమ్మతో వివాహం జరిగింది. ఆ తరువాత తటవర్తి 'రామం'ను రావిశాస్త్రి 1965లో తన రెండవ భార్యగా స్వీకరించారు. ఆమె అనారోగ్యం వలన 9-3-93న మరణించింది. వీరి బిడ్డలు లక్ష్మీనారాయణ ప్రసాద్, ఉమా కుమారశాస్త్రి. శాస్త్రి వంశమంతా ప్లీడర్ల వంశమే. "అటు మూడు తరాలు యిటు మూడు తరాలు కూడా వారి కుటుంబంలో న్యాయవాదులే"[19]

శాస్త్రి మొట్టమొదటిగా 1948లో ప్రసిద్ధ న్యాయవాది శ్రీ తాతా శ్రీరామమూర్తి దగ్గర ఎప్రంటీస్‌గా చేరారు. అప్పటినుండి 1957 వరకు శ్రీరామమూర్తి దగ్గర ఎప్రంటీస్‌గా, జూనియర్‌గా పనిచేసారు. శాస్త్రి తన వ్యక్తిత్వానికి భంగం కలగకుండా, శ్రీరామమూర్తిని నొప్పించకుండా కోర్టు వ్యవహారాలు చక్కబరచుకొనేవారు. ఈ న్యాయవాద వృత్తిని కూడా విడిచిపెట్టి ఏదైనా ఉద్యోగాన్ని చూసుకుందామని కూడా శాస్త్రి తలంచిన రోజులు వున్నాయి. చివరకు సివిల్ కంటే క్రిమినల్ లాయర్‌గానే శాస్త్రి స్థిరపడ్డారు. అర్ధరాత్రా, అపరాత్రా, వానా, ఎండా, పొద్దునా, సాయంత్రమా అనే విచక్షణలేదు. ఎప్పుడొచ్చి, ఏ క్లయింటు, ఏ పరిస్థితుల్లోనైనా సరే తలుపుగొడితే కాలికి బలపంగట్టుకున్నట్లు, లేడికి లేచిందే పరుగులా, వాళ్ళకోసం ఉరకలు, పరుగులు తియ్యటమే ఆయన పని. వాళ్ళనుంచి వచ్చే ఫీజు దేవుడెరుగు, తను ఎదురిచ్చుకుంటానికి గూడా వెనుకాడని వ్యక్తి.

"మొదటి రోజుల్లో కోర్టుల నుంచి సాయంత్రం తిరిగి రాగానే యివాళ సంపాదనెంతంటే హస్తంలో అరటిపళ్ళు చూపించేవారు. ఒక్కోరోజు రొయ్యలు, చేపలు కూడా యిచ్చేవారు క్లయింటులు"[20] అంతేగాదు స్టార్ సిగరెట్ పెట్టీ, గుర్రం గుర్తు అగ్గిపెట్టి యిచ్చి కేసు ఫీజులు సరిపెట్టుకున్నారంటే రావిశాస్త్రి ఈ వృత్తిలో ఎంత సంపాదించుకున్నారో ఊహించుకోవచ్చు.

బ్రతుకు తెరువును చూపిందీ, నేర్పిందీ, భుక్తినిచ్చిందీ యీ ప్లీడరీ ఉద్యోగమే. అన్యాయాలకు, అవమానాలకు గురవుతున్న పేద ప్రజల పక్షాన ఒక బాధ్యతగల న్యాయవాదిగా నిలబడితే వాళ్ళకోసం ఏ కాస్తన్న మంచి చేసిన వాడినవుతానేమోననే మానవతా దృష్టి శాస్త్రిలో కలిగించిందీ యీ న్యాయవాదవృత్తే. ముఖ్యంగా మధ్యతరగతి ప్రజల జీవనశైలి కొంతలో కొంతన్న తనకు అవగతం కావటానికి యీ వృత్తి తోడ్పడిందని ఆయన తలంచారు.

"సామూహికంగా మధ్యతరగతి వారి తెలివితేటల్నీ, స్వార్థపరత్వాన్ని నాకు 'లా' కాలేజీయే చూపించింది"[21] అని ఆయనే చెప్పుకున్నారు. సామాజికపు కప్పును తొలగించి బ్రతుకు బాటను విప్పి చూపింది ఈ న్యాయవాదవృత్తి. దామోదరం సంజీవయ్య, అయ్యపురెడ్డి లాంటి ప్రముఖులు మద్రాసు కాలేజీలో రావిశాస్త్రికి సహచరులు.

సారా, సారో, కేసులలో యిరుక్కున్న; యిరికించబడిన; అమాయకుల నెందర్నో రావిశాస్త్రి కాపాడారు. తన దగ్గరకొచ్చిన క్లయింట్లని జలగల్లా పీల్చే న్యాయవాద వ్యవస్థలో రావిశాస్త్రి ఆపన్నులను ఆదుకున్న పేదోళ్ళ ప్లీడరు.

ఆకెళ్ళ కృష్ణమూర్తి కేసు విషయంలో "చిన్న పొరపాటు చేసేను. మీకు అరెస్టు వారెంటొచ్చేస్తోంది. వెంటనే కోణార్కులో బయలుదేరి హైదరాబాదు వెళ్ళి స్టే తీసుకు రావాలి.... ఇవి మీ దగ్గర ఉండనివ్వండి... అని కొన్ని వందల రూపాయలు ఇచ్చి" ఇలా తన పార్టీలకు సొంతంగా తన డబ్బులు ఎదురిచ్చి మరీ వాదించి గెలిచిన సందర్భాలలో మచ్చుకు యిదొకటి. ఫీజు సంగతి ఆకాశానికెరుక అసలు ఎదురుఖర్చు పెట్టిన డబ్బులు రాబట్టుకోవడం కూడా చాతగాని మొహమాటస్తులు శాస్త్రి. పేరు ప్రఖ్యాతుల కోసం యిలా ఎదురు కొట్టుడు వ్యవహారం చేస్తున్నారా? అవేమన్నా ప్లీడరుగా ప్రారంభదినాలా? అంటే జీవితంలో దాదాపు అరవై సంవత్సరాల దగ్గర (1980) యీ సంఘటన జరిగిందంటే ఆయన స్వభావాన్ని అంచనా వేసుకోవచ్చు. అదీ యిలాంటి సంఘటనలు మిత్రులు బయటపెడితే తప్పించి వెలుగుచూడవు.

"Law is an ass"అని చెప్పిన చార్లెస్ డికెన్స్ సిద్ధాంతం శాస్త్రికి బాగా నచ్చింది. "Indian Constitution is Lawyers Paradise"అని రావిశాస్త్రి నమ్మేవారు. శాస్త్రి ప్రాపంచక జ్ఞానం న్యాయవాద వృత్తివలన బాగా యినుమడించి లోకజ్ఞతతో రచనా వ్యాసంగం కొనసాగించటానికి తోడ్పడింది.

## 5. రచనా వ్యాసంగం

రావిశాస్త్రి వాళ్ళ ఇంటి వాతావరణం, వాళ్ళమ్మ ప్రభావం, పుస్తక పఠనం, రచనా కుతూహలం-ఇవన్నీ రావిశాస్త్రిని రచనా వ్యాసంగంవైపు మలిచాయి. "మా అమ్మ చాలా పుస్తకాలు చదివించింది- అంచేత నా చిన్నతనంలోనే 'శ్రీకృష్ణ కర్ణామృతం', 'రఘువంశం' చదవగలిగాను"[22]. ఈ పఠనాసక్తే ఆయనలోని రచయితని తట్టిమేలు కొలిపింది. పదమూడేళ్ళ వయసు నాటికే 'గలివర్ ట్రావెల్స్' నవల చదివి ఆ ప్రేరణతో అప్పటికప్పుడే నవలా రచయితనైపోదామని ఉత్సాహపడ్డారు. తను ఏవేవో ఊహించుకొని ఒక పెద్ద కథాబుట్టల్లి; పిల్లల్ని చుట్టూ చేరవేసుకొని ఆ బుట్ట విప్పి వాళ్ళను సరదాగా చంపుకు తినేవారు. ఈ పదమూడేళ్ళ వయసులోనే డిటెక్టివ్ నవల రాద్దామని కొంతవరకు రాసి ఆ తరువాత మానేశారు. అసలు యింత చిన్నవయసులోనే యీరకమైన ఆలోచనలు కలగటం, వాటిని అమలు పరచటానికి ప్రయత్నించటం చూస్తుంటే ఆయనలోని రచనా వ్యాసంగం ఎంతటి పురుటినొప్పులు పడిందో తెలుస్తుంది.

'వినోదిని', 'చిత్రగుప్త', 'ఢంకా', 'గృహలక్ష్మి' మొదలయిన పత్రికలు చదవటం సినిమాలు చూడటం, కుటుంబపరంగా వినే పురాణ గాథలు ఆయనలో రచనాసక్తిని పెంచాయి. 16, 17 సం॥ వయస్సులోనే "చార్లెస్ డికెన్స్, డేవిడ్ కాపర్ ఫీల్డ్, అలివర్ ట్విస్ట్,

ఓల్డ్ క్యూరియాసిటీస్, గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్ వగైరా; ఉడ్‌హౌస్ నవలలుకూడా 1938-39 లలో చదివా''[23] నని రావిశాస్త్రి చెప్పుకున్నారు. ఆ వయసులో తెలుగు పుస్తకాలు చదివి అర్థం చేసుకుంటమే అంతంతమాత్రం. మరి ఆయన ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన డికెన్స్, డేవిడ్ కాపర్ ఫీల్డు లాంటి నవలలు చదవ గలిగారంటే ఆయన పఠనాసక్తిని, ప్రతిభని, మనస్తత్వాన్ని ఊహించుకోవచ్చు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందంటే ఇదేనేమో. అలానే ఆంధ్రా యూనివర్సిటీ లైబ్రరీలోని ఇంగ్లీషులోకి అనువదింపబడిన చెహోవ్ రచనలన్నీ చదివారు చెహోవ్ ప్రభావం రావిశాస్త్రిమీద వుందనేది స్పష్టం. అప్టన్ సింక్లెయిర్ (మామన్ ఆర్ట్), అనటోలీ ఫ్రాన్స్ (పెంగ్విన్ ఐలండ్)ల రచనల్ని కూడా శాస్త్రి అధ్యయనంచేశారు. రెండు పదులన్నా దాటని వయసులో ఇంగ్లీషు నవలల్ని మెలేశారు. అబ్బూరి వరద రాజేశ్వరరావు, శ్రీశ్రీ, పురిపండా, శ్రీపాద, ఉన్నవ, కాళీపట్నం, కొ.కు, మొదలగువారి సాహిత్య సాహచర్యం కూడా క్రమేపి, తన రచనా విస్తృతికి దోహదపడినట్లు ఆయన తలంచారు.

1938లో తొలిసారిగా, 'శశాంక విజయం' అనే కథ రాసినట్లు తనకు గుర్తుందని శాస్త్రి వివరణ. 1938 సం॥ ఆగస్టులో "దేముడే చేశాడు'' అనే కథ మొదటిసారి 'వినోదిని'లో అచ్చయింది. అచ్చులో రాచకొండ విశ్వనాథశాస్త్రి అనే పేరు చూసుకొంటం అదే మొదటిసారి. ఆయన మొదటి కథని 'వినోదిని' వారు బొమ్మకూడా వేసి ప్రచారంతో మరీ ప్రచురించటం శాస్త్రికి సంతోషాన్నిచ్చుంటుంది. ఈ ఉత్సాహంతో వెంటనే 'ప్రతిఫలం' కథరాసి పత్రిక్కి పంపిస్తే ప్రతిఫలం వాళ్ళు వేసుకోకపోవటం''. "కామేశ్వర్రావుగారి కేసు''అనే డిటెక్టివ్ కథ వ్రాశారు.

"1939లో 'ప్రేమ ఫలితం' అనే కథ 'చిత్రగుప్తకి' పంపేను 'మోడరన్ రత్నావళి' అనే నాటకం రాయాలని చూసేను. 'కోనయ్యా' అనే నవలకూడా రాసేను. 1939లో ఇంటర్ పాసైన వెంటనే 'పాతివ్రత్యం' అనే కథరాసి పడేసేను.'' అంటే ఇంటర్ విద్యార్థిగా వున్నప్పుడు కథలతో పాటు నవలలు కూడా రాశారన్నమాట. కాని 'కోనయ్యా' నవల యింత వరకు ఎక్కడా దొరకలేదు. అది అముద్రితం. ప్రేమ ఫలితం కథ 'చిత్రగుప్త' వారి మరో పత్రిక "ప్రజాబంధు''లో ప్రచురించ బడ్డది. 'యువభారతి' అనే సంస్థను కూడా కొందరి మిత్రుల సహకారంతో నిర్వహించటమే కాకుండా 'ఉష' అనే పత్రిక కూడా ప్రారంభిద్దామని ఊహించారు శాస్త్రి. దాదాపు ఈ కాలంలోనే రావిశాస్త్రి మిత్రుడు పన్యాల రంగనాథరావు సంపాదకుడుగా, సహసంపాదకుడిగా రావిశాస్త్రి ప్రింటింగ్ విషయాల కోసం పుట్రె భాస్కరరావు, సహకారం అబ్బూరి వరద రాజేశ్వరరావులు చూసేలాగ ఈ విద్యార్థి మిత్రులు "యువకళ" అనే పత్రికను ప్రారంభించి మూడు సంచికలు దాక ప్రచురించగలిగారంటే ఆశ్చర్యమే. అప్పటి పరిస్థితులలో యిదొక 'సాహసం', 'వ్యామోహం', 'దౌర్భాగ్యం', "రైలు ప్రయాణం'' 'పోరుపడలేక', 'స్వప్నమా, సత్యమా', 'చిత్రగుప్త', 'ఉద్యోగం దొరక్కపోతే', (చిత్రగుప్త) మీరే ఆలోచించండి

(కథాంజలి పత్రిక) మొ॥ రచనలు రకరకాలుగా వెలువరించినా సాహితీలోకం రావిశాస్త్రి వైపు చూసిందీ, రచయితగా అయనకు ముద్రవేసిందీ, 'అల్పజీవి' నవలతోనే. ఈ నవలా రచనతోనే ఆయనలో గూడ రచయితగా ఆత్మవిశ్వాసం పెరిగింది. అంతకుముందు దశావతారాలతో, అంటే జాస్మిన్, శంకరగిరి గిరిజా శంకరం, గోల్కొండ రాంప్రసాద్ కాంతాకాంతా, అన్‌జానా లాంటి మారు పేర్లతో రచనలు చేసి అరణ్యా, అజ్ఞాతాల నుండి సాహితీ లోకానికి పరిచయమయ్యింది 'అల్పజీవి'తోనే.

అనకాపల్లిలోని శారదా గ్రంథాలయం, అనాటి పత్రికలు శాస్త్రికి లోకరీతిని తెలియజేసాయి. పూడిపెద్ది వెంకటరామయ్య, తాతా కృష్ణమూర్తి, కొడవటిగంటి కుటుంబరావు, గుడిపాటి వెంకటచలం, మాగోఖలే, శ్రీపాద, ఉన్నవ, ఈ కథకుల కథల్ని శాస్త్రి చదివినప్పటికి 'తనమార్గం తక్కొరుల చేతగాదన్నట్లు' తనదైన ప్రత్యేక శైలిలోనే రచనలు జేశారేగాని,ఎవరిని అనుసరించటం గాని, అనుకరించటం గాని చెయ్యలేదు. తన రచనా మార్గానికి,శైలికి ఇతివృత్త స్వీకరణకు తను చదివిన అసంఖ్యాక ఆంగ్ల నవలలతో బాటు పైన పేర్కొన్న వారి రచనలు గూడా దోహదపడి వుండవచ్చు.

'అయ్యారే బాబారే' అనే పేరుతో రావిశాస్త్రి రాసిన దానిని 'అల్పజీవి' పేరుతో 1953 జనవరి నుండి ఏప్రిల్ వరకు 'భారతి' వారు ప్రచురించారు. 'జయశ్రీ' మాసపత్రికలో ధారావాహికంగా 1966 నుండి 'రాజా-మహిషి' అనే అసంపూర్తి నవల వెలువడింది. "బుక్కులు" కథల్లో చివరిది 'గుర్రపుకళ్ళెం' ఇది "మరిడీ మహాలక్ష్మి కథ", 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' అనే నామాంతరాల్లో 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రికలో 19-01-1973 నుండి 18-05-1973 వరకు ధారావాహికంగా ప్రచురితమయ్యింది. ఎమర్జెన్సీ కాలంలో జైలులో ఉండి రాసిన అసంపూర్తి నవల 'రత్తాలు-రాంబాబు' (నాలుగుభాగాలు) 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో 05-03-1976 నుండి 18-11-1977 వరకు ధారావాహికంగా వచ్చింది 1980 లో 'సొమ్ములు పోనాయండి' అనే గొప్ప నవలని ఆయన రచించారు. ఇది 'స్వాతి ' మాసపత్రికలో 1980 సెప్టెంబర్‌లో అనుబంధనవల. స్వాతిలోనే 22-10-93 నుండి 26-11-93 వరకు మళ్ళీ ధారావాహికంగా వెలువడింది : 'మూడు కథల బంగారం' అనే నవల 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రికలో 14-5-1982 నుండి 26-11-1982 వరకు ధారావాహికంగా ప్రచురించబడింది. 11-6-1993 నుండి 01-10-1993 వరకు ధారావాహికంగా 'స్వాతి' వారపత్రికలోనే రావిశాస్త్రి చివరి నవల 'ఇల్లు' ప్రచురితమయ్యింది.

ఇంకా ఏడు సంపుటాల్లో అరవై రెండు కథల్ని, 'నిజం', తిరస్కృతి' 'విషాదం' అనే నాటకాల్ని 'డాల్ఫిన్‌డైరీ'ని ఎన్నోవ్యాసాల్ని అసంపూర్తిగా 'ఏడో చంద్రుడు ' ని ఆయన రచించారు. ఇంతటితో ఆయన చరనా కలం అగిపోయింది. గళం మూగబోయింది. పేదసాదల జీవజాలం, వారి వ్యక్తిత్వం, ఒడుదుడుకులు, కష్టసుఖాలు, కాలేకడుపులు, మాడేబతుకులు, పెత్తందార్ల పైశాచికత్వానికి ఆ అమాయక పసికూనలు బలైపోతున్న తీరు, ధనదాహం, భూస్వామ్య దౌష్ట్యం, ఆస్తికోసం వెంపర్లాడటం, అస్తిత్వపోరు, అల్పజీవుల ఆర్తనాదం, కోర్టులు-పోలీసుయంత్రాంగం- ఇవన్నీ రావిశాస్త్రి రచనావేణువులోని సరిగమలు.

రసపుత్ర వీరుల గురించి నవల రాద్దామని దాదాపు నలభై పేజీల దాకా రాసి, ఆ తరువాత దాన్నెలా కొనసాగించాలో తెలియక అపేశారట. చిన్నప్పటి నుంచే సెక్స్ కథలు రాయటం, చదవటం మొదటు పెట్టారట. 'రచయిత ప్రతివాడూ తాను రాస్తున్నది ఏ మంచికి హానీ కల్గిస్తుందో, ఏ చెడ్డకి ఉపకారం చేస్తుందో అని ఆలోచించవలసిన అవసరం వుందనినేను తలుస్తాను. మంచికి హాని, చెడ్డకి సహాయం చెయ్యకూడదని నేను భావిస్తాను."[24] ఇదీ రావిశాస్త్రి రచనాతత్వం. రచనలు హితోపదేశంగా, పరోపకారం కలిగించేట్టుగా ఉండాలేగాని విషోపదేశంగా పరాపకారంగా వుండరాదనేది రావిశాస్త్రి అభిమతం, అదే సమ్మతం.

## 6. విరసం బాటలో ముందడుగు

సీష్ పాలన అంతమై స్వాతంత్ర్యం సిద్ధించినా ప్రజల జీవన స్థితిగతుల్లో చెప్పుకోదగ్గ మార్పులు సంభవించకపోవటం, దివాళాకోరు రాజకీయాలు, ఆర్థిమాంద్యం, ద్రవ్యోల్బణం, తదితర కారణాల వల్ల క్రమేపి ప్రజా అసంతృప్తి పాలక ప్రభుత్వాలపై ప్రబలమవుతున్న రోజులు. ఉత్తర భారతాన విద్యార్థి, యువజన అసంతృప్తి జ్వాలలు రాజుకుంటున్న కాలమది. నక్సల్ బరిలో విప్లవ కొలిమి రాజుకుంటున్న విప్లవయుగారంభ దశ అది. శ్రీకాకుళ గిరిజన ప్రజానీకం ఈనేల మాది, ఈ చేలు మావి అని తమ భూమాతను నమ్ముకొని పాలకపక్షంపై పిడికిళ్ళు బిగిస్తున్న ప్రజాప్రభంజనం, విప్లవీకరిస్తున్న సమయమది. రా. శాస్త్రికి తెలంగాణా సాయుధ రైతాంగం పోరాటం తెలుసు. కమ్యూనిష్టు ఉద్యమ ఎత్తులు, పల్లాలు తెలుసు. కమ్యూనిష్టు పార్టీ చీలికతో అభ్యుదయ సాహిత్యం క్రమేపి సన్నగిల్లింది. దిగంబర సాహిత్యం క్రమేపి, పెనుగాలిలా సాహితీరంగంపై దూసుకొచ్చింది.

శ్రీకాకుళ గిరిజనోద్యమంపై అణచివేత, అప్రకటిత నిరంకుశ విధానాన్ని అమలుజరుపుతుంది ప్రభుత్వం. ఆ ప్రాంతవాసుల్ని ఆలోచింపజేశారు, ఆదిభట్ల కైలాసం, వెంపటాపు సత్యం, ఫలితంగా 21-11-69లో డాక్టర్ చాగంటి భాస్కరరావు తదితరులను అమానుషంగా కాల్చి చంపింది పాలక ప్రభుత్వం. దీంతో ఉద్యమం ఎర్రకావురువేసింది.

ఈనేపథ్యంలో 1970 ఫిబ్రవరి విశాఖలో 'శ్రీశ్రీ' షష్టి పూర్తి మహోత్సవానికి కొందరు పెద్దలు సన్నాహాలు ప్రారంభించారు. "రచయితలారా మీరెటు వైపు" అని ప్రచురించిన విశాఖ విద్యార్థి లోకపు కరపత్రాలు ఆసభకు కరెంటు షాకు నిచ్చాయి. ఈ సంఘటన తెలుగు సాహిత్య చరిత్రను ఓ మలుపు తిప్పి విప్లవ రచయితల సంఘం ఆవిర్భావానికి నాందీపలికింది.

"పాత", 'అభ్యుదయ' కవులు ముగ్గురు నలుగురు, 'దిగంబర' కవులు నలుగురు, 'తిరగబడు' కవుల్లో అనేకులు కలిసి 'అభ్యుదయ సాహిత్య సదస్సు' పేరిట

సర్కారీ-రివిజనిస్టు సాంస్కృతిక కుట్రను బద్దలు కొడుతూ 1970 జూలై 4న విరసంగా రూపొంది శాస్త్రీయ సోషలిజమే తమ ధ్యేయంగా ప్రకటించారు."[25] అయితే అర్ధరాత్రి శిశువు" లా విరసం ఆవిర్భవించినప్పుడు ప్రముఖులైన రావిశాస్త్రి గాని, కొడవటిగంటి కుటుంబరావు గాని హైదరాబాదుకు హాజరు కానప్పటికి విరసం; ఆవిర్భావం. ఆలోచనా ప్రణాళికతో మమైక్యం చెందివున్నారు.

1970 విరసం ప్రారంభ మహాసభలు ఖమ్మంలో జరిగినప్పుడు రావిశాస్త్రిని, కొ.కుని విరసం వ్యవస్థాపక ఉపాధ్యక్షులుగా ఎన్నుకున్నారు. "ఇది సంస్థకు కొండంత బలాన్నిచ్చింది. అయితే ఆయిద్దరూ విరసం కార్యవర్గసమావేశాలకు మరెన్నడూ హాజరు కాలేదు"[26] అయినప్పటికి రావిశాస్త్రి చివరి వరకు విరసంతోటి పెనవేసుకొని వున్నారు. విరసం ఆలోచనలతో ఏకీభూతంగా వుండటం వలన, పాలకపక్ష నిరంకుశత్వాన్ని, ప్రజావ్యతిరేక చర్యల్ని తన రచనల ద్వారా వ్యతిరేకించటం వలన రావిశాస్త్రి ఎమర్జన్సీ కాలంలో జైలు పాలయ్యారు. 1975 జూలై నుండి 6-2-77 వరకు శాస్త్రి జైలు జీవితాన్ని గడపవలసి వచ్చింది. మానసిక వత్తిడి, తన బలహీనతలు, పరిధి, యివన్నీ శాస్త్రిలో తీవ్ర ఆలోచనను రేకెత్తించటం వల్ల చివరకు "జైలు అధికారులకు సంజాయిషీ లాంటిది రాసి యిచ్చి", విరసం నుండి 'బహిష్కరణకు' గురై విడుదలయ్యారు. ఈ విషయంలో శాస్త్రి కొంత బలహీనత కనబరచారు. ఆయన స్థాయికి యిది తగని పని. అయితే ఆయన తుదిశ్వాస వరకు ప్రజల పక్షాన్నే నిలిచారు. విరసం బాటలోనే నడిచారు. కాని టిక్కెట్టు (సభ్యత్వం) లేకుండా ప్రయాణించారు. విరసానికి దూరంగా లేరు గాని, విరసం వలన తనలో విపరీతమైన మార్పులేమి రాలేదని రావిశాస్త్రి స్పష్టపరిచారు. వాసిరెడ్డి వెంకటప్పయ్య ప్రభావంతో రావిశాస్త్రి కమ్యూనిస్టు సానుభూతిపరునిగా మారారు. న్యాయవాదిగా నల్లకోటు వేసుకున్నా ఆయన మనసు తెల్లన. బాట, భావాలు ఎర్రన.

1972లో వరవరరావు, యం.టి.ఖాన్‌ల నిర్బంధానికి వ్యతిరేకంగా నిర్వహించిన ప్రదర్శనలో రావిశాస్త్రి పాల్గొనటమే గాకుండా 'విరసం' వర్ధిల్లాలనే నినాదాలిచ్చి సంఘీభావాన్ని తెలిపారు.

వయసు ప్రభావం, అనారోగ్యం, కుటుంబ కారణాలు, వ్యక్తిగత పరిధులు- వీటన్నింటి మూలంగా విరసంతో పాటు తాను మందగించారు. రచనలు మందగించాయి. అయినా ప్రభుత్వ దమననీతిని ధిక్కరించి, ప్రజల పక్షాన నిలిచి, ప్రగతి బాటను కాంక్షించిన ప్రజా రచయిత రావిశాస్త్రి.

## 7. నిర్బంధాలు-నిరసనలు

భారతదేశ రాజకీయాలు, 1975 నుండి పెనుమార్పులకు లోనయ్యాయి. రాజకీయ పార్టీలు గూడ నిజాలను మరచి ఇజాల (ప్రిజమ్స్) వెంట ఎండమావుల్లా పరుగులు తీసాయి.

జయప్రకాశ్ నారాయణ ప్రారంభించిన సంపూర్ణ విప్లవాన్ని బలోపేతం చేస్తూ దేశవ్యాపిత ఉద్యమం మొదలయిన రోజుల్లో అవినీతి, లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం, రాజకీయ జులం, అధికార దుర్వినియోగాలకు వ్యతిరేకంగా విద్యార్థిలోకం, యువతరం, వివిధ పార్టీల వారుఅధికార పార్టీపై సమర శంఖం పూరించారు. కానీ ఆనాటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఉద్యమాన్ని అణచడానికి ప్రయత్నించింది. అలహాబాద్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ జగమోహన్‌లాల్ సిన్హా శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నికల ప్రత్యర్థి. శ్రీ రాజనారాయణ పెట్టుకున్న ఎన్నికల పిటీషన్‌పై ఇందిర రాయబరేలి ఎన్నిక చెల్లదని, ఆరు సం॥వరకు ఆమె ఎన్నికలలో పోటీ చేయరాదని న్యాయస్థానం 12-6-1975న చారిత్రాత్మక తీర్పు నిచ్చింది. ఇందిర సుప్రీంకోర్టునాశ్రయించి స్టే తెచ్చుకొని 26-6-1975న అత్యవసర పరిస్థితిని ప్రకటించింది. "రాక్షసులు పుట్టినప్పుడు రక్తం కురిసినట్లు ఈ అత్యవసర పరిస్థితి అమల్లోకి రాగానే అమాయకుల నెత్తుల మీద పోలీసు వర్షం కురియ నారంభించింది".[27] జైళ్ళు నోళ్ళు తెరిచాయి. దేశవ్యాపితంగా లక్షలాది అరెస్టులు అదేమని అడిగే నాథుడేలేడు. రచయితలు, కళాకారులు, మేధావులు, ఆలోచన చెయ్యగల ప్రతివాణ్ణి నిర్బంధించింది. దీనిలో భాగంగానే విప్లవ రచయితల సంఘం (విరసం) వ్యవస్థాపక ఉపాధ్యక్షులైన రావిశాస్త్రిని 04-7-1975 న ప్రభుత్వం అరెస్టు చేసింది. జైల్లో ఆయన జీవితం కొన్ని మలుపులు తిరిగింది. ఆ తరువాత 06-2-1977న శాస్త్రి జైలు నుండి విడుదలయ్యారు. జైలు నుండి విడుదలవ్వటం వివాదాలకు దారి తీసింది. 19-11-75 నుండి మధ్య మధ్య శాస్త్రికి పెరోల్ అవకాశం కల్పించారు. "తన శాశ్వత చిరునామా విరసం సభ్యులతో బాటు తానూ జైలుకు వెళ్ళి నెలలూ, కాలాలూ మగ్గ వలసి వచ్చినప్పుడు మాత్రం, శాస్త్రిగారు, అ కార్యకారణానికి, పూనుకున్నారు. జైలు అధికారులకు సంజాయిషీలాంటిది రాసి ఇచ్చారు. దానితో విడుదలయ్యారు."[28]

అబ్బూరి కూడ పెద్ద పెద్ద నాయకుల ద్వారా శాస్త్రి విడుదలకు తీవ్రప్రయత్నాలు చేశారు. శాస్త్రి ఈ పని చెయ్యకుంటే బాగుండేది. కాని తీవ్ర మానసిక వత్తిడికిలోనై యిలా ప్రవర్తించి వుంటారు. అంతేకాని ఆశలు ప్రలోభాలు యిలాంటి వాటిని గురించి కాదనేది యాధార్థం. విరసం సిద్ధాంత ప్రణాళికకు వ్యతిరేకంగా ప్రవర్తించిన వారందరిని ఆఖరుకు శ్రీశ్రీని గూడ బహిష్కరించినట్లుగానే రావిశాస్త్రిని గూడ విరసం బహిష్కరించింది. అయినప్పటికి శాస్త్రి ఏ విధమైన దుందుడుకు వ్యాఖలు చెయ్యలేదు. బహిష్కరణ తరువాత మళ్ళీ సభ్యత్వంస్వీకరించక పోయిన శాస్త్రి తుదిశ్వాస వరకు విరసంతోనే జీవించారనేది సాహితీ కారులకు, ప్రజా ఉద్యమసంబంధాలను ఎరిగిన వారికి తెలిసిందే "తన వ్యసనాల మూలంగా విరసంకు చెడ్డ పేరు రావచ్చుననుకొని రాజీనామా చేసినట్లు"[29] శాస్త్రి వివరణ.

ఈఎమర్జెన్సీ కాలంలోనే జైలు నుండి శాస్త్రి 'రత్తాలు-రాంబాబు నవలను రాసింది. తాను రాసిన కథను మిగతా డిటెన్యూలకు వినిపించేవారు డిటెన్యూలతో రాజకీయ, సాహిత్య విషయాలు చర్చించేవారు.

'మార్చ్' కవితా సంకలనాన్ని నిషేధించి, ఆకవితా సంపాదకులు పెండ్యాల కిషన్‌రావుని అరెష్టు చేసినప్పుడు రావిశాస్త్రి ఈ విషయాన్ని ప్రజల దృష్టికి తెస్తూ తన నిరసనను తెలియజేశారు.

విరసం కవులు, దిగంబర ప్రముఖులు జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజులను 2-8-1971 హైదరాబాదులో నిర్బంధించారు. "బీదల రక్తం తాగేవాళ్ళు బీభత్సంగా పరిపాలన సాగిస్తున్నారు. ఇటువంటి వీరంతా రాజునీ, జ్వాలనీ, ఈశ్వరుణ్ణి ద్రోహులంటున్నారు"- అని రావిశాస్త్రి 'విశాఖ ప్రజారక్షణ ' సమితి సమావేశం ద్వారా తన తీవ్ర నిరసనను వ్యక్త పరచారు. కలాలపై ఖాకీ జులుం ప్రదర్శించినప్పుడు, ప్రభుత్వం ప్రజావుద్యమకారుల్ని నిర్బంధించినపుడల్లా శాస్త్రి ఉద్యమంతోనే వున్నారు.

జైళ్ళల్లోని ఖైదీలను, మరీ ముఖ్యంగా నక్సలైట్ ఖైదీలను యిబ్బందుల పాలుజేసినప్పుడు, రాజమండ్రి, విశాఖ జైలులో ఖైదీలను నరకయాతనలు బెడితే, వాళ్ళు రోజుల తరబడి సత్యాగ్రహం చేసినప్పుడు రావిశాస్త్రి తనకలాన్ని ప్రజాగళానికి శ్రుతి కలిపి నిరసనను తెలిపారు.

గిరిజనుల్ని, యువకుల్ని, బక్కరైతుల్ని, అట్టడుగు వర్గాలవారిని, ఆలోచించడం, ఎదురిండటం నేర్పేవారిని ఎమర్జెన్సీలోనే గాకుండ అంతకు ముందునించి, మరీ ముఖ్యంగా గిరిజన ప్రాంతాల వారిని ప్రభుత్వం నిష్కారణంగా అరెష్టు జేసినప్పుడు, నెలల తరబడి వాళ్ళను కోర్టుల్లో హాజరు పరచకుండా, బెయిలు రాకుండా ప్రభుత్వం, పోలీసులు అడ్డదారులు తొక్కినపుడు రావిశాస్త్రి ఇతర ప్రజా సంఘాలతో పాటు, ఉద్యమకారులతోపాటు, తాను ఆ అమానుషాన్ని కలమెత్తి, గళమెత్తి నిరసించి, నినదించారు. జైళ్ళల్లో మగ్గుతున్న నిరపరాధ ఖైదీల విడుదలకోసం, ప్రజాతంత్ర హక్కులను కాపాడటం కోసం ప్రగతిశీల న్యాయవాదుల సమావేశాన్ని తన యింట్లో యేర్పాటు జేసి, ఆ ఖైదీల విడుదలకు శాయశక్తుల ప్రయత్నించారు.

తన శక్తిమేరకు ప్రగతిశీల శక్తుల్ని సమైక్య పరుస్తూ, ప్రజాతంత్ర ఉద్యమాన్ని బలోపేతంజేస్తూ, విప్లవ శక్తుల పోరాటాన్ని ఎరుపెక్కిస్తూ, ఎఱ్ఱబాటలో ఎదురవుతున్న ముళ్ళని, రాళ్ళని తొలగించు కొంటూ రావిశాస్త్రి ఆక్రమంలో ముందుకు సాగారు. కేవలం కార్యాచరణ సూత్రాన్ని వల్లించటమే గాకుండా, కార్యరంగంలో స్వయంగా పాల్గొని, వీధుల్లో ఊరేగింపులప్పుడు, సభలప్పుడు ప్రత్యక్షంగా వుండి ప్రజాఉద్యమాలకి "చేయెత్తి జై కొట్టారు" ప్రభుత్వ దమన కాండని గొంతెత్తి ఛీ కొట్టారు.

## 8. అవార్డులు-తిరస్కారాలు

అవార్డులు, అభినందనల కోసం పడిగాపులు గాసేవారు, పడిచచ్చేవారు, అఱ్ఱులు చాసేవారు వుంటారు, అటువైపు కన్నెత్తి చూడనే చూడని వారువుంటారు, పాలక పక్షం బలవంతాన కట్టబెడితే వాటిని అటకెక్కించేవారు వుంటారు. వద్దుమొర్రో అంటున్నా

వెంటబడి వాటిని అంటగడితే నాకొద్దు బాబో అని తిరస్కరించేవారు వుంటారు. రావిశాస్త్రి యీ చివరకోవకు చెందిన అగ్రశ్రేణి రచయిత.

'రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలు' అనే కథా సంపుటికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1966వ సం॥నికి గాను రావిశాస్త్రి ఈ పురస్కారాన్ని 1967లో అందించింది. అప్పటి ఆలోచనా తీరునుబట్టి రావిశాస్త్రికి ఆ పురస్కారాన్ని స్వీకరించినా - 1983లో ఈ బహూకృతిని తిరస్కరిస్తున్నట్లు ప్రకటించారు.

ఆయన మూడొంతుల జీవితం సాగరంలా విశాఖలో ప్రవహిస్తే, సాగరొడ్డునవున్న ఆంధ్ర విశ్వవిద్యాలయం రావిశాస్త్రి మీద గౌరవంతో; ఆయన రచనలపట్ల ఆసక్తితో 1983లో ఆయనకు 'కళాప్రపూర్ణ' బిరుదును ప్రకటించి; సత్కరించబోతే రావిశాస్త్రి ఆ 'కళాప్రపూర్ణ'ను తిరస్కరించారు. పీడిత ప్రజా లోకపు షోడశ కళా ప్రపూర్ణునికి యీ పాలక 'కళా ప్రపూర్ణ'లు వుంటే యెంత? వూడితే యెంత?

'రత్తాలు-రాంబాబు' అసంపూర్ణ నవలలోని మూడు నాలుగు భాగాలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రకటించిన అవార్డును రావిశాస్త్రి తిరస్కరించారు. 1974లో శ్రీ కాళీపట్నం రామారావు ఏ కారణాలతో 'యజ్ఞం' కధకు సాహిత్య అకాడమీ యిచ్చిన అవార్డును తిరస్కరించారో అవే కారణాలతో నేనుగూడ యీ సాహిత్య అకాడమీ అవార్డును తిరస్కరిస్తున్నానని శాస్త్రి ప్రకటించటం ముదావహం.

తుపాకీ రాజ్యం అవార్డుని తిరస్కరించి కా.రా. పీడిత ప్రజల పక్షాన నిలిచినట్లు, దాదాపు దశాబ్ది తరువాత తనకు వచ్చిన అదే అవార్డుని రావిశాస్త్రికూడా తిరస్కరించటానికి కారణం; కాలం దశాబ్ది గడిచినా, పాలకవర్గాలు మారినా పాలనా పద్ధతిలో, పీడనలో, తేడా లేదుగాబట్టి అణగారిన అప్పులకోసం శాస్త్రిగూడా ఆ బాటలోనే పయనించారు.

'శిరీషా సాహిత్య అవార్డు'ని రావిశాస్త్రి స్వీకరించారు. తన 'మూడు కథల బంగారం' నవలకు ఈ అవార్డు ప్రదానం చేయబడింది''[30]

అలానే 'గోపీచంద్' స్మారక సాహిత్య అవార్డుని రావిశాస్త్రి స్వీకరించారు.[31] 1980-90 దశకపు ఉత్తమ రచయితగా రావిశాస్త్రికి ఈ అవార్డు బహూకరించబడింది.

పై రెండు అవార్డులు పాలకవర్గాలుగాకుండా ప్రజలపక్షాన, ప్రజాసంస్థల పక్షాన వారు రావిశాస్త్రికి ఆయా అవార్డులను ప్రకటించారు; గాబట్టి వాటిని స్వీకరించారు.

ప్రేమతో తృణమో పణమో ఇస్తే స్వీకరించవచ్చుగాని; ప్రజల్ని జలగల్లా పీల్చిపిప్పిజేస్తూ ఆ ప్రజల పక్షాన నిలిచినవారికి; అదే ప్రజల రక్తమాంసాలను అవార్డులుగా అందిస్తామంటే ఏ ప్రజాసంక్షేమ కాంక్షితుడు వాటిని స్వీకరించడు.

ఏ అవార్డులకు అందక, ప్రజల నాడిని; ముఖ్యంగా విశాఖవాణిని సొంతం జేసుకున్న ప్రజా రచయిత రావిశాస్త్రి.

## 9. వ్యక్తిత్వం - వికాసం

రావిశాస్త్రిది చిన్నప్పటినుంచి విలక్షణ వ్యక్తిత్వం. ఇంట్లో వాళ్ళకి విశ్వం, బయటి వ్యక్తులకు రావిశాస్త్రి, బార్‌లో వాళ్ళకి ఆర్వీయస్, కేసుల్లో యిరుక్కున్నవాళ్ళకి 'చాత్రిబాబు' అనే ముద్దుపేర్లతో పరిచయం.

చదువులోనేగాదు ఇతర వ్యాపకాల్లో గూడా మునిగి తేలుతుండేవారు. సినిమాల్లో గూడా వేలుబెట్టారు. "స్త్రీ" సినిమాకి కథ, మాటలు రాసింది రావిశాస్త్రే. ఆయన 'నిజం' నాటకం సినిమాగా వచ్చింది. 1965లో పోలార్ ఫుట్‌బాల్ క్లబ్బుకు అధ్యక్షులుగా వున్నారు.

బాల్యచేష్టల నుంచి ఆయన ఆలోచనలు క్రమేపి కొంత మంచి పరిణామం దిశగా మళ్ళాయి. "బాల్య దశలోంచి ఆ తరువాత దశకి నేను ఏ విధంగా మారానో నేను సరిగా చెప్పలేనుగాని ఆ మారడంలో ఏదైనా మంచి అంటూ వుంటే కొంతవరకూ డాక్టర్ తలశెట్టి ఆత్మారాం పురుషోత్తంగారు, డాక్టర్ పూళ్ళ తిరుపతిరాజుగారు కారకులని నేను చెప్పగలను. మరో కారణం విశ్వవిద్యాలయంలోని లైబ్రరీ"[32] అని శాస్త్రే స్వయంగా చెప్పుకున్నారు. ఏ వ్యక్తిగూడ తనకు తానుగా మంచిగాను చెడ్డగాను రూపొందడు. అతని చుట్టూ వున్న వాతావరణం తప్పకుండా ఆ వ్యక్తి పరిణామ క్రమాన్ని ప్రభావితం జేస్తుంది. ప్రతి వ్యక్తికి తనదైన ఒక ప్రాపంచిక అనుభవం, అవగాహన, తద్వారా కొన్ని పరిణామ దశలు, వాటికొక క్రమ వికాసం, ఆ వికాసానికొక ఫలితం ఉంటుంది. రావిశాస్త్రి జీవితంలోను కొన్ని మలుపులు మనకు కొట్టవచ్చినట్లు కనబడతాయి.

స్నేహానికి తరతమ భేదాలు పాటించటం ఆయన స్వభావంలో లేదు. డబ్బుకు, మానవత్వానికి మించిన విలువ యివ్వటం ఆయనకు తెలియదు. అందుకే ఆయన పొయ్యేటప్పుడు ఏమి మూటగట్టిగాని, కట్టుకొనిగాని వెళ్ళలేదనేది లోకవిదితం. ఆయన దాపరికం లేని మనిషి. తన బలహీనతల్ని బహిర్గతం చెయ్యటానికి శ్రీశ్రీలా సంకోచించని వ్యక్తి. తన వ్యక్తిగత బలహీనతల వలన తానున్న ఉద్యమానికి చెడ్డపేరొస్తుందంటే కాస్త పక్కకు తప్పుకొని, తన చేతనైనంత మంచి చెయ్యటానికి చిత్తశుద్ధితో ప్రయత్నించే శీలం ఆయనది. శ్రీశ్రీలానే 'రామం'గారిని రెండవ భార్యగా స్వీకరించారేగానీ, చాటుమాటుగా జీవితాన్ని గడపలేదు. తన ద్రవ్యాన్ని ద్రవంగా మార్చుకున్నారేగాని, పరాన్నభుక్కులా జీవితాన్ని గడపలేదు. ఎదుటి వ్యక్తిలోని మంచిని బహిర్గతం జేసేవారేగాని, చెడు తెలిసినా చెప్పేవారుగాదు. మరీ బయటపడవలసి వస్తే చిరునవ్వే సమాధానం.

సభా వేదికలపై ఉపన్యాసాల సమయంలో, చర్చల సందర్భంలో యితరులను డామినేట్ చెయ్యాలనే తలంపు ఆయనకు వుండేది గాదు, తన క్లయింట్లకుగాని, ఇతరులకుగానీ, తను సహాయం చేసిన విషయాన్ని బయటకు తెలియనివ్వనంతటి గోప్యపు వ్యక్తి. కష్టాల్లో ఉన్నప్పుడు చెయ్యిజాచి యితరులను అడగలేక పోవటం గాదు కనీసం తనకు రావలసిన డబ్బుల్ని ఆపద సమయంలోనైనా నోరు తెరిచి అడగలేనంత మొగమాటస్తుడు శాస్త్రి. డబ్బుల కోసం చాలా యిబ్బంది పడుతూ "ఇంత బాధపడుతున్న తనకు రావలసిన డబ్బుకోసం అడగడానికి క్కూడా ఆయనకెంతో మొగమాటం, సంకోచమున్నూ 16-8-64 జాబులో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ఏ 300 రూ॥ల

కన్నానో ఎక్కువ బాకీ లేరంటూనే వారికి స్వయంగా రాయలేరు. "You kindly request them to pay some thing out of it"[33] అంటూ నాకు పురమాయించారు. అదీ మనిషి తత్వం. శ్రీ మహీధర రామ్మోహనరావు బయటపెట్టిన యీ సంగతినిబట్టి రావిశాస్త్రి వ్యక్తిత్వాన్ని అంచనా వేసుకోవచ్చు. ఇలాంటి ఘటనలు 'రాచకొండ'ను తవ్వి తీస్తే ఎన్నో.

"ఆయన జీవితంలో ఎప్పుడు రిక్షాగాని, ఆటోగాని, బేరమాడి ఎక్కలేదు[34] ఇదీ అల్పజీవులపట్ల రావిశాస్త్రి కుండే అనల్పాభిమానం.

"సెక్స్ కథలు చిన్నప్పుడే చదివి జీవితం కొంతవరకు పాడు చేసుకున్న వాళ్ళెవరయిన వున్నారో లేదో కానీ నేను మాత్రం వున్నాను. ఈ కథల ప్రభావం అందరికి చెడ్డగా పరిణమించకపోవచ్చు. నాలోమాత్రం అవి చెడ్డనే కలిగించాయిగాని, మంచిని కలిగించలేదు"[35] అని ఆయనే చెప్పుకున్న ఈ మాటలు శాస్త్రి నిజాయితీకి, సత్యదృష్టికి అసలైన ఉదాహరణ. తన బలహీనతని దాపరికం లేకుండా వెళ్ళడి చేసినందుకు శాస్త్రి అభినందనీయులు.

"నిజాయితీ, చిత్తశుద్ధి ఆయనకు పెట్టని నగలు, పండితుల గర్వం రచయితల మాత్సర్యం, ప్లీడర్ల మాయలు రావిశాస్త్రిగారిలో మచ్చుకుకూడా లేవు"[36] అని రావిశాస్త్రికి అత్యంత ఆప్తమిత్రులు, ఆయన స్వభావాన్ని బాగా ఆకళింపు జేసుకున్న శ్రీ చలసాని ప్రసాద్ అభిప్రాయం.

"నేను డాకూ నంబర్ వన్ని ఈ వ్యవస్థే నన్ను సృష్టించింది అని కుండబద్దలు కొట్టినట్లు చెప్తారు శాస్త్రి"[37] అని రావిశాస్త్రికి సన్నిహితుడైన శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ ఉద్దేశ్యం. శాస్త్రి చేసేపని, చెప్పే మాటలు ఆత్మ విమర్శ, ఆత్మ విశ్వాసంతో కూడుకొని వుంటాయనటానికి పై మాటలే నిదర్శనం.

"విశ్వనాథ శాస్త్రి చక్కటి స్నేహితుడు మేధావుల కుండే అహంకారము, పొగరుబోతు తనము ఇతడికి లేవు. ఇతడు నిగర్వి, ఇతణ్ణి ఎవరైనా చూస్తే, మృదువుగా మాట్లాడడం, సున్నితమైన ఆలోచనాశక్తి కలిగినవాడు కాబట్టి, యితడికి అందరూ స్నేహితులే. అజాత శత్రువు"[38] అని రావిశాస్త్రి సహాధ్యాయి పట్టాభి సోదరుడు మామిడిపూడి ఆనందం; శాస్త్రిపై అభిమానాన్ని వ్యక్తీకరించారు. నెమ్మదిగా వుండటం, నిర్మలంగా మాట్లాడడం, స్నేహ వాత్సల్యం, నమ్మకమైన గుణం యివి రావిశాస్త్రి వ్యక్తిత్వానికి బాగా పదునుపెట్టాయి. స్వాభావిక ఉదాత్తతను పెంపుచేశాయి.

'అన్యాయాలకు గురైన వాళ్ళే అన్యాయాల్ని ఎదిరించేవాళ్ళవుతారని శాస్త్రి విశ్వాసం' అంతేమరి దెబ్బతగిలిన వాడికే నొప్పేమిటో, బాధేమిటో తెలుస్తుంది. ఒడ్డునున్న వాడికేమి తెలుస్తుంది? అసంఖ్యాక పీడిత ప్రజానీకం, తమ పీడనకు విముక్తి మార్గాన్ని తామే ఎన్నుకుంటారని ఆయన తలంచారు.

"అగ్గిపుల్ల అనే కథలో శేషగిరిలా నేను ఉండగలనని నాకు నమ్మకం వుంది. అటువంటి వాళ్ళంటే నాకు చాలా అసహ్యం"[39] అని శాస్త్రి తన వ్యక్తిత్వాన్ని అంచనా వేసుకొని చెప్పటం హర్షణీయం. శేషగిరి తన పెళ్లికి ముందే అగ్రహారంలోని సముద్రాలు అనే అమ్మాయిని అనుభవిస్తాడు. అతనిలో శృంగార శాతం అధికం. కోరికలను

అణచుకోలేని బలహీనత తన జీవితంలో వుందని రావిశాస్త్రి ఎంతో చిత్తశుద్ధితో అంగీకరిస్తూ తాను శేషగిరిలా వుంటానని వివరించటం ఆయన సత్యశీలతకు నిదర్శనం.

తన మార్గంలో వురకలు పరుగులు తీయకపోయినా, అలసటలేని శాస్త్రి, రావిశాస్త్రి. పీడితుని పక్షాన వాదించటానికి వెరపులేని 'ఎరుపు' శాస్త్రి, రావిశాస్త్రి. తన జీవన అవసాన దశలో జబ్బు చేసినప్పుడు గూడ డబ్బు కోసం దిగులు పడని వ్యక్తి.

## 10. మహాప్రస్థానం

ఒక దుందుభిలో పుట్టిన సాహితీ సింధువు గురజాడ. మరో దుందుభిలో పుట్టిన గురజాడ సాహితీబంధువు రావిశాస్త్రి. పాతకొత్తల మేలు కలయిక గాదు, వినూత్న వచన రచనా మేస్త్రి రావిశాస్త్రి. 'నేనొక దుర్గం, నాదొక సొర్గం, అనితర సాధ్యం నా మార్గం' అని మహాకవి ప్రవచించినట్లు రావిశాస్త్రి రచనా పద్ధతి విశిష్టమైంది.

పేదసాదల కోసం నిరంతరం, సమయ సందర్భాలు లేకుండా తిరగడం, వేళకు సరైన ఆహారం తీసుకోకపోవటం, యింకా యితర కారణాలవలన, కొంత వయసు ప్రభావంవల్ల రావిశాస్త్రి 1990 డిసెంబరు 9న పక్షవాత జబ్బుకు గురైనారు. క్రమేపి కొంతవరకు పక్షవాతం నుండి బయటపడగలిగారు. 1993 జూన్ 2వ తేదీన ఆయనకు మూత్రపిండాల వ్యాధి అని బయటపడింది. విశాఖ కె.జి.సి.డి.ఆర్. హాస్పటల్‌లో చాలాసార్లు డయాలసిస్ చేశారు. ఈ జబ్బు తగ్గేది కాదని, కొన్ని రోజులు, మహా అయితే నెలలు మాత్రమే అని శాస్త్రికి తెలుసు. "ఎవడు బ్రతికేను మూడు యాభైలు" ఇందులో దాదాపు సగం గడిపావు. ఇక చాల్లే రావయ్యా! అని శ్రీశ్రీ స్నేహం హస్తం చాచాడేమో, తొందరపడి "దొంగ లంజకొడుకు లసలే మసలే లోకం"లో ఇక ఉండలేనని 1993 నవంబరు పదిన ఉదయం గం.9-45 నిముషాలకు, "ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోయారు"రావిశాస్త్రి.

1922 జులై 30న ప్రారంభమైన రావిశాస్త్రి మహోదయం 1993 నవంబరు 10 నాటి మహాప్రస్థానంతో ముగిసింది. సాహితీ అరుణకిరణం నేలరాలింది. పీడిత ప్రజల కలం ఆగిపోయింది. అణగారిన అప్పుల మిత్రుని గళం శాశ్వతంగా మూగబోయింది. 'పేరెన్నికగన్న సీత్కవీంద్రుని' కమ్మని కలం నిప్పులలో కరిగిపోయింది. అధికార, అన్యాయవాద; ధనమదాంధుల దుర్మార్గాన్ని చీల్చి చెండాడిన న్యాయవాది పదునైన జిహ్వా కరవాలం మొద్దుబారింది. పేదల కండయైన రాచకొండ కరిగిపోయింది. రావిశాస్త్రి కన్ను, 'పెన్నుమూశారు.'

వ్యక్తిగా రావిశాస్త్రి ఉత్తమ సంస్కారి; స్నేహశీలి. రచయితగా రాటుదేలటానికి, కావలసిన మార్గాలన్నీ శాస్త్రి యుక్త వయస్సులోనే అలవరచుకున్నారని స్పష్టమవుతుంది. జీవితాంతం పేద ప్రజల పక్షాన నిలిచారని బోధపడుతుంది. వ్యక్తిగా, రచయితగా రావిశాస్త్రి జీవితం మార్గదర్శకమైంది; సమాజాన్ని ఆలోచింపజేసి చైతన్య పరచింది.

# 2. నవలల ఇతివృత్తం

రచయిత దృక్పథం ఇతివృత్త స్వీకరణ; నిర్వహణను బట్టి చెప్పవచ్చు. ఇతివృత్త స్వీకరణా వైవిధ్యం రచయిత నేర్పరితనంపై ఆధారపడి ఉంటుంది. సమకాలీన సామాజిక,ఆర్థిక,రాజకీయ, సాంస్కృతిక సమస్యల పట్ల స్పందిస్తు, యుగధర్మాన్ని గుబాళింపజేస్తు ప్రగతి కాముక రచయిత తన రచనలు కొనసాగిస్తాడు. వర్తమాన ప్రాపంచిక చరిత్రకు ఏ ప్రగతి శీల రచయితా దూరంగా ఉండలేడు. రావిశాస్త్రి గూడ తన నవలేతి వృత్తాల ద్వారా సామాజిక పోకడలని, ధన, అధికార దురహంకారాన్ని, దురన్యాయాన్ని, భూదాహాన్ని, అస్తుల అపహరణామనస్తత్వాన్ని, సంపన్న వర్గం బక్క జీవులను అణిచివేస్తున్న తీరుని, ధన సంపాదనతో జీవితాలలో ఏర్పడే మార్పుని, స్త్రీల జీవితాల్ని, వేశ్యరికాన్ని, పోలీసు, న్యాయ, రాజకీయ రంగాలని మధ్య తరగతి, అట్టడుగు ప్రజల జీవన విధానాన్ని ఆయన విశదం చేశారు.

నవలకు కధావస్తువు ప్రాణం లాంటిదని సాహితీ విమర్శకులు సూచించారు. "In the first place, the novel deals with events and actions, with things which are suffered and done, and these constitute what we commonly call the plot.

Secondly such things happen to people and are suffered or done by people, and the men and women who thus carry on the action from its dramatis persons or charectors"[1] అని విలియం హెన్రీ హడ్సన్ పేర్కొన్నారు.

ఇతివృత్తంతో పరిచయం లేకుండ, అందులోని పాత్రల గురించిగాని, వివిధ ప్రభావాల గురించిగాని, అవగాహన ఏర్పరచుకోవటం కష్టమనే దృష్టితో సూక్ష్మంగా, ఆయా నవలల ఇతివృత్తాలను దీనిలో వివరించాను.

## 1. అల్పజీవి

'అల్పజీవి' నవల 1953 జనవరి నుండి ఏప్రిల్ వరకు 'భారతి'సాహిత్య మాస పత్రికలో ధారావాహికంగా ప్రచురించబడింది.

1954 డిసెంబరులో సౌర సాహితీ పక్షాన 'అల్పజీవి' పుస్తకంగా వెలువడింది.

అంతకు ముందు ఎన్నో మారుపేర్లతో రచనలు చేసినప్పటికి మొట్టమొదటి సారిగా రాచకొండ విశ్వనాధశాస్త్రి పేరుతో అచ్చైన తొలి నవల 'అల్పజీవి'. రావిశాస్త్రి ఈ నవలను "అయ్యారే బాబారే" పేరుతో రచించారు. ఒకనాటి సుప్రసిద్ధ సాహిత్య మాసపత్రిక 'భారతి' సంపాదక వర్గ సభ్యులు శ్రీ వి.డి. ప్రసాదరావు ఈనవలకు 'అల్పజీవి' అని పేరు బెట్టారు. శ్రీశ్రీ. పురిపండ అప్పలస్వామి లాంటి సాహితీ ప్రముఖులు దీనిని ప్రశంసించటం రావిశాస్త్రికి సాహితీపరంగా మనో ధైర్యం కలిగింది.

"అల్పజీవి" మనో వైజ్ఞానిక నవల --- చైతన్య స్రవంతి శిల్పాన్ని వుపయోగించి రచింపబడిన తెలుగు నవలల్లో 'అల్పజీవి' మొట్టమొదటిది[2] అని నిర్ధారింపబడి తెలుగు

నవలా సాహిత్యంలో ఒక వినూత్న ఒరవడికి అల్పజీవి నాంది పలికింది. ప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రవేత్త ఆడ్లర్ సూత్రీకరించిన ఆత్మ న్యూనతా భ్రాంతి (Inferiority Complex) ప్రభావం కూడా ఈ జేమ్స్ జాయిస్ 'యులిసిస్' (Ulisess) ప్రభావం కూడా ఈ నవలపై వుంది. "సుబ్బయ్య పాత్రకి శ్రీశ్రీ గారి 'కొనేటి రావు' కొంతగా నమూన, నిజజీవితంలో చాలా నమూనాలు" అని రావిశాస్త్రి స్వయంగా చెప్పుకున్నారు. శ్రీశ్రీ రూపొందించిన మధ్యతరగతి గుమస్తా పాత్ర కొనేటిరావు.

ప్రతి వ్యక్తి జీవితాన్ని కొన్ని భాగాలుగా విభజించుకోవచ్చు. ముఖ్యంగా ప్రతి ఒక్కరికి అంతరంగిక, బాహిరజీవితాలుంటాయి. ఈ రెండింటి మధ్యఘర్షణ, సామాజిక కట్టుబాట్లకు, నియమాలకు తలొగ్గటం, కాలానుసారణంగా వాటిని ఎదిరించ వలసిన పరిస్థితులు ఏర్పడినప్పుడు మానసికంగా ఎంతో వత్తిడికి గురవుతుంటాము. బాహిర, అంతరంగిక స్థితులు రెండు చైతన్యస్రవంతిలో రెండు పాయలుగా వుంటాయి. అయితే అంతర్మధనానికి, అంతర్గతాలోచనా స్రవంతికి అక్షరాకృతి నివ్వటమే చైతన్య స్రవంతిగా భావించాలి. ఏదైనా ఒక సామాజిక సంఘటనకు, లేదా తన వ్యక్తిగత జీవితంలో తారసపడిన సన్నివేశానికో ఒక వ్యక్తి మానసికంగా ఎలా ప్రతిస్పందిస్తాడు; అతని భావప్రకంపనలు ఎలా పరివర్తిస్థాయనే అంశాన్ని వివిధకోణాల నుంచి విశ్లేషించి చిత్రీకరించటమే చైతన్యస్రవంతి మార్గం, లేక మనోవిశ్లేషణాత్మక విధానం. ఈ పద్ధతినే అనుసరించాలని గాకపోయినా; ఈ ప్రభావానికి లోనై రావిశాస్త్రి 'అల్పజీవి'ని రచించారు.

"అల్పజీవిలోని కథావస్తువు ఆత్మన్యూనతాభావం (Inferiority Complex) కథన శిల్పం చైతన్య స్రవంతి (Streem of Consciousness). బుచ్చిబాబు,'చివరకు మిగిలేది, గోపీచంద్ అసమర్థుని జీవయాత్ర, 'అల్పజీవి'కి ముందువచ్చిన మంచి మనోవైజ్ఞానిక నవలలు, 'చివరకు మిగిలేదిలో' ఈడిపస్ కాంప్లెక్సు ఇతి వృత్తం కాగా అసమర్థుని 'జీవయాత్ర' ఆలోచనా పరుడుగా గోపీచంద్ భౌతికవాదం నుంచి ఆధ్యాత్మిక వాదానికి చేసినయాత్రను వర్ణిస్తుంది' దయానిధి సీతారామారావుల కంటే సుబ్బయ్యలోనే ఆత్మన్యూనతాభావం గూడుకట్టుకొని ఉంది. చిన్ననాటి సంఘటన, తనచుట్టూ ఉన్నవాతావరణం సుబ్బయ్యలో ఈ భావాన్ని అధికం చేసాయి. భయం, భయం సుబ్బయ్య జీవిత మంతా భయంతో నిండిపోయంది. 'ఆ భయం' నుంచి బయటకి రావాలని సుబ్బయ్య చేసే విఫల ప్రయత్నమే 'అల్పజీవి' లోని కథావస్తువు Theory of Complexes కు మూల పురుషుడైన ఆడ్లేర్ తన Life Style సిద్ధాంతాన్ని నిర్వచిస్తూ 'న్యూరోసిస్'ను గురించి ఇలా అన్నారు.

Every Nourosis Can be Understood as an attempt to free oneself from a feeling of inferiority in order to gain a feeling of superiority"[3] సుబ్బయ్యకు ఈ సూత్రం దాదాపు సంపూర్ణంగా వర్తిసుంది. కానీ ఈ సూత్రాన్ని మొత్తం సుబ్బయ్య జీవితానికి ఆపాదన చెయ్యటం సముచితం గాదు. సుబ్బయ్య చుట్టూ పరుచుకొని వున్న అస్తిత్వం, అతనిలో నూతన ఆలోచనా జ్యోతిని అంకురింపజేసింది. భయంతో కూడుకున్న ఆత్మన్యూనతా భావాన్ని కూడా ఈ అస్తిత్వంలో అంతర్భాగంగా పరిగణించాలి.

అల్పజీవిలో కథానాయకుడైన అల్పజీవి సుబ్బయ్య సోమయ్యకు మొదటి భార్య వలన కలిగిన ఏకైక సంతానం. సుబ్బయ్య పుట్టుకతోనే తన తల్లిని కోల్పోయాడు. జీవితంలో అచ్చట, ముచ్చట తీరకుండానే, రెండుపదుల వయసన్నా దాటకుండానే అతని తండ్రి కూడా పరమపదించాడు.

సుబ్బయ్య 5 సం॥ల వయసప్పుడు, సోమయ్య రెండవ వివాహం జేసుకున్నాడు. 'ఈరెండవ భార్య చాలా వికృతంగా వుండటమే గాకుండా, చాలా క్రూరంగా ఉండేది'. కాపురానికి వచ్చిన మరునాటి నుండే సుబ్బయ్యను కొట్టి హింసిస్తూ అసలే భయస్తుడైన సుబ్బయ్యను మరీ పిరికి వానిగా తయారుజేసింది. పెళ్ళైనా సంవత్సరానికే ఆమె పక్కింటాయనతో లేచిపోయింది.

ఒకనాటి రాత్రి సమయంలో సుబ్బయ్య అతని తండ్రి నడిచి వెళ్తుంటే ఎవరో ముగ్గురు వ్యక్తులు అటకాయించి సోమయ్యను చితకబాదుతారు. ఈసన్నివేశం సుబ్బయ్యలో విపరీత భయానక వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఒక చలన చిత్రంగా ఈ సన్నివేశం జీవితాంతం సుబ్బయ్యను భయానకంగా వెంటాడుతుంది.

స్కూల్ ఫైనల్ పాసైనాక, పద్దెనిమిదేళ్ళు నిండీ నిండగానే గుమస్తా ఉద్యోగంలో చేరాడు సుబ్బయ్య. జమిందారీ వంశంలో పుట్టిన వెంకట్రావు సుబ్బయ్యకు క్లాస్‌మేట్. సుబ్బయ్యకు ఉద్యోగం వచ్చిందని తెలియగానే, వెంకట్రావు తన చెల్లి సావిత్రిని సుబ్బయ్యకు ఇవ్వడానికి సిద్ధపడతాడు. అప్పటికి సావిత్రి వయస్సు 13 సం॥లు.జమిందారీ వంశంలో పుట్టిన పిల్ల తనకు భార్య అవుతుందని కలలో గూడా ఊహించని సుబ్బయ్య సావిత్రిని చేసుకోవడానికి పరమానందంగా ఒప్పుకుంటాడు. పెళ్ళి పీటల మీద అపురూప సౌందర్యరాశిగా వున్న సావిత్రిని చూసిన సుబ్బయ్య ఆనందాశ్చర్యాలతో భగవంతునికి నమస్కరిస్తాడు. కానీ సావిత్రి మాత్రం ఏనాడు సుబ్బయ్యని తనకు తగిన భర్త అని భావించనేలేదు. "నువ్వు చాలా ఇనెఫిషియంట్‌గా కనిపిస్తున్నా"వని ఆఫీసులో డిస్పేచ్ సెక్షన్ అప్పగిస్తే సంవత్సరాల తరబడి ఆసీటునే అంటిపెట్టుకొని పని జేశాడు. కొత్త హెడ్ గుమస్తా రామస్వామి సుబ్బయ్యను అకౌంట్సు సెక్షన్‌కి మార్చాడు. ఈ సెక్షన్‌లో కాంట్రాక్టర్ల బిల్స్ చెక్ చేయటం ముఖ్యమైన పని.

సావిత్రిని పెళ్ళి జేసుకొని పదిహేను సంవత్సరాలు దాటినా, ఆమెతో యింకా అలవాటు బడలేదు సుబ్బయ్య, అందుకు తరచు వీధి వరండాలో కూర్చొని వచ్చే పోయ్యేవాళ్ళని తదేకంగా చూస్తూ ఉంటాడు.

వెంకట్రావు తండ్రి చనిపోయిన తరువాత, అతని మేనమామ నర్సయ్య అప్పుల బాధల్లో ఉన్న కుటుంబాన్ని చక్కబరచుదామని, వీలైతే తన కూతురు శాంతమ్మను వెంకట్రావుకు ఇద్దామనే ఉద్దేశ్యంతో, నర్సయ్యమ్మ వెంకట్రావు వాళ్ళ యింటికి వస్తాడు. నర్సయ్య అడుగుబెట్టే సరికి వెంకట్రావు వాళ్ళ ఎస్టేటు జప్తులో వుంది. ఈకుటుంబ, ఎస్టేటు వ్యవహారాలన్నీ ఆమూలాగ్రం తెలిసిన గుమస్తా కామేశం. జమిందారీ నగల తాకట్టు విషయంలో కామేశం నర్సయ్యకు దొరికిపోతాడు. నర్సయ్య, కామేశం యిద్దరు ఒక అంగీకారానికి వచ్చి ఆసొమ్మంతా కాజేశారు. వెంకట్రావు శాంతని ప్రేమించాడు.

కానీ అకస్మాత్తుగా నర్సయ్య, శాంతలు ఆయిల్లు వదిలి వెళ్ళిపోతారు, ఇది జాలిలేని లోకం. మానవలోకం అనే ఈ మార్కెట్టులో ఎవడి జాగ్రత్తలో వారుండాలి. ఎవడి లాభం వాడు చూసుకోవాలి... అని ఆలోచించి సిగ్గు, లజ్జావిడిచి పెట్టి వెంకట్రావు కాంట్రాక్టరుగా ఎదుగుతాడు. వెంకట్రావు ఒక రోజు సుబ్బయ్య యింటి కొచ్చి 'అర్జంటుగా ఓ ఐదు వందలు, కావాలోయ్" అని అడిగి, ఆ ఐదు వందలు కాంట్రాక్టరు గవరయ్య ద్వారా సంపాదించి తన కియ్యమని బావ సుబ్బయ్యకి వెంకట్రావు వుపాయం జెప్తాడు.

నలభై సంవత్సరాల గవరయ్య చాలా గంభీరంగా వుంటాడు. రామయ్యమ్మతో గవరయ్యకు పెళ్ళి చేసింది గంగమ్మ. తల్లి గంగమ్మ చనిపోయే సరికి గవరయ్య పరిస్థితి బజార్న బడ్డట్టయ్యింది. గవరయ్య నాలుగోఫారం వరకే చదువుకున్నాడు. తాలుకా ఆఫీసులో బంట్రోతుగా పని జేసే నూకరాజు గవరయ్యకు ప్రాణ స్నేహితుడు. నూకరాజు గవరయ్యకు తాలూకా ఆఫీసులో అటెండర్ ఉద్యోగం రావటానికి బాగా సహాయం జేస్తాడు. గవరయ్య ఒక రోజు తాసీల్దారుకి తన యింటిని జూపిస్తే, ఆ తసీల్దారు గవరయ్య యింటి కంటే అతని యిల్లాలు బాగుందని అనుకొని ఆతరువాత ఆమెతో కామక్రీడ వెలగబెడుతున్న సమయంలోనే, గవరయ్య యింటికి రావటం జరుగుతుంది. భార్యని నరికేస్తానని కోపంతో ఊగిపోతున్న గవరయ్యకు నూకరాజు సలహా చెప్పటమే గాదు, తాసీల్దారు నుండి డబ్బులు గుంజుకునే ఉపాయం గూడా జెప్పి అతన్ని చల్లబరుస్తాడు. అప్పటి నుండి గవరయ్య జీవితం మలుపు తిరుగుతుంది. అలా ఎదిగిన గవరయ్య ద్వారా ఐదువందలు తీసుకొని సుబ్బయ్య, వెంకట్రావుకిస్తాడు. ఈ ఐదు వందల వ్యవహారం సుబ్బయ్య జీవితానికి పెద్ద గుదిబండలా తయారవుతుంది. ఈ సంఘటనను ఆధారంగా జేసుకొని చాలా కథ నడుస్తుంది.

సుబ్బయ్య జీవితంలో మనోరమ పరిచయం ఓమలుపు.మనోరమ వల్లనే సుబ్బయ్య ఆలోచనా పరిధిలో విస్తృత పరిణామాలు చోటు జేసుకుంటాయి. మనోరమ టీచర్.

గవరయ్య దగ్గర తీసుకున్న డబ్బుల విషయంలో కాస్త జాగ్రత్తగా వుండమని అవధాని, సుబ్బయ్యకు సూచనలిస్తాడు. "ఇహ నువ్వు చూస్తే ఓ వెర్రి పీరువి'" అనికూడా అవధాని సుబ్బయ్యనంటాడు.

ఎప్పుడూ ఆఫీసుకు ఆలస్యంగా రాని సుబ్బయ్య కూతురు కమలనాసుపత్రికి తీసుకెళ్ళి రావటం వలన ఒక్క రోజు ఆలస్యంగా వచ్చేసరికి హెడ్ గుమస్తా, సుబ్బయ్యను తీవ్రంగా అవమాన పరచటమే గాకుండా 'కాంట్రాక్టర్ను దగ్గరకు పోయి చెయ్యిచాపుతావు డిస్మిస్ అయిపోతావు. అని గూడా నలుగురు ముందు అరుస్తాడు. ఎకౌంట్స్ సీటు నుండి మళ్ళీ సుబ్బయ్యను డిస్పేచ్ సీటుకు మార్చి ఘోరంగా అవమాన పరుస్తాడు. ఈ సన్నివేశానికి సుబ్బయ్య వగిడాకులా గజగజ వణికి పోతాడు. అవధాని, సుబ్బయ్యను కొంత ఓదార్చి ధైర్యం చెపుతాడు. బాధపడుతూ ఇంటికొచ్చే సరికి పోతన్న సుబ్బయ్య కోసమే ఎదురుచూస్తున్నట్టు యింట్లోనే వుండి; గవరయ్య; మీరివ్వాల్సిన ఐదువందలు

ఎప్పుడిస్తారో తెల్సుకురమ్మన్నారండి'' 'జాగ్రత్త' అని మరీ చెప్పివెళతాడు పోతన్న.' ఒక రోజు గవరయ్య సుబ్బయ్యనుకారులో కూర్చొనే ఐదువందల విషయమై బెదిరించి "పది రోజులే గడువు; ఈ లోపున యివ్వక పోయావా చూస్కో తమాషా'' అని హెచ్చరించి నడిరోడ్డులో అవమాన పరుస్తాడు. అ తరువాత వెంట్రావు కనబడి సుబ్బయ్యను 'చచ్చుపెద్దమ్మ' బిరుదుతో పలకరించి, ఆ గవరయ్య డబ్బులు వారంలో సర్దుదామని చెప్తాడు. కానీ ఎన్నిసార్లు సుబ్బయ్య వెంకట్రావు యింటికి వెళ్ళినా 'లేడనో' 'ఊరెళ్ళాడనో' ఇలాంటి సమాధానాలే గాని, వెంకట్రావు సుబ్బయ్యకు కనబడనే లేదు. ఒకరోజు అనుకోకుండా వెంకట్రావు దర్శనమయ్యింది సుబ్బయ్యకు, ఇంకా కొన్నాళ్ళు గవరయ్యను ఆగమని, అంతగా ఆగలేకపోతే 'చావమనో', ... ఇవ్వనని చెప్పు. దిక్కున్న వాడితో 'చెప్పుకోమను''- ఇలాంటి సమాధానం చెప్పాడేగాని, వెంకట్రావు సుబ్బయ్యకు డబ్బులిచ్చి పంపలేదు.

'మనిషన్న ప్రతివాడు నాశనం కావాలి' అనేంత తీవ్ర మానసిక వేదనకు గురవుతాడు సుబ్బయ్య. రాత్రి వంతెనపై కూర్చొని మనస్సు బాధగా మూలుగుతున్నప్పుడు మనోరమ కనిపించి మాట్లాడటం సుబ్బయ్యకు ఉపశమనాన్ని కలిగించటమే గాదు, సంతోషం కలిగింది. ఈ లోకంలో సుబ్బయ్య మీద కూడా జాలిపడే వారున్నారనే తలంపు సుబ్బయ్యలో బతుకు తీపిని రుచి చూపించేలా చేసి, మనోరమ కౌగిలిలో సుఖిస్తాడు. ఆ తరువాత రోజు మనోరమ గురించి, గవరయ్య గురించి సుబ్బయ్య ఆలోచిస్తుండగా పోతున్న, సుబ్బయ్య దగ్గరకొచ్చి తాను గవరయ్య దగ్గర పని చెయ్యటం మానేశానని చెప్పి, గవరయ్యకు సొమ్మివ్వనని చెప్పమని సలహా ఇస్తాడు. ఆ ఆలోచనతో కాసేపు ధైర్యంగా ఉంటాడే గాని మళ్ళీ అధైర్యంలో బడతాడు. సుబ్బయ్య. వెంకట్రావు గూడా సుబ్బయ్యను కలిసి గవరయ్యకు డబ్బులివ్వనని చెప్పమని ప్రోత్సహిస్తాడు.

గవరయ్య బెదిరించిన సంగతి సుబ్బయ్య అవధానికి చెప్తే అవధాని మండి పడి, అసలు గవరయ్యకు డబ్బులు యివ్వనని చెప్పు, ఆ తరువాత జరిగే సంగతి నేను చూసుకుంటానని చెప్తాడు. సుబ్బయ్య ఎన్నో ఆలోచనలతో ఇంటికి జేరేసరికి, గవరయ్య మనిషి పోతరాజు వచ్చి గవరయ్య గారు డబ్బులిప్పించుకు రమ్మన్నారని "ఇవ్వకపోతే తడాకా చూద్దువుగాని'' అని గవరయ్య చెప్పమన్నాడని అంటాడు. "నేను యివ్వలేను, ఇవ్వను, ఇచ్చుకోలేను మరి'' అని, పోతన్న ధైర్యంతో, సుబ్బయ్య చెప్పటం ఒక మలుపు. ఆతరువాత సుబ్బయ్య మనోరమ యింటికి వెళతాడు.

మనోరమ, అల్పజీవి సుబ్బయ్యలు ఆలింగనాలతో ఆనందిస్తారు. 'గవరయ్య బాధ వదిలిందని', అది చెప్పటానికే తాను వచ్చినట్లు మనోరమకు చెప్పి, సుబ్బయ్య వెళ్ళి పోతుండగా, రేపు సాయంకాలం రండి చాలా ముఖ్యమైన విషయం మాటాడాలని చెప్తుంది. గవరయ్య, ఆయన మంది మార్బలం సుబ్బయ్యపై దౌర్జన్యం చేసి, యివ్వవలసింది ఐదు వందలయితే వెయ్యికి సుబ్బయ్య చేత బలవంతంగా నోటు రాయించుకుంటారు. తన చిన్నప్పుడు తండ్రిని దొంగలుగొట్టిన సన్నివేశం జ్ఞాపకానికి వస్తుందీ పరిస్థితుల్లో సుబ్బయ్యకు.

ఈ సంఘటన జరిగిన మరుసటిరోజు సుబ్బయ్యలో గలిగిన సదాలోచన ఆయనలో చైతన్యం కలగటానికి దారి తీసింది. "భయం ప్రతివాడికి వుంటుంది"- ఇదీ సుబ్బయ్యలో గలిగిన చైతన్యం. ఆపిమ్మట గవరయ్య తనను జుట్టు పట్టుకొని అవమాన పరచిన సంఘటన వివరాలనుపోతన్నకు, అవధానికి, వెంకట్రావుకు, మనోరమకు సుబ్బయ్య అందజేస్తాడు.

మనోరమ, ఆ ప్రోనోట్ పోతరాజు ద్వారా సుబ్బయ్యకు అందేలా చేస్తుంది. ఆఫీసులో అవధాని బిల్లు విషయంలో ఎదురుతిరగటం గూడా గవరయ్య సుబ్బయ్యకు నోటు యిచ్చేలా దోహద పడింది.

గవరయ్య పూర్వపు భార్య రామయ్యమ్మ ప్రస్తుతం వెంకట్రావుని అంటి పెట్టుకొని వుంటుంది. ఆమెను వెంకట్రావు గవరయ్య చూచేలా చేసేసరికి, గవరయ్య విపరీతమైన మానసిక వత్తిడికి గురవ్వటం జరుగుతుంది.

బీచ్ దగ్గర సుబ్బయ్య మనోరమ కోసం ఎదురు జూస్తు తనకుధైర్యాన్ని కలిగించిన మనోరమ గురించి మానవత లేకుండా ఆలోచించటమే గాకుండా ఎదుటి వాళ్ళు ఏమైపోయినా మనం 'సేఫెస్ట్' పొజిషన్‌లో వుండాలనే ఆలోచనకొస్తాడు సుబ్బయ్య, 'ముప్పైఐదేళ్ళకీ మూల సూత్రం'(సేఫెస్ట్‌మార్గం) బోధపడిందని సుబ్బయ్య తలంచుతాడు. ఎవరేమైపోయినా మనకనవసరమనే దగుల్బాజీ ఆలోచనకొస్తాడు సుబ్బయ్య. తన జీవిత సంఘటనల చీకటిని గుర్తుకు తెచ్చుకునే సరికి సుబ్బయ్యకు "శైశవం, బాల్యం, యౌవనం, అంతా ఒక్కలా వుంది". అయితే మనోరమ సాహచార్యం వలన పొందిన నూతన వెలుగు రేఖలు సుబ్బయ్య జీవిత రేఖలను మార్చివేశాయి. అయినా సుబ్బయ్య మనోరమను సరిగా స్వీకరించలేదు.

" ఈ నవల చివరి భాగాలు రాస్తున్నప్పుడే నాకు సుబ్బయ్యంటే అసహ్యం వేసింది. గవరయ్య చెప్పినట్టు, వాడు దొంగ వెధవేననే నమ్మకంతో వుండి పోయాను." [4]అని చెప్పిన రావిశాస్త్రి మాటలు గమనార్హం.

అయితే సుబ్బయ్యలో కలిగిన పరిణామం మంచికి దోహదపడాలని ఆశిద్దాం.

## 2. రాజు-మహిషి

ఈ నవల 1966 లో'జయశ్రీ' మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురితమై, 1971లో న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్ వారి పేర పుస్తకంగా వెలువడింది.

'రాజు-మహిషి'ని వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది కృష్ణమూర్తి, పంచాది-నిర్మల, తామాడ గణపతి గార్లకీ, నరుడో భాస్కరుడికీ, డబ్బీరు నాగభూషణ పట్నాయక్‌లకు అంకితమిచ్చారు.

గంగరాజు భార్య అమ్మవారుజబ్బు వలన చనిపోతుంది. గంగరాజు మరదలు రాజమ్మ అతనికి సొంత మరదలు కాకపోయినా, భార్య సవతి చెల్లెలు, రాజమ్మ, బుగత పోలీసు చేతుల్లో నలిగినాక, బావ ఇంటికి చేరింది.

అక్క చనిపోయిన నాలుగోరోజు నుండే మరదలు రాజుకి భార్యగా స్థిరపడి, అన్నవరం దేవాలయంలో వాళ్ళిద్దరూ పెళ్ళిగూడ చేసుకున్నారు. రాజు జీవితం ఇక్కడ నుండి మలుపు దిరిగింది. పాల వ్యాపారంతో బాగా డబ్బు సంపాదిస్తాడు. ఒక కొడుకు ఒక కూతురు పుడతారు.

చైర్మన్ భీమసేనరావుకి ఏకైక కుమార్తె, పద్మజ, ఆమెని 'మిస్‌ప్రేమ' అనిగూడ పిలుస్తారు. చాలా అందంగా వుంటుంది. ప్రేమ విపరీతమైన అసహనంగా వున్న పరిస్థితిలో అపురూప బొమ్మలా వుండే గిరిజ, వాళ్ళ ఇంటికి వస్తుంది. గిరిజ, పద్మ ఇద్దరు క్లాస్‌మేట్స్, ఆరోజు పద్మ పుట్టినరోజు గాబట్టి తన ప్రేమికుడు వస్తానన్న సమయానికి రాకపోయేసరికి రంగారావు అనే వన్‌సైడ్ పద్మ ప్రేమికుడు అక్కడకు వచ్చి గిరిజతో పిచ్చాపాటి మాట్లాడతాడు.

రంగారావు మందుల భీముడి ఏకైక ముద్దుల కొడుకు. ప్యారీసోనా కంపెనీలో పనిజేసే రంగారావు పద్మకి బంధువు. భవాని శంకర్ ప్రసాద్‌కి, రాజమ్మకి మధ్యజరిగిన గేదెల గొడవ జెప్పి, ఆ తరువాత ముగ్గురూ కలసి కారులో బయలు దేరారు. 'కౌంటర్‌ఫీట్' సినిమాకి పద్మ, రంగారావు వెళితే గిరిజ సినిమాకి వెళ్ళకుండా ప్రసాద్ కోసం ఆసుపత్రికి వెళుతుంది.

శాంతమ్మ భవాని శంకర్ ప్రసాద్ తల్లి,అతి చిన్న వయసులో పెళ్లైంది. కటిక దారిద్ర్య కుటుంబంలోని అత్తమామలను, భర్తని, మరిదిని, తలచుకొని బాధపడుతుంది. హోరుగాలి వర్షంలో తడిసి ముద్దైపోయి ఆమె భర్త ఇంటికి చేరాడు. ఆ వర్షంలో తడిసి రావటం వల్ల, అనారోగ్య కారణంగా శాంతమ్మ భర్తకి జ్వరం వస్తుంది. శాంతమ్మ విపరీత దు:ఖంతో తన భర్త ఆరోగ్యం కుదుట పడాలని భగవంతుణ్ణి తీవ్రంగా ప్రార్థిస్తుంది. ఆసమయంలో తలవని తలంపుగా శాంతమ్మ ఆడపడచు భర్త అక్కడికి వచ్చాడు. అతను డాక్టరు. కానీ శాంతమ్మ భర్తకి వట్టి జ్వరమే కాదని, అతిభయంకరమైన జబ్బు వుందని వైద్య పరీక్ష ద్వారా నిర్ధారిస్తాడు, అతని డాక్టరు బావ. ఏదో శక్తి ఆవహించిన వాడిలా జోరున కురుస్తున్న వర్షంలోకిపరుగులు తీస్తాడు శాంతమ్మ భర్త. తెల్లవారి చూసేసరికి శాంతమ్మ భర్త శవం చెరువులో తేలుతుంది. భర్త చనిపోవటంతో శాంతమ్మ పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆ తరువాత శాంతమ్మ అత్తమామలు కొద్ది నెలల తేడాతో చనిపోతారు. ఆమె మరిదిగూడ ఇల్లు వదిలి ఎటువెళ్ళాడో తెలియదు. భర్త పోయేప్పటికి శాంతమ్మకి పద్నాలుగేళ్లు అప్పుడే నిండాయి. మరో ఆర్నెల్లకి ఆమెకి మగబిడ్డ జన్మించాడు. ఆ పిల్లవాడే భావానీ శంకర్ ప్రసాద్. పద్మజ కాలేజీలో ప్రేమ గురించి యిచ్చిన ఉపన్యాసంతో పద్మ మిస్ 'ప్రేమ'గా స్థిరపడిపోయింది.

హెడియా పద్మజకి బంధువు. హెడియాకి ఫ్యాషన్లు, పిక్‌నిక్‌లు సరదాలంటే బలే సరదా. హెడియా బృందం, పద్మ., అందరూ కలసి పిక్‌నిక్‌కి వెళతారు. ప్రేమ, హెడియాలు నిలుచున్న యాభై గజాల దూరంలో రెండు భయంకర పాములు పడగలు

విప్పిమరీ నిలుచున్నాయి. వాటికి భయపడి హెడియా పరిగెత్తింది. ఆపాముల ప్రమాదం నుండి భవానీ శంకర్ ప్రసాద్ ప్రేమనీ అమాంతంగా తన దగ్గరకు లాక్కొని రక్షిస్తాడు. ఆనాటి నుండి వాళ్ళిద్దరూ ప్రతి ఆదివారం హేపీవాలీకి వెళ్ళి కలుసుకుంటుంటారు. ఈ జరిగిన విషయాలన్నీ సినిమా హాలులో రంగారావుతో సినిమా చూస్తు మిస్ ప్రేమ గుర్తు జేసుకుంటూవుంది.

తనపుట్టిన రోజు నాడు తన ప్రేమికుని, తండ్రికి పరిచయం చేద్దామనుకుంటే అతను ఆలస్యంగా రావటం వలన అది వీలు పడలేదు. సినిమా నుండి ప్రేమ, రంగారావులు ఇల్లు చేరేసరికి ప్రేమ తండ్రి యాక్సిడెంట్‌కి గురై బెడ్‌మీద వుంటాడు.

కౌన్సిలర్ భీమసేనరావు పద్మజకి ఆమె తండ్రి యాక్సిడెంట్ గురించి చెప్తాడు. పద్మజ రంగారావులు చైర్మన్ భీమసేనరావు పరిస్థితిని తెలుసుకుంటానికి మేడమీదికి వెళతారు. రంగారావు, పద్మజ భీమసేనరావు దగ్గర కెళ్ళినప్పుడు అక్కడ పద్మజ పెద్దమ్మ విశ్వమోహిని ఆమె తండ్రి ప్రక్కనే వుంటుంది. విశ్వమోహిని చాలా విలక్షణమైనవ్యక్తి పెద్ద ఆస్తిపరుడు. వ్యసనపరుడైన విశ్వమోహిని భర్త-పిల్లలు, లేకుండానే చనిపోతాడు. వీళ్ళ తండ్రి పురుషోత్తం సాధుస్వభావి. తన దగ్గర చిరకాలంగా పనిచేసిన బంట్రోతు చనిపోతే పురుషోత్తం అ బంట్రోతు కొడుకుని బి.ఏ వరకు చదివించి, అ కుటుంబాన్ని ఆదుకుంటాడు. కానీ శ్యామల ఆ కుర్రవాణ్ణి ప్రేమించి పరిధులు దాటిందని తెలియగానే పురుషోత్తం ఆ కుర్రవాణ్ణి అంతం చేయిస్తాడు. శ్యామలని భీమసేనరావు కిచ్చి పెళ్ళి చేస్తారు. పెళ్ళి సమయంలోనే "ఈ రోజు నుంచి తొమ్మిది మాసాలలోపు నా శవాన్ని మీరు చూస్తారని చెప్పి; చెప్పినట్టుగానే శ్యామల పద్మజకి జన్మనిచ్చి ఈ లోకం నుండి శాశ్వతంగా దూరమవుతుంది. భీమసేనరావు ఉన్నత శిఖరాలనధిరోహించటానికి చాలా వరకు ప్రేరణ విశ్వమోహినియే. విశ్వమోహిని పద్మజ సంరక్షణ బాధ్యతను చేపట్టింది. పద్మజ తాత తన ఆస్తిలో సగభాగం పద్మజ పేర పెట్టి, ఆ ఆస్తికి చైర్మన్‌ని సంరక్షకుడిగా నియమిస్తాడు. విధవరాలైన విశ్వమోహిని ఎవరి దగ్గర వుండటానికి ఇష్టపడక పద్మజతో పాటు చైర్మన్ గారింట్లోనే వుంటుంది.

అగ్గిపెట్టెల వ్యాపారంతో ప్రారంభమైన మన్మథాకారుడైన భీమసేనరావు వ్యాపార జీవితం పంచదార ఫ్యాక్టరీతో, బ్యాంక్ డైరెక్టర్ పదవులతో, మూడుసార్లు పురపాలక సంఘం చైర్మన్ పదవితో పురప్రముఖుడి స్థానానికి ఎదిగింది. ఆయన్ని పరీక్షజేసిన డాక్టరు హాస్పటల్‌లో అడ్మిట్ చేస్తే బాగుంటుందనే సరికి; ఆమాట విన్న పద్మజకి హిస్టీరియా వస్తుంది. మరుసటి రోజు తండ్రిని చూడటానికి పద్మజ హాస్పటల్‌కి వెళుతుంది.

రంగారావు విలాస పురుషుడు. చైర్మన్ కూతురు తన కోడలైతే బాగుండునని కలలు గంటున్నాడు. ఈ భీమసేనరావుని అందరూ మందుల భీముడంటారు. మందుల షాపు సంబంధం వలన అతనికి మందుల భీముడని పేరొచ్చింది.ఎలక్షన్లోనిలబడి

కౌన్సిలర్ కావటం అతని అదృష్టం. అక్కడ నుంచి అతని జీవితం కొత్త మలుపు దిరిగింది. "సిగ్గు, దైవభీతి, లజ్జ, పాపభీతి విడిచి పెట్టిన మార్గమే భాగ్యలక్ష్మికి దగ్గర మార్గం" అని బోధపరచుకున్నాడు. భీముడు కాళ్ళ రాధతో సరసం జోరుజేశాడు. కౌన్సిలర్ అయినాక భీముడికి చాలా మంది స్త్రీలతో సంబంధం ఏర్పడిందని భావించిన రాధ, తన కూతురు మంగని చేసుకోమని కోరేసరికి; భీముడు ఆసాకుతో ఆమెను విడిచిపెడతాడు. అయితే అంతకు ముందే మంగ జీవితాన్ని భీముడు కాటేశాడు. రాధ చనిపోతుంది. రాధ ,చనిపోయినందుకు భీముడు చాలా దు:ఖిస్తాడు. మంగకి వేరే ఉద్యోగం దొరికేలా అతను ప్రయత్నించాడు, చైర్మన్ వదిన మీద గూడా భీముడు కన్నేశాడు. పద్మజ తన కోడలైతే అర్ధవెయ్యి నూట పదహార్లు వేస్తానని ఇంటికి వెలుతూనే దేవుడికి మొక్కుతాడు. కానీ విచిత్రమేమంటే అదే సమయానికి అదే కారణానికి అంతడబ్బుని దేవుడికి మొక్కుకుంటాడు అతని కొడుకు రంగారావు గూడా. తండ్రీ కొడుకుల్ది ఒకే బాట.

వాళ్ళ యింటికి వెళ్ళేదోవలో రాజమ్మ గేదెల బాధ మాత్రం ఎవరికీ తప్పటం లేదు. అదేమంటే ఆరాజమ్మేమో భీముడికి ముఖ్య సపోర్టర్, భవానీ శంకర్ ప్రసాద్. రాజమ్మ గేదెల విషయంలో కంప్లెయింట్ ఇవ్వటానికి కొంత మేర లోపాయికారిగా రంగారావు సపోర్టుగూడా వుంది.

పద్మజ, తన స్నేహితుడు ప్రసాద్. ఇద్దరూ ప్రేమించుకున్నారనే విషయం కమల; హెడియాల ద్వారా తెలుసుకున్న రంగారావు పద్మమీద కుతకుతలాడతాడు.

రంగారావు, రామారావుతో స్నేహం చెయ్యడానికి ముందు సద్భక్తుడిగా వుండేవాడు. రామారావు, రంగారావు పని జేస్తున్న కంపెనీలోనే స్టెనోగా చేరాడు. రామారావు కంపెనీ ఉద్యోగులతో గుమస్తాల సంఘాన్ని స్థాపించాడు. ఆయన నాస్తికుడు.రంగారావు ఉద్యోగం పర్మనెంటు కావటానికి రామారావే కారణం.

నాలుగు రంగు పెన్సిళ్ళు ఇంటికి తీసెకెళుతు రంగారావు కంపెనీ వాళ్ళకు పట్టుబడి ఉద్యోగం నుండి సస్పెండు అవుతాడు. రామారావుతో స్నేహం వల్లే ఇలా జరిగిందని తండ్రీ, కూతుళ్ళు రంగారావుని మందలిస్తారు.రంగారావులో మళ్ళీ దైవభక్తి చిగురించేలా తండ్రి చివాట్లేశాడు. ఉద్యోగుల ఎలక్షన్స్‌లో రామారావుకి గాకుండా కృష్ణారావుకి సపోర్టు చెయ్యమని భీముడు కుమారుడికి నూరిపోశాడు. మన బాగుకోసం ఎదుటివాడు ఏమైపోయినా మనం పట్టిచ్చుకోగూడదని, భీముడు కొడుక్కి బోధజేశాడు. ఈ ప్రభావంతో రంగారావు కృష్ణారావుని బలపరుస్తాడు. రెండు ఓట్ల తేడాతో రామారావు ఎలక్షన్‌లో ఓడిపోవటం. ఉద్యోగం నుండి సస్పెండు అవటం, టీ.బీ.రోగం - వీటితో సతమతమవటం అన్నీ జరిగిపోతాయి.

రంగారావు మేనేజిమెంటు వారి పక్షం జేరి ఆర్థికంగా బలబడటమేగాక, కంపెనీ పుట్ బాల్ టీమ్‌కి మేనేజరవుతాడు. ప్రేమ ప్రసాద్‌ల ప్రణయవిహార వార్త రంగారావుకి కంట్లో నలుసుగా బాధపెడుతుంది. అసలే ప్రసాద్ మీద కోపంగా వున్న గేదెల రాజమ్మకి

రంగారావు మరి కాస్త ద్వేషం పాలు ఎక్కించి వాళ్ళిద్దరూ తీవ్రంగా గొడవబడేలా చేసి తన ఉక్రోషాన్ని కొంత వరుకు అణుచుకుంటాడు.

బంగారి కిళ్ళీకొట్టుదగ్గర అమ్మలు, ఆడారి, ఆదినారాయణ, పీనుగ్గుమస్తా చేరి ఊళ్ళో కబుర్లన్నీ ఏకరువు పెడుతుంటారు. బంగారి మంచి అందచందాలతో మెరుస్తు వుంటుంది. వీరుడిగా మరణించిన పెద్దప్పల స్వామి భార్య బంగారి. రాజమ్మకి, కమ్మలింటిరాజుకి గేదెల విషయంలో గొడవ జరిగింది. సూడి గేదె దెబ్బతిని గేదె ఈని దూడ చచ్చేసరికి రాజమ్మ అగ్గిమీద గుగ్గిలం అయిపోయింది. రాజమ్మ గేదెలు కట్టేసుకునే దగ్గర్లో భవానీ ప్రసాద్ కమ్మలపాక వేసుకుంటంతో, రాజమ్మకి ప్రసాద్ కి గొడవలు ప్రారంభమవుతాయి.

పీనుగ్గుమస్తా, తోటి గుమస్తాలకి, రాజమ్మ, గంగరాజు గుంపు కమ్మలింటి రాజును ఎలా చితక బాదారో అ సన్నివేశాన్ని వివరంగా చెపుతాడు. కమ్మలింటి రాజు బంగారి కొట్టు దగ్గరకొచ్చిన సమయంలోనే "పెయ్యసచ్చింది. ఏటి సంజాసీ సెప్తాడో అడగండెదవ"నని అరుసుకుంటూ అసిరెమ్మలా రాజమ్మనానా రభస జేస్తుంది. తన కొట్టు దగ్గర గొడవ జరగటానికి వీల్లేదని బంగారి రాజమ్మతో గొడవపడుతుంది. అంతలో "ఏయ్ అమ్మీ" అనే సంబోధనతో రాజు మాటాడేప్పటికి రాజమ్మ రెచ్చిపోతుంది. రాజమ్మ, బంగారి విపరీతంగా పోట్లాడుకుంటారు. అమ్మలు కమ్మలింటిరాజు తప్పులేదని, ఆ బాబు; గేదని కొట్టలేదని వత్తాసు పలుకుతుంది. రాజమ్మ అమ్మలు పీక నొక్కేస్తుంది. గంగరాజు అడ్డుపడి, రాజమ్మ చేతిపై బలంగా కొట్టి అమ్మలను విడిపించటానికి ప్రయత్నిస్తాడు. కానీ అదే సమయంలో కమ్మలింటి రాజా ఒక్కఉదుటున రాజమ్మను బలంగా వెనక్కితోసేసి అమ్మల్ని కాపాడతాడు. ఇక దీంతో యుద్ధం ముదిరి అందరు కలిసి రాజును చితకబాదుతారు. బంగారి , అమ్మలు, రాజుని అసుపత్రిలో చేరుస్తారు,

నల్ల నర్సు అని పిలపబడే మంగ భీమసేనరావుకి ఆసుపత్రిలో సపర్యలు చేస్తుంటుంది. భీమసేనారావు యాక్సిడెంట్ గురించి పేపర్లో వచ్చేసరికి , ఆ విషయానికి పొంగి పోతుంది 'మిస్ ప్రేమ'. విశ్వమోహినీ గూడా ఆనందిస్తుంది. తండ్రికి యాక్సిడెంట్ జరిగిన దగ్గర నుంచి ముఖ్యమంత్రి మొదలుకొని 'ప్రిన్సిపల్, తన క్లాస్‌మేట్స్ వరకు ఆయనకు సానుభూతి తెలుపుతూ వుంటే పద్మజకి చాలా ఆనందం వేస్తుంది.

భవాని శంకర్ ప్రసాద్‌ని ప్రేమ ముద్దుగా "భానీ" అని పిలుస్తుంది. భానీ గరించి ఆలోచిస్తూ ఆసుపత్రికి వెళుతుంది ప్రేమ. ఆసుపత్రిలో రాధ కూతురు నర్సు మంగ; పద్మజతో చాలసేపు ఎకసెక్కాలాడి, భవాని శంకర ప్రసాద్ రాజమ్మ, గంగరాజులతో గొడవపడి దెబ్బలుతిని ఆసుపత్రి పాలయ్యాడని, నీవుగానీ ఆ భవాని శంకర్ ప్రసాద్ దగ్గరకు వెళ్ళకపోతే ఆగిరిజకే అతను సొంతమవుతాడని చెప్పి; ప్రేమ వెంటనే భవానీ శంకర్ ప్రసాద్‌ని కలుసుకోనేలా చేస్తుంది. ప్రేమ భానీ దగ్గరకు వెళ్ళేసరికి గిరిజ అతని ప్రక్కనే కనిపిస్తుంది. ఈ సన్నివేశాన్ని జూసి ప్రేమ కలవర పడుతుంది.

భవానీ శంకర్ ప్రసాద్ కి దెబ్బలు తగిలి ఆసుపత్రిలో చేరిన నాటి నుండి గిరిజ అతని దగ్గరే వుంటుంది. కాలేజీ కూడా మానేసింది. గిరిజ తండ్రి డిప్యూటీ తాశీల్దారుగా పనిజేసి చనిపోయాడు.

ఒకరోజు భవానీ శంకర్ ప్రసాద్ పాతికరూపాయల కోసం అత్యవసరమై రాత్రి పూట గిరిజ వాళ్ళ తలుపుతడతాడు. గిరిజ అతికష్టం మీద తల్లిని నిద్రలేపింది. పాతిక రూపాయలు అత్యవసరమై ప్రసాద్ మన ఇంటికొచ్చాడని గిరిజతల్లికి చెప్పింది. తల్లి డబ్బు లేదని అబద్ధమాడింది. కానీ డబ్బులున్నసంగతి గిరిజ గుర్తుచేసినా డబ్బులు ఇవ్వకుండానే ప్రసాద్‌ను పంపిస్తుంది. వర్ధనమ్మ. పరాయివ్యక్తి ముందు డబ్బుల విషయంలో కూతురుమాట్లాడిన మాటలు వర్ధనమ్మకు కష్టం కలిగించాయి. గిరిజకి పెళ్ళి చేయ్యాలని నిశ్చయించుకుంది ఆమె. తల్లి ప్రసాద్‌కు డబ్బులు ఇవ్వకుండానే పంపించినందుకు గిరిజ చాల కలత పడుతుంది.

"పాతిక రూపాయలు పట్టుకెళ్ళి అతనికి ఇస్తున్నాను" అని గిరిజ చీటి రాసి ఇల్లు వదలి వెళ్ళిన సంగతిని గ్రహించిన వర్ధనమ్మ గిరిజని చెఢామడా తిడుతుంది. వర్ధనమ్మ హడావుడి జేస్తుంది. ఇంతలో గిరిజ తిరిగి ఇంటికొస్తూ తీసుకెళ్ళిన డబ్బులు గూడ గిరిజ వెనక్కి తెస్తుంది. తాను ఆలస్యంగా డబ్బులు తీసుకెళ్లటం వలన అక్కడ నిండుప్రాణం బలైపోయిందని తను పాపాత్ముురాలునని విలవిల్లాడుతుంది.

ముకుందరావు బాగా స్థిరపడిన ప్లీడరు. ముండమోసిన మరదలతో హాయిగా కాలక్షేపం జేస్తున్నాడు. ముకుందుడు కమ్మలింటి రాజాతో గేదల గొడవ జరిగి అతను ఆసుపత్రి పాలైనాక గంగరాజుని పోలీసులు అరెస్టు జేసేక, రాజమ్మ కౌన్సిలర్ భీమసేనరావుని వెంటబెట్టుకొని అర్ధరాత్రి ముకుందుడి ఇంటికొచ్చేసరికి; అతని మరదలు ప్లీడరు బావని నిద్రలేపుతుంది. రాజమ్మ గత జీవితంలో జరిగిన కొన్ని పొరపాట్ల వలన పోలీస్‌స్టేషన్‌లోని హెడ్డుకీ ఆమెకీ మరీ గొడవ ఎక్కువైందని, ఆ కోపంతో ఆ హెడ్డుగాడు కమ్మలింటి రాజా కేసుని అడ్డుబెట్టుకొని గంగరాజుని జైల్లో వేశారని మందుల భీముడు చెప్తాడు. రాజమ్మ చేతికి తగిలిన గాయానికి పిడతల డాక్టరు చేత కట్టు గట్టించుకొని, అతని సలహాపై ఎక్సరే కోసం ఆసుపత్రికి వెళ్ళినట్టు తతంగం నడిపించమని ముకుందుడు సలహా ఇస్తాడు. ప్రస్తుతానికి ఈ ఐదొందలు తీసుకొని తమని ఒడ్డున వెయ్యమని, ఆ తరువాత మళ్ళీ కనిపిస్తానని రాజమ్మ ముకుందుడికి మనవిజేసుకుంటుంది.

ప్లీడరు ముకుందరావు సలహాపై రాజమ్మ ఆసుపత్రిలో అడ్మిట్ అయిన సంఘటన; గాయాలతో భవానీ శంకరుడు ఆసుపత్రి పాలైన సంగతి ముకుందుని క్రిమినల్ సివిల్ కేసుల ప్రాక్టీసు - ఈ సమాచారమంతా మేజిస్ట్రేటుకి అందింది. ముకుందుని జూనియర్ చిట్టిబాబు, గంగరాజు బెయిలు విషయమై కోర్టులో వాదిస్తాడు. ప్రభుత్వంతో తీవ్రమైన పోరాటం జరుపుతున్న సంజకెంజాయి పార్టీ సభ్యులతో చిట్టిబాబుకి పరిచయముంది.

మేజిస్ట్రేటు గంగరాజుకి పదిహేను రోజులు రిమాండు ఆర్డరు వేస్తాడు. చిట్టిబాబు కోర్టులో అవమానానికి గురవుతాడు. తన జూనియర్‌కి జరిగిన అవమానం తనకు జరిగినట్టు తన వృత్తికి దెబ్బతగిలినట్టు ముకుందుడు బాధపడతాడు.

మందుల భీముడు గంగరాజు బెయిలు గురించి బార్రూముకి వెళతాడు. అక్కడ భీముడుకి ఈ లోకంలో డబ్బుకి తప్ప మరి దేనికీ విలువనియ్యని లాయర్ సూర్యచంద్రారావు భీముణ్ణి కలుస్తాడు. ముకుందుడు తన జూనియర్ చిట్టిబాబుకి జరిగిన అవమానం గురించి, బార్ ప్రెసిడెంట్, తదితర సీనియర్ లాయర్లతో మంతనాలు జరుపుతాడు. వాళ్ళవాళ్ళ స్వార్థాల్నిబట్టి నలుగురు సీనియర్లు ముకుందుడితో చెయ్యికలుపుతారు. అయితే మేజిస్ట్రేటుపై నిరసన తీర్మానం ప్రవేశ పెట్టటానికి ఎవరూ ముందుకు రాలేదు.

బార్ ప్రెసిడెంట్ రాజశేఖరం మేజిస్ట్రేటు మీద నిరసన తీర్మానం ప్రవేశ పెట్టటానికి సమ్మతించలేదు. దీంతో ముకుందుడు మందుల భీముణ్ణి రంగంలోకి దింపాడు. మందుల భీముడు రాజశేఖరాన్ని బాగా ప్రశంసించి, ఛైర్మన్ భీమసేనరావు తనకు బావమరిదని; అయన పంపితే తను వచ్చానని నమ్మబలుకుతాడు. కమ్మలింటి రాజాతో ఛైర్మన్ గారి అమ్మాయి ప్రేమ వృత్తాంతం సవివరంగా జెప్పి; ఆ రాజాగాడి పనిబట్టమని గంగరాజుకు ఆజ్ఞలు జారీ కావటం వలన గంగరాజు వాణ్ణి చితకబాదాడు; కాబట్టి గంగరాజుని తప్పని సరిగా రక్షించమని ఛైర్మన్‌గారు చెప్పారని భీముడు బార్ ప్రెసిడెంట్‌తో నమ్మబలికి, మేజిస్ట్రేటుపై న్యాయవాదుల సంఘం యుద్ధానికిదిగేలా చేస్తాడు.

తరువాత మేజిస్ట్రేటు 'ఓ పంతుల కుర్రాణ్ణి' రాజమ్మ దగ్గరకు పంపించి సూర్యచంద్రరావుని కొత్తప్లీడరుగా పెట్టుకోమని సలహా యిప్పించి; గంగరాజు, రాజమ్మలకు మేజిస్ట్రేటు జామీను మంజూరు చేస్తాడు.

'ఇంతటితో అయిపోలేదు, అడవలసిన నాటకం ఇంకా చాలా ఉంది' అన్న సూర్యచంద్రుడి మాటలతో ఈ నవలా నాటకం నిజంగానే అసంపూర్తిగా మిగిలిపోయింది.

## 3. గోవులొస్తున్నాయి జాగ్రత్త

గోవులొస్తున్నాయి జాగ్రత్త 19-01-1973 నుండి 18-05-1973 వరకు 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైంది. దీనికే 'గుర్రపు కళ్ళెం', 'మరిడీ మహాలక్ష్మి కథ' అనే నామాంతరాలు గూడా గలవు. శ్రీశ్రీ 'బుక్కుల్లో' ఇది చివరిది.

'అరుణా పబ్లిషింగ్' వారు దీనిని 1987లో ముద్రించారు. రావిశాస్త్రి ఈ నవలను మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) కి అంకితమిచ్చారు.

బెంగాల్లో సబ్ డివిజనల్ మేజిస్ట్రేటుగా పనిజేస్తున్న రాజయోగి బంధువు కిరీటి. సుమారు తన 14 సం॥ ప్రాయంలో జరిగిన వృత్తాంతాన్ని వివరిస్తాడు. గోవులొస్తున్నాయి జాగ్రత్తని 'అంతరంగ కథనం' (Internal Monolouge) గా పరిగణింపవచ్చు.

కిరీటి 1917 జనవరి ఒకటవ తేదీనాడు పుట్టాడు. కిరీటి మాతామహుల వారింట్లో తోటమాలి కుమారుడు కూడా అదేరోజు పుట్టాడని తెలుసుకుని కిరీటి తన గౌరవం తగ్గినట్లు బాధపడతాడు. తోటమాలి కుమారుడి పేరు గోపాలదాసుడు. కిరీటి తండ్రి పాండురంగారావు డెప్యూటి కలెక్టరుగా ఉద్యోగం చేశాడు.

సువర్ణ సుందరపురం జమీందారు రాజయోగి. కిరీటి పూర్తిపేరు శ్యామసుందర కిరీటిరావు. రాజయోగిని కిరీటి దత్తత తీసుకుంటానికి సర్వసన్నాహాలు చేశాడుగాని, ఆ కోరిక తీరకుండానే ఆయన మరణిస్తాడు.

కిరీటి చెన్నపట్నంలోని రాజయోగి యింటికి చాలాసార్లు వెళ్ళాడుగాని, ఆయన జమీ గ్రామమైన సువర్ణ సుందరపురం మాత్రం ఒక్కసారే వెళతాడు. 1930 సం॥ దసరా సెలవలప్పుడు కిరీటిని, అతనికి తోడుగా గోపాలదాసుని రాజయోగి ఆహ్వానంపై సు.సు.పురం పంపించారు.

రాజయోగి, కిరీటి తన ఆశ్రమానికి వచ్చినందుకు సంతోషించి, అక్కడి వారందరకు కిరీటిని గురించి గొప్పగా చెప్తాడు.

కిరీటి తాను వెళ్ళిన రోజు, మరునాడు జరిగిన సంఘటనలను, అంటే దాదాపు ఒకటిన్నర రోజుల్లో జరిగిన విషయాలని, తాను తరువాత తెలుసుకున్న విషయాలని కలిపి అతను పెద్దవాడైనాక ఈ వృత్తాంతాన్ని వివరిస్తున్నట్లు గ్రహించాలి. భూస్వామ్య దౌర్జన్యానికి వ్యతిరేకంగా సామాన్య ప్రజానీకం జరిపిన తిరుగుబాటునే 'సింబాలిక్‌గా' 'గోవులొస్తున్నాయిజాగ్రత్త' అని రావిశాస్త్రి లచ్చయ్యమ్మ వృత్తాంతాన్ని చిత్రీకరించారు.

రాజయోగి, యోగీ కాదు, లేకపోతే మునీశ్వరుడూ కాదు, అతనుఒక సంపన్న జమీందారీ కుటుంబీకుడు. మంచి భోగి. రాజయోగికి 16సం॥లోనే పెళ్ళైంది. ఆరోజుల్లోనే లక్ష రూపాయల కట్నం 'ఓ మొఖాసా గ్రామం' పుచ్చుకొని పెళ్ళి చేసుకున్నాడంటే అతని హోదాని ఊహించుకోవచ్చు. అయితే అనారోగ్యం వలన ఆ అమ్మాయి పెళ్ళైన రెండు సం॥లకే చనిపోయింది. ఆ తరువాత వెంటనే మళ్ళీ వివాహం చేసుకున్నాడు. ఈ రెండవ భార్య యోగితో 10సం॥లు కాపురం చేసింది. రెండవ భార్య కూడా చనిపోయినాకా బాధతో రెండు సంవత్సరాల వరకు యోగి మళ్ళీ పెళ్ళిమాట తలపెట్టలేదు. అయితే ఏదోవిధంగా సుఖాలు అనుభవిస్తూనే ఉంటాడు.

ఆపిమ్మట మంచి కట్నకానుకలతో జాగీర్దారు కుమార్తెను యోగి వివాహమాడతాడు. అయితే ఈమె ఒక పనివాడితో అక్రమ సంబంధం పెట్టుకుందనే పుకార్లు వ్యాపించాయి. యోగి పెరట్లో టార్‌గెట్ ప్రాక్టీసు చేసుకుంటుంటే అకస్మాత్తుగా అడ్డువెళ్ళి గుండు దెబ్బకి ఈ మూడవ భార్య గూడా చనిపోయినాకా, ఇక ఆయన జీవితంలో మళ్ళీ ఎప్పుడూ పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టలేదు.

ఆతరువాత దాదాపు ఐదారు సంవత్సరాలు గడిచినాక ఒకరోజు తన స్నేహితులతో వేటకు వెళుతూ యోగి దార్లో ఒకరాత్రి ఓకుగ్రామంలో గ్రామ కరణం ఇంట్లో విడిది చేస్తారు. కరణం ఇంటికి అచ్చయ్యమ్మనే ఓ అపురూప పల్లెపడుచు పాలు తీసుకొస్తే యోగి ఆశ్చర్యపడుతూ ఆమెను చూస్తాడు.

లచ్చయ్యమ్మ పశువుల కాపరి కూతురు. ఆమెకు తల్లిదండ్రులతో పాటు అన్న, తమ్ముడూ ఉన్నారు. ఈ ఊళ్ళోనే ఓ భూస్వామి దగ్గర పాలేర్లుగా వీళ్ళు ఉన్నారు. యోగి లచ్చయ్యమ్మపై మనస్సుపడి ఆమెను తన దగ్గర ఉంచుకుంటానికి, మర్యాదయిన పద్ధతిలో ఆమె తల్లిదండ్రులకు కబురుపెడితే వారు తిరస్కరిస్తారు. 'రంగ వంట వున్న' దాని మేన మామతో లచ్చయ్యమ్మకి పెళ్ళి ప్రదాన మయ్యిందని ఆమె తల్లి దండ్రులు చెపితే, అతనికి కావలసినంత డబ్బు యిచ్చి ఈ పెళ్ళి తప్పించమని యోగి కబురంపితే, 'కులానికి తక్కువైన, గుణానికి మావు తక్కువ కాదు' అని వాళ్ళు తిరస్కరిస్తారు. దానితో రాజ యోగిలో గూడ ఎలాగైనా లచ్చయ్యమ్మను చేపట్టాలనే కాంక్ష బలీయమైంది.

లచ్చయ్యమ్మకి సు.సు.పురం జమిందారుకీ మధ్య అక్రమ సంబంధం ఏర్పడిందని ఒక ఉత్తరాన్ని యోగి రంగంలోని లచ్చయ్యమ్మని చేసుకోబోతున్న రంగడికి పంపించి ఆసంబంధాన్ని చెడగొడతాడు రాజభోగి. మళ్ళీ లచ్చయ్యమ్మ తండ్రికి కబురు పంపిస్తే వాడు అగ్గిమీద గుగ్గిలమై "నలుగుర్లో నిలబడి నా కూతురి మెళ్ళో తాళికట్టు ! నేక పోతే పో" అని పొగరుగా, అనే సరికి అతని కొడుకులు గూడా అందుకు వంతపాడారు.

లచ్చయ్యమ్మ తండ్రిని, అన్నదమ్ముల్ని, ఓ అమావాస్యనాడు వాళ్ళ బుగత పొరుగూరి సంతకు పంపించేలా ప్రణాళిక సిద్ధం చేయించాడు యోగి. లచ్చయ్యమ్మ వాళ్ళు ఊరి చివర పాకలోఉంటారు. రాజయోగిమనుషులు లచ్చయ్యమ్మ తల్లిని బంధించి, పొడిచిన ఆవుని చావబాది లచ్చయ్యమ్మని తీసుకెళ్ళి రాజభోగి భవనంలో బంధిస్తారు. ఈ పని మొదట్లోనే చేసి ఉంటే ఇంకా బాగుండేదని కిరీటి భావన.

లచ్చయ్యమ్మ వాళ్ళు పని చేస్తున్న భూస్వామికి పట్నంలో బి.ఏ చదువుతున్న మేనల్లుడొకడున్నాడు. అతను లచ్చయ్యమ్మ విషయాన్ని పెద్ద సమస్యగా చిత్రించి రాజభోగని రచ్చకీడ్వాలని చూశాడు. దీంతో లచ్చయ్యమ్మ తమ్ముడికి కొమ్ములొచ్చాయి. రాజభోగి మీద పోలీస్టేషన్లో ఫిర్యాదు కూడా లచ్చయ్యమ్మ కుటుంబీకుల చేత ఇప్పించాడు. భూస్వామి మేనల్లుడి ప్రోత్సాహంతో లచ్చయ్యమ్మ తమ్ముడు యోగి ఇంటి మీదకెళ్ళి గొడ్డల్ని గేటుమీద విసిరేసి వస్తాడు. ఈ విషయాన్ని యోగి పోలీస్టేషన్లో ఫిర్యాదు చేసి లచ్చయ్యమ్మ కుటుంబీకుల మీద కేసు నమోదు చేయిస్తాడు. రాజయోగి దుర్మార్గాన్ని పోలీసుల పక్షపాతాన్ని నిరసిస్తూ లచ్చయ్యమ్మ తమ్ముడి చేత రాజభోగి ఇంటికెదురుగా నిరాహారదీక్షని ప్రారంభింపచేయిస్తాడు. భూస్వామి మేనల్లుడు, చాల మంది యువకులు గూడ ఈ గొడవలో చేరతారు. ఈ లచ్చయ్యమ్మ తమ్ముడు ఈ రోజు నామీద తిరగబడ్డట్టే రేపు మీమీద తిరగబడడని గ్యారంటీ ఏమిటని ఆ యువకుల తల్లిదండ్రులకు యోగి జ్ఞానబోధ చేస్తాడు.

ఇంతలో స్పెషల్ పోలీసు బ్రాంచి వారు దర్యాప్తు చేసి "ఇది రాజకీయపు తగువు కాదని డబ్బుగల పెద్ద కులం వారు డబ్బులేని చిన్న కులం మనిషిని చెరిచే దురుద్దేశంతో దౌర్జన్యంగా ఎత్తుకు పోవటం వల్ల ప్రజలు అలజడి చెందేరని" పోలీసువారు కూడా యోగి

పక్షమే వహించారని ప్రజలు భావించటం వలన ఇది ఉద్యమ రూపాన్ని ధరించిందని పై అధికారులకు పంపించిన రిపోర్టు విషయం యోగికి తెలుస్తుంది.

రాజభోగి నేరుగా కలెక్టర్‌ని, పోలీసు సూపరింటెండెంటుని కలిసి తెల్లపాలకులకు వ్యతిరేకులైన ఖద్దరుగాళ్ళు ఈ రభసంతా చేస్తున్నారని, లచ్చయ్యమ్మని నేను బలవంతంగా తెచ్చి చెరిచి నా భవనంలో బంధించిన మాట నిజమేనని, అయిన నేనే మీకు సాక్ష్యాధారాలతో దొరకనని చెప్పేసరికి వాళ్ళు సందిగ్ధంలో పడతారు.

కాని గవర్నరు, ఐజీలు మాత్రం దీనిని సాంఘిక సమస్యగా గుర్తించి భారతదేశంలో బలహీన వర్గాల వారిని ఖద్దరు ఉద్యమం వాళ్ళు ఆదుకోరుగనుక, తక్కువ కులం అమ్మాయికి జరిగిన ఈ ఘోరాన్ని మనం వెలుగులోకి తీసుకొచ్చి అగ్రకులం వాళ్ళని, ఖద్దరుగాళ్ళని అణచటం మంచిదని భావిస్తారు. కావలసిన విధంగా రాసుకోండి గాని 'నా ఇళ్ళు స్థలాలు సోదా చెయ్యవద్దని', రాజభోగి కళ్ళంట నీళ్ళు పెట్టుకొని అధికార్లని బ్రతిమలాడతాడు. "నేను చేసిన సాంఘిక నేరాన్ని మీరు రాజకీయ సమస్యగా మార్చేయండి నాకు చాలు" అని యోగి ఖద్దరు నాయకుడు శివకేశవరావుని అభ్యర్థిస్తాడు.

ఆవెంటనే శివకేశవరావు జమీన్ రైతుల సమావేశం ఏర్పాటు జేస్తాడు. ఆసభలో లచ్చయ్యమ్మ ప్రస్తావన దెచ్చి రాజభోగిని శివకేశవరావు పథకం ప్రకారం దూషించి ప్రజల్ని రెచ్చగొడతాడు. ఉద్యమం శాంతివంతంగా జరగాలని అతను చెప్పినప్పటికీ, అది అశాంతి జ్వాలలతో నిండిపోయి చివరకు లచ్చయ్యమ్మ తమ్ముణ్ణి బలితీసుకుంటుంది. లచ్చయ్యమ్మ తమ్ముడితో పాటు చాలమంది జనాన్ని పోలీసులు కాల్చి చంపుతారు. రాజయోగి తన మీద చేసిన ఆరోపణలన్నీ నిరాధారమైనవని ఉన్నత పోలీసు అధికార్ల ద్వారా ప్రకటనలిప్పిస్తాడు. లచ్చయ్యమ్మ కుటుంబం మొత్తాన్ని యోగి అంతంజేస్తాడు. ఇలా చెయ్యటం అమానుషమని వాగే మానవతావాదం గాళ్ళకి నాజవాబేమంటే "మనం లోకాన్ని కాటేసి బతకాలి. మనం వర్ధిల్లాలంటే మనం అన్యాయాలు చెయ్యాలి." అని కిరీటి వివరిస్తాడు.

లచ్చయ్యమ్మ రెండురోజులు అన్న పానాలు ముట్టకుండా దాదాపు రాజయోగి ముఖం మీద ఉమ్మినంత పనిజేస్తుంది. దీంతో రాజభోగిలో పట్టుదల పెరిగి ఆమెను స్తంభానికి బంధింపజేసి పచ్చి మంచినీళ్ళయినా ఇవ్వకుండా మూడోరోజుదాకా ఉంచుతాడు. అమూడోనాడు విదేశీద్రాక్ష పాకానికి మంచినీళ్ళు కలిపి కొద్దిగా ఆమెకు అందిస్తారు.ఆమెకు ద్రాక్ష పాకం వలన దాహం మరీహెచ్చింది ఆరో నాటికల్లా ఆమె "త్రాహి త్రాహి" అని గోలెత్తింది.

ఆరోనాటి రాత్రి రాజయోగి చీకటిగా ఉన్న లచ్చయ్యమ్మ గదిలోకి ప్రవేశించి "లచ్చులూ నా లచ్చరూపాయలా' అని సౌమ్యంగా లచ్చయ్యమ్మని పిలిచేటప్పటికి ఆ పిలుపు తన రంగం బావదేనని లచ్చయ్యమ్మ భ్రాంతి పడేసరికి, మోసంతో లచ్చయ్యమ్మని రాజభోగి అనుభవిస్తాడు. కానీ తెల్లవారినాకా లచ్చయ్యమ్మ జరిగిన మోసం తెలుసుకొని

డెలీరియంలో పడిపోయి నెలదాక తీవ్ర అస్వస్థతకి లోనవుతుంది. స్వస్థత పొందినాక ఆమె తాను గర్భిణీవని తెలుసుకుంటుంది. తన వాళ్ళెవ్వరూ లేరని తెలిసికొని, రాజభోగి తన దగ్గర కొచ్చిన, అతనినేమి అనేది గాదట. 'కాని నువ్వేనా నాబిడ్డకి తండ్రివి' అని అడిగి యోగి ద్వారా "అవును" అనిపించుకొని కాస్త నెమ్మది పడుతుంది. లచ్చుయ్యమ్మకి కొడుకు పుడతాడు. ఆ పిల్లవాడు అందచందాలతో చూడముచ్చటగా ఉండేవాడు.

"ఇయ్యాల్టికాణ్ణించి నీ రాజ్యం నా కొడుకుది' అని లచ్చుయ్యమ్మ యోగికి అజ్ఞలు జారీ చేస్తుంది. ఎట్లాగయినా పిల్లవాణ్ణి వదిలించు కోవాలని యోగి నిర్ణయించుకుంటాడు. శివకేశవరావుతో యోగి మంతనాలు జరిపి, కిరీటిని తన వారసునిగా పెంచుకుంటానికి నిర్ణయించుకుంటాడు. లచ్చుయ్యమ్మ కొండదొరల చేత పిల్లవాడికి జ్యోతిష్యం చెప్పించుకొని ఆపిల్లవాడికి రాజయ్యే లక్షణాలు వున్నాయని తెలిసి ఆనందిస్తుంది. ఈజ్యోతిష్యుల పన్నాగం గూడ యోగిదే. ఆతరువాత రాజభోగి ఈపిల్లవాణ్ణి మాయం చేయిస్తాడు.

"కొడుకుతో పాటు పోయిందనుకున్న వజ్రాలహారం" రాజయోగి గదిలో దొరికే సరికి లచ్చుయ్యమ్మ యోగిమీద, అగ్గిమీద గుగ్గిలంలా మండిపడి కలబడుతుంది. యోగి లచ్చుయ్యమ్మను బంధింపజేస్తాడు. లచ్చుయ్యమ్మ తలుపులు బద్దలు కొట్టి బయటకువస్తుంది. ఆమెకు పిచ్చెక్కుతుంది. తాటి చెట్టుని జూసి యోగి అని భ్రమపడి గొడ్డలితో నరుకుతుంది ఇంతలో తనని యోగి మనుషులు బంధించి తీసుకొచ్చిననాడు బలైపోయిన ఆవుయొక్క దూడను జూసి 'నామాలచ్చిబిడ్డా' అని దానిని కౌగలించుకొని దుఃఖిస్తుంది. ఆ వెంటనే నాలుగు భయంకరమైన కుక్కల్ని దీసుకొచ్చి లచ్చుయ్యమ్మని భయపెట్టి మళ్ళీ కోటలోకి తీసుకుపోతారు. జనంలోంచి యోగికి ప్రతిఘటన ఎదురయ్యేసరికి; ఆమె కుమారుడు ఎక్కడోచోట క్షేమంగానే ఉండి ఉంటాడని, లచ్చుయ్యమ్మని బ్రతికించుకుంటానికి ఇంతకంటే మార్గంలేదని చెప్పి యోగి జనాన్ని చల్లబరుస్తాడు.

కిరిటీ సువర్ణ సుందర పురం వెళ్ళిననాటి పరిస్థితి ఇది. ఆ లచ్చుయ్యమ్మకి ఏదైనా అపకారం జరిగితే జనం తనని బ్రతకనివ్వరని గూడా యోగి గ్రహిస్తాడు.

యోగి కిరీటికి జీవిత సత్యాల్ని, బతుకు మార్గాన్ని వివరించి ఈ లోకంలో 'తినేవి, తినబడేవి' అనే రెండు జాతులే ఉన్నాయని చచ్చేజాతి తన అస్తిత్వం కోసం తిరగబడుతుందని, మనం పట్టుదలతో జీవితపోరు సాగించాలని ఇలాంటి విషయాలు వివరిస్తాడు.

ప్రభుదాసు లచ్చుయ్యమ్మకి పెద్దమ్మ కొడుకైన ఆమెపట్ల దుర్మార్గంగా ప్రవర్తిస్తుంటాడు. అందరూ లచ్చుయ్యమ్మని మహాలక్ష్మిగా భావిస్తారు.

బలవంతంగా బంధించిన లచ్చుయ్యమ్మని కుక్కలతో భయపెడుతూ మేడ దిగకుండా, ఆమెకు ప్రభుదాసు తదితర సేవకుల ద్వారా అన్నపానీయాలు అందిస్తుంటారు. కిరీటి సు.సు.పురం చేరుకున్న మరునాడు దాదాపు ఆరువందల ఆవులు వస్తున్నట్లు రాజభోగికి ముందుగా సమాచారం అందుతుంది. లచ్చుయ్యమ్మకి పిచ్చి తగ్గిపోతుంది.

విశ్రాంతి తీసుకుంటున్న కిరీటి గదిలోకి లచ్చయ్యమ్మ ప్రవేశించి "ఏయ్ ఎవరు నువ్వు' ' అని ప్రశ్నించేసరికి ఆమె ఆకారాన్ని జూసి కిరీటి తీవ్ర భయాందోళనలకి గురవుతాడు. ఆ సమయంలో లచ్చాయ్యమ్మ నగా నట్రతో సర్వాంగ సుందరంగా అలంకరించుకొని గూడా ఉంది. ప్రభుదాసు, గోదాసు, తదితర సేవకా గణం రాగ లచ్చయ్యమ్మ వాళ్ళకెవరికి లొంగకుండా "ఇయ్యాళ్ళించి నాకింకా బంధికానా సరి, మరింక నన్నెవడైనా సరే ఏంజెయ్యలేడు''అని ధీమాగా ప్రకటిస్తుంది. "ఈ రాజ్యంలో ఈ కోట ముందర నా కొడుకు బావుటా ఎగరాలేకాని, మరోడి బావుట ఎగరటానికీల్లేదు... విందుకు మరింక తిరుగులేదు''అని ప్రకటించేసరికి అందరూ విస్తుబోతారు. ప్రభుదాసు; కుక్క జాకీ ద్వారా లచ్చయ్యమ్మని బెదిరించటానికి ప్రయత్నించినప్పటికి, లచ్చయ్యమ్మ ఆ జాకీని చావబాదుతుంది. ఈ భయంకర దృశ్యాల్ని చూడలేక కిరీటి బాత్‌రూమ్‌లో దాక్కుంటాడు. లచ్చయ్యమ్మ మేడమీదికెళ్తుంది.

"గడ్డపోడికి ఇయ్యాళ్ళ కాణ్ణించి పొయ్యేకాలం దాపురించినట్టేనంట'' అని గోదాసు చెప్పేసరికి కిరీటి ఉగ్రుడై గోదాసుని చావబాదితే అతను కిరీటి చేతిలోని బెల్టును లాక్కొని ప్రభుదాసుని ఒక తన్ను తన్ని గోదాసు అంతర్ధానమవుతాడు.

రాజయోగి ఆవుల కిష్టయ్యతో ప్రభుదాసుతో లచ్చయ్యమ్మ గురించి హడావుడిగా ఆలోచిస్తుంటాడు. లచ్చయ్యమ్మ విషయంలో రాజయోగి అనుసరించిన విధానం గురించి చెప్పి లచ్చయ్యమ్మ పూర్తిగా తిరగబడిందని సాయంకాలం లోపల తన కుమారుణ్ణి చూపించకపోతే భవనం మొత్తాన్ని ధ్వంసం చేసి మనల్ని అంతంచేస్తానని కబురు పెట్టిందని కిష్టయ్య కిరీటికి వివరిస్తాడు. అయితే ఇదేరోజు ఆవుల మంద ఇక్కడికి చేరుకుంటుందని కిష్టయ్య వాపోతాడు. ప్రభుదాసు మంతనాలతో లచ్చయ్యమ్మ మూడురోజులవరకు గడువిస్తుంది.

లచ్చయ్యమ్మకి అపకారం జరిగితే మేం సహించమని సత్యమూర్తి కిష్టయ్యని హెచ్చరిస్తాడు. యోగికూడా లచ్చయ్యమ్మకు భయపడినట్లు కిరీటి ఊహిస్తాడు. కిరీటితో యోగి "మనిషి పులిలా బతకడమే మంచిది''అని చెప్తాడు. మొత్తంమీద లచ్చయ్యమ్మని పరమ కిరాతకంగా చంపటానికి పథకం సిద్ధం చేస్తున్నట్లు యోగి మాటలద్వారా గ్రహించగల్గుతాడు కిరీటి. రాజయోగి బయటకు వెళతాడు. కిరీటి సు.సు.పురం వచ్చిన రెండోరోజు మధ్యాహ్నం లచ్చయ్యమ్మ మేడమీద కనిపించే సరికి జనం ఆమెకు తమ సానుభూతిని ప్రకటిస్తారు. లచ్చయ్యమ్మని చూస్తున్న జనంలో గోదాను, సత్యమూర్తి ఉండటాన్ని గమనించిన కిరీటి ఆశ్చర్యపోతాడు. ఇంతలో ఆవుల మందగూడ ఆ కోట దగ్గరకు చేరుకుంటున్నట్లు కిరీటికి కర్రి నౌకరు ద్వారా తెలుస్తుంది. ఒంటి కొమ్ము ఎద్దుని చూసి లచ్చయ్యమ్మ "నాబిడ్డ, నా రాజు గోడు''అని తన ఆనందాన్ని వ్యక్తంజేస్తుంది. ఎద్దు మేడపైకి రావటం, నన్ను విడిచిపెట్టమని లచ్చయ్యమ్మ కేకవెయ్యటం, జనంగూడ లచ్చయ్యమ్మని విడిచిపెట్టాలని కేకలెయ్యటం, ప్రభుదాసు తదితర సేవకులతో, గోదాసు, సత్యమూర్తి ఇంకొంతమంది ఘర్షణ పడటం, గోదాసు తాళం చెవులు లాక్కొని, తాళాలు తియ్యటం, ఆ లచ్చయ్యమ్మ చప్టామీదికి రావటం, అంతా కొద్ది క్షణాల్లో జరిగిపోతుంది.

తనపైకొచ్చిన జాకీని లచ్చయ్యమ్మ చంపేస్తుంది. రెండోసారి కుక్కల్ని లచ్చయ్యమ్మ మీదికి ఉసిగొల్పటాన్ని కళ్ళారా చూసిన జనం తిరగబడతారు. అదే సమయంలో రాజయోగి, కారు గేటు దగ్గరకు రావటం జరుగుతుంది. ఆ గెడ్డపోడె మన బతుకులు నాశనం జేసిందని లచ్చయ్యమ్మ ఒంటి కొమ్ము ఎద్దుతో అనే సరికి మిగిలిన ఆవులు రాజయోగిని, ఆయన కారుని కుమ్మికుమ్మి రాజయోగిని చంపుతాయి.

ఆ తరువాత జనంమీదికి ప్రభుదాసు తదితరులు చాలా తుపాకులు పేల్చారు. అయినా, జనసముద్రం ముందు తుపాకులు నీటి బొట్టులాంటివి. తుపాకులు పేల్చినవారిని ఆవులు వెదికి వెదికి పొడిచి పొడిచి చంపేశాయి. కిరీటి ఒక్కడే అక్కడ మిగులుతాడు. లచ్చయ్యమ్మ వేలాది గోవులు వెంటరాగా ఆ సమీప కొండల్లోకి వెళ్ళిపోయింది. ఆమెవెంట గోదాసు, సత్యమూర్తికూడా వెళతారు. లచ్చయ్యమ్మ ఆ కొండల్లో తపస్సు చేస్తుందని, ఆ తపస్సు అనంతరం ఆమె తన కుమారుడితోపాటు మళ్ళీ ఇక్కడకొచ్చి గోసామ్రాజ్యాన్ని 'స్థాపించి' పేదలందరికి సుఖశాంతులు ప్రసాదిస్తుందని' జనం ఆమె వృత్తాంతాన్ని కథలు కధలుగా చెప్పుకుంటుంటారని కిరీటి వివరిస్తాడు.

## 4. రత్తాలు - రాంబాబు

'రత్తాలు-రాంబాబు' నవల 5-3-1976 నుండి 18-11-1977 వరకు 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడి అసంపూర్తిగా ఆగిపోయింది. ఆ తరువాత నాలుగు భాగాలుగా 'అరుణ్ పబ్లిషింగ్ హౌస్'వారు ఈ నవలను 1977లోనే ముద్రించారు.

రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు'ను వాసిరెడ్డి వెంకటప్పయ్య; యన్.యస్.ప్రకాశ రావులకు అంకితమిచ్చారు.

**మొదటిభాగం**

వరాలమ్మ రత్తాలికి పెద్దమ్మ. చిన్న కాఫీ కొట్టుతో జీవనం గడుపుకుంటున్నది. తల్లితండ్రిలేని రత్తాలి సంరక్షణ వరాలమ్మే చూస్తుంటుంది.

రత్తాలు మంచి అందమైన అమ్మాయి. శారీరక పటుత్వం, సౌందర్యం గల చక్కని చుక్క. ఒకనాడు పట్నం నుండి సింహాచలం తాళ్ళున్నాసప్పడి కొడుకునని చెప్పి వరాలమ్మ కొట్లో ఊడిపడతాడు. చిన్నగా వరాలమ్మని, రత్తాల్ని నమ్మించి, తనకు హార్బర్‌లో ఉద్యోగమని చెప్పి, రత్తాల్ని పెళ్ళి జేసుకుంటానని నమ్మించి, రాత్రికి రాత్రి రత్తాల్ని లేవదీసుకుని నరసమ్మ కంపెనీకి జేరు కుంటాడు సింహాచలం. సింహాచలం కంపెనీలకి అమ్మాయిలను తార్చే దగుల్బాజీ వెధవ. రత్తాల్ని వెయ్యి రూపాయలకి నరసమ్మ కంపెనీకి అమ్ముతాడు "డాకూ నాకొడుకైన" సింహాచలం.

గంగరాజుహెడ్. అన్ని అవలక్షణాలున్న పోలీస్‌హెడ్. నరసమ్మతో, ఆమె కంపెనీతో మంచి సంబంధాలున్నాయి ఇతనికి.

నరసమ్మ జాంపండులా బావుంటుంది. పోలీస్ డిపార్టుమెంటులోని చాల మందికి నరసమ్మ భార్యల అవతార మెత్తింది. ఒక ఎస్పీగారి వలన కాస్తపుంజుకొని మెలకువలు తెలుసుకొని స్వంత కంపెనీ ప్రారంభించింది. సొంత కంపెనీ అంటే, మనుషుల రక్త మాంసాలని, మానాన్ని అమ్ముకునే వ్యాపారమని వేరే చెప్పనవసరం లేదు గదా ! ఆమె వేలు విడిచిన మేనమామ, నరసమ్మని అంటిపెట్టుకుని, ఆకంపెనీలని అమ్మాయిలను వణికిస్తూ జీవితం గడుపుతుంటాడు. నరసమ్మ అతన్ని 'మామయ్యా' అని పిలుస్తుంది.

ముత్యాలు రత్తాలు ఒకే 'వర్ణస్తులు'. రత్తాల్ని కార్యక్రమానికి సిద్ధంజేసే బాధ్యతని నరసమ్మ ముత్యాలుకి అప్పజెప్తుంది. రత్తాల్ని ముత్యాలు 'అప్పలా' తలంచుతుంది. చీపురు పల్లికి చెందిన సచ్చాలు కులాంతర వివాహం జేసుకున్నాక భర్త, బిడ్డ, మరణించటంతో విషమ పరిస్థితుల్లో నరసమ్మ కంపెనీలో చిక్కుకుంటుంది. రత్తాల్ని బాగా అలంకరణతో సిద్ధంజేసి వంటరిగా ఒక గదిలో ఉంచుతారు.తనతో పాటు తీసుకొచ్చిన కొత్త వ్యక్తికి సుఖాన్నందించమని సింహాచలం కోరేసరికి రత్తాలికి అప్పుడుగానీ తను 'యమకూపంలో' ఇరుక్కు పోయినట్లు తెలియలేదు. వాళ్ళతో రత్తాలు తన శీలాన్ని కాపాడుకుంటం కోసం పోట్లాడుతుంది. ఇంతలో సచ్చాలు చనిపోవటం వలన అక్కడి వాతావరణం మారి పోయేసరికి వాళ్ళిద్దరూ రత్తాల్ని విడిచిపెట్టి వెళ్ళిపోతారు. రిక్షా జోగులు సహాయంతో ముత్యాలు రత్తాల్ని కంపెనీ నుండి తప్పించే ప్రయత్నం జేసింది. రత్తాలు లేదనే సంగతి బయట పడేసరికి, అడ్డబుర్ర, మామయ్యలు, ఒక రిక్షా అతను ఇచ్చిన సమాచారం వలన బస్స్టాండు దగ్గర్నుండి రత్తాల్ని మళ్ళీ నరకకూపంలోకి లాక్కొస్తారు.

రెండు రోజుల వరకు ఆహారం లేకుండా నీళ్ళు మాత్రమే అందించి రత్తాల్ని ఓ గదిలో వుంచారు. రెండో రోజు రాత్రి రత్తాలు ఆత్మహత్యా ప్రయత్నం జేస్తుంది.

ముత్యాలు రత్తాల్ని ఆగది నుండి ఇవతలికి తీసుకొస్తుంది. అప్పుడు నరసమ్మ రత్తాల్ని జుట్టు పట్టుకొని కొట్టి, నానా తిట్లు తిడుతుంది. రత్తాలకు జరిగిన పరాభవం ముత్యాల్ని ఏడేళ్ళ వయసులోకి తీసుకెళుతుంది. ముత్యాలుకు ఏడేళ్ళ వయసులోనే పెళ్ళవటం, ఆమెతల్లి చనిపోవటం, మరో మూడు రోజులకి భర్త చనిపోవటం జరిగాయి. యౌవన వయసులో ఎవరి చేతుల్లోనో శీలాన్ని కోల్పోవటం, మోసంతో కంపెనీకి తాను అమ్మబడటం ఇవన్నీ గుర్తుకొచ్చేసరికి ముత్యాలుకి బతుకంతా శూన్యంగా తోచింది. అయినా అన్యాయాలు అంతమయ్యే మంచిరోజులొస్తాయనే ఆశతో బతుకుతున్నానని ముత్యాలు రత్తాలికి తన దీనగాథని జెప్పి ఆమెను ఓదారుస్తుంది.

ముత్యాలు బలవంతం చెయ్యగా మూడు రోజుల నుండి భోజనం లేని రత్తాలు ఆ రాత్రి కొద్దిగా భోంచేసి ముత్యాలు దగ్గర పండుకుంటుంది. రత్తాలుకి జ్వరం వస్తుంది. సూది మందు డాక్టరు రత్తాల్ని పరీక్షించి, ఇంజెక్షన్ ఇచ్చి ఆమెను పెద్దాసుపత్రికి పంపించమని నరసమ్మకు సలహా ఇస్తాడు. ఇక ఇప్పట్లో నీకు 'ఆప్రమాదం' లేదని ముత్యాలు రత్తాలుకి నచ్చజెప్తుంది. ఇంతలో ముత్యాలు కోసం ఎప్పుడూ వచ్చే కారుజోగులు

విస్కీ సీసాతో సహా వస్తాడు. నూటయాభై ఎకరాల మాగాణి ఉందతనికి . ఇంకా వ్యాపారాలున్నాయి. ఈ ముత్యాలుతో కాలక్షేపం చేస్తుంటాడు. తన మేనకోడలు వసంత చదువు అయిపోయాక ఆమెను వివాహం చేసుకోవాలని, ఆమెకయ్యే ఖర్చంతా తానే భరిస్తుంటాడు. ఈజోగుల్ని జూసి రిక్షాజోగులు కసిగా మండి పడుతుంటాడు. రిక్షాజోగులు ముత్యాల్ని మనసారా ప్రేమిస్తున్నవాడు.

కృష్ణా, రాంబాబు లిద్దరూ క్లాస్‌మేట్సు, వాళ్ళిద్దరూ ఐ.ఏ.యస్ పరీక్షలు రాసి కృష్ణావాళ్ళ ఊరు చేరుకుంటారు. వసంత గూడ కృష్ణ ఉండే ఊళ్ళోనే ఉంటుంది. వీళ్ళిద్దరూ రైలు దిగి కార్లో ఇంటికి వస్తుంటే దారిలో జరిగిన సన్నివేశమే రత్తాలు-రాంబాబులు దగ్గరవటానికి కారణభూతమవుతుంది.

రత్తాలు 'కొంగ' రిక్షాలో ఆసుపత్రికి బయలు దేరింది. రిక్షా వెంటే సైకిల్‌మీద అడ్డ బుర్ర ప్రయాణం. ఈకొంగ రిక్షా అతనిది, నరసమ్మది ఒకే ఊరు. రిక్షా నాలుగురోడ్ల జంక్షన్ దగ్గర కొచ్చే సరికి, రాకెట్టు,స్పుత్నిక్ రిక్షాని అడ్డగించి, ఈ రిక్షాలోని సరుకు (రత్తాలు) షేక్ బంగారప్పదని అడ్డగిస్తారు. రాంబాబు రాకెట్టుని నుగ్గునుగ్గు జేసి రత్తాల్ని కాపాడతాడు.

కృష్ణ రాంబాబుని తన ఇంట్లో ఉండమంటే రాంబాబు కృష్ణకు నచ్చజెప్పి దేవ కాంత లాడ్జింగ్‌లో దిగుతాడు.వసంత వాళ్ళ క్లాస్‌మేట్. వసంత రాంబాబులు ప్రేమించుకున్నారు. వసంత కోసమే రాంబాబు ఈ ఊరు వచ్చింది.

వసంతని చూద్దామని వాళ్ళింటికి వెళ్ళిన రాంబాబుని వసంత తండ్రి హనుమంతరావు రాంబాబుకి కులం లేదని, అతనికి తండ్రి లేడని,వాళ్ళమ్మను గూడా నిందిస్తాడు. తన మేనల్లుడు జోగారావుతో వసంత పెళ్ళి జరుగుతుందని గూడా చెప్తాడు.

కృష్ణ బలవంతం చెయ్యగా రాంబాబు గూడ పార్టీలో మందు తాగి రోడ్డు మీద పడిపోతాడు. సింహాచలం రాంబాబు పర్సుని, వాచీని దొంగిలిస్తాడు. సినిమా చూసి వస్తున్న రత్తాలు, ముత్యాలు పడిపోయిన రాంబాబుని గుర్తుబట్టి దగ్గరలోనే ఉన్న ప్రభుత్వాసుపత్రికి తీసుకెళతారు. డాక్టరు చూసినాక ఆసుపత్రి నుండి రాంబాబుని నరసమ్మ కంపెనీకి తీసుకెళతారు.

ఆ రాత్రి రైడు జరగటం వలన నరసమ్మ, మామయ్య మర్యాదల గదిలో హాయిగా ఉంటారు. రాంబాబు కాస్త తేరుకున్నాక జరిగినదంతా తెలుసుకొని బాధపడతారు. తన వాచీ, పర్సు పోయింది గాబట్టి ఇప్పుడు ఏం చెయ్యాలని మథన పడతాడు. నరసమ్మని ఒప్పించి, రత్తాలు, రాంబాబుకి సహాయంగా బయటికి వెళ్ళటానికి ముత్యాలు ఏర్పాట్లు జేస్తుంది. రత్తాల్ని జూసేసరికి రాంబాబుకి తన తల్లి జీవితం జ్ఞాపకాని కొస్తుంది. ముందు కృష్ణ ఇంటికెళితే అతను ఊళ్ళో లేకపోయేసరికి వసంత జ్ఞాపకానికి వస్తుంది. రాంబాబు వసంతకి జరిగిందంతా చెప్పి డబ్బు కావాలని అడిగితే తనకు డబ్బు ఇవ్వగలిగిన స్వతంత్రం ఈ ఇంట్లో లేదంటుంది. అందుకు రత్తాలు వసంత మెడలోని గొలుసన్నా ఇవ్వమంటే వసంత తన గొలుసివ్వటానికి ఇష్టపడదు. అంతలో వసంత బావ జోగులు, తండ్రి, వచ్చేటప్పటికి, రాంబాబు రత్తాలు అక్కడి నుండి వెళ్ళిపోతారు. రత్తాల్ని చూసిన జోగులు ఈ అమ్మాయి వేశ్యల కంపెనీకి చెందిన పిల్ల అని మామతో చెప్తాడు.

ఎవరి దగ్గర ఏసహాయం అందక మళ్ళీ రాంబాబుని నరసమ్మ కంపెనీకి తీసుకొస్తుంది రత్తాలు. సూదిపోటు డాక్టరు, రాంబాబుని పరీక్షించి అతనిని వెంటనే అంటురోగాల ఆసుపత్రిలో చేర్పించమని సలహా ఇస్తాడు.రత్తాలు రాంబాబుని ఆసుపత్రికి తీసుకెళుతుంది. ఆరాత్రి రత్తాలు కూడా ఆసుపత్రిలోనే ఉంటుంది.

జోగులు, తదితర విటులతో ఆరాత్రి నరసమ్మకంపెనీ చాల బిజీగా ఉంటుంది. ఇంతలో కంపెనీపై రైడు జరుగుతుంది. జోగులు, ఇంకొంత మంది పోలీసులకు దొరికిపోతారు. రాంబాబు వసంత పేరు కలవరిస్తుంటాడు డాక్టరు. ఈ అమ్మాయిని ఒకసారి పిలిపించితే బాగుంటుందనే సరికి రత్తాలు,ఇక రాంబాబుకి ఆఖరి క్షణాలు వచ్చాయని ఏడుస్తుంది. మందులు కొంటానికి కూడా రత్తాలు దగ్గర డబ్బులు లేవు.కాని డాక్టరు యాభైరూపాయల ఖరీదు చేసే మందులు రాస్తాడు. అర్ధరాత్రి మరోదారి లేక రత్తాలు వసంత ఇంటికి వెళ్ళి రాంబాబు ఎంతటి ప్రమాదపు అంచున ఉన్నాడో చెప్తుంది.అయిన వసంత తండ్రి డబ్బులు ఇవ్వక, వసంత రాంబాబుని చూడ్డానికి ఆసుపత్రికి వెళ్ళనియ్యక రత్తాల్ని నానా తిట్లు తిడతాడు. తన సర్వస్వం త్యాగంచేసైన రాంబాబుని బ్రతికించుకుంటానికి రత్తాలు ప్రయత్నిస్తుంది. రత్తాలు మానవతా మణిదీపం.

**రెండవభాగం**

యాభై రూపాయల కోసం తెగ గాలించినా రత్తాలికి ఆ డబ్బు అందలేదు. మళ్ళీ కంపెనీకి వచ్చింది. ఆ రాత్రే కంపెనీలో జరిగిన రైడు ఫలితంగా ముత్యాలు, అడ్డబుర్ర దప్ప అందరూ జైలుపాలయ్యారు. రత్తాలు ఎంతో మధనపడి రాంబాబుని రక్షించటం కోసం తన మానమమ్ముకోటానికి సిద్ధపడుతుంది. జోసల రిక్షాలో రత్తాలు, ముత్యాలు వాళ్ళ వెనక అడ్డబుర్ర బయలుదేరుతారు. రాథమ్మ భర్త గోపాలం రత్తాల్ని మాట్లాడుకొని లాడ్జింగ్‌కి తీసుకెళతాడు. ఆరోజు ఊర్వశిపై రైడ్ జరగటంతో రత్తాలు రక్షింపబడింది. అందుకు ముత్యాలు ఆనందిస్తుంది.

అడ్డబుర్ర మందులు తెస్తాడు. ఈ మందులతో “మీ ఆయన” తప్పకుండా బ్రతుకుతాడని డాక్టరు రత్తాలికి చెపుతాడు.

ముత్యాలు, రిక్షా జోగులు కంపెనీకి వెళతారు. రత్తాలు, ముత్యాలిచ్చిన కొద్ది డబ్బులతో ఆసుపత్రిలోనే ఉంటుంది. రాంబాబు బెడ్డుకి దగ్గరలోని ఒక ముసలాయన రత్తాలు రాంబాబు కోసం పడుతున్న శ్రమనంతా గమనిస్తుంటాడు. ఆసుపత్రిలోని అందరూ రత్తాలు రాంబాబు భార్య అని అనుకుంటారు.

మరునాడు పొద్దున రత్తాలు ఆసుపత్రినుండి బయలుదేరిన సమయంలోనే వసంత రాంబాబు కోసం ఆసుపత్రికి వస్తుంది. కానీ ఒకరినొకరు చూసుకోలేదు. ఆసుపత్రిలో రాంబాబు పేరు పొడుగు కొండబాబని ఉండటం వలన, ఆ ఆసుపత్రిలో రాంబాబు లేడని డాక్టరు నమ్మకంగా చెప్పటం వలన, వసంత వెళ్ళిపోతుంది. రాంబాబు ఆసుపత్రిలో లేడని నిర్ధారణ అయ్యేసరికి వసంత రత్తాలు గురించి నీచంగా ఆలోచిస్తుంది.

కంపెనీకి వచ్చిన రత్తాలుతో ముత్యాలు “ఉప్పుడు నువ్వు నీ ఊరికెళ్ళిపో”మని సలహా ఇస్తుంది. అయితే రత్తాలు మాత్రం అందుకు ఒప్పుకోదు. మళ్ళీ ఆసుపత్రికెళ్తుంది

రత్తాలు. "మీవాడు నువ్వెళ్ళిన తరువాత లేచి.... కొంచెం బార్లీ నీళ్ళు తాగాడని" ఆ ముసలాయన చెప్పేసరికి రత్తాలు సంతోషిస్తుంది.

మళ్ళీ రత్తాలు కంపెనీ నుండి తిరిగి ఆసుపత్రికి చేరేలోపు రాంబాబుకి పూర్తిగా తెలివస్తుంది. అందరూ రాత్రి మీ భార్య సేవలవల్లే నువ్వు బతికి బయటపడ్డావనే సరికి, తనకి భార్య ఎవ్వరని రాంబాబు విస్తుబోతాడు. ఆ సమయంలోనే రత్తాలు రాంబాబు దగ్గరికి చేరుకునేసరికి రత్తాల్ని ఎగాదిగా చూసి "నువ్వు రోడ్డిమీది అమ్మాయివికదూ" అని రాంబాబు ప్రశ్నించేసరికి రత్తాలు నిలవిల్లాడుతుంది.

వసంతని వాళ్ళ నాన్న రానియ్యలేదని, అందువలన ఆమె ఆసుపత్రికి రాలేకపోయిందని, కృష్ణవేరే ఊరికి వెళ్ళటంవలన రాలేకపొయ్యాడని రత్తాలు రాంబాబుతో చెప్తుంది.

మరినన్ను ఆసుపత్రిలో ఎవరు చేర్చారని అడిగితే 'నేనే'నని రత్తాలు సమాధానం చెప్పి; ఇక్కడివాళ్ళు 'నన్ను నీ భార్యగా' అనుకుంటున్నారని 'నేనెవరికి అలా చెప్పలేదని' రత్తాలు నమ్మకంగా చెప్తుంది. అంతలో డాక్టరుగారు రాంబాబుతో నీ భార్య అర్ధరాత్రి ఆ యాభైరూపాయలతో ఆ సమయంలో మందులు తేవటంవల్లే, నువ్విప్పుడు మాతో మాట్లాడగలుగుతున్నావని చెప్తాడు.

ఆసుపత్రి నుండి కంపెనీకి వచ్చాక తనని రాంబాబు 'రోడ్డుమీది అమ్మాయివి' అన్నందుకు రత్తాలు పొర్లిపొర్లి ఏడ్చి, తన అస్తిత్వాన్ని గురించి ముత్యాలుతో బాధగా మాట్లాడుతుంది. ప్రొద్దున్నే ముత్యాలు, రత్తాలు రొట్టె, కాఫీ తీసుకుని ఆసుపత్రికి బయలుదేరతారు.

రత్తాలు, ముత్యాలు ఆసుపత్రికి వచ్చేలోపు రాంబాబు చేసిన ఫోన్‌తో కృష్ణ రాంబాబు దగ్గరకొచ్చి జరిగిన సంగతి తెలుసుకుంటాడు. వెంటనే కృష్ణ, ఇంటికి వెళ్ళి, బట్టలు తదితర సామాన్లన్నీ తీసుకొస్తాడు. కృష్ణ రత్తాల్ని అక్షరజ్ఞానం లేని దేవకాన్త అని, ఆమె వలన రాంబాబుకి చిక్కులొస్తాయేమోనని మాట్లాడుతుంటే ప్రక్కనున్న ముసలాయన అందుకుని ఆ అమ్మాయి ఏవిధమైన ప్రమాదకర శక్తిగాదు అని చెప్తాడు. ఇంతలో రత్తాలు, ముత్యాలు ఆసుపత్రికి వస్తారు.

రత్తాల్ని పేరడిగి, రెండొందలు రాంబాబుకిచ్చి వాటిని రత్తాలికి ఇవ్వమని కృష్ణ సలహా జెపుతాడు. ఆ డబ్బుని తీసుకోమని కృష్ణ అంటే "దేనికండి ఆ డబ్బు? అది ఆ బాబు పేనాల ఖరీదా?" అది నా బతుక్కరీదా? అని రత్తాలు ప్రశ్నించేసరికి తలతిరిగి పోతుంది. వాళ్ళకి.

ముత్యాలు రత్తాల్ని ఆసుపత్రికి బయటకు పంపించివచ్చి, తాను కంపెనీ ఎలకనని, మా జీవితాలిలా మాడిపోతున్నా మీలాంటి చదువుకున్నోళ్ళెవరు పట్టించుకోవటం లేదని, రత్తాలు. అనాఘ్రాత పుష్పమని చెప్పి రాంబాబు ఇచ్చిన 250 రూపాయలు తీసుకుంటుంది, ముత్యాలు. రాంబాబు తన అడ్రస్, క్రిష్ణ అడ్రస్ రాసి, నీకు ఏ సహాయం కావాలన్నా చేస్తానని రత్తాలుతో చెప్పేసరికి రత్తాలు పొంగిపోతుంది.

రత్తాలు, ముత్యాలు ఆసుపత్రి నుండి వెళ్ళగానే వసంత ఆసుపత్రికి వచ్చి రాంబాబుని కలుసుకుంటుంది. రాంబాబు అనారోగ్యం గురించి వసంత పరామర్శిస్తుంది. అన్ని సంగతులు వసంత, రాంబాబులు మాట్లాడుకుంటారు. వసంత దుఃఖిస్తూ వెంటనే ఇక్కణ్ణుంచి తీసుకుపో నన్ను నువ్వు పెళ్ళి చేసుకో 'మా బావ కూనికోరు'అని చెప్తుంది.

వసంత ఇక తన సంగతులేవీ దాచకుండ రాంబాబుకి చెప్పాలనుకుని, తనకు చిన్నప్పుడే తన బావ జోగులుతో పెళ్ళి నిశ్చయమైపోయిందని చెప్తుంది. డ్రిల్ మాస్టరు అతని భార్య కమలని తన బావ జోగులే హత్యచేశాడని, ఆ హత్యల దృశ్యాన్ని తాను చూశానని వసంత రాంబాబుతో చెప్తుంది. రత్తాలుని తాను అనుమానించానని, అందుకు నేను క్షమాభిక్షనర్థిస్తున్నానని, ఆ అమ్మాయి నీకు కలిస్తే చెప్పమని గూడ వసంత రాంబాబుతో అంటుంది. తను జోగుల్ని చేసుకోనని పరిస్థితి విషమిస్తే చచ్చిపోవటానికైనా సిద్ధమేనని, తన తప్పులను క్షమించమని వసంత రాంబాబుని అర్థించి అతని కౌగిలిలో ఒదిగిపోతుంది. వసంత ఆసుపత్రి నుండి వెళ్ళిపోతుంది.

తను చెప్పినప్పుడు కంపెనీ నుండి తప్పించుకుపోనందుకు, ముత్యాలు రత్తాల్ని కసురుకుంటుంది. ముత్యాలు జోగులు దగ్గరకెళ్ళి తన దగ్గరున్న 250 రూపాయల్లో 200 రూపాయలు జోగులకిచ్చి రత్తాల్ని తప్పించటానికి ప్లాను చెప్పి ఈ డబ్బు అందుకు ఉపయోగించమంటుంది. అడ్డబుర్రతో నమ్మకంగా ఉండమని, అవతలి పార్టీ రాకెట్టు వాళ్ళకు కూడా తాను చెప్పానని చెప్పి అక్కణ్ణుంచి మళ్ళీ రిక్షాలో ముత్యాలు, రత్తాలు బయలుదేరుతారు. అప్పుడే వచ్చిన ముత్యాలు, రత్తాలుపై నరసమ్మ కేకలు వేస్తుంది.

ఆంటన్ చెహోవ్ రచించిన 'ది కెమీలియన్' కథ ఆధారంగా, ఒక పిల్లవాడికి కుక్క కరిస్తే గంగరాజు హెడ్డు అతనితో ఎలా ప్రవర్తిస్తాడో అంటే అన్యాపదేశంగా పోలీసుశాఖ పనితీరు ఎలా ఉంటుందో, ఈ వృత్తాంతం ఆధారంగా పాఠకులు గ్రహించేలా చేస్తారు రావిశాస్త్రి. ఈ వృత్తాంతాన్ని కథా భాగం నుండి తొలగించినా వచ్చే నష్టమేమీ లేదు.

**మూడవ భాగం**

గంగరాజు హెడ్డు, అతని శిష్యుడు బస్‌స్టాండ్ దగ్గరకు చేరేసరికి సింహాచలం నాలుగు సంవత్సరాల పాపతో కనిపిస్తాడు. ఆ అమ్మాయి తన కూతురేనని నమ్మించి అవతలికి జారుకున్న సింహాచలాన్ని హెడ్డు అనుమానించాడు. బొబ్బిలి పెళ్ళికి వెళుతున్న పెద్దావిడని మోసగించి, పిల్లదగ్గరున్న బంగారం కాజేద్దామని సింహాచలం ప్లాను వేశాడు. పరిస్థితి తారుమారయ్యేసరికి, సింహాచలం ఆ పాపని హోటల్‌లోనే వదిలిపెట్టి వెళతాడు. పాప దొరికినప్పటికీ ఆ పెద్దావిడ పోలీసులతో నానాయాతనపడి చివరకు 'రెండు వందలు' సమర్పించుకొని అక్కడి నుండి పెళ్ళికి వెళుతుంది.

రాకెట్టు, స్ఫూత్నిక్కు, షేక్ బంగారప్ప కంపెనీకి గొప్ప రక్షక భటులు లాంటివారు. కానీ ఈ మధ్య రాకెట్టు బంగారప్పపై కక్షగడతాడు. ముత్యాలు రత్తాల్ని నరసమ్మ కంపెనీ

నుండి తప్పించి ఆమె ఊరు పంపించటానికి సహాయపడమని అభ్యర్థిస్తే అందుకు రాకెట్టు, స్ఫుత్నిక్కు అంగీకరిస్తారు. ఈ పథకంలో భాగంగా ముత్యాలు కృష్ణసహాయంగూడా తీసుకుంటుంది.

ముత్యాలు, రత్తాలు కలిసి ఆసుపత్రికి వెళ్ళినాక ముత్యాలు రత్తాల్ని ఈరోజే ఆమె పెద్దమ్మ దగ్గరకు పంపిస్తున్నానని చెప్పే సరికి రత్తాలు ఆశ్చర్యపడుతుంది. ప్లాను మొత్తం ముత్యాలు రత్తాలికి వివరించి, ఖర్చుల నిమిత్తం యాభై రూపాయలు రత్తాలికి ఇస్తుంది. ముత్యాలు అభిమానానికి రత్తాలు చలించిపోతుంది. మనం "ఒక్కలాంటోళ్ళం' ' ఎక్కడున్నా కలుస్తామని ముత్యాలు చెప్పి జోగులు రిక్షాలో అనుకున్న సమయానికి ఇద్దరు నీలాటాకీసు దగ్గరకు చేరుకుంటారు. వీళ్ళకి రక్షకుడిగా అడ్డబుఱ్ఱ సైకిల్‌మీద వెనకాలే వస్తాడు.

నీలా టాకీసు దగ్గర కొచ్చిన రిక్షాను స్ఫుత్నిక్కు అడ్డగించటం, రిక్షాలోంచి, ముత్యాలు, రత్తాలు తప్పుకుంటం, శత్రుసైన్యం, ఎక్కువగా ఉందని గ్రహించిన అడ్డబుఱ్ఱ తోకముడవటం క్షణాల్లో జరిగిపోయింది. అయితే గల్లీపులి జోగులు కొట్లాటకు దిగుతారు. జనమంతా ఈ గొడవలో మునిగిపోతారు. ఈ సమయంలో రత్తాల్ని వేరే టాక్సీలో ఎక్కించి బస్‌స్టాండుకు తీసుకెళ్ళి వాళ్ల ఊరు బస్ ఎక్కించి తన మాట నిలుపుకున్నాడు కృష్ణ. అయితే అడ్డబుఱ్ఱ రత్తాలెక్కిన కారునంబరు 1200 అని గుర్తుబెట్టుకొని ఈ ఆచూకీతో రత్తాల్ని బస్‌స్టాండులో దించి వచ్చారనే సమాచారాన్ని టాక్సీ డ్రైవరు ద్వారా రాబడతాడు. గల్లీ పులిని గుల్లగుల్లగా కొట్టి తన శక్తి నిరూపించుకొని "సైకిల్ భీముడని" ప్రజల మెప్పు పొందుతాడు జోగులు.

బస్‌స్టాండు దగ్గర హెడ్డుకి దొరక్కుండా తప్పించుకున్న సింహాచలం నేరుగా నరసమ్మ కంపెనీకి వస్తాడు. 'నా బావని నాక్కాకుండా చేసి' చంపేసెయ్యబొయ్యారని ముత్యాలు గుండెలు బాదుకుంటూ ఏడుస్తూ దెబ్బలు తగిలిన జోగుల్ని తీసుకొని వచ్చేసరికి "ఏటయిందర్రా" అని నరసమ్మ ముత్యాలుపై కేకలేస్తుంది. సింహాచలం షేక్ బంగారప్ప దగ్గర ఐదు వందలు అడ్వాన్సు తీసుకొని రత్తాల్ని అప్పగించనందుకే ఈ తగువని ముత్యాలు చెప్తుంది. అడ్డబుఱ్ఱ, రత్తాలు వాళ్ళ ఊరెళ్ళి పోయిందని మొత్తం జరిగిన సంగతంతా నరసమ్మకు చెప్పే సరికి, నరసమ్మ లబోదిబో మంటుంది. నరసమ్మ సింహాచలం, అడ్డబుఱ్ఱతో మాట్లాడి రత్తాల్ని లాక్కురావటానికి ప్లాను సిద్ధంజేసింది. ఈ విషయాలన్నీ జాగ్రత్తగా ముత్యాలు గమనిస్తూనే ఉంది. సింహాచలం అడ్డబుఱ్ఱ, రత్తాలు కోసం బయలు దేరే సమయానికే సింహాచలం కోసం వెతుకుతున్న గంగరాజు హెడ్డు, అతని శిష్యుడు నరసమ్మ కంపెనీకి వస్తారు.

'నరసమా' అనే కేకతో గంగరాజు గొంతు గుర్తుబట్టిన సింహాచలం వెనక్కి తిరిగి గదిలో మంచం కింద దూరతాడు. సింహాచలం వెనక్కి తిరిగి రావటాన్ని ముత్యాలు గమనించలేదు. దీంతో కన్యాశుల్కంలో రావప్పంతలు, మధురవాణి సీనులా, మంచం క్రింద సింహాచలం, మంచంమీద గంగరాజెడ్డు, నరసమ్మ. శిష్యుణ్ణే అడ్డు తొలగించుకోవటం

కోసం అతణ్ణి వెళ్ళిపొమ్మంటాడు హెడ్డు. వెళ్ళబోతున్న శిష్యుడికి మర్యాదలు జేసి, ముత్యాలు సింహాచలం, అడ్డబుర్ర, రత్తాల్ని బలవంతంగా నరసమ్మ కంపెనీకి లాక్కురాబోతున్నారని సమాచారాన్నందిస్తుంది. నరసమ్మతో సరసంజేసి హెడ్డు అలసిపోయి గుర్రు బెడుతున్న సమయంలో నరసమ్మ తలుపుదీసి మెల్లగ సింహాచలాన్ని బయటకు పంపిస్తుంది.

బస్‌లో కూర్చున్న రత్తాలు తన పెద్దమ్మ గురించి ఊళ్ళోవాళ్ళ గురించి తల్లిలాంటి ముత్యాలు గురించి మరోసారి రాంబాబు గురించి---ఇలా చాలారీతులుగా ఆలోచిస్తుంటుంది. మధ్యలో బస్ చెడిపోయి, రత్తాలు ఆలస్యంగా ఆఊరు చేరే సరికి, కాఫీ కొట్టుందేగాని, అక్కడ తన పెద్దమ్మ లేదు. కాఫీ కొట్టుని ప్రెసిడెంటు సన్యాసి నాయుడు, అతని ముండ సన్నమ్మ ఆక్రమించుకున్నారు.

సన్నమ్మ భర్త ఆమె చిన్నతనంలో మరణించాడు. అప్పటికి ఆమె కొక కొడుకు గూడ ఉన్నాడు. అప్పటి నుండి ప్రెసిడెంట్‌కి సన్నమ్మకి సంబంధముంది. తన పెద్దమ్మేదని అడిగిన రత్తాలుకి, పెద్దమ్మ సంగతి ముందుగా చెప్పకుండా, పెద్దమ్మ కూతురు 'సిన్నాలు' చచ్చిపోయిందని 'సన్నమ్మ' చెప్పేసరికి రత్తాలు పెద్దగా విలపిస్తుంది. ఆ తరువాత రత్తాలికి ఆమాట, ఈమాట జెప్పి, నెమ్మదిగా మీ పెద్దమ్మ కూతురు చనిపోయిన కొన్నాళ్ళకీ దిగులుతో పెద్దమ్మ గూడా చనిపోయిందని, చావుకబురు చల్లగా చెప్పుంది. రత్తాలు శోకదేవతై పోతుంది. మంచం కోడుకేసి తలబాదుకుని దు:ఖించే సరికి ఆమె నొసలు చిట్లి రక్తమొస్తుంది. రత్తాల్ని ఎలా వదిలించుదామా అని సన్నమ్మ ప్రెసిడెంటు ఆలోచిస్తుండగా, అడ్డబుర్ర సాయిబు ఎస్సై వేషంలో, సింహాచలం మాములు ఆకారంలో టాక్సీలో కాఫీకొట్టు దగ్గర కొస్తారు.

రత్తాలు లోపలుందని పెద్దమ్మ చనిపోయిందని సన్నమ్మ మాటల ద్వారా సింహాచలం గ్రహిస్తాడు. రత్తాలే లేవ దీసుకెళ్ళమని తనని తొందర బెట్టిందని రత్తాలు తిరుగుబోతని, వెయ్యిరూపాయల డబ్బులు, పక్కింటివాళ్ళ నగలు పట్టుకుని చెప్పా చెయ్యకుండా పారిపోయి వచ్చిందని సింహాచలం కథలల్లుతాడు. సింహాచలం చెప్పిన కథ సాకుతో, డబ్బులు, బంగారం తనకు తెలియదని చెప్పి, రత్తాలు ఎంత మొరబెట్టుకున్న ఆలకించకుండ ప్రెసిడెంట్, సన్నమ్మ రత్తాల్ని నిర్దాక్షణ్యంగా సింహాచలమనే మృగం వెంట పంపిస్తారు.

'వెంకట్రావు' అనే పోలీసు కంపెనీకి వచ్చి, రత్తాల్ని బలవంతంగా తీసుకురమ్మని సింహాచలాన్ని, అడ్డబుర్రని పంపించావట, వాళ్ళు కారుతో సహా మా డిపార్టుమెంటుకు దొరికిపొయ్యారు. ఇది పెద్దకేసు అవుతుందని నరసమ్మకి జెప్పేసరికి, ఆమె శోకాల్లోకి దిగుతుంది. నరసమ్మ ఈ సంగతి ముత్యాలకి జెప్పి కొంప మునిగిందని ఏడుస్తుంది.

రాంబాబు తల్లి టీచరు. ఆమె పెళ్ళి కాకుండానే గర్భవతి అవుతుంది. ప్రేమించినతను నిర్దాక్షణ్యంగా ఆమెను తిరస్కరిస్తాడు. తండ్రి లేని బిడ్డగా రాంబాబు జీవితంలో చాలాసార్లు ఘోరమైన అవమానలకు గురవుతాడు. చిన్నప్పుడే తండ్రి మీద

కోపం కొద్దీ తండ్రి ఫోటోని ముక్కలు జేసి, ఒకరోజు తండ్రి చనిపోయాడనే సూచనగా బోడుగుండు గూడా చేయించుకుంటాడు రాంబాబు. ఈ సంఘటనలన్నీ ఒకసారి జ్ఞాపకం చేసుకుంటూ రాంబాబు తల్లి, రాంబాబు పరీక్షలు రాసి వచ్చిందగ్గరనుండి అదోలా ఉన్నాడని అనుకుంటూ వుంది. ఒకసారి రాంబాబు వసంతని ఇంటికి తీసుకొచ్చి ఆమెకు పరిచయం జేస్తే ఆమె మరిచిపోలేదు. ఆతరువాత రాంబాబు, వసంతలు ప్రేమించుకున్నారనే సంగతి ఆమెకు రూఢి అవుతుంది.

రాంబాబు ఇంటికి వచ్చిన దగ్గర నుండి రత్తాలు గురించి ఆలోచిస్తుంటాడు. తను జబ్బుపడినప్పుడు ఎవరో పల్లెటూరి అమ్మాయి చాలా సహాయం జేసిందని తల్లికి గూడా చెప్తాడు. రత్తాల్ని కంపెనీ నుండి విడిపించటం కోసం వెయ్యి రూపాయలు సంపాదించాలనే ప్రయత్నంలో రాంబాబు తన స్నేహితుడు బంగార్రాజుని అడుగుతాడు. పార్టీలో అందరి సమక్షంలో బంగార్రాజు ఐదువందలు ఇచ్చేసరికి రాంబాబు చాల బాధపడతాడు. పార్టీకి అమ్మాయిలను తీసుకొచ్చి రకరకాలుగా ఆఅమ్మాయిలను వేధిస్తుంటే రాంబాబు ఆదృశ్యం భరించలేక వాళ్ళతో గొడవపడి, ఆ డబ్బులు వాళ్ళ మొఖం మీద కొట్టి అక్కడ నుండి బయటపడతాడు.

రాంబాబు తీవ్రవేదకు గురవుతాడు. ఈఅమ్మాయిల వేదనకి,రత్తాలు బాధకి, తన తల్లి జీవితానికి అవినాభావ సంబంధముందని అతని అంతరాత్మ ఘోషిస్తుంది. అలా మథన పడుతూ ఆరాత్రంతా ఏదో గట్టు మీద కునుకుతీస్తాడు. రాంబాబు స్నేహితుడు మాధవరావు మానవత్వమున్న మంచి వ్యక్తి. "ఎలాగైనా సరే వెయ్యిరూపాయలు సంపాదిస్తాను. నన్ను నేను అమ్మేసుకునైన సరే సంపాదిస్తాను".[17] అని అనుకున్న సంగతులు గురించి రాంబాబు ఏదో తీవ్ర ఆలోచనలో ఉన్నాడనే సంగతి గ్రహించిన మాధవరావు రాంబాబుని అడిగి విషయం తెలుసుకుని తన దగ్గర ఐదు వందలున్నాయని తీసుకోమని చెప్తాడు. మాధవరావు అప్యాయతకి రాంబాబు చలించి "మాధవా నువ్వు నా బెస్టు ఫ్రెండువిరా'! అని మాధవరావుని కౌగిలించుకుంటాడు.

**నాలుగవ భాగం**

చెప్పిన మాట ప్రకారం మర్నాడు ఉదయం బ్యాంకి దగ్గర ఐదు వందల రూపాయలు మాధవరావు రాంబాబుకి ఇస్తాడు. మిగిలిన ఐదు వందల కోసం గుమస్తా రమణయ్య దగ్గరకు మాధవుడు రాంబాబుని తీసుకెళతాడు. రాంబాబు గురించి తెలుసుకున్న రమణయ్య రాంబాబు తండ్రి, అతని తల్లికి చేసిన అపకారం గురించి చెప్తాడు. రాంబాబు, మాధవలకు రమణయ్య వేరే చోట డబ్బు ఇప్పించి, తన కమీషన్ తీసుకొని వెళతాడు. రత్తాలుకోసం ఈ డబ్బు తీసుకుంటున్నట్టు రాంబాబు మాధవరావుకి చెప్పి, రత్తాలువృత్తాంతాన్నంతటిని వివరిస్తాడు.

రాంబాబు ఐ.ఏ.యస్‌లో ఆలిండియా ఫస్టు వచ్చాడని, తనకు ఐదోర్యాంకు వచ్చిందని కృష్ణ పంపించిన టెలిగ్రాం, చూచి, రాంబాబు తల్లి ఆనందాన్ని ఆపుకోలేక వత్తిడికి గురవుతుంది. రాంబాబు సంతోషిస్తాడు.

ముత్యాలు ద్వారా అందిన సమాచారంతో రత్తాల్ని తీసుకొస్తున్న టాక్సీని, సింహాచలాన్ని, అడ్డబుర్రని, రత్తాల్ని పోలీసులు స్టేషన్‌కి తీసుకొస్తారు. సింహాచలం, అడ్డబుర్రల ద్వారా నరసమ్మ కంపెనీ సమాచారాన్ని రాబట్టి, నరసమ్మ కంపెనీకి చెందిన అందర్నీ బంధించి స్టేషన్‌కి తీసుకురమ్మనమని అధికార్లు ఆజ్ఞాపించే సరికి కంపెనీ నుండి ముత్యాల్ని స్టేషన్‌కి తీసుకురాగలిగారే గానీ, వాళ్ళకు నరసమ్మ, మామయ్య తదితరులు దొరకలేదు.

అడ్డబుర్రకు ఓమాదిరిగా, సింహాచలానికి పూర్తిగా పోలీసులు కోటింగ్ ఇస్తారు. తను మొదటిసారి తప్పించుకున్న వృత్తాంతం మినహా సింహాచలం తనని తీసుకొచ్చిన దగ్గర నుండి జరిగిన వృత్తాంతమంతా పోలీసులకు చెప్తుంది. కాని తాను కంపెనీ నుండి తప్పుకొని ఊరువెళ్ళటానికి ముత్యాలు సహాయ పడిందనే సంఘటన మాత్రం చెప్పదు. ముత్యాలు రత్తాలు స్టేషన్‌లో కలుసుకుంటారు. రత్తాలు తనపెద్దమ్మ చనిపోయిన సంగతి ముత్యాలుకి చెప్పి దుఃఖిస్తుంది.

రత్తాలికి నొసటన ఉన్న దెబ్బ గురించి ఇంకా ఆమెకు వైద్యపరీక్ష గురించి, ఒక డాక్టరు మరో మహిళా డాక్టరు పరీక్షించిరత్తాలు అనాఘ్రాత పుష్పమని సర్టిఫికెటు ఇస్తారు. వైద్యపరీక్షలైన మర్నాడు రత్తాల్ని కోర్టులో హాజరు పరిచి, మళ్ళీ స్టేషన్‌కి తీసుకొస్తారు. ట్రైనీ ఏ.యస్.పీ శ్యామ సుందర రావుకి ఈసర్టిఫికెట్టుతో రత్తాలంటే గౌరవం ఏర్పడి, ఆమె జీవిత వివరాలు తెలుసుకుంటాడు. తనకు కృష్ణ బాబు, రాంబాబు తెలుసని రత్తాలు చెప్తుంది ఏ.యస్.పీ రత్తాలుకి పేపర్లో వచ్చిన రాంబాబు ఫోటో చూపించి, అతను ఐ.ఏ.యస్ ఆలిండియా ఫస్టులో పాసయ్యాడని చెప్తాడు.

ముత్యాలు ప్రోద్బలంతో ఏ.యస్.పి సూచనలతో రత్తాలు ఏదైనా పని చూపిస్తాడేమోనని ప్రొద్దున్నే కృష్ణ ఇంటికి వస్తుంది. అంతకు ముందే రాంబాబు కృష్ణకి వెయ్యి రూపాయలు డి.డి. పంపించి రత్తాల్ని ఆ కంపెనీ నుండి విడిపించి కాపాడమని కృష్ణకు ఉత్తరం కూడా రాస్తాడు.

ఇంతలో కృష్ణతన స్నేహితుడైన ఏ.ఎస్.పి. శ్యామసుందరరావుకి ఫోన్ చెయ్యటం అతను రత్తాలు గురించి చాలా గొప్పగా మాట్లాడటమే గాకుండా, రత్తాలు శీలవతి అని చెప్పి, ఆమెకు తప్పకుండా ఏదైనా పని చూపించమనేసరికి రత్తాలుపై కృష్ణకి కూడా గౌరవమేర్పడి, రాంబాబు పంపించిన డబ్బులు రత్తాలుకే ఇద్దామని నిర్ణయించుకుంటాడు.

ఇలా జరిగిన తరువాత రత్తాలు కృష్ణని కలుస్తుంది. నిన్ను బంధించిన కంపెనీ వాళ్ళకు వెయ్యిరూపాయలిస్తే వాళ్ళు నిన్ను విడిపిస్తారా? అని కృష్ణ రత్తాలుని అడిగి రాంబాబు నిన్ను విడిపించటం కోసం డబ్బులు పంపించాడని చెప్తాడు. ఆమాట విన్న రత్తాలు పొంగిపోతుంది, దుఃఖిస్తుంది. రాంబాబు పంపించిన వెయ్యిరూపాయల్ని కృష్ణ రత్తాలికి ఇవ్వబోతే, రత్తాలు ఆడబ్బు తనకొద్దని, తన రెక్కల కష్టంమీద, తాను బతుకుతానని చెప్తుంది. కృష్ణ రత్తాల్ని తన అక్క రాధ ఇంట్లో వంట మనిషిగా కుదురుస్తాడు.

రాధమ్మ కృష్ణ కంటే పెద్దది. ఆమెకు వేలువిడిచిన మేనత్త కొడుకు గోపాలరావుమంచి అందగాడు, తెలివైనవాడు, ఇంజనీర్. చిన్నప్పటి నుండే రాధ ఇతనిపై మనసు పెంచుకుంది. పెళ్ళికి ముందే ఓ అమ్మాయితో సంబంధం పెట్టుకుంటే అందరూ కలసి ఆబంధాన్ని విడిపించి రాధ, గోపాలరావుకి పెళ్ళి చేస్తారు. రాంబాబుకి మందులు కొంటం కోసం రత్తాలు యాభైరూపాయలకు లాడ్జింగ్‌లోకి వెళ్ళింది ఈ ప్రబుద్ధుని దగ్గరకే. రాధ, గోపాలరావులకి ఇద్దరు పిల్లలుగూడ. కాంట్రాక్టు పనుల అవినీతిలో కూరుకుపోయి గోపాలరావుజైలు పాలయ్యాడు.

రత్తాలు రాధమ్మ వాళ్ళింట్లో వంటమనిషికంటే, ఇంటి మనిషిగా పిల్లల అభిమానాన్ని పొందుతుంది. రాంబాబు ఆసుపత్రిలో ఉన్నప్పుడు పరిచయమైన ముసలాయన రాధమ్మ వాళ్ళ ఇంటికి పిల్లలకు చదువు చెప్పే మాస్టారుగా రావటంతో పిల్లలతోపాటు రత్తాలుగూడా కొంత అక్షరజ్ఞానం సంపాదిస్తుంది.

రత్తాలు రాధమ్మ వాళ్ళింట్లో వంట పనికి కుదిరి దాదాపు సంవత్సరం గడిచిపోతుంది. సింహాచలం కేసు గురించి రత్తాలు కోర్టుకు హాజరు కావలసి ఉంటుందని ఒక రోజు పోలీసు ఆమెకు సమన్లు అందిస్తే రత్తాలు గాబరా పడుతుంది. రాధమ్మ ఓరోజు దుఃఖంలో రత్తాల్ని తనకు ఆత్మీయురాలుగా భావించి తన జీవిత సంఘటనలు; భర్తకు సంబంధించిన విషయాలు చెప్తుంది. అంతేగాకుండా అవినీతి పనులవలన తన భర్తకు మూడు సంవత్సరాలు శిక్షపడి ప్రస్తుతం జైలులో ఉన్నాడని చెప్తుంది. రాధమ్మ దగ్గర రెండురోజులు ఏదో పని ఉందని సెలవు తీసుకొని మర్నాడు పొద్దున్నే రత్తాలు ప్రయాణానికి సిద్ధమవుతుండగా ముత్యాలును దీసుకొని రిక్షా జోగులు రత్తాలున్న ఇంటిముందుకొచ్చేసరికి రత్తాలు ఆ రిక్షాలోనే బయలుదేరుతుంది.

తనకు సహాయం చేస్తానని ఒట్టెయ్యమని ముత్యాలు రత్తాలుచేత ఒట్టు వేయించుకుంటుంది. నిన్న సింహాచలం; కంపెనీకి అమ్మితేనే ఓనరమ్మ కొన్నదని చెప్పి, నరసమ్మ కంపెనీ పరిస్థితి ప్రస్తుతం బాగోలేదని, చెప్తుంది. "మారేసికం వేసుకొని అయ్యాళీ నీ కాడికొచ్చినోణ్ణి పోల్చనేననేస్తే తీరిపోద్ది' అని అడ్డబుర్రను దృష్టిలో బెట్టుకొని ముత్యాలు కేసు గురించి చెప్తే దానికి అంగీకరిస్తుంది రత్తాలు. ముత్యాలు ద్వారా నరసమ్మ పంపిన డబ్బుని రత్తాలు తిరస్కరిస్తుంది. కార్యం సాధించుకొచ్చామని ముత్యాలు కంపెనీకెళ్ళి నరసమ్మకు చెప్తుంది. కాని తాను చేస్తున్న పనికి ఆమె చాలా దుఃఖిస్తుంది.

కోర్టువారికి రత్తాలు మొదటి నుండి జరిగిన సంగతుల్ని చెప్పింది. కేసు రెండ్రోజులు విచారణ జరుగుతుంది. మూడోరోజు డాక్టరు సాక్ష్యం అయ్యాక రత్తాల్ని వెళ్ళిపొమ్మని కోర్టువారు చెప్తారు. సింహాచలానికి మినహాయించి అందరకు శిక్ష తప్పిపోతుందని చెప్పి, రత్తాలి సహాయానికి ముత్యాలు కృతజ్ఞత తెలియజేసి మళ్ళీ తీరుబడిగా కలుద్దామని చెప్పి గంగరాజు ఎస్సై దగ్గరకు వెళ్తుంది.

ముత్యాలు వల్లే తన జీవితం ఈ మాత్రమన్నా స్థిరపడిందని రత్తాలు రాధమ్మ ఇంటికి తిరిగివస్తూ అనుకుంటుంది. రాంబాబు, కృష్ణలకు కూడా రత్తాలు మనస్సులో కృతజ్ఞతలు తెలుపుకుంటుంది. రాధమ్మ పిల్లలను తలుచుకొని "అంతమంచి పిల్లలు తనక్కూడా ఉంటే" అని ఆలోచిస్తుంది.

రత్తాలు రాధ ఇంటికి తిరిగివచ్చే సరికి ఆ ఇంటి పరిస్థితి పూర్తిగా మారిపోతుంది. రాధ భర్త గోపాలరావు జైలునుండి విడుదలవుతాడు. ఆ ఆనందంతో ఇంట్లో పెద్ద పార్టీ ఏర్పాటయ్యింది. ఆపార్టీకి వసంతగూడా హాజరవుతుంది. రాంబాబు మందులకోసం తిరిగిన నాటి రాత్రి తనను యాభై రూపాయలకు కుదుర్చుకున్న వ్యక్తే రాధమ్మ భర్త అని రత్తాలు గుర్తుబట్టి ఇకనాకిక్కడ స్థానం లేదని గాబరాపడుతుంది.

రత్తాలు త్వరగా వచ్చినందుకు రాధ సంతోషిస్తుంది. పిల్లలు రత్తాల్ని "డాడీ అదే రత్తాలు, మన పనిమనిషి" అని చెప్తారు. కృష్ణ రత్తాల్ని పలకరించి "మీ రాంబాబు గూడా కలెక్టరయ్యాడు" తెలుసా నీకు అని అంటం జరిగాక గోపాలం రత్తాల్ని జూసి "నేనిదివరికెక్కడో చూసినట్టున్నాను, రాంబాబుకి రెలెటివా?" అని కృష్ణని అడగటంతో ఒక్కసారిగా రాధమ్మకి, రత్తాలిపై ఉండే అభిప్రాయంలో పెనెమార్పు చోటు జేసుకుంటుంది.

రత్తాలు తన భర్తను వలలో వేసుకుంటానికి ప్లాను ప్రకారం ఇక్కడ కొచ్చిందా; అని రాధమ్మ కలవరపడి, రత్తాల్ని వెంటనే ఇంటినుండి పంపించాలనుకుంటుంది. రత్తాలు గూడ తను ఇక్కడ నుండి ఎంత తొందరగా వెళ్ళిపోతే అంత మంచిదనే అభిప్రాయానికి వస్తుంది.

ఆపార్టీలో హఠాత్తుగా వసంతని చూసేసరికి రత్తాలు చేతిలోని ట్రే క్రిందపడిపోతుంది. 'అమ్మో ఇదెలా వచ్చింది ఇక్కడికి? ఇది పెద్ద ప్రాస్టిట్యూట్' అని వసంత రత్తాలు గురించి రాధకు చెప్పేసరికి రాధ శివమెత్తి పోతుంది. వసంతకి రాధతో చనువు తక్కువ. అయినప్పటికీ తన బావ జోగులు రైతులతో పొలం తగాదాల్లో ఇరుక్కుంటం వల్ల తన పెళ్ళి అతనితో తప్పిపోయిందనే ఆనందంతో, తనకు టీచరు ఉద్యోగం వచ్చి స్వతంత్రత ఏర్పడిందనే సంతోషంతో, రాంబాబు ట్రయినింగ్‌కి ఈ ఊరే వస్తున్నాడనే పరమానందంతో వసంత రాధతో దగ్గరగా ఆరోజు మాట్లాడగలిగింది.

మర్నాడు తెల్లవారుతుందనగానే రత్తాలు ఆ ఇంటి నుండి వెళ్ళిపోటానికి సిద్ధపడుతుండగా రాధమ్మ చూసి రత్తాల్నివెళ్ళిపొమ్మని చెప్తుంది. తన జీవితం గాలికెగిరే గాలిపటంగా మారిపోయిందని రత్తాలు భయపడి, అక్కడినుండి నిష్క్రమిస్తుంది.

## 5. సొమ్ములు పోనాయండి

ఈనవల 1980 సెప్టెంబరులో 'స్వాతి' సచిత్ర మాస పత్రికలో అనుబంధ నవలగా వచ్చింది. మళ్ళీ 'స్వాతి' వారపత్రికలో 22-10-1993 నుండి 26-11-1993 వరకు ధారావాహికంగా ప్రచురింపబడింది. 'అరుణా పబ్లిషింగ్ హౌస్' వారు 1981లో దీనిని ముద్రించారు.

'తన చిన్ననాటి నేస్తం' అబ్బూరి వరదరాజేశ్వరరావుకి రావిశాస్త్రి దీనిని అంకితమిచ్చారు.

దాసరి సన్యాసి కొడుకు దాసరి బోడెయ్య జైలులోనే ఉండి ఈ"సొమ్మలు పోనాయండి" ఇతి వృత్తాన్ని వివరిస్తాడు. ఊరి ప్రెసిడెంట్ దగ్గర మూడు వందలు బాకీగా తీసుకొని, తుంపాల సంతకెళ్ళి చౌకగా బేరమాడి మూడు వందలకే జత దున్నపోతుల్ని కొనుక్కొచ్చాడు బోడి. ఆమూడు వందలకు నెలకి నూటికి పాతిక రూపాయల చొప్పున వడ్డీ చెల్లించేట్టుగా, మొత్తం ఆరు వందలకి కర్ణం చేత నోటు రాయించాడు ప్రెసిడెంటు.

సంకు రాత్రి వెళ్ళిన ఐదోనాడు దున్నల్ని కొంటే, శివ రాత్రి వెళ్ళిన నాలుగోనాటికే దొంగలు తోలుకుపోయారు.ప్రెసిడెంటే తన మనుషుల ద్వారా ఇలా చేయించాడనే అనుమానం. చుట్టుపట్ల అన్ని ఊళ్ళు గాలించినప్పటికి ఎక్కడా పోతుల ఆచూకీ తెలియదు.

ఎకరా నలభై సెంట్ల భూమున్న బక్కరైతుకూలీ దాసరి బోడి. భార్య ముగ్గురు పిల్లలతో గలిసి గుట్టుగా కాపురం నెట్టుకొస్తున్నాడు. బోడితోడల్లుడు జగిలీడ, అతని బావమరిది, కష్ట సుఖాల్లో తోడు నీడగా ఉంటుంటారు.

ప్రెసిడెంటు, అతని అన్నకొడుకులను మినహాయిస్తే, ఆఊరు ఊరంతా గోచిపాత రాయుళ్ళే.దరిద్ర నారాయణులే. అన్ని అవలక్షణాలున్న ప్రెసిడెంటుకు పోలీసులు, ప్లీడర్లు, చెవులు, కళ్ళలాగ సహాయపడుతుంటారు.

జతపోతులు పోయినందుకు పోలీసు రిపోర్టు ఇద్దామని అనుకొని మళ్ళీ మానేస్తాడు బోడి. సొమ్మలు పోయిన పదిరోజులకి ప్రెసిడెంటు బోడికి కబురు పెట్టి, తన ఆరువందలు వారం రోజుల్లో కట్టాలని, లేకపోతే జరగబోయే దానికి కాస్కోమని ప్రెసిడెంటు గదమాయించే సరికి బోడి నవనాడులు కుంగిపోతాయి.

బోడి భార్య సంద్రాలు ఈమోసానికి తట్టుకోలేక ప్రెసిడెంటుని తిడితే, ప్రెసిడెంటు అన్నకొడుకు మిరపకాయల సిన్నారావు సంద్రాల్ని పైటలాగి గుండెల మీద తంతాడు. బోడి అందుకు ఆగ్రహంతో సిన్నారావుని కర్రతో కొడతాడు. సిన్నారావు అన్న బోడితల పగల గొడతాడు.

దెబ్బల్నుండి కోలుకున్నాక మూడోనాడుబోడి ఊరి పెద్దలకి ఈ విషయం మొరబెట్టుకుంటాడు. కర్ణం, మున్సబులు అంతా ప్రెసిడెంటు తొత్తులే గనుక పెద్దమనుషులెవరు ప్రసిడెంటుని గాని, వాడి అన్నకొడుకుల్నిగాని విచారణ దగ్గరకు పిలవలేదు. బోడి ఆరు వందల డబ్బులు విషయం గురించి అడిగితే, ఇది వాళ్ళ పరిధిలో లేదని, ప్రెసిడెంటు, తను, చూసుకోవాలని, లేకపోతే కోర్టు ద్వారా తేల్చుకోవాలని ఆధర్మాత్ములు సెలవిస్తారు.

ఆ తరువాత సిన్నారావు కేసు పెట్టటం వలన, మూడు వారాలకే బోడిని, సంద్రాలుని, వీళ్ళకూతురు 'సిలుక'ని ఎస్సై స్టేషన్‌కి పిలిపిస్తాడు. తోడుగా బోడి బావమరిది గూడ స్టేషన్‌దాక వెళతాడు. అప్పుడు పోలీసాకతను సిన్నారావుని మీరు 'సితక్కొట్టటం' వలన మీ ముగ్గురిమీద అరెస్టు వారంట్లు ఉన్నాయి. జామీనుమీద తప్పితే మీరిక్కణ్ణుంచి వెళ్ళలేరని చెప్పేసరికి వారు బోరున విలపిస్తారు.

ఈకేసు వ్యవహారమంతా నడవటానికి తెరవెనుక సూత్రధారి ప్రెసిడెంటే. పోలీస్‌స్టేషన్‌లో వున్న వీళ్ళకి తన ప్రతాపం చూపించటానికి సిన్నారావు అక్కడికి వస్తాడు. బోడి అతనిమీద కలబడేసరికి, బోడిని జైల్లో వేస్తారు. చివరికి బ్రోకర్లతో రెండు వందలకి మాటాడుకొని, జామీను తీసుకొని, నానాయాతనబడి బోడివాళ్ళు ఇల్లు చేరుకుంటారు.

కేసు వాయిదాలు నడుస్తూ ఉంటాయి. జగిలీడు కొంత డబ్బు బోడికి సర్దుతా ఉన్నాడు. జగిలీడు దగ్గర తీసుకున్న డబ్బులికి బోడి నోటు రాయించి ఇస్తాడు. ఇంతలో ప్రెసిడెంటు వాళ్ళు బోడికి అతని బావమరిది, జగిలీడుల సహాయంగూడ అందకుండా చెయ్యటం కోసం వాళ్ళమీదు బైండోవరీ కేసు బెడతారు. ఉన్న కాస్త భూమిని బోడి జగిలీడుకి అమ్మజూపుతున్నాడని, ప్రెసిడెంటు తన ఆరు వందలు వసూలు జేసుకుంటానికై బోడి పొలాన్ని జప్తు చేయిస్తాడు.

బ్యాంకు లోను తదితర కారణాలవలన జగిలీడు కొంత వెనక్కి తగ్గి, బోడినిగూడ ప్రెసిడెంటుతో రాజీపడమని చెప్పటమేగాక; ఇక తాను ఆర్థికంగా ఏ విధంగాను సహాయ పడలేనని చెప్పేసరికి బోడి ఇంకా దిగులుపడతాడు. అప్పుడు బోడికి; జగిలీడుకి బావమరిదియైనతడు, బోడికున్న భూమిలో నలభైసెంట్లని జగిలీడు పెట్టిన పెట్టుబడికింద రాయించు కోమని రాజీజేస్తాడు. దానికిష్టపడి, జగిలీడు మరికొంత డబ్బు సర్దుతాడు. ఈ డబ్బుతో బోడి ఆరువందల నోటు తాలూకా కేసుకి తాను సన్నకారు రైతునని ఎదురు వాదించటానికి ప్లీడరును బెడతాడు.

బోడి కూతురు 'సిలుక' చక్కని చుక్క. కేసుల వాయిదాలప్పుడు కామం కళ్ళకెగదట్టిన మానవ మృగాల దుర్మార్గానికి సిలుక బలైపోతుంది. సిలుక సింహంలా పోరాడి బలైపోయిందేగాని, మానభంగానికి తలొగ్గలేదు. అందుకనే "అయిదు కుక్కల్తో మేకపిల్ల ఏటి పోట్లాడుద్దండీ"అని కూతురు శవాన్ని జూసి గుండెలు అవిసేలా విలపిస్తాడు బోడి. ఇంతలో జగిలీడు, అతని భార్య బైండోవరీ కేసుకి ఒప్పుకుని కోర్టుల గోల నుండి తప్పుకుంటారు.

జగిలీడు అంతకు ముందు బోడిచేత రాయించుకున్న ప్రోనోటుని ప్రెసిడెంటు పేర ట్రాన్స్‌ఫర్‌చేసి బోడికి పెద్ద ప్రమాదందెచ్చి పెడతాడు. ఆ హక్కుతో ప్రెసిడెంటు, ఆ భూమిని తనకు రిజిస్ట్రేషన్ చెయ్యమని, లేకపోతే దావా వేస్తానని బోడికి నోటీసు పంపిస్తాడు. అయితే ఆ పొలాన్ని జగిలీడు కొనలేనంటే, మా బావమరిది దగ్గర డబ్బు పుచ్చుకొని, ఆ భూమిని అతనికి స్వాధీన పరిచానని బోడి ప్రెసిడెంటు పంపిన నోటీసుకు జవాబు పంపిస్తాడు.

సిన్నారావు కొట్లాట కేసులో బోడికి ఆరునెల్ల జైలు శిక్ష, నాలుగు వందల జరిమానా పడుతుంది. ఈ కేసులు గొడవలతో దిగాలుపడిన సంద్రాలు, ఇక ఈ ఊళ్ళో మనం బతకలేం, ఏదైనా పట్నమెళ్ళి బతుకుదామని బోడితో చెపితే, అతను అందుకు అంగీకరించడు.

ప్రెసిడెంటు ప్రోనోటు కేసు డిక్రీ అవుతుంది. ప్లీడరు బోడికి, తొంభైపాళ్ళు ప్రెసిడెంటే నెగ్గుతాడని గూడ చెపుతాడు. ఆ తరువాత కర్ణం బోడిని పిలిచి, నువ్వు కేసు గెలిచినా, ఓడినా, నలభై సెంట్లు నీకు దక్కదు గనుక రాజీ చేసుకోమని సలహా ఇస్తాడు. చివరికి ఇరువర్గాలు అన్ని కేసుల్ని రాజీద్వారా పరిష్కరించుకుంటానని అంగీకరిస్తారు.

అసలు ఇదంతా కూడ "సీపురుపిల్లి సి(న్నామ్మూరితి" (పెసిడెంటు దగ్గర తనఖా బెట్టిన భూమికి, (పెసిడెంటు భూమికీ మధ్య బోడి పొలం నలభై సెంట్లు అడ్డుగా ఉండటంవల్ల, దానిని తన పొలంలో కలిపేసుకుని, మొత్తం ఏకాచదరంగా ఒకే ముక్కగా చేసుకోవాలని (పెసిడెంటు అనుకోవడంవల్ల ఇంత గ్రంథం నడవవలసి వచ్చింది. అనుకున్న ప్రకారం అన్ని కాయితాల మీద ప్లీడర్ల సమక్షంలోనే సంతకాలు జరిగినాక, రెండవరోజు కర్ణం; పొలాన్ని కొలిసి, ముప్ఫై సెంట్లే ఉందనే సరికి మళ్ళీ కథ మొదలుకొస్తుంది. బోడి, అతని బావమరిది కర్ణంమీద మండిపడతారు. కర్ణంతో నలభైసెంట్ల భూమికి ఒప్పుకుంటే రాజీ లేకపోతే, "కోరుటు డిక్కరీ".... గాని మరొకటి గాని "అణ్ణిమట్టుకు నాభూవిల అడుగెట్టనీయను"అని బోడి తెగేసి చెపుతాడు.

మరి వారం రోజుల తరువాత (పెసిడెంటు పోలీసువాళ్ళతో ఏదో దుర్మార్గపు ఆలోచనలు జేస్తున్నాడనే పోలీసు సమాచారాన్ని బోడి తన బావమరిది కందించి, తను అపస్మారక స్థితికి లోనవుతాడు. విపరీత జ్వరం, పిచ్చిపిచ్చిగా మాటాడుతూ ఐదు రోజులు అలానే ఉండిపోయి, ఆ తరువాత కొద్దిగా స్వస్థపడతాడు బోడి.

(పెసిడెంటు మనకు పెద్ద ప్రమాదం తెచ్చిపెట్టే ప్రయత్నంలో ఉన్నాడని బోడి బావమరిది బోడికి, మిగిలినవారికి చెపుతాడు. బోడికి జ్వరం తగ్గిన ఆరోనాడు (పెసిడెంటు మనుషులు అన్ని హంగులతో లారీమీద వచ్చి బోడి పొలాన్ని దున్నటం ప్రారంభిస్తారు. ఈ దృశ్యం జూసిన బోడి కొడుకు తండ్రికి ఈ వర్తమానం అందిస్తాడు. "ఓరి పెసినెంటు నంజికొడకా" అని బొబ్బరిస్తూ అంత జబ్బులో గూడ బోడి గొడ్డలితో (పెసిడెంటు మనుషులమీద తిరగబడతాడు. బోడి భార్య, జగిలీడు, బోడి బావమరిది అంతా వాళ్ళమీద తిరగబడతారు. అయితే ఈ కొట్లాటలో మొదటిగా బోడి భార్య సం(దాలు అసువులు బాస్తే; ఆ వెంటనే (పెసిడెంటు అన్న కొడుకు సిన్నారావుని బోడి అంతం జేస్తాడు. కొన ఊపిరితో కొద్ది సేపున్నా జగిలీడు గూడ మరణిస్తాడు. జగిలీడు భార్యకి; బోడి బావమరిదికి, బోడికి గూడ తీవ్ర గాయాలవుతాయి. సం(దాలు మరణంతో ఊరంతా తిరగబడి కొట్లాటలోకి దూరి పదిమందిని చంపుతారు. ఇక తట్టుకోలేక (పెసిడెంటు మనుషులు పారిపోతారు. నేలనేలంతా రక్తమయమవుతుంది. ఆగ్రహోదగ్రులైన ప్రజలు (పెసిడెంటుని అరెస్టు జేసినా, అతనికి జామీనిచ్చారుగాని, బోడి వాళ్ళకు మాత్రం జామీను ఇవ్వలేదు. కాని తనకు జామీనివ్వకపోతే జైలు గోడలు పగలగొట్టైన బయటకు వెళ్ళి "ఆ పెసిడెంటు గోణ్ణి నరుకుతా"నని తీవ్ర నిర్ణయం దీసుకుంటాడు బోడి. బోడికి, అతని వర్గానికి జరిగిన తీవ్ర అన్యాయమే, అతనీ నిర్ణయం తీసుకుంటానికి కారణమవుతుంది.

## 6. మూడు కథల బంగారం

ఈ నవల 14-05-1982 నుండి 26-11-1982 వరకు 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా వెలువడింది. పేరుకి మూడు కథల బంగారం అని ఉన్నా 'వియత్నాం విమల వృత్తాంతం' గూడ దీనిలో ఉంది. అరుణా పబ్లిషింగ్ హౌస్‌వారు 1982లో దీనిని ముద్రించారు. రావిశాస్త్రి తనకు ఆత్మీయమిత్రులైన శ్రీ తుమ్మల వేణుగోపాలరావుకి, శ్రీ చలసాని ప్రసాద్‌కి ఈ నవలను అంకితమిచ్చారు.

## వియత్నాం విమల వృత్తాంతం

రైల్వేలో జూనియర్ ఇంజనీర్‌గా ఉద్యోగంచేసి రిటైర్ అయిన విమల తండ్రికి మొత్తం ఆరుగురు సంతానం. ఇద్దరు మొగ, నలుగురు ఆడపిల్లలు, పెద్దకూతురికి; ఆ తరువాత అమ్మాయికి పెళ్ళి చేయగలిగాడు. ఆయనకు వచ్చే పెన్షన్, బాకీ తాలూకా వడ్డీలకు కట్టడానికే చాలటంలేదు.

స్నేహితుడు కనకరాజు సహాయంతో చిలకల ఆంజనేయదాసు లేఖల ద్వారా సరళాకుమారితో ప్రేమాయణం సాగిస్తుంటాడు. కనకరాజు తండ్రి సరళ వాళ్ళ నాన్నపనిచేసిన రైల్వే ఆఫీసులోనే పని చెయ్యటంవలన కనకరాజుకు సరళవాళ్ళ యింట్లో చనువుంది. దాసుకి ఒక పెద్ద ప్రైవేటు కంపెనీలో ఆఫీసు అటెండర్‌గా ఉద్యోగం.

లేఖల ప్రేమాయణంతో సరళ, దాసుపై అనురాగాన్ని పెంచుకుంది. ఒక రోజు ముందుగా నిర్ణయించుకున్న పథకం ప్రకారం దాసు, సరళ అర్ధరాత్రి లేచిపోతే కనకరాజు ఓ వారం రోజులు తన పిన్నిగారింట్లో వుంచుతాడు.

సరళ దాసుతో లేచివచ్చిన దగ్గర్నుంచి, పెళ్ళి, పెళ్ళి అని గొడవ చేస్తుంది. దాసుకు మాత్రం సరళని పెళ్ళి చేసుకోవాలని లేదు. దాసు తండ్రి దాసుని ఉద్యోగం నుండి సస్పెండు అయ్యేట్టుగా చేస్తాడు. సరళ దాసుతో లేచివచ్చిన పదిహేనో రోజుకల్లా నెలతప్పుతుంది. దాసు సరళను కొట్టి వెళ్ళి పొమ్మంటాడు. తను చావనైనా ఛస్తానుకాని యింటికి మాత్రం వెళ్ళనని తెగేసి చెప్తుంది సరళ. సరళ పెళ్ళి విషయమై దాసు, కనకరాజు, గొడవబడి, కనకరాజు దాసుని చితకబాదుతాడు. కనకరాజుని పోలీసులు అరెస్టు చేస్తారు.

గర్భవతియైన సరళ జరిగిన ఘోరపాపానికి విలవిల్లాడి సముద్రంలో దూకి ఆత్మహత్య చేసుకుంటుంది. ఈ సంగతంగా బయటపడిన తరువాత సరళ చెల్లి విమల, చిలకల దాసు యింటికి వెళ్ళి వాణ్ణి చెప్పుదెబ్బలతో సత్కరించి వస్తుంది.

సరళ చనిపోయిన తరువాత విమల తల్లిదండ్రులకు ధైర్యం చెప్పి; తనూ గుండె రాయి జేసుకొని పిల్లలకు ప్రైవేటు చెప్పటానికి పాఠశాలను ప్రారంభిస్తుంది. విమల తండ్రి ఆమెకు సాధ్యమైనంత తొందరగా పెళ్ళి చెయ్యాలనే ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఎక్కడో ఒక పల్లెటూళ్ళో తొండలు గుడ్లు బెట్టని నాలుగెకరాల పొలం విమల తండ్రికుందనే విషయం ఒక షావుకారు పొలం కొంటానికొచ్చినప్పుడు కరణం ద్వారా తెలుస్తుంది.

ఆ పొలం అమ్మటం వలన విమల తండ్రికి పదివేల రూపాయలు ముడతాయి. శానిటరీ, ఇనస్పెక్టర్ శేషారావు పెద్దకుమారుడు వరహాలుతో విమల పెళ్ళి నిశ్చయమవుతుంది.

విమల తండ్రి అల్లుడికి ఆరువేలు కట్నంగా యివ్వటానికి గూడ అంగీకరిస్తాడు. వరహాలు తండ్రిమాట జవదాటలేని చవట; కట్నం డబ్బుల్లో మూడు వేలు విమల తండ్రి ముందుగానే శేషగిరిరావుకు యిచ్చి నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుంటారు. ఆ తరువాత విమల తల్లికి జబ్బుచేసి, ఆమె మరణిస్తుంది.

శేషగిరిరావు విషయం బాగా తెలిసిన రిటైరు ఉద్యోగి సుందరరావు సలహాపై విమల తండ్రి కట్నం డబ్బులు తగ్గినా, విమల పెళ్ళి చెయ్యటానికి సిద్ధపడతాడు. రాములవారి గుడిలో అర్ధరాత్రి విమల పెళ్ళి. ఎవరెన్ని చెప్పినా ఆ మూడువేలు తనకందనిదే తన కొడుకు; అదే పెళ్లికొడుకు విమల మెళ్ళో తాళిగట్టడని శేషగిరిరావు చెప్తాడు. పీటలమీద పెళ్ళి; పీకల మీదకొచ్చి రభసవుతుంటే విమల ఏడుస్తూ లేచి పెళ్లి పీటమీద నిలబడే "మీరు నాకు పుస్తెకట్టరా" అని విమల పెళ్ళి కొడుకుని నిలదీస్తుంది. "కట్నం ఇచ్చేగానే కట్టేస్తాను" అని పెళ్ళికొడుకు సిగ్గుమాలిన సమాధానం చెప్తాడు. ఆ తరువాత విమల పెళ్ళికొడుకు చెంప ఛెళ్ళుమనిపిస్తుంది. అంతటితో ఆగకుండ అతని చేతిలోని పుస్తెలతాడు లాక్కొని, అతని మెళ్ళో గట్టి "నువ్వు నాకు మొగుడివిగా ఉండలేవు" అంచేత ఇకమీంచి కనీసం నా పెళ్ళాంగా అయినా బతుకు ఫో" అని పెళ్ళి కొడుకుని వెనక్కి తోసేసింది విమల. ఏమైనా నేటి సమాజంలో ఇలాంటి వియత్నాం విమలలు వేలాదిగా పుట్టుకురావలసిన ఆవశ్యకత వుంది.

## బంగారుబాబు కథ

అసలుపేరు బంగారుబాబు కాకపోయినా బంగారుబాబుగానే చెలామణి అవుతున్నాడు, బంగారుబాబు! 'దేముడు ప్లీడరు'గా పేరుపడ్డ న్యాయవాది దగ్గర బంగారుబాబు తండ్రి ఓ 'బీద గుమస్తాగా' పని జేస్తుండేవాడు. బంగారుబాబుకి ఏడవ సంవత్సరం నుండే బంగారం మీద మోజుపెరిగింది.

బంగారుబాబు తండ్రి మొదటి భార్య 'టూరింగువాడితో లేచిపోగా' రెండవ భార్య చనిపోతే మూడోసారి ఒక వంటావిడ కూతుర్ని పెళ్ళాడతాడు. ఈమెకు పుట్టినవాడే మన బంగారుబాబు. బంగారుబాబుకి అక్కా, చెల్లి ఉన్నారు.

ఎలిమెంటరీ స్కూల్లో టీచరుగా పనిచేస్తున్న బంగారుబాబు మేనత్త కొడుక్కి బంగారుబాబు అక్కనిచ్చి పెళ్ళిజేసారు. వీళ్ళక్కకి అత్తా, మామలు లేకపోయినా సవతి అత్తగారు ఉన్నారు. వీళ్ళ బావకి సవతి తమ్ముడు ఉన్నాడు.

అప్పుల బాధలకి తాళలేక బంగారుబాబు తండ్రి, తన భార్య పుస్తెలతాడు తాకట్టుబెడతాడు. వాళ్ళమ్మ మెడలో పుస్తెలతాడు లేకపోయే సరికి 'ఈ జీవితంలో బాధల్ని జయించటానికి బంగారం పనికొస్తుందనే ఆలోచన మొదటిసారిగా తెలుస్తుంది బంగారుబాబుకి. బంగారుబాబు ఫస్టుఫారం చదువుతున్నప్పుడు వాళ్ళ నాన్న చనిపోతాడు. దీనస్థితిలో ఉన్న ఆ కుటుంబాన్ని ఆదుకున్నవాడు బంగారుబాబు బావ.

బంగారుబాబు థర్డ్‌ఫారం చదువుతున్న రోజుల్లో, వాళ్ళ అమ్మ తన పుస్తెలతాడు చెడగొట్టి, వాళ్ళ అక్కకు జత బంగారు గాజులు, చెల్లికి ఒక గొలుసు, చెవులకు ఎర్రరాళ్ళ దుద్దుల జత చేయించింది. బంగారం వాళ్ళ అమ్మ నీళ్ళు తోడుతూ మూర్ఛవచ్చి నూతిలో బడి చనిపోతుంది. అమె దహన సంస్కారాల ఖర్చులకి వాళ్ళక్క, తల్లి చేయించిన గాజులు అమ్మేస్తుంది. 'బాధల్లో బంగారం మనల్ని ఆదుకుంటుంది' అనే ఆలోచన బంగారంలో మళ్ళీ రేకెత్తింది.

బంగారం వాళ్ళ అక్కకి పెళ్ళై ఎనిమిది సంవత్సరాలయినా పిల్లలు కలగలేదనే బాధ వుంది. తనకు పిల్లలు పుట్టే రాత లేదనే బాధతో అమె బావిలో దూకి మరణిస్తుంది.

కామేశ్వరరావు అనే కాముగాడు ఎస్.ఎస్.ఎల్‌సి తప్పి, బంగారానికి క్లాస్‌మేట్ అయ్యాడు. బంగారానికి మంచి స్నేహితుడితను. వాళ్ళ అక్క చనిపోయినాక బంగారంతో పాటు అతని చెల్లి కూడ కామువాళ్ళ యింటికి తరచుగా వెళ్ళేది ఒకవంటావిడ కూతుర్ని బంగారం వాళ్ళ బావ పెళ్ళి చేసుకుంటాడు. బంగారం బావ కొత్త భార్య, పెళ్ళైయిన రెండోనెలకే నెలతప్పే సరికి ఆఇంట్లో ఆనందం వెల్లివిరిసింది. కొత్త పెళ్ళానికి,సవతి తల్లికి మధ్య పేచీలు ఏర్పడతాయి. ఒకరోజు తన బావ కొత్త పెళ్ళానికి, తన చెల్లి కాళ్ళు పిసకటం చూసిన బంగారం గుండె పిసుకున్నాడు.

పొద్దున్నే నిద్రలేచి కామూవాళ్ళ యింటి నుండి తన బావ యింటికెళ్ళే సరికి, వాళ్ళ బావ సవతి తల్లి "ఏరా మీ చెల్లెమ్మ గారు ఏరీ? రాత్రి హరి కథ వింటానికని చెప్పి హారం వేసుకు మరీ వెళ్ళింది. అమ్మగారు" అని అడిగే సరికి గుండె ఆగినంత పనైంది. బంగారానికి. చెల్లి కోసం అంతటా గాలించాడు బంగారం. పోకిరి అలవాట్లున్న బంగారం వాళ్ళ చిన్నబావ, నాలుగురోజుల నాడు సారా సౌఖ్యం కోసం, బంగారు బాబు చెల్లి మెళ్ళో గొలుసు, చెవుల పోగులు కాజేసి ఆమెను పాడు బడ్డ నూతిలో తోసేసాడు. అప్పుడు పోలీసులు బంగారం వాళ్ళ చిన్నబావని అరెస్టు జేసి, బంగారం స్వాధీనం జేసుకుంటారు.

అలా "బంగారానికి మాచెల్లి బలైపోయింది." అని బంగారబాబు తన ఒకటో బంగారం కథ వివరిస్తాడు. బంగారం ఇరుసుమీద ఈకథాచక్రం తిరుగుతుంది. కథాచక్రం దొర్లిన దోవ మాత్రం సామాజిక దుస్థితిలోనే.

## బంగారిగాడి కత

"నేను సోరుల్లో ఓ శిన్నయిారుణ్ణి" అని బంగారి గాడు తన కథను ప్రారంభిస్తాడు.

బంగారి, అమ్మలు, అనే అమ్మాయితో ప్రేమకలాపం సాగిస్తాడు. దాదాపు నలపై తులాల బంగారం, వెయ్యి రూపాయల రొక్కంతో అమ్మలు బంగారిగాడితో లేచిపోయి మోసపోతుంది.

తన దగ్గర నలభై తులాల బంగారం, ఎనిమిదొందలపైన డబ్బు వుంది గాబట్టి, ఈ పిరిస్థితిలో ఎవరి సలహానైన తీసుకుంటే బాగుంటుందని ఆలోచించి తనకు తెలిసిన నరసింహమూర్తి అనే పోలీసు దగ్గరకెళతాడు బంగారం. రెండు బంగారు గాజులిచ్చి, ఇవి అమ్మిపెట్టి తనకు డబ్బులిప్పించమని పోలీసుని అడుగుతాడు. బంగారుగాణ్ణి బంగారం దొంగగా పేపర్లో ప్రకటించబడిన ఫోటోను చూచి పోలీసు వీణ్ణి చితగ్గొట్టి ఎస్సైకి అప్పజెప్తాడు. అమ్మలు తండ్రి అజాగ్రత్త వలన బంగారంగాడికి శిక్ష పడదు.

బంగారు, సత్తరకాయ, సిత్తరలేగ్గాడు ముగ్గురు జాయింటుగా పిక్‌పాకెటింగ్ 'జేబ్‌కాట్' 'బిజినెస్ చెయ్యటం' మొదలెడతారు. బంగారం దొంగసారా వ్యాపారంలోకి మారిపోతాడు. బాగా డబ్బు సంపాదిస్తాడు. ఒకరోజు సినిమాహాలు దగ్గర బంగారానికి 'సూర్రావేడ్డు' కనబడతాడు. సుర్రావేడ్డు దొంగనోట్ల వ్యాపారం జేసే నారాయణకి బంగారాన్ని పరిచయం జేసి, దొంగనోట్ల వ్యాపారంలోకి దింపుతాడు. బంగారాన్ని నారాయన దొంగనోట్ల వ్యాపారానికి 'బాస్' గా నిర్ణయిస్తారు. ఒక గ్రామ ప్రెసిడెంటు

పర్వాతాలుని దొంగనోట్లతో మోసగించి బంగారుగాడు తన సామర్థ్యాన్ని నిరూపించు కుంటాడు. హాయిగా కాలం గడుపుతున్న రోజుల్లో బైరాగి నాయుడు బేరం తగిలింది.

క్రరి పంతులు పెట్టిన ఆశతో తను నానాతంటాలు బడి తెచ్చుకున్న ఐదువేలు పోగొట్టుకొని, జరిగిన మోసానికి కారకుడైన క్రరి పంతుల్ని చంపుతాడు. బైరాగి నాయుడు. బైరాగి నాయుడు ఉదంతం బంగారానికి మనోవేదన కలిగిస్తుంది. తిరుపతికి ప్రయాణమవుతాడు బంగారం. దూదిపులి, బంగారంతో రైలు ప్రయాణం జేస్తున్న వారి సమాచారాన్ని అందించి, ఆ వ్యవహారం ఫలప్రదమైతే తనకూ కూరాకంత వాటా ఇవ్వమని చెప్తాడు. పెళ్ళి బృందమెక్కిన పెట్టెలోనే బంగారం గూడ ఎక్కాడు. ఆబృందంలోని ఓస్త్రీతో చిన్నగా ప్రేమాయణం మెదలెట్టి, బృంద సమాచారం రాబడతాడు. బెజవాడ రైల్వేస్టేషన్‌లో మొత్తం బృందానికి సంబంధించిన బంగారమంతా నిండివున్న సజ్జబట్టుకొని రైలు బండి నుండి బయటబడతాడు బంగారం. బంగారిగాడి జీవితం ఈ సజ్జతో కొత్త మలుపు తిరిగింది.

## బంగారయ్యగారి కథ

1934వ సం॥లో విశాఖ జిల్లా అనకాపల్లిలో పుట్టిన కడవలూరి వీర వెంకట సత్యనారాయణ తన జీవిత సంగ్రహాన్ని ఓమిత్రుని ద్వారా రాయించుకొని మనకు తెలియజేస్తున్న చరిత్రే 'బంగారయ్య గారి కథ' మొదట్లో బస్‌రూట్ల వ్యాపారంలో ఉన్న బంగారయ్య 1969లో గాంధీగారి శతజయంతి సందర్భంగా మద్యపాన నిషేధం అమలులోకి వచ్చేసరికి సారారెంటర్ అవతార మెత్తాడు. ఇక అక్కడి నుండి అతని దశ తిరిగింది. బంగారయ్య చాలాకాలం అవివాహితుడిగా వుండిపోయాడు. బంగారయ్య తన పతనానికి స్త్రీయే కారణం అనిభావిస్తాడు. ఆపతనం వియత్నాం. విమల ద్వారా జరిగింది. తనకు వ్యాపారంలో సహాయపడుతున్న రామచంద్రయ్య అనే అతనికి ఓరోజుగుండెజబ్బు రావటంతో బంగారయ్య అతనిని హాస్పటల్‌లో చేర్చినప్పుడు విమలను చూస్తాడు. తన మిత్రుడి వైద్య సేవల నిమిత్తం ఎంతైన ఖర్చుజేస్తానని నర్సు వియత్నాం విమల ముందు పదివేల రూపాయల కట్టబెట్టి భంగపడతాడు బంగారయ్య. వియత్నాం విమల అతణ్ణి ఆకర్షిస్తుంది. విమలను దగ్గరగా చూసిన బంగారయ్యకు ఇంతకు పూర్వం విమల గూళ్ళోపెట్టి దృశ్యం కళ్ళముందు కదిలాడింది. మీది విశాఖపట్నం గదూ, మీపెళ్ళి జరిగినప్పుడు నేను ఆ గుళ్ళో వున్నాను, అని బంగారయ్య గుర్తుజేసేసరికి విమలలో కొంత మార్పు కనిపిస్తుంది. " ఈమెని పెళ్ళాడితీరాలి, లేకపోతే అంతే నాప్రాణం పోవాలి" అని బంగారయ్య తీర్మానించుకుంటాడు.

ధనాల వజ్రం విమలను గురించి, ఆమె 'మొగోడికి మొగుడువొంటిదిగాని మాముల్ది గాదు' అని చెప్పటమే గాక, నిజమైన వజ్రంలాంటిది అని చెప్పి, బంగారయ్య దగ్గర యాభై రూపాయలు కాజేస్తాడు. తను ప్రముఖ సారా వ్యాపారినని బంగారయ్య విమలకు, జెప్తాడు. తనకు పెళ్ళికాలేదని, తమలాంటి పెళ్ళికూతురు కోసం తాను ఎదురు చూస్తున్నానని బంగారయ్య చెప్పేసరికి విమల ఆశ్చర్యపోతుంది. ఆమె కూడ బంగారయ్యను మోహిస్తుంది.

చిన్నప్పటి పాత సినిమాసీను గుర్తొచ్చి, అలాంటి దృశ్యాల్ని సృష్టించి విమలకు దగ్గరవుదామని బంగారయ్య పథకం వేస్తాడు. కాని వ్యవహారం బెడిసికొట్టి బంగారయ్య ఆసుపత్రి పాలవుతాడు.

ఆసుపత్రిలో పరామర్శ కోసం బంగారయ్య దగ్గర కొచ్చిన విమలను బంగారయ్య ఆప్యాయంగా తన దగ్గరకు లాక్కొని, కథను మలుపు తిప్పుతాడు. మేమిద్దరం భార్యా భర్తలవుతున్నామని ఆసుపత్రిలో అందరికి బంగారయ్య విమలలు ప్రకటిస్తారు. ఇంతకు పూర్వం విమల వివాహం అర్ధంతరంగా ఆగిపోయిన రాముల వారి గుళ్లోనే విమల, బంగారయ్యల వివాహం జరిగింది. పెళ్ళైన మర్నాడు ఎ.సి.గదిలో పడుకుందామంటే ఆరుబయట డాబామీద పడుకుందామని చెప్పటమేగాదు, తనకు సారా కావాలని గూడ విమల చెప్పే సరికి ఆశ్చర్యపోతాడు బంగారం. బంగారయ్య జీవితాన్ని పూర్తిగా మారుస్తుంది విమల.

విమల గర్భవతియై ఏడు నెలలవుతుంది. విమల పెట్టిన షరతు ప్రకారం బంగారయ్య సారా వ్యాపారం మానెయ్యకుండా వేరే వాళ్ళ పేరన చాటుమాటుగా నిర్వహిస్తుంటాడు. బంగారయ్యకు తన జీవితంలో జరిగిన మలుపులన్నీ జ్ఞాపకానికొస్తాయి. తన మోసపు జీవితం గురించి విమలకు తెలిస్తే తనతో కాపురం చెయ్యదేమోననే భయం కలుగుతుంది. దూది పులి కొడుకు తనకు రావాల్సిన వాటాకోసం దొంగలా అర్ధరాత్రి తన ఇంటికి రావటాన్ని బంగారయ్య కళ్ళారాజూస్తాడు.

ఈ సంగతులు విమలకు తెలియగూడదనుకుంటాడు. కాని వీటన్నింటిని విమల గ్రహిస్తుంది. తన గత జీవితపు ముఖ్య ఘటనలన్నీ బంగారయ్య విమలకు చెప్తాడు. విమల, బంగారయ్యలు గుడి దగ్గరకు చేరుకుంటారు. కొన్ని మెట్లు ఎక్కాక విమల ఇక నడవలేనని చెప్పి వైద్యుణ్ణి తీసుకురమ్మంటుంది. బంగారం వైద్యుడి కోసం వెళతాడు.

బంగారయ్య, నర్సు, మంత్రసానితో తిరిగివచ్చే సరికి విమల రక్తపు మడుగులో ప్రసవిస్తున్న దృశ్యం చూసి బంగారయ్య, అక్కడ చేరిన జనం చలించిపోతారు. బంగారం కాజెయ్యటానికి వచ్చిన దొంగ ఆమెను కత్తితో పొడవటం, ఆమె తిరిగి ఆదొంగను పొడవటం, ఇద్దరు ప్రాణాపాయ స్థితికి గురవటం క్షణాల మీద జరిగింది. విమల ఆడపిల్లని కని తనువు చాలించింది. అంతకు ముందురోజే పోలీసు వారికి బంగారయ్య దొంగ ఆస్తుల భోగట్టా అంతా అందించింది విమల బంగారయ్య ఇంటికి వెళ్ళే సరికి పోలీసులు ఇల్లంతా గాలిస్తుంటే బంగారయ్యకు విమల మాటల ఆంతర్యం అప్పుడు అర్థమవుతుంది. విమల బంగారయ్యను పునీతుడిగా మారమని ఒక లేఖ కూడ రాసి ఉంచింది. అది పోలీసులు బంగారానికి అందిస్తారు.

బంగారయ్య కోర్టులో అన్ని తప్పులు ఒప్పుకొని జైలుశిక్ష గూడ అనుభవించి, జైలునుండి విడుదలయ్యాక తన కూతురిలో బంగారానికి బలైపోయిన తన చెల్లెల్ని చూస్తాడు బంగారం. తనవల్ల సర్వనాశనమైపోయిన బైరాగినాయుడు 'ధర్మంచెయ్యి

బాబు" అని తననే అడగటం బంగారం మనసును కలచివేస్తుంది. బంగారయ్య బైరాగి నాయుడుతో కలిసి "దా బైరాగి నాయుడు దా!' ధర్మంకోసం వెళదాంరా!' అంటూ లోకరక్షణకు పూనుకున్నట్లుగా 'మూడు కథల బంగారం' ముగింపును పరిగణించవచ్చు.

**7. ఇల్లు**

రావిశాస్త్రి చివరి నవల 'ఇల్లు' 'స్వాతి' సచిత్ర వార పత్రికలో 11-6-1993 నుండి 01-10-1993 వరకు ధారావాహికంగా ప్రచురించబడింది. 'ఆర్.కె.పబ్లికేషన్స్' (విశాఖపట్నం) వారు దీనిని 1993లో పుస్తకంగా తీసుకొచ్చారు.

తొగరురాతి రమాజ్యోత్స్న తనరెండవ భార్య రాచకొండ రామంలకు రావిశాస్త్రి ఈ 'ఇల్లు' నవలను అంకితమిచ్చారు.

చిట్టెమ్మభర్త కరణం. పిల్లలు లేకుండానే 20సం॥ వయసు నాటికే చిట్టెమ్మ విధవరాలవుతుంది. స్వభావరీత్యా మంచిదే అయినప్పటికి దుర్మార్గుడైన సోమయాజుల చెప్పుడు మాటలకు చెవియొగ్గి చిట్టెమ్మ కోరికోరి కష్టాలు కొనితెచ్చుకుంది. గిట్టని వాళ్ళు సోమయాజులకి ఆమెకు రంకు కడతారు. వాళ్ళ సొంత ఊరిలో కొద్దోగొప్పో పొలాలు ఉన్నా, ప్రస్తుతానికి చిట్టెమ్మకి యావదాస్తి మాత్రం ఇల్లు ఒక్కటే.

సోమయాజులు కౌన్సిలర్. కుట్రలు, కుయుక్తులతో ప్రజల సొమ్ముదోచుకుని, ఎప్పుడూ ఎవరినోఒకరిని ఆర్పేద్దామనే దృష్టితో ఉంటాడు. అందుకనే "సోమయాజులు పరమాలుచ్చాల్లో లుచ్చా" అని చిట్టెమ్మ మేనల్లుడు అరుణ ప్రకాశం ఉద్దేశం.

వంగల అనంతం, భార్యచాటు భర్త. భార్య పెద్దగా కేకలు వేస్తే గజగజవణికి పోతాడు. అసుపత్రిలో చిన్న ఉద్యోగి. "పేడ మీద కాసుబడితే నాలికతో తీసే" వ్యక్తి. పిసినారుల్లో పరమ వీర పిసినారి. అనంతానికి ఇద్దరు కూతుళ్ళు. పెద్దమ్మాయి ఉద్యోగం డబ్బులుగూడ తానే దిగమింగుతూ, ఆమెకు పెళ్ళైతే ఆ కాస్త సంపాదన పోతుందనే సాకులతో ఆమె వివాహాన్ని వాయిదా వేసుకొస్తున్న గొప్ప తండ్రి . చిన్నమ్మాయి జ్యోతిర్మయి చదువుతూ ఉంది. అనంతం తండ్రి గూడ అతని దగ్గర ఉంటాడు. అనంతం భార్య పేరుకు శాంతమ్మే గాని, ఆమె నోరుకు అడ్డు అదుపులేదు. ఆరు సంవత్సారాలు నుండి నెలకి అరవై రూ॥ అద్దె కడుతూ చిట్టెమ్మ ఇంట్లో ఉంటున్నారు అనంతం వాళ్ళు.

సోమయాజుల దుర్బోధవల్లే చిట్టెమ్మ అనంతాన్ని అద్దె పెంచమంటుంది. నెలకి ఒక్కసారే వంద పెంచమంది. అంతేగాకుండా మూడు నెలల క్రితం, ఇంటి అద్దె సక్రమంగా చెల్లించటం లేదు. గాబట్టి, ఇల్లు ఖాళీ చెయ్యమని, ఖాళీ చేసేదాక నెలకి నూటయాభై చొప్పున అద్దె చెల్లించాలని చిట్టెమ్మ అనంతానికి ప్లీడరు నోటీసు పంపించింది నోటీసు అందుకున్న సమయంలోనే అనంతం ఉద్యోగం నుండి సస్పెండు అవుతాడు. సోమయాజులు, చిట్టెమ్మ ఇంటికి వచ్చిన కాసేపటికే కోర్టు జవాను "ఇల్లు ఖాళీ చెయ్యమనే" నోటీసుని అనంతానికి అందిస్తాడు. సోమయాజులు సలహాతో చిట్టెమ్మ ఈకేసుని న్యాయవాది పరమబ్రహ్మశాస్త్రికి అప్పజెప్పింది.

అనంతం భార్య శాంతమ్మ చాల మొరటుగా ప్రవర్తిసుంది. 'పిసినారి ముండాకొడుకు' 'ముష్టిచచ్చిన వెధవా' అని భర్తకు బిరుదు ప్రదానాలు చెయ్యటమేగాదు. దేహశుద్ధి గూడ చెయ్యగల బలశాలి ప్లీడరీ నోటీసంటున్నారేమిటి' అని అడిగిన శాంతమ్మకి చిట్టెమ్మ ఇల్లు ఖాళీ చెయ్యమని దావా వేసిందని భర్త చెప్పేసరికి, ఆమె చిట్టెమ్మను తిడుతూ మూర్ఛపోతుంది.

అనంతం వాళ్ళు డెబ్బైయ్యయిదురూపాయలు అద్దెని పెంచారు, గనుక దానికి ఒప్పుకుంటే బాగుండేదేమోనని చిట్టెమ్మ అనుకుంటుంది. చిట్టెమ్మ అడక్కుండానే సోమయాజులు రెండు వేలు అప్పు బెట్టి, నోటు రాయించుకుని, ఈ నోటుతో కుట్రని కొనసాగిస్తాడు.

దావావ్యవహారాలన్నీ మీరే చూడండి అని చిట్టెమ్మ సోమాయాజులకి చెప్తుండగానే "బి. సుందరమ్మ ఉరఫ్ చిట్టెమ్మ" పేరుతో పోస్టు వస్తుంది. చిట్టెమ్మ అసలు పేరు సుందరమ్మని సోమయాజులకి అప్పుడు తెలుస్తుంది. ఆసమయంలోనే "అత్తా నాకేమైనా ఉత్తరం వచ్చిందా" అని అరుణ ప్రకాశం అడగటం, "ఇదిగో ఇప్పుడే వచ్చిందని" సుందరమ్మ చెప్పి నాలిక కరుచుకోవటం జరిగిపోతుంది.

అరుణ సోమయాజుల్ని చూసి ఆ ఉత్తరం తీసుకోకుండా వెళ్ళిపోతాడు. అరుణ తన ఆడపడుచుకొడుకని తల్లీకొడుకులు ఇక్కడే ఉంటున్నారని చిట్టెమ్మ చెప్తుంది. ఆశ్చర్యమేమంటే చిట్టెమ్మ భర్త చనిపోయిన రోజే ఆమె ఆడపడుచు వెంకటలక్ష్మి తన నాలుగేళ్ల పెద్ద కొడుకు ఉదయాన్ని తీసుకొని భర్తతో వేగలేక చిట్టెమ్మ భర్త తనకి తమ్ముడే గాబట్టి ఆ ఇంటికి వస్తుంది. భర్త మరణంతో చిట్టెమ్మ నూతిలో దూకబోయేసరికి వెంకటలక్ష్మి ఆమెను రక్షిస్తుంది. భర్త తాగుబోతుగా ఉండి, కుటుంబ పోషణ గూడా చెయ్యకపోయేసరికి వెంకటలక్ష్మి అతణ్ణి వదలి ఇక్కడికి వస్తే; మళ్ళీ ఆభర్త ఇక్కడికి కూడ వస్తాడు. చాలాకాలం తరువాత మళ్ళీ దాంపత్య సుఖాన్ని అనుభవించి వెంకటలక్ష్మి భర్త ఆ రోజే మరణిస్తాడు. అప్పటినుండే ఆమె కడుపులో రెండో బిడ్డ పెరుగుతుంటాడు. ఆ రెండో బిడ్డే ఈ అరుణ ప్రకాశం. పెద్దకుమారుడు ఉదయభాస్కరం బి.ఎ. వరకు చదివి 'ఇది దొంగలరాజ్యమని' ఈ వ్యవస్థని అసహ్యించుకొని అడవుల్లోకెళ్ళి 'అన్న'లతో గలిసి, ఈ దుర్మార్గపు దుష్టవ్యవస్థపై పోరు జేస్తుంటాడు. అతను అప్పుడప్పుడు కొన్ని పనుల నిమిత్తమై బి.సుందరమ్మ ఉరఫ్ చిట్టెమ్మ పేరుతో ఉత్తరాలు రాసి తన తమ్ముడి ద్వారా వాటిని పూర్తి జేసుకుంటుంటాడు. అరుణ తెలివైనవాడు., బి.యస్సీ. చదువుతుంటాడు. అనంతం చిన్నకూతురు జ్యోతిర్మయి, అరుణ ప్రేమించుకుంటారు.

చిట్టెమ్మ అనంతంపై దావా వేసి దాదాపు సంవత్సరం కావస్తుంది. ఇంటికి న్యాయమైన అద్దె నిర్ణయించమని అనంతం గూడ చిట్టెమ్మపై ఎదురుదావా వేశాడు. అనంతం కేసుకోసం రెడ్డినాయుడి ప్లీడర్‌ని బెట్టాడు.

డెబ్బైఐదువేలకి తనకు ఇల్లు అమ్ముతానని చిట్టెమ్మ ఒప్పుకొని, అందుకు అడ్వాన్సుగా తన దగ్గర ఇరవైరెండు వేలు పుచ్చుకున్నట్టు 'దస్తావేజు-క్రయిపురోణి'

తయారు చేయించాడు సోమయాజులు. సోమయాజులు, అనంతం ప్లీడరు, రెడ్డినాయుడి గుమస్తా సూరిబాబుని, కలిసి కేసు పూర్వాపరాలు జెప్పి చిట్టెమ్మ ఇల్లు తనకు దక్కేలా చేస్తే నీకు ముట్టజెప్పేది చెప్పి, ఒక 'గద' (ఫుల్ బాటిల్) కూడా సమర్పించుకుంటానని చెప్పి, ప్రస్తుతానికి ఒక 'అరగద' ఇతర ఖర్చులకుగాను యాభై ఇస్తాడు.

సెలవలు లేకపోవటం వలన వాయిదా ఏర్పాటు చెయ్యమని చెప్పి అనంతం కోర్టుకు హజరుకాడు. ఈ అవకాశాన్ని ఆసరా జేసుకొని "అనంతం నెలదినాల తరువాత ఇల్లు ఖాళీ చెయ్యవలసిందిగా ఆర్డర్సు" రావటానికి సూరిబాబు మార్గం సుగమం చేస్తాడు.

నెలరోజుల గడువు తీరినాక కోర్టుకు సెలవైన శనివారంనాడు కోర్టువారి బేటామేను తదితరులు వచ్చి ఇల్లు ఖాళీ చెయ్యాలని కేసు సుందరమ్మకు (చిట్టెమ్మకు) అనుకూలంగా వచ్చిందని చెప్పేసరికి శాంతమ్మ గగ్గోలు బెడుతుంది. సెలవురోజున అనంతం వేరే పని ఉండి ఆసుపత్రికి వెళ్ళాడు. కోర్టు ఆర్డర్సు చూసిన జ్యోతిర్మయి ఈ విషయం తన తండ్రితో చెప్పివస్తానని ఆసుపత్రికి పరుగుదీసింది. వెంటనే జ్యోతిర్మయి, అనంతం, ప్లీడరు రెడ్డినాయుడి దగ్గరకు పరుగుదీస్తారు. వచ్చేనెల పదహారో తారీకున కేసుంది, అని సూరిబాబు అనంతాన్ని మోసగించి ఇంతకుముందు చెప్పిన విషయం అప్పుడు బయట పడుతుంది. అయితే సూరిబాబు దీనికి కావలసిన ప్రణాళిక కూడ సిద్ధం చేసుకునే ఉన్నాడు.

ప్రస్తుతానికి ఆ కోర్టు వారిని అడ్డుకుంటం మినహాయించి మరో మార్గం లేదని సూరిబాబు సలహాజెప్పి, ఇదంతా ఆ సోమయాజులుగాడే నడిపిస్తున్నాడని గూడ చెపుతాడు. మీరు అడ్డుకున్నప్పుడు కోర్టువాళ్ళు వెనుదిరగకపోతే, జాకెట్టులు చించుకొని మానభంగం చేసారని కేసు బెట్టమని సూరిబాబు సలహా. ఈ లోపు మనం 'స్టే' ఆర్డరు కోసం ప్రయత్నం చుద్దామని అనంతం దగ్గరున్న మూడొందలు తీసుకుంటాడు.

ఇంటికొచ్చిన అనంతాన్ని చూసి శాంతమ్మ 'దొంగచచ్చినాడా' అని అందరు అదిరిపోయేలా పెనుకేకవేసే సరికి ఆ వాటాల్లో ఉంటున్న అందరు పరుగులు దీసుకొస్తారు. శాంతమ్మ భర్తను తిడుతూ, చొక్కాపట్టుకొని లాగి కింద పడవేస్తుంది. అంతేకాకుండా 'కదిలేరంటే, లంజాకొడకల్లారా, కాళ్ళు చేతులు విరిచేస్తా" నంటూ శాంతమ్మ ఒక రోకలి దీసుకొని, ఇల్లు ఖాళీ చేయించటానికొచ్చిన వాళ్ళమీద తిరగబడే సరికి, సోమయాజులు, చిట్టెమ్మ అందరూ ఎటోళ్ళటు పరుగులు దీస్తారు.

అంతమంది అక్కడున్నా గూడ ఏమాత్రం సంకోచించకుండా జ్యోతిర్మయి ఒక్కసారిగా అరుణని కౌగలించుకొని అలాగే ఉండిపోతుంది. ఈ వింతజూసినప్పటికి శాంతమ్మ ఏమీ అనదు.

అరుణ జోక్యంతో ఇక నుండి నెలకు నూటయాభై చొప్పున అద్దె ఇచ్చేట్టు, ఇప్పటి వరకు అయిన ఖర్చులు ఎవరివి వారే భరించేట్టుగా రాజీమార్గం కుదురుతుంది. అరుణ తల్లి వెంకటలక్ష్మిని క్యాన్సరు చికిత్స కోసం రాయవెల్లూరు ఆసుపత్రికి తీసుకెళతాడు.

గోపికా మనోహరం సుందరంగా ఉండటం వల్ల ఆయన్ని అందరూ 'సౌందరిగోరు' అంటారు. అతని పెద్దకూతురు అల్లుడు అమెరికాలో స్థిరపడితే, చిన్నకూతురు మెడిసిన్ చదువుతుంది. ఒకే ఒక్క కొడుకు అమెరికాలో ఎం.బి.ఏ. పూర్తిజేసుకొని బారతదేశం రాబోతున్నాడు. ఊరి పొలిమేరల్లో తోటలు ఊళ్ళోని పోష్ ఏరియాల్లో ఇళ్ళ స్థలాలు కొంటున్నాడు మనోహరం. మనోహరానికి సంబంధించిన ఈ వ్యవహారాలన్నీ గవర్రాజు చూస్తూ, స్వామికార్యం, స్వకార్యం సరిపెట్టుకుంటున్నాడు. గవర్రాజు, మనోహరం చిట్టెమ్మ ఇంటిని చూస్తారు. ఒక డబ్బైవేల దాకా అయితే ఆ ఇంటిని కొనవచ్చని మనోహరం గవర్రాజుతో చెప్తాడు. వీళ్ళిద్దరు చిట్టెమ్మ ఇంటికి రావటాన్ని ఆ దారిలోనే ఉన్న సోమయాజులు గమనిస్తాడు. బయటకు వెళ్ళిన గవర్రాజు మళ్ళీ వెనుతిరిగి వచ్చి "సూడు సిట్టెమ్మ తల్లీ, మనోహరం సౌందరి పులిసున్నాడు, లక్షకి తగ్గవద్దు" అని చెప్పి ఆపైన వచ్చిన సొమ్ము చెరిసగం అని చిట్టెమ్మకు సలహా ఇచ్చివస్తాడు.

లక్ష రూపాయలనే సరికి చిట్టెమ్మకు ఆశ కలిగింది. చిట్టెమ్మ దగ్గరకు సోమయాజులు వస్తాడు. మాటల సందర్భంలో ఇల్లూ, భూములు అమ్మి సగం డబ్బులు అరుణకి ఇచ్చి, మిగతాది బ్యాంకులో వేసి, తాను, వదిన కాశీకి వెళతామని సోమయాజులతో చెప్తుంది. "మరింక రణరంగంలోకి దిగితీరా"లని సోమయాజులు నిర్ణయించుకుంటాడు. క్షేమంగా రాయవెల్లూరు చేరినట్లు ఆ సమయంలోనే అరుణ నుండి టెలిగ్రాం వస్తుంది. వెంకటలక్ష్మికి 'పుట్టుకురుపు' (క్యాన్సరు) జబ్బని చెప్పి, ఆమె దిగులంతా మూడు సంవత్సరాలనాడు కలకత్తా వెళ్ళిన పెద్ద కొడుకు ఉదయం గురించేనని సోమయాజులుతో చెప్తుంది. అంతేగాక, ఆ ఉదయం అడవుల్లో ఎవరితోనో చేరి ప్రభుత్వంపై యుద్ధం జేస్తున్నాడని, అతని ఫొటో కోసం 'నిన్న' ఎవరో మా ఇంటికొచ్చి వాకబు చేసారని చిట్టెమ్మ చెప్తుంది. ఇంతలో చిట్టెమ్మ పెద్దమ్మ కూతురు 'మాలక్ష్మి' చనిపోయినట్లు ఆ సమయంలోనే ఉత్తరం వస్తుంది.

వెంకటలక్ష్మి తనకు డెబ్బై ఐదువేలకి ఇల్లు అమ్ముతానని 'పురోణి' రాసి, అడ్వాన్సుగా ఇరవై రెండు వేలు తీసుకున్నావు గనుక మిగతా యాభై మూడు వేలు తీసుకొని ఆ ఇంటిని తనకు స్వాధీన పరచమని, ఇల్లు తనకు అమ్మకపోతే దావావేస్తానని సోమయాజులు చిట్టెమ్మకి నోటీసు పంపిస్తాడు. ఆ కాపీ మనోహరానికి గూడ పంపిస్తాడు. ఈ విషయం విని చిట్టెమ్మ మూర్ఛబోతుంది. చిన్న, శాంతమ్మ చిట్టెమ్మని ఓదారుస్తారు. ఇరవైరెండు కాదు, తాను రెండువేలే తీసుకున్నానని, కాని చాలా కాయితాల మీద నమ్మకం కొద్ది సంతకం చేసానని చిట్టెమ్మ చెపుతుంది. ఇంతలో గవర్రాజు అక్కడకొచ్చి భయపడాల్సిన పనిలేదని చెప్పి మనోహరాన్ని చిట్టెమ్మ ఇంటికి తీసుకొస్తాడు.

సోమయాజులు పోస్ట్‌మేన్‌కి మస్కాగొట్టి 'బొల్లాప్రగడ చిట్టెమ్మ ఉరఫ్ సుందరమ్మ' పేర వచ్చిన ఉత్తరాన్ని కాజేస్తాడు. పోలీసుగా డిపార్టుమెంటులో ప్రవేశించిన చిటికెల చిట్టికన్నబాబు ప్రస్తుతం డియ్యస్పీగా ఉద్యోగం జేస్తూ ఏ.యస్పీ కోసం కలలు గంటున్నాడు. సోమయాజులు చిట్టిబాబుని కలసి చిట్టెమ్మ పేర వచ్చిన ఉత్తరాన్ని ఇచ్చి, అరుణప్రకాశం

గురించి చెప్పి, తన ఇరవై రెండువేల నోటుని చిట్టిబాబుకి ఇస్తే, ఆనోటు రెండువేలదేనని చిట్టిబాబు గమనిస్తాడు.

ఆ ఉత్తరాన్ని బిట్టిబాబు చదువుతాడు. ఆ ఉత్తరంలో మరో చిన్న కవరు ఉంటుంది. దానిని శివాలయం గేటు దగ్గర కొచ్చే మరో వ్యక్తికి అందించమని అరుణప్రకాశానికి సూచన. చిట్టిబాబు ఆ రెండో ఉత్తరాన్నిగూడ చదివితే, దానిలో ఆదివారం శివాలయం గుడి దగ్గర దిగే ముఖ్యమంత్రిని అంతం జేసి, అ దగ్గరలోనే 'వి.వి. 2526 నెంబరు స్కూటరుతో ఎదురుజూస్తున్న మా దగ్గరకు రావలసిందని ఉంటుంది. రెండో ఉత్తరంలోని విషయాన్ని సోమయాజులకి చెప్పకుండా, ఉదయభాస్కరాన్ని పట్టిచ్చిన వాళ్ళకి పాతికవేల బహుమానం; అందులో నీకు కూడ కొంత ముడుతుందని చెప్తాడు. ఎలాగైనా చిట్టెమ్మని బెదిరించి, ఇల్లు తనకే అయ్యేట్టు చూడమని సోమయాజులు చెప్పి, ఆ నోటు, ఉత్తరాన్ని, చిట్టిబాబు దగ్గర వదిలిపెట్టి వెళతాడు. సోమయాజులు వెళ్ళాక చిట్టిబాబు ఆ రెండో ఉత్తరాన్ని మరోమారు చదువుకుంటాడు.

ఇక వెంటనే బిట్టిబాబు రంగంలోకి దిగి, తన దగ్గరున్న పోలీసులతో ప్రణాళిక సిద్ధం చేసుకున్నాడు. రేప్పొద్దునకల్లా ఆ చిట్టెమ్మని తీసుకొచ్చి గెస్ట్‌హవుసులో ఉంచమని చిట్టిబాబు ఆర్డర్స్ జారీ చేసాడు. ఉగ్రవాదులు ముఖ్యమంత్రిని చంపటానికి పథకమేసారట అని ప్రచారం జరిగింది.

ముఖ్యమంత్రి మర్రిచెట్టుకింద మహాత్మాగాంధీ విగ్రహాన్ని ఆవిష్కరించే ప్రోగ్రాంలో మార్పు జరగలేదు. ముఖ్యమంత్రి కార్యక్రమానుసారం అక్కడకు వచ్చి వేదికపై ఆశీనుడవుతాడు. అప్పుడు 'వర్తకసంఘం కార్యదర్శి శ్రీ వెంకట్రాజుగారి కుమార్తె కుమారి ఝాన్సీలక్ష్మి' పదివేల రూపాయల దండను విరాళంగా ముఖ్యమంత్రికి అందజేయ్యటం కోసం, స్టేజి మీదకు ఎక్కుతుంటే, నూకరాజు అనే పోలీసు ఆమెను గుర్తుబట్టి, "ఆపండి, ఆపండి" అని కేకలు వేసి తుపాకి గుళ్ళకు బలైపోతాడు. ఉత్తరంలోని సంకేతాల ప్రకారం స్కూటర్ నడిపిన చిలకముక్కు కుర్రాడే ఈ అమ్మాయి. సభాస్థలిలోని జనం అంతా ఎటువాళ్ళు అటు పరుగులు తీస్తారు. ఉగ్రవాదులుగా అనుమానించబడుతున్న ఇద్దరు యువతీ యువకులు పోలీసు కాల్పుల్లో చనిపోతారు. ముఖ్యమంత్రికి గుండెపోటు వస్తుంది.

ఈ సంఘటనను నిరశిస్తూ పట్టణ బందు, దోపిడీ, లూటీలు జరిగిన తరువాత డి.ఐ.జీ. జిల్లా ఎస్పీలకు సస్పెన్షన్ ఆర్డర్స్ వస్తాయి. చిట్టిబాబుకి అదనపు జిల్లా పోలీసూపరింటెండెంట్‌గా ప్రమోషన్ వస్తుంది.

పోలీసులు ఆ యువకుని శవాన్ని గుర్తుబట్టి చెప్పమంటే, అతన్ని ఉదయంగా గుర్తిస్తుంది చిట్టెమ్మ. కాని, ఆ శవం ఉదయానిది కాదని చిట్టెమ్మకీ తెలుసు, ఆ శవం ఉదయానిదని ఆమె చెప్తే తనకు పాతికవేలు వస్తుందనే ఆశతో చిట్టిబాబే ఆమె మాటలను అంగీకరిస్తాడు. అరుణ తల్లి వెంకటలక్ష్మి చనిపోయినట్లు టెలిగ్రాం ద్వారా తెలుసుకొని చిట్టెమ్మ వలవల ఏడ్చి, ఇప్పుడన్నా తనని విడిచి పెట్టమని పోలీసులని

అర్థిస్తుంది. లక్ష రూపాయలకైతే చిట్టెమ్మ ఇల్లు అమ్ముతుందనే విషయం ఆమె మాటలద్వారా చిట్టిబాబు గ్రహిస్తాడు. సోమయాజుల్ని మూడోవాటా తీసుకోమంటే అతను చిట్టిబాబు మీద మండిపడి, ఇల్లు మొత్తం తనకే చెందాలంటాడు. ఏప్రిల్ ఒకటిన దస్తావేజులు కొంటే జనవరి ఒకటిన దస్తావేజులు రాసినట్టువున్న తప్పిదాన్ని పట్టుకొని చిట్టిబాబు సోమయాజుల్ని ఈ వ్యవహారం నుండి తప్పిస్తాడు. సో.మ.నా. ఎంటర్‌ప్రైజెస్ వారి పేర చిట్టిబాబు బిట్టెమ్మ ఇంటిని రిజిస్ట్రేషన్ చేయించుకుంటమేగాక, ఆ ప్రక్క ఇంటినిగూడ కొంటాడు.

చిట్టెమ్మ అరుణ పేర లక్షరూపాయల చెక్కును చిన్న చేతుల్లో బెట్టి, అరుణ, చిన్నాలను పెళ్ళిజేసుకొని సుఖంగా ఉండమని చెప్పి, తన ఊరిలోని పొలంగూడ దానిని నమ్ముకున్న రైతులకే ఏదో ఒకధరకి ఇచ్చి కాశీకి వెళదామని, ఆ ఊరివైపు బయలుదేరింది. అక్కడ నుండి చిట్టెమ్మ కాశీకి ప్రయాణమైపోయింది.

అరుణ ప్రకాశం తల్లికి ఉత్తరక్రియలు జరిపించి వచ్చేసరికి చిట్టెమ్మ ఇల్లు సో.మ.నా. ఎంటర్‌ప్రైజెస్ వారి పరమై, ఆ వీధి రూపురేఖలు మారిపోతాయి. అరుణ, జ్యోతిర్మయిల వివాహం జరుగుతుంది. సామాజిక చైతన్యం కోసం, బ్రతుకు తెరువు కోసం వీళ్ళిద్దరూ ఒక చిన్న ట్యుటోరియల్ కాలేజీని ప్రారంభిస్తారు. అలా మూడు మాసాలు జరిగాక ఒకరోజు పోలీసు వేషంలోవున్న ఉదయం అనుచరులు, అరుణ, జ్యోతిర్మయిలను కారులో ఎక్కించుకొని అరణ్య ప్రాంతానికి తీసుకువెళతారు.

అరణ్య ప్రాంతానికి తీసుకెళ్ళినాక అరుణ, జ్యోతిర్మయిల కళ్ళగంతలు ఊడదీసి, అరుణని కొన్ని ప్రశ్నలు వాళ్ళు అడుగుతుంటే అప్పుడు, ఆ వ్యక్తుల్ని మారు పోలీసులని అరుణ గుర్తిస్తాడు. జ్యోతిర్మయి గాఢ నిద్రలో ఉంటుంది. అప్పుడు వాళ్ళు అరుణని 'ఫలానా రోజున ఫలానా శుక్రవారం ఫలానా ఉత్తరం నమ్మక ద్రోహం చేసి, .... ఇద్దరు మా కామ్రేడ్స్ బలి కావటానికి కారకుడివి అయ్యావు. నీకు మరణశిక్ష విధిస్తున్నాం' అని వాళ్ళు చెప్పేసరికి అరుణ ఏమాత్రం జంకక ఆ ఫలానా శుక్రవారం తన తల్లి చనిపోయిందని, అసలు అంతకు ముందు నుండి కూడ తాను రాయవేలూరులోనే ఉంటున్నానని, ఆ ఉత్తరం సంగతే తనకు తెలియదని చెప్పేసరికి, ఆ ప్రశ్నలు వేసిన ఉదయం చలించిపోతాడు. తన తల్లి మరణించిందని తెలిసి అతను బాధపడతాడు. తరువాత అరుణని, జ్యోతిర్మయిని విడుదల చేస్తారు.

రావిశాస్త్రి నవలలు మంచికి ఉపకారం; చెడుకు అపకారం చేసేవేగాని; మరొక విధమైనవిగావని, ఈ నవలల ఇతివృత్త పరిచయం వల్ల బోధపడుతుంది. ఇతి వృత్తాలననుసరించి పాత్ర చిత్రణను ఎలా చేసారో తరువాతి అధ్యాయంలో పరిశీలిద్దాం.

# 3. పాత్ర చిత్రణ

రైతు; పొలం సారాన్నిబట్టి రుతు క్రమాన్ననుసరించి పైరుని ఎన్నుకుంటాడు. అలానే నవలా రచయిత గూడ ఇతివృత్త స్వీకరణను, సామాజిక కాలమాన పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, పాత్రలను సృష్టించుకుంటాడు. తాను స్వీకరించిన ఇతివృత్తం రక్తిగట్టాలంటే, అయా సన్నివేశాల కనుగుణమైన పాత్ర చిత్రణ గూడ సమర్ధంగా, సామాజిక జీవన గమనాన్ని ప్రతిబింబించేట్టుగా సాగాలి. మనిషి ఆకారాన్ని బట్టి వస్త్రకొలతలు, కుట్టు, వస్త్రధారణ ఉండేట్టుగానే, ఇతివృత్తానికనువైన పాత్ర పోషణ నిర్వహింపబడటం దర్జీపనిలోని మెలకువలను పాటించటం లాంటిది. మొత్తం రూపనిర్మాణ శిల్ప బాధ్యతను రచయిత జాగరూకతతో పోషించుకోవాలి. పాత్రపోషణ నిర్వహణారీతుల్లో కాలానుసారంగా ఎన్నో మార్పులు చోటుజేసుకున్నాయి. వ్యక్తిగత గీతల బరినుండి నవలేతి వృత్తాలు విశాలసామాజిక ప్రాపంచిక దృక్పథాన్ని అలవరచుకున్నాయి. వ్యక్తి సంస్కారం నుండి, సంఘ చైతన్యం వైపు, నవలలు నడిచాయి. ఈ మార్పుని తెలుగు సాహిత్యంలో ప్రముఖంగా స్వాతంత్ర్యానంతర రచనలలో గుర్తించగలం. ఈ మార్పుకు కొంతమేర ఆంగ్ల, రష్యన్, బెంగాలీ, హిందీ అనువాద రచనలు గూడ తోడ్పడ్డాయి. 1950 నుండి తెలుగు నవలా సాహిత్యం నూతన మార్పు వైపు దృష్టి మళ్ళించిందని చెప్పవచ్చు.

ఏ వ్యక్తి "భావాలు స్థిరంగా, మార్పు చెందకుండా ఉండవు. తాము దేశ కాలాలను మార్చుతూ, దేశ కాలాల ప్రభావం చేత తాము మార్పు చెందుతూ, భావాలు ముందుకు సాగుతూ ఉంటాయి. కాబట్టి గొప్ప పాత్రలు నిశ్చితమైన దేశకాలాలను కలిగి ఉంటాయి. దేశకాలాల నుంచి వేరు చేయగలిగిన పాత్రలు వ్యాపార నవలల్లో మాత్రమే ఉంటాయి. కాబట్టి నవలా సాహిత్యంలోని గొప్ప పాత్రలు సమకాలీన సామాజిక భావజాలంలో నుంచి ఉద్భవించినవిగా, వ్యక్తిత్వాన్ని, మానసికమైన లోతునూ కలిగినవిగా ఉంటాయని మనం గుర్తించాలి"[1] అందువలన సమకాలీన సామాజిక స్థితిగతులను సానబట్టి, మరీ రాటుదేలి వచ్చిన పాత్రలేగాని రావిశాస్త్రి పాత్రలు మరోరకమైనవిగావు. స్వాతంత్ర్యం సిద్ధించే నాటికి మూడు పదులు దాటని వయసులో ఉన్న రావిశాస్త్రి అప్పటికే పది సంవత్సరాల రచనా అనుభవాన్ని గడించారు. మారిన ప్రాపంచిక పరిస్థితులను, రాజకీయ ఆర్థిక దృక్పథాన్ని, నడుస్తున్న చరిత్రను సమతూకంలో అవగాహన జేసుకుని రచనా వ్యాసంగానికి పూనుకున్నారు. గాబట్టే ఆయన నవలేతి వృత్తాలుగాని, నవలా పాత్రలుగాని 'సమకాలీన సామాజిక భావజాలం' నుండి వేరుబడకుండా ఉన్నాయి.

ఆర్థిక అసమానతలున్నంత కాలం సామాజిక వర్గాలుంటాయి. వర్గాలున్నంత కాలం వర్గ సాహిత్యం ఉంటూనే ఉంటుంది. పీడిత, శ్రామిక, అణగారిన ప్రజాపక్షం వహించే ప్రగతి కాముక రచయితలు పాలిత ప్రజల పక్షం నిలబడి పాలక వర్గంపై తమపెన్నును గన్నులా ఎక్కుబెడతారు. రావిశాస్త్రి పాత్రలు గూడ హెచ్చుభాగం

వర్గదృక్పథంతో పాలక వర్గకుహనా సంస్కృతిని నిరసించేవే. శాస్త్రి నవలల్లో శ్రామిక, లంపెన్, న్యాయ, పోలీసుశాఖల ప్రాతినిధ్యపు పాత్రలు, సోషలిస్టు, మార్క్సిస్టు దృక్పథంగల పాత్రలు, చైతన్యంతో తిరగబడే పాత్రలు, మానవత్వానికి నీరాజనాలందించే పాత్రలు, దుర్మార్గానికీ, దురహంకారానికీ, డబ్బుకీ ప్రతీకలైన విభిన్న పాత్రలు దర్శనీయమవుతాయి.

## 3. I. అల్పజీవి

మనో విశ్లేషణ. లేక చైతన్య ప్రవంతి పద్ధతిలో ఈ నవలేతివృత్తం నడిచింది. ముఖ్యంగా ఆడ్లర్ సూత్రీకరించిన ఆత్మన్యూనతా భ్రాంతి (Inferiority Complex) కి అల్పజీవి అద్దం బడుతుంది. అందుకే "చైతన్య ప్రవంతి శిల్పాన్ని ఉపయోగించి రచింపబడిన తెలుగు నవలల్లో 'అల్పజీవి' మొట్టమొదటిది"[2] అని పేర్కొనబడింది. ఈ సిద్ధాంతానికి ముఖ్యప్రతీక దీనిలోని సుబ్బయ్యపాత్ర.

### I. సుబ్బయ్య

ఒక పాత్ర అంతర్గత ఆలోచనా ప్రవంతిని బట్టి లేక అతని మనస్తత్వ విశ్లేషణా ధోరణిని బట్టి, ఆ పాత్రను అంచనా వెయ్యటం చైతన్య ప్రవంతిలోని ముఖ్య అంశం. అల్పజీవిలోని సుబ్బయ్య తన నీడను తాను నమ్మలేడు. తనకేమాత్రం ఆత్మ ప్రత్యయం లేదు. అతని భార్య సావిత్రిగాని, పిల్లలుగాని అతణ్ణి ఏనాడు సముచిత గౌరవంగా చూడలేదు. మనోరమ సాహచర్యమే సుబ్బయ్య జీవిత గమనాన్ని మలుపుదిప్పింది.

సుబ్బయ్య 'ఇనెఫిషెంట్' అని, 'వెర్రిపీరు' అని ఆఫీసు వాళ్ల అభిప్రాయం. 'తన భర్త చవట దద్దమ్మని అసలు తనకు భర్తగా ఉండటానికే అసమర్థుడని', సుబ్బయ్య భార్య గట్టి నమ్మకం. ఎందుకు పనికిరాని అధైర్యస్తుడని సుబ్బయ్యపై వెంకట్రావు అభిప్రాయం. 'ఇల్లొక నరకం, ఆఫీసొక నరకం, నా మనసొక నరకం అని, ఈ లోకంలో తానొక పనికిరాని వెధవనని, తనపై జాలిపడే వాళ్ళుగాని, సహాయం అందించేవాళ్ళుగాని ఎవరూలేరని సుబ్బయ్య తన గురించి బాధపడతాడు. ఈ అభిప్రాయాలననుసరించి సుబ్బయ్య ఎలాంటివాడో, అతని జీవిత పునాది దేనిమీదుందో తెలుసుకోవచ్చు. నిత్యం భయం, భయం ఇదీ సుబ్బయ్య అస్తిత్వం.

తల్లి చిన్నప్పుడే చనిపోవటం వల్ల, సవతితల్లి సుబ్బయ్యను రోజూ కొట్టి హింసించటం, తండ్రిని ఒకరోజు దొంగలు కొట్టి దోచుకోవటం, ఆ సన్నివేశాన్ని తాను కళ్ళారా చూడటం ఈ సంఘటనలు సుబ్బయ్య జీవితంపై చిన్ననాడే బలమైన ముద్రను వేశాయి. అందుకని ప్రతి సన్నివేశానికి చిరుగాలికి అల్లల్లాడే వగిడాకులా వణికిపోవటం, విపరీతంగా భయపడటం సుబ్బయ్య జీవితంలో భాగమయ్యాయి. భయం పుట్టుకతో లేకపోయినా పరిసరాల ప్రభావం వల్ల ఆ విషపు కోరల్లో ఇరుక్కుపోయాడు సుబ్బయ్య.

"మనుషుల ప్రవర్తనలకు కారణాలుంటాయని, ఆ కారణాలు తెలిసినప్పుడే వాళ్ళ ప్రవర్తనను అర్థంజేసుకోవటానికి, సానుభూతి చూపించటానికి సంస్కరించటానికి వీలుంటుందని ఫ్రాయిడ్ అభిప్రాయ పడతాడు"[3]. ఈ ఆలోచన వాస్తవమైనది. దీనిని ఒక్క సుబ్బయ్య జీవితానికే కాదు, సామాజిక వ్యక్తుల ప్రవర్తన కంతటికి అన్వయించవచ్చు.

రావిశాస్త్రి అల్పజీవిలో సుబ్బయ్య పాత్ర ద్వారా వ్యక్తం చేసింది గూడ ఈ భావనే. అయితే ఆడ్లర్ ఫ్రాయిడ్ కంటే మరోమెట్టు ముందుకువెళ్ళి, "ప్రయోజనాన్ని బట్టి మానవ ప్రవర్తన ఉంటుందని, ఏ ప్రయోజనాన్ని ఆశించి మనిషి అట్లా ప్రవర్తిస్తున్నాడో అర్థం చేసుకోవటం ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందని"[4] చెప్పటమే కాక, సదాచరణ వైపు మనిషిని మళ్ళించాలని సూత్రీకరించటం సముచితం. సుబ్బయ్యలోని అవక తవకాలోచనాక్రమాన్ని, స్వార్థపూరిత ధోరణిని, సంస్కరించి, సాంఘిక ప్రయోజనంవైపు, సాటి మనుషులకు సాయపడదామనే సదాలోచనవైపు, రావిశాస్త్రి సుబ్బయ్య పాత్రను నడిపించారు. సుబ్బయ్య ప్రవర్తనను, అతని ఆలోచనలను రచయిత అసహ్యించుకొని, అతనిని 'ఓ దొంగవెధవే' , నని అనుకున్నప్పటికి, నవల చివరలో అతనిలో మంచి పరిణామం కలిగినట్టు శాస్త్రి సూచిస్తాడు.

తనలో తీరకుండా, అణగారిన ఆలోచనలను సుబ్బయ్య దోవనబొయ్యే మనుషులను చూచి, వాళ్ళపై ఆరోపణ జేసుకొని తద్వారా తన ఆలోచనా క్రమాన్ని వ్యక్తం చెయ్యటం గూడ చైతన్య స్రవంతిలో భాగం. బడిపిల్లలను, ఎర్ర చీర మనిషిని, ఇంకా ఇతరులను చూసినప్పుడు సుబ్బయ్య వ్యక్తంజేసిన ఆలోచనలు ఈ ధోరణి కిందకు వస్తాయి. సుబ్బయ్యలో పిరికితనం, భయం జాస్తి. వెంకట్రావు కోసం గవరయ్యను ఐదువందలు అడగటానికి ఎంతో కష్టపడి పోతాడు. అవధాని హెచ్చరికతో సుబ్బయ్య మరీ దిగులు పడతాడు. హెడ్‌క్లర్క్ హూంకరింపుతో సుబ్బయ్య నవనాడులు కుంగిపోతాయి. తనకెవ్వరూ సహాయం చేసేవాళ్ళు లేరనే అభద్రతా భావం, అందరూ తనను అపహాస్యం చేస్తున్నారనే చులకన తలంపు అతనిలో ఆ క్షణం కలగటం సహజమే. గానుగెద్దులా సుబ్బయ్య మనసు ఆ సన్నివేశపు సర్కిల్ నుండి బయట పడలేక విలవిల్లాడింది. ఈ సన్నివేశ చిత్రీకరణ రావిశాస్త్రిలో, పరిశీలనా దృష్టిని ఇనుమడింపజేస్తుంది. సుబ్బయ్య మనస్తత్వాన్ని ఆలోచనా స్రవంతిని, పాయలు పాయలుగా, ఎత్తుపల్లాలతో, మలుపులు దిప్పి, పరవళ్ళుగా పొంగించి, దూకించి, పారించి ప్రవహింపజేసిన తీరు హృదయాలను హత్తుకుంటుంది.

భయంలో భగవంతుడు గుర్తుకురావటం సర్వసాధారణం. సుబ్బయ్య పూరీ జగన్నాథుడికి మొక్కుకుంటాడు. సాక్షాత్తు జగన్నాథస్వామి వచ్చి "నీ వేణి ఇస్తే నీ భర్త ఆపద తప్పుతుంది" అని చెప్పినా సావిత్రి తలనీలాలు ఇవ్వదని "నేను బతికివున్న ఒక్కటే, చచ్చినా ఒక్కటే దానికి" అనేంత తీవ్రంగా సుబ్బయ్య నిరాశతో, అసంతృప్తితో ఆ మాటలు అనగలిగాడంటే సావిత్రి పట్ల సుబ్బయ్యకు ఏ విధమైన భావం ఉందో తెలుసుకుంటానికి ఇంతకంటే వేరే ఉదాహరణ అవసరంలేదు.

ఈ పరిస్థితుల్లో ఏ వ్యక్తి అయినా అందర్నీ అసహ్యించుకుంటం, ద్వేషించటం అనే ఆలోచనకులోనవుతాడు. అందుకని సుబ్బయ్య మొత్తం సమాజాన్ని ద్వేషిస్తాడు. ఈ లోకమంతా కనికరం లేనిదని, అందుకని మొత్తం సర్వనాశనమవ్వాలని, ముందుగా తన బాధలకి కారకుడైన గవరయ్య చావాలని అనుకుంటాడు. రావిశాస్త్రి మానవ స్వభావాన్ని ఇక్కడ చాలా నేర్పుగా వివరించాడు. ఈ సన్నివేశ చిత్రీకరణ స్వాభావికమైంది.

గవరయ్య బృందం ఐదువందలు ఇవ్వనందుకు సుబ్బయ్యను చితగ్గొట్టి, వెయ్యిరూపాయలకు నోటు రాయించుకున్నప్పుడు 'అందర్నీ అడిగానని చెప్పు' అనే అప్పగింతల పరిస్థితికి లోనవుతాడు సుబ్బయ్య. అప్పుడు 'బాధ నిజం, చావు నిజం, మనిషి మాట అబద్ధం' అనే సుబ్బయ్య ఆలోచనా తరంగాలను అప్పటి పరిస్థితిలో ఒక బక్కజీవి ఎలా ఆలోచిస్తాడో రావిశాస్త్రి సమర్థంగా చిత్రీకరించారు.

అయితే 'భయం ప్రతివాడికి ఉంటుంది' అనే ఆలోచన సుబ్బయ్యలో కలగటం కారుచీకటిలో కాంతిరేఖ లాంటిది. గవరయ్య ఆఫీసులో తనని డబ్బు అడగటానికి భయపడతాడు, కనుక భయం సర్వసాధారణం అనే ఓదార్పుకు వచ్చి జరిగిన విషయం సుబ్బయ్య అందరికీ చెప్తాడు. ఈ సన్నివేశమే సుబ్బయ్య జీవితాన్ని మరో మలుపు దిప్పింది. మనోరమ సాహచర్యం, సాన్నిహిత్యం వలన సుబ్బయ్య జీవితం కొంతవరకన్నా మబ్బు విడిచిన వెన్నెలయ్యింది.

"ఏదైనా బోధపరచుకోవాలంటే దానికి కారణం తెలుసుకో అన్నాడు, చిన్నప్పుడు సైన్సు మాస్టారు"[5] అని హేతుదృష్టితో, కార్యకారణ సంబంధంతో, ఆలోచించాలనే, నూతన పరిణామ కాంతి మెరుపులా సుబ్బయ్య బుర్రలో లిప్తపాటు తళుక్కుమన్నట్లుంది. అందుకని గవరయ్య, వెంకట్రావు, మనోరమలు సుబ్బయ్య దృష్టి పథంలో మెదిలారు. మనోరమ గురించి గూడ సందేహాస్పద ఆలోచనలు సుబ్బయ్యలో మెదలి ఒక పొంతనలేకుండా అవి సాగటం అనతి అపరిపక్వస్థితికి నిదర్శనం.

శాంతి, విశ్రాంతి తనకు కరువయ్యాయని, భయం, క్షోభ తనను పీడిస్తున్నాయని, చచ్చేంత వరకు ఈ పీడన తప్పదని, అయినా చావటం పరిష్కారం కాదనే ఆశ, సదాలోచన సుబ్బయ్యలో అంకురించటం చైతన్యానికి ప్రతీక. "కనిపిస్తోందామె నడిచే వెలుగులా" అని రావిశాస్త్రి వెలుగునిచ్చే మార్గదర్శకురాలిగా మనోరమను చిత్రీకరించబట్టే సుబ్బయ్య లాంటి కూపస్థమండూకాలకు లోకస్థితి అర్థమవటానికి మార్గం ఏర్పడుతుందని భావించాలి. తనేమిటో, ఎక్కడున్నాడో, సంఘంలో తన స్థానమేమిటో తరిచి చూసుకుంటే "శైశవం, బాల్యం, యౌవనం, అంతా ఒక్కలా ఉంది" అంటే సుబ్బయ్య జీవితం ఇప్పటి వరకు గానుగెద్దు జీవితంలా గడిచిందేగాని, ఏమాత్రం మార్పురాలేదనే ఆలోచన ఇన్నాళ్ళకు సుబ్బయ్యకే తట్టింది. "ముప్ఫైయ్యొయిదేళ్ళకీ మూల సూత్రం" సుబ్బయ్యకి బోధపడింది. సుబ్బయ్యకి తన ఆస్తిత్వం (Existence) తెలిసింది గాబట్టి ఇదే అతనికి చైతన్యం వైపు (Consciousness) దారి చూపిస్తుంది. అస్తిత్వమే చైతన్యానికి మూలమనే సూత్రం సుబ్బయ్య జీవితానికి అన్వయిస్తుంది.

"దాసోహం, దాసోహం" ఇప్పటి వరకు సుబ్బయ్య జీవితం గడిచింది. ఇంకా "జీవితం హీనంగా, నీచంగా, క్షుద్రంగా, దౌర్భాగ్యంగా, దైన్యంగా" గడిచింది. అందుకనే "ఆ చీకటి వెనక్కి పీకుతుంది" నూతనంగా పొందిన చైతన్య స్ఫూర్తి ఈ వెలుగు ముందుకు లాగుతోంది, 'సుబ్బయ్య'ని అని రావిశాస్త్రి ఆ సుబ్బయ్య జీవిత పరిణామ దశను తులనాత్మకంగా సూచించారు. సుబ్బయ్యలో భయం, స్తబ్దత తొలగిపోయి చైతన్య స్రవంతి, నూతన స్ఫూర్తి, సామాజిక చైతన్యం చోటు జేసుకున్నాయి. భయం

పునాదుల నుండి అభద్రతా భావపు ఆలోచనా ధోరణి నుండి సుబ్బయ్య బయటపడి చైతన్యపు వెలుగుబాట వైపు తొంగి చూశాడని మొత్తం సుబ్బయ్య జీవితాన్ని విశ్లేషించుకుంటే అర్థమవుతుంది.

జేమ్సుజాయిస్, 'యులిసిస్' ప్రభావం సుబ్బయ్య పాత్రపై, నవలా సన్నివేశాలలో ఇమిడి ఉంది, 'యులిసిస్ నవల చివరలో Sindbad Sailor అనే వాక్యాన్ని ఆధారంగా తీసుకుని, జాయిస్, Tinbad-Tailor, Binbad-Bailor, Jinbad-Jailor అంటూ రాస్తాడు. బార్బర్- సుబ్బయ్య, బార్బయ్య శబ్ద సృష్టి ఇటువంటిదే"[6] కనుక రావిశాస్త్రి చెప్పుకున్నట్లు అల్పజీవిపై జేమ్సుజాయిస్, శ్రీశ్రీల ప్రభావం ఉన్నది.

**2. గవరయ్య**

గవరయ్య తండ్రి రంగూన్ వెళ్ళి మరి తిరిగిరాలేదు. తల్లి గంగమ్మ ఇతణ్ణి ఆదరణతో పెంచింది. గవరయ్య చాలా పేద కుటుంబం నుంచి ఎదిగాడు. గవరయ్యకు చదువు అబ్బలేదు.

గవరయ్య పదిహేనోఏట ఫస్టు ఫారంలో చేరితే, అదే ఏడు గంగమ్మ రామయ్యమ్మనే అమ్మాయితో గవరయ్యకు పెళ్ళిజేసింది, పందొమ్మిదో సంవత్సరానికి గవరయ్య నాలుగో ఫారంలోకి వచ్చాడు. అప్పటినుంచి గవరయ్య, రామయ్యమ్మతో దాంపత్య సుఖం అనుభవిస్తు హాయిగా ఉన్నాడనుకునేసరికి గంగమ్మకు భూమిపై నూకలు చెల్లిపోయాయి. తల్లి చనిపోవటంతో అనాథ అయిపోయాడు. తనతో పాటు చదువుకొని, తాలూకా ఆఫీసులో బంట్రోతుగా ఉన్న నూకరాజు గవరయ్యకు మంచి స్నేహితుడు. నూకరాజు సాయంతో గవరయ్య తాలూకా ఆఫీసులో అటెండరుగా చేరాడు.

ఒకరోజు గవరయ్య తాశీలుదారుకు తన ఇంటిని చూపిస్తే ఆయన ఇంటితోపాటు గవరయ్య భార్యను గూడా జూసి 'చక్కటి చుక్కని సంపాదించేవురా' అని మెచ్చుకుంటాడు. ఆ తరువాత రామయ్యమ్మతో ఆ తాశీలుదారు కులుకుతున్న దృశ్యాన్ని గవరయ్య కళ్ళారా జూసి చనిపోదామని సముద్రం దగ్గర కెళతాడు. ఏ ఎండకా గొడుగు బట్టగల, లోకతత్వం వంటబట్టించుకున్న నూకరాజు గవరయ్యను ఓదార్చి, తాశీలుదారుతో మాటాడి, గవరయ్యకు రెండు వందలు ఇప్పించి, వ్యవహారిన్ని కొద్దిగా తగువు బెట్టినట్టు బెట్టి సర్దుతాడు. ఈ రెండు వందలకు రుచి మరిగిన గవరయ్య, రామయ్యమ్మను చంపుతానన్న మాట మరిచి అక్కణ్నుంచి డబ్బు దాహంతో పరుగులు దీస్తాడు. ఈ సన్నివేశం గవరయ్య జీవితాన్ని మలుపుదిప్పుతుంది. ఈ రోజే రామయ్యమ్మను పుట్టింటికి పంపుతాడు. రావిశాస్త్రి ఈ సన్నివేశ సందర్భంలో 'కత్తికి కనికరం తక్కువ' అని వివరించాడు. నలభై ఏళ్ళ గవరయ్య పెద్ద కాంట్రాక్టరై గవరయ్యగారుగా రూపొందాడు. తాలూకా ఆఫీసులో ఏ పనికి గవరయ్యకి ఎదురులేదు. సుబ్బయ్య వద్ద తన బిల్లులు ఉన్నాయి గాబట్టి అడగ్గానే గవరయ్య ఐదువందలు ఇంటికి పంపించాడు. కాని ఇదే గవరయ్య సుబ్బయ్య ఆ సీటు నుండి మారగానే అతనిని బెదిరించి, మరోసారి, కొట్టి, ఐదువందలకు బదులు వెయ్యి రూపాయలకు నోటు రాయించుకుంటం, దౌర్జన్యానికి,

దుర్మార్గత్వానికి నిదర్శనం. తాను చేస్తున్న వ్యాపార సంబంధాలలో గవరయ్య లాంటి పాత్ర అలా ప్రవర్తించటం ఆశ్చర్యమేమిగాదు.

ఆఫీసులో అవధాని, గవరయ్య, సుబ్బయ్యను కొట్టించినందుకు, నోటు రాయించుకున్నందుకు, నిరసనగా బిల్స్ పాస్ చేయకుండా ఉండటం, తన ఊరి అమ్మాయి మనోరమ సుబ్బయ్య పక్షాన వచ్చి నోటు విషయం అడగటం, మార్గాలనీ తెలిసిన పోతన్న ఉద్యోగం మానెయ్యటమే గాకుండా విభీషణుడిలా సుబ్బయ్య పంచన చేరటం, వెంకట్రావు తన పాత విషయాలు బయట బెడతానని బీరాలు పలకటం ఇవన్నీ గవరయ్యను సుబ్బయ్య చేత బలవంతంగా రాయించుకున్న నోటుని అతనికి ఇచ్చి వెయ్యటానికి దోహదపడ్డాయి. ఆయా సన్నివేశాన్ని బట్టి రకరకాల వత్తిళ్ళు ఒక వ్యక్తిపై ఎలా పనిజేస్తాయో రావిశాస్త్రి గవరయ్య పాత్రద్వారా తెలిపారు.

ఈ విషయాలన్నీ ఆలోచించే సరికి గవరయ్యకి తలనొప్పొచ్చింది రామయ్యమ్మ విషయంలో ఆనాడు సముద్రం ఒడ్డున కూర్చున్నప్పటి స్థితి దాపురించినట్లయింది గవరయ్యకు. అందుకని "గతం చచ్చిందనుకున్నాను. కాని బతికే ఉంది. నన్ను చంపుకు తింటుంది. అబ్బా తలనొప్పి"[7] అని గవరయ్య అనుకుంటం, ఇడ్, ఇగో, సూపర్ ఇగోల సూత్రాన్ని గుర్తుజేస్తుంది. గతం ఎక్కడో లోలోపల పొరల్లో అణగారి ఉన్నప్పటికి, అది పూర్తిగా మాసిపోలేదు గాబట్టి, ఆ సన్నివేశ తీవ్రతని బట్టి అది బయటకొచ్చింది. తన జీవితాన్నే మలుపు దిప్పిన సన్నివేశం కనుక అది అంత తొందరగా అణగారి పోలేదు. అందుకే అతనికి తలనొప్పి.

ఈ సన్నివేశంలో గవరయ్య అనుభవించే మనోవేదన చైతన్య స్రవంతికి మంచి ఉదాహరణ. "రచయిత బాహ్య ప్రకృతి నుండీ, లేక బాహిరమైన ప్రవర్తన నుండి తనదైన వైయక్తిక ప్రపంచపు రెపరెపలాడే పల్చటి నీడల్లోకి మలగి పోవటమే చైతన్య స్రవంతి"[8] వీడ్లే (The new novel therefore is described as a with drawal from external phenomena in to the flickering half shades of the authors' private world)- అని లేక "మనస్సును ప్రత్యక్షంగా సరాసరి ఉల్లేఖించటమే"[9] చైతన్య స్రవంతి అని ఎడ్వర్డు బౌలింగ్ పేర్కొన్నాడు. (Direct quotation of mind).

తన జీవితాన్ని మార్చిన రామయ్యమ్మ, గవరయ్య మనోముకురంపై ప్రస్ఫుటించింది. గతమంతా తన కళ్లముందు చలన చిత్రంలా దర్శనీయమవుతుంది గవరయ్యకు. చైతన్య స్రవంతి పద్ధతిని చక్కగా నిర్వహించిన సన్నివేశానికి ఈ పై మనస్తత్వ చిత్రీకరణ మంచి ఉదాహరణ. ఎంతో దుర్మార్గమైన పద్ధతిలో ధన సంపాదన జేసినప్పటికి గవరయ్యలో ఇంకా మానవత్వపు పోగు పూర్తిగా ధ్వంసం కాలేదు గాబట్టే, తన తల్లి గురించి ఆలోచించాడు, మనోరమకు నోటు ఇవ్వగలిగాడు. రామయ్యమ్మను నిరపాయంగా వదిలెయ్యగలిగాడు. సామాజిక గమనం మారనంతకాలం గవరయ్యలకు లోటు ఉండదు.

### 3. వెంకట్రావు

వెంకట్రావు తాత తండ్రులది జమిందారీ వంశం. డబ్బు, హోదా లేకపోయినా వెంకట్రావులో ఆ ఇంగువ కట్టిన గుడ్డ, వాసనపోలేదు. తన అవసరం కొద్దీ ఎదుటివాడి దగ్గరకెళ్ళి చెయ్యిచాచే పరిస్థితిలో కూడా 'దాసోహం' రీతిలో గాకుండా, దర్జాగా ప్రవర్తించే అహంకారానికి అతనిలో లోటులేదు. ఎదుటి వాళ్ళను చాలా చులకనగా చూడటం తనెంతో గొప్పవాడిగా ఫీలవడం అతనికి వారసత్వంగా వచ్చిన లక్షణాలు. చదువు గూడ పెద్దగా అబ్బలేదు. పద్దెనిమిదేళ్ళ వయసు వరకు నిర్లక్ష్యంగా, స్నేహితులతో, అమ్మాయిల వెంటబడుతూ బాధ్యతా రహితంగా కాలక్షేపం చేసిన వెంకట్రావుకి తండ్రి చనిపోవటంతో సంసార బాధ్యతలు తలకి చుట్టుకుంటాయి. అప్పులు నెత్తిమీద బడేసరికి వెంకట్రావుకి అప్పుడు కళ్ళు నెత్తిమీదనుండి నేల మీదకి దిగిన ట్లైంది. దానికి తోడు గుమస్తా కామేశం, మేనమామ నరసయ్య, కూడ బలుక్కుని కొద్దో, గొప్పో మిగిలిన నగనట్రా, అస్తిపాస్తుల్నీ కాజేసి, వెంకట్రావుని బికారిగా నడిబజార్లో నిలబెడతారు. తండ్రిపోయిన, తొమ్మిది నెలలకి తల్లి మరణించటం, తన వాళ్ళే తనకు ద్రోహం చేయ్యటం, జీవిత దారిద్ర్యం బతుకు భయం- ఇవన్నీ వెంకట్రావు జీవిత గమనాన్ని మార్చుతాయి. అందుకని ఇది దయా దాక్షిణ్యం లేని లోకమని "మానవలోకం అనే ఈ మార్కెట్టులో ఎవడి జాగ్రత్త మీద వాడుండాలి ఎవడి లాభం వాడు చూసుకోవాలి. అవతలి వాడి లాభనష్టాలతో, కష్ట సుఖాలతో ఇవతలివాడికి సంబంధంలేదు ఎవడి కష్టం వాడు మాన్పుకోవాలి. ఎవడి సుఖం వాడు చూసుకోవాలి... ఈ అడవిలో ఏది తాడో, ఏదిపామో తెలుసుకోవటం కష్టం. తరచుగా తాడే పామవుతుంది. పామయి కరుస్తుంది కరవకుండా కాపాడుకోవాలి అవసరమొస్తే మనమే ముందు కరవాలి"[10] అని వెంకట్రావు ఆలోచిస్తాడు. తన సొంత మనుషులే తనకి ద్రోహం చేసే సరికి, కష్టాల్లో నా అనేవారు లేకపోయేసరికి ఈ లోకం పాముల పుట్టలాగ వెంకట్రావుకి కనిపించింది. ఎవడి కాటుకి దొరక్కూడదని, అవసరమొస్తే ముందుగా మనమే కాటెయ్యాలనే తీవ్ర ఆలోచనకు అతనికి జరిగిన పరిస్థితులే అతన్ని అలా ఆలోచింపజేసాయి. పరమ దుర్మార్గంగా మారే వ్యక్తి ఎప్పుడైనా ఇలానే ఆలోచిస్తాడు కాబట్టి "సిగ్గు, లజ్జ విడిచి పెట్టేశాడు. మొండి కవచం తొడిగేడు స్వలాభం అనే జెండా ఎత్తాడు. జీవితం అనే యుద్ధంలో దిగేడు"[11] అని రావిశాస్త్రి వెంకట్రావు గురించి వ్యాఖ్యానించటం అక్షర సత్యం. ఆ "సిగ్గు, లజ్జా విడిచి పెట్టిన పునాదిపై అతను కాంట్రాక్టరుగా ఎదిగి జీవితంలో నిలదొక్కుకోగలిగాడు.

ఇంత ఘన చరిత్ర గల వెంకట్రావు తన తండ్రి చనిపోయాక కుటుంబ భారం మోయలేని పరిస్థితుల్లో తన చెల్లి సావిత్రిని, తనతో పాటు చదువుకున్న సౌమ్యుడు, 'అల్పజీవి' అయిన సుబ్బయ్యకిచ్చి వివాహం చెయ్యటం, బాధ్యతల నుండి జాగ్రత్తగా బయటపడ్డ అతని మనస్తత్వాన్ని సూచిస్తుంది. "నీ నంగిరి పింగిరి మాటలు మాని నే చెప్పినట్టు" గవరయ్యని ఐదువందల డబ్బులు అడగమని దబాయించి సుబ్బయ్యతో చెప్పటం వెంకట్రావు స్వభావాన్ని బట్టబయలుజేస్తుంది.

గవరయ్య తిరిగి డబ్బులు ఇవ్వాల్సిన పరిస్థితి యేర్పడిన సంగతి సుబ్బయ్య చెప్తే "నువ్వు చేతగాని చచ్చు పెద్దమ్మవోయ్ బావ" అని ఏ మాత్రం తడుముకోకుండా

అనగలిగిన ధీశాలి వెంకట్రావు. అందుకే "ఎవర్నయినా సరే మోసపుచ్చడానికి వెంకట్రావు సాధారణంగా వెనుకతియ్యడు." వాడు బావైనా సరేనని రావిశాస్త్రి వెంకట్రావు గురించి స్పష్టంగా వ్యాఖ్యానించాడు. సుబ్బయ్య భయపడుతున్నట్లుగానే వెంకట్రావు తాను తీసుకున్న డబ్బులు ఇవ్వనని, కావాలంటే "దిక్కున్న వాడితో చెప్పుకోమను" అని గవరయ్య నుద్దేశించి సుబ్బయ్యతో చెప్పటం వెంకట్రావు ఎలాంటి స్వార్థపరుడో, సొంతబావ బాధపడుతున్నా ఏ మాత్రం చలించకుండా ఉంపుడుగత్తెతో కులుకుతూ, అలా మాట్లాడటం, అతని నైతిక దిగజారుడుతనానికి నిదర్శనం.

బాకీ డబ్బు కోసం గవరయ్య బృందం సుబ్బయ్యను చితకబాదినాక, ఎంతకాదన్నా సుబ్బయ్య తన బావనే దృష్టితో గాబోలు వెంకట్రావు గవరయ్యపై మండిపడి, అతని పూర్వవృత్తాంతం, తన దగ్గర ఉంపుడుగత్తెగా ఉన్న అతని ఒకనాటి భార్య అయిన రామయ్యమ్మని అడ్డం బెట్టుకొని బ్లాక్‌మెయిల్ రాజకీయం మొదలెడతాడు. ఇదికూడా డబ్బుని దృష్టిలో ఉంచుకొనే వెంకట్రావు అలా ప్రవర్తించింది. దగ్గర వారిని కూడ దగా చెయ్యటానికి వెనుదీయని నీచ ప్రవృత్తి ఇతనిది. వ్యాపార పెట్టుబడిదారీ సమాజంలో మానవ సంబంధాలు వ్యాపార దృష్టితోనే కొనసాగుతాయనే దానికి వెంకట్రావు ఓ నిదర్శనం సామాజిక మార్పుతోనే వెంకట్రావులాంటి వాళ్ళు మారేది.

## 4. మనోరమ

సుబ్బయ్య జీవితాన్ని మలుపుదిప్పి, అతనిలో చైతన్యాన్ని రగిలింపజేసిన స్త్రీమూర్తి మనోరమ. భారతీయ విద్యాలయంలో టీచరుగా పనిజేస్తుంది.

సుబ్బయ్య రాత్రిపూట విచారంగా వంతెనపై కూర్చొని ఉండగా మనోరమ అతనిని కలిసి మాట్లాడిన తీరు సుబ్బయ్యలో ఎంతో ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఈ లోకంలో తనపై జాలి పడేవారెవరన్నా ఉన్నారంటే ఆ ఒక్క వ్యక్తి మనోరమ అని సుబ్బయ్య భావించటం వల్ల, మనోరమ సాహచర్యం అతనిలో ఎంతటి మార్పుని గలిగించిందో గమనించవచ్చు. ఆమె చనువుని సుబ్బయ్య గూడ అపార్థం జేసుకొని, "నా ఇంటికి వచ్చి నా పీకల మీద ఆవిడ కూర్చుంటే నేనేం చేసేది?"[12] నాకు పెళ్ళాం పిల్లలు ఉన్నారు గదా అనేంత ఆలోచనకు లోను జేసింది.

అయినప్పటికి సుబ్బయ్య మనోరమ స్నేహాన్ని కోరుకుంటాడు. ఈ బాధలన్నింటి నుంచి మనోరమ ఒక్కటే తనని కాపాడగలిగిన వ్యక్తి అని కాసేపైన సుబ్బయ్య తలంచుతాడు. సుబ్బయ్యకు మనోరమ వట్టి ఓదార్పు నియ్యటమేగాదు, సర్వ సుఖాన్ని అందించి ఆనందపరిచింది. గవరయ్య బృందం తనకు చేసిన అవమానం గురించి సుబ్బయ్య మనోరమతో చెప్పగా, ఆమె గవరయ్య తనకు బాగా తెలిసిన వ్యక్తి అని, తాను తప్పకుండా ఆ నోటు తీసుకొస్తానని చెప్పి, ఆ నోటు తెచ్చి సుబ్బయ్యకు మరీదగ్గరైంది మనోరమ. సుబ్బయ్యలో జీవితంపై ప్రేమని, బ్రతుకుపై ఆశని, ఆత్మవిశ్వాసాన్ని కలిగించిన చైతన్య స్రవంతిగా మనోరమ 'అల్పజీవి'లో దర్శనీయమవుతుంది.

ఇంకా దీనిలో నర్సయ్య, కామేశం లాంటి అవకాశవాదులు, నూకరాజులాంటి లౌక్యపు వ్యక్తిత్వమున్న పాత్ర, దురహంకారం, లెక్కలేని తనంగల జమిందారీ

మనస్తత్వమున్న సుబ్బయ్య భార్య సావిత్రి, డబ్బు, హోదాగల పెద్దమనుషుల కామానికి సంసారాన్ని బలిచెట్టుకుని, తదనంతర జీవితాన్ని పాడుజేసుకున్న గవరయ్య భార్య రామాయమ్మ, తన దగ్గర పనిచేసే చలిచీమల్లాంటి వాళ్ళ జీవితాల్లో తన అధికార హోదాతో, కామం కళ్ళకెగదట్టి నిప్పులుపోసే తాశీల్దారుపాత్ర, దురహంకారాన్ని భరించలేని మానవతగల పోతన్న పాత్ర, ప్రభుసేవకే అంకితమైన పోతరాజు, ఆఫీసులో పరస్పరం దెబ్బతీసుకుంటూ, తమ ఆటలో ఇతరుల్ని గూడ బలితీసుకున్న రామస్వామి, అవధానులు, మొదలైన పాత్రలు 'అల్పజీవి' తెరపై సంపూర్ణంగా మనకు కన్పించటానికి దోహదపడ్డాయి. మధ్యతరగతి జీవితానికి మంచి ప్రతినిధి సుబ్బయ్య. 'అల్పజీవి'లోని పాత్రలు, మధ్య తరగతి, మధ్యతరగతి దిగువ వర్గ పాత్రలు.

## 2. రాజు-మహిషి

రావిశాస్త్రి నవలల్లో విలక్షణమైంది 'రాజు-మహిషి' సంపన్న మధ్యతరగతి జీవితాల వర్ణన దీనిలో ఉంది. ఫాంటసీతో, చిన్నచిన్న కథల రూపంలో ఈ నవల కొనసాగింది. శ్రీశ్రీ 'రాజు-మహిషి' ని 'పూరి జగన్నాథంలో విశ్వకర్మ తయారుచేసిన అసంపూర్తి విగ్రహం'తో పోల్చటమేగాక, దీనిని 'ఇరవయ్యో శతాబ్దపు క్లాసిక్' అని వీరాభిమానంతో చెప్పారు. ఇందులోని పాత్రలు గూడ మితిమీరిన సంఖ్యలోనే ఉన్నాయి. వ్యాపార, పెట్టుబడిదారీ వర్గ లక్షణాలను ఈ నవల ప్రతిబింబిస్తుంది.

### I. గంగరాజు

"రాజు రాజుకాడు. అతనికి రాణీలేదు. రాజ్యంలేదు. గేదెలు మాత్రం చాలా ఉన్నాయి''. ఈ నవలలో అసలు ప్రారంభవాక్యాలే ఇవి. అందుకని గంగరాజు రాజ్యాధిపతేంగాదు. కాకపోతే ఎక్కువ గేదెలున్నాయి గాబట్టి గేదెల రాజని అనవచ్చు. రాజుకి స్వయం నిర్ణాయక శక్తి తక్కువ. అంతకుముందు మరదలు ప్రవర్తన అసభ్యంగా ఉందని తెలిసి ఇంటి చాలిరావొద్దని, రాజు అతని భార్య కసురుకున్నారు. అయినా భార్య చనిపోయిన నాలుగు రోజులకే రాజు మరదల వశమవ్వటమేగాదు, ఏకంగా ఆమెను పెళ్ళిజేసుకున్నాడంటే రాజు వ్యక్తిత్వం ఎలాంటిదో ఊహించుకోవచ్చు.

రాజమ్మ రాజు జీవితంలో ప్రవేశించాక, అతని జీవితం పూర్తిగా మారిపోయింది. వివిధ వ్యాపారాలతో అతని ఆర్థిక స్థితి, హోదా బాగా మెరుగయింది. రావిశాస్త్రి అతనిలోని శక్తి "గనుల్లో మణుల్లా, చీకటి గదిలో అద్దాల బొమ్మలా" దాగి ఉంటే "ఆ మణుల్ని బైటకి తీసి ఆ బొమ్మకి వెలుగిచ్చింది మరదలు పిల్ల" అని వర్ణించారు. మరదలు రాకతో తన ఆర్థిక పరిస్థితి మెరుగుపడేసరికి, 'ఆమె శీలం చెడలేదని', శ్రీరాముడి దయ వలననే తన మరదలు తన దగ్గరికి వచ్చిందని"[13] భావించేంత వ్యామోహంలో పడ్డాడు రాజు. వ్యాపార, పెట్టుబడిదారీ లక్షణాలు అసలు వాస్తవాన్ని జోకొట్టి, భ్రమలో ఉంచి, వాస్తవానికి మనిషిని ఎంత దూరంగా నెడతాయో తెలుసుకుంటానికి, రాజు ఆలోచనలు మంచి ఉదాహరణ. రావిశాస్త్రి రాజుని శారీరకంగా చాలా అందగాడుగా, బలిష్టుడిగా వర్ణిస్తూ, "ఆ ఊరే యమలోకం అయితే యితనే ధర్మరాజునిపిస్తాడు అతను చెక్కిన రాతి బొమ్మలా ఉంటాడు. చాలా అందంగా ఉంటాడు"[14] అని వర్ణించాడే గాని, తెలివిగలవాడిగా

సూచించలేదు. అంతే గాకుండా, గంగరాజు వేషం చూస్తే "హిట్లరుగాడు, ముసోలినగాడు, ఊష్ణాలు పెట్టేసుకొని జాయింటుగా మంచం ఎక్కవలసిందే"[15] అని గూడ వర్ణిస్తాడు. కమ్మలింటి రాజుకి, ఈరాజు, రాజమ్మలకి, గేదెల విషయంలో గొడవ జరిగి, గంగరాజు జైలుపాలై, చివరికి విడుదలవుతాడు. గంగరాజులో వ్యాపార సంబంధాలు ఎంతో మార్పుదెచ్చినా తాను ఏ వర్గం నుండి వచ్చాడో, ఆవర్గం తాలుకా స్పృహ పూర్తిగా చావలేదు గాబట్టే రాజమ్మ, అమ్మల్ని చితకబాదుతుంటే, అడ్డుకొని అమ్మల్ని కాపాడటమే కాకుండా తన భార్యనే చేతిపై గొడతాడు. తన జీవిత ఎదుగుదల్లో మార్పులు సంభవించినా మానవతా జీవలక్షణం సమసిపోలేదని గంగరాజు ఈ సన్నివేశం ద్వారా రుజువుజేసాడు.

## 2. రాజమ్మ

రాజమ్మ గంగరాజుకి వరసకి మరదలు, కాని రాజు భార్య చనిపోయినాక, ఆమె అతనికి రెండవభార్యగా స్థిరపడిపోయింది. రాజమ్మని చేరదీసిన బుగతని, అతనిభార్యే, వీళ్ళిద్దరి రంకు సహించలేక చంపేస్తుంది. ఆ చిన్న వయసులోనే, రాజమ్మకు "తల్లియిాదీ, తండ్రియిాదీ, పిల్లయిాదీ, పెనిమిటయిాదీ అడ్డొచ్చినోణ్ణెవుణ్ణయినా సరే అణచిపారేస్తారు' '[16] అనే జీవిత సత్యం బుగత చావుతో బోధపడుతుంది. పాశవిక అణచివేత విధానం సామాజిక ధర్మంగా చోటుజేసుకుందనే వాస్తవాన్ని రాజమ్మ పసిగట్టింది. ఈ జ్ఞానంతో ఆమె, తొందరపాటుతనం వల్ల ఒక పోలీసుతో ఉంటూ, మరోపోలీసు హెడ్డుతో గూడ రంకు సాగించబోయి భంగపడుతుంది. 'జీవితమొక కీకారణ్యం' అనే సత్యాన్ని గూడ రాజమ్మ గ్రహించిందని రావిశాస్త్రి వివరించారు. అలవాటుబడ్డ పాత జీవితాన్ని పూర్తిగా వదిలిపెట్టలేక, డబ్బు సంపాదించాలనే ఆశతో గూడ రాజమ్మ కొందరమ్మాయిలతో సానిగృహం ప్రారంభిస్తుంది. కాని సానికొంప నిర్వహణకవసరమైన అండదండలు లేకపోవటం వల్ల అది ఎంతో కాలం నడవలేదు. జీవితంలో నిలదొక్కుకుంటానికి ఈపని, ఆపని అని లేక ఏదైనా చెయ్యటానికి వెనుదీయని వ్యక్తి రాజమ్మని తెలుస్తుంది.

తన అక్కైన రాజు మొదటి భార్యకి అమ్మవారు పోసిందని తెలిసి, ఆమె చనిపోవాలని నూకాలమ్మ తల్లిని మొక్కుకుంటం గూడ రాజమ్మ దుష్ట స్వభావనికి నిదర్శనం. చిన్న బొగ్గుల దుకాణం నుంచి, కట్టెలడితీ, గేదెలు, ఆవులు, మేడలు, మిల్లు హోటల్, లాడ్జి, ఓ ఇలాగ రాజుని-పెద్ద ధనవంతుణ్ణి,వ్యాపారస్తుణ్ణి జేస్తుంది. రాజమ్మ, ఆకారంలో హంగు,పొంగు, హావ భావవిన్యాసాలు ఉన్నాయి. మంచికి మంచి, చెడుకు చెడు ప్రదర్శించగల సామర్థ్యం రాజమ్మలో పుష్కలంగా ఉంది. కాబట్టే 'ఆవిడ వెయ్యిళ్ళకి దీపాలు పెట్టగలదు. పదివేల కొంపలకి నిప్పంటించగలదు".[17] అని రావిశాస్త్రి రాజమ్మ స్వభావాన్ని వ్యక్తీకరించారు. ఆశక్తి యుక్తులతోటే రాయిలాంటి రాజుకి సానబెట్టి రత్నంలా చేసింది. తను అనుకున్నది సాధించటానికి ఎవరేమైపోయిన వెనుకాడని విలక్షణ వ్యక్తిత్వం రాజమ్మది. 'వీధంతా రాజమ్మ రాజ్యం కింద మారిపోయింది."[18] ఎదుటి వాళ్ళు కామందైన, కౌన్సిలరయిన, తన మాటకు ఎదురులేకుండా నెగ్గుకు రాగల నేర్పరితనం, గడుసుతనం ఆమెకున్నాయి.

సాటి స్త్రీల మీద కూడ రాజమ్మకు చులకన భావం ఉంది. "మా ఆడ ముండ్లకి బుద్ధిలేదు బాబూ ఎవుడెర్ర గుంటే ఆడికే ఎగబడతారు."[19] అని రంగారావుతో రాజమ్మ పలికిన మాటలు ఆమె స్వభావాన్ని పట్టిస్తాయి.

"సదుంకున్నోళ్ళంతా ఒక్కటే గదా? మాలాంటి సదువులేని మూర్ఖులంటే మీకులోకువ,"[20] అన్న రాజమ్మే:గేదెల విషయమై తన మీద పిటీషన్ బెట్టిన రాజునుద్దేశించి' ' పబిలీగ్గ పిలకపట్టుకి జాడించేస్తే నువ్వే అడ్డుకుంటావో, నీ అయ్యే అడ్డుకుంటాడో ఈదిలో ఏసదవుకున్నోడు అడ్డుకుంటాడో నాను జోస్తానీయాల"[21] అని రంగారావుతో అనటం ఆమె గడుసుదనానికి, తెంపరితనానికి అద్దం పడుతుంది. ప్రతిఘటనకు , అవిద్య ప్రతిబంధకం కాదని, అధికార తెలివితేటలతో తనను అణచివెయ్యాలని చేసే ప్రయత్నాలు వమ్మవుతాయని ఆమె తెలియజేస్తున్నట్లు గ్రహించాలి. అంతేగాకుండ "చదువు లేని ముండ, ఎర్రిముండా ఇదేటి జేస్తాదని సూస్తె" తాను చేతగాని దాన్నికాదనే హెచ్చరిక గూడ రాజమ్మ చేసింది. ఆరాజు దెబ్బల వల్ల గేదె ఈని పెయ్య చచ్చిపోయింది గనుక "పెయ్య ఖరీదు ఇవ్వకపోతే ఆయువు మూడినట్టె," నాను "శివాలెత్తిపోతే, మరింక ఇక్కడా, అక్కడా అని జూణ్ను! ఇదీ, అది అని జూణ్ను, ఈడు,ఆడు అని జూణ్ను" అని తన ఉగ్రరూపాన్ని చాటి చెప్పింది రాజమ్మ. ఆరు నూరైన దీనికి తిరుగు లేదనే మొండి వైఖరి. తన అనుభవంలోని సాంఘిక జీవన గమనం నుంచి రాజమ్మ ఈమాటలు చెప్పింది.

కమ్మలింటి రాజుతో తగువు పడి చితకబాదినప్పుడు జుట్టూ జుట్టూ పట్టుకున్నప్పుడు, అమ్మల్ని పీక నులిమి నుగ్గు జేసినప్పుడు -రాజమ్మ ప్రవర్తన లంపెన్ క్యారెక్టర్‌లా ఉంది." ఖాళీ సీసాలు" లోని ఆసుపత్రి సీన్‌ని గుర్తుకు తెచ్చేల రాజమ్మ, బంగారి జుట్లు జుట్లు పట్టుకున్నారు. తను చేసే దౌర్జన్యానికి ఆడ, మొగ అనే భేదాన్ని గూడ రాజమ్మ పాటించినట్లు లేదు. చేసేది దౌర్జన్యమైనప్పుడు ఆడేంటి మొగేంటి "రెండురెళ్ళు నాలుగే" స్త్రీ సహజమైన రీతిలో రాజమ్మ, బంగారి తమగత చరిత్రల్ని ఆతగువులో తవ్వుకుంటం సహజంగా ఉంది.

గంగరాజుని జైలు నుండి విడిపించటానికి, తమపై కేసు మాఫీ చేయించుకుంటానికి రాజమ్మ మందుల భీముడి ద్వారా ప్లీడరు ముకుందరావుని ఆశ్రయించిన తీరుగూడ రాజమ్మ లోకతత్వాన్ని, బాగా గ్రహించినట్లు కనిపిస్తుంది. అలానే రాజమ్మ మందుల భీముడి స్వార్థపుటుచ్చులో యిరుక్కొని చివరికి పంతుల కుర్రాడి ద్వారా విషయం గ్రహించి " తెలిసిన వెధవే ద్రోహం చేస్తాడు"[22] అని భీముడి ద్రోహాన్ని గురించి వ్యాఖ్యానించింది.

తన స్వార్థానికి ఎవరిని బలితీసుకుంటానికైన వెనుకాడని నీచపు మనస్తత్వమున్న స్త్రీ రాజమ్మ,మాట నేర్పరితనంలో ఎదుటి వాళ్ళని బోల్తా కొట్టించగలదు. లోకతత్వాన్ని జీర్ణించుకున్న వ్యక్తి గనుక ఆగాడిలోనే తిరిగింది గానీ, తన కంటే పెద్దవాడైన బుగతికి, యుక్తవయస్సులోనే తన జీవితాన్ని అర్పణజేసానని గాని, ఆ తరువాత హెడ్డు విషయంలోగాని, తదనంతర సంఘటనలు, మందుల భీముడు మోసం జేస్తున్నప్పుడు గాని,-సాంఘిక అవగాహనతో ఎదిరించలేక పోయింది. మధ్య తరగతి మనస్తత్వానికి దగ్గరగా ప్రవర్తించింది. రాజమ్మ.

## 3. భీమసేనరావు

ఛైర్మన్ భీమసేనరావు పూర్వీకులది సంపన్న వర్గాలకి "మేలు గులాములుగా ఉండే వంశం''. బ్రిటీషు దొరలకి నమ్మిన బంట్లుగా ఉండి, సంపదలతో తుల తూగిన వంశం. కాని భీమసేనరావుకి యుక్త వయస్సు వచ్చే నాటికి మొత్తం సంపద హరించుకు పోతుంది. ఇతనికి అన్ని ఇతర 'కళలు' తెలిసినా, తండ్రి చనిపోయే నాటికి 'బ్రతుకు తెరువేమిటో' మాత్రం తెలియలేదు. "రాజు గారింట్లో పెంపుడు పిల్లగా పెరిగిన పులిపిల్ల అకస్మాత్తుగా అడవిని పడిపోయినట్లు అతను జీవితంలో భయపడుతూ నిల్చున్నాడు. జీవితంలో నిలబడ్డం తెలియక భయపడ్డాడు.''[23] దుర్గమారణ్యపు మధ్య భాగంలోచిక్కుకున్నట్టుంది అతని జీవితం. వంశానుగత వాసన మాత్రం అతనిని వీడలేదు.

భీమసేనరావుది "మంచి పర్సనాలిటీ" "ఆ పర్సనాలిటీలోని పవరు " గ్రహించి ఆయన బంధువు భీ.సే.రావుని తన అగ్గి పెట్టెల ఫ్యాక్టరీకి మేనేజరుగా నియమిస్తాడు. ప్రతి వ్యక్తి జీవితానికి కొన్ని మలుపులుంటాయి. అలానే భీ.సే రావు జీవన ప్రవాహం ఇక్కణ్ణుంచి మలుపు దిరిగి మహోధృతంగా ముందుకు సాగింది. దీంతో భీ.సే రావు ఒక ముఖ్యమైన జీవన సూత్రాన్ని కనిపెట్టాడు. అదే మంటే తను "తనే ముఖ్యం తను లేకపోతే లోకమూ లేదు, భగవంతుడూ లేడు. ఏమీ లేదు తను లేక పోతే సర్వం శూన్యం''[24] అని నిర్థారించుకున్నాడు. దీన్నే ఫ్రాయిడ్ పరిభాషలో 'ఇగో' అంటారు. తనపై తనకు ఆత్మవిశ్వాసముండవచ్చుగాని, మితిమీరిన అహంకారం ఏవ్యక్తికి పనికిరాదు.

"అవతల వాణ్ణి, అణచి పారేసి అదే దైవ నిర్ణయమని, దైవ న్యాయమని సమర్థించడానికి, దైవం దొరికినంత వీలుగా ప్రపంచంలో మరేదీ లేదనే విషయం భీమసేనరావు గారు ఏనాడో గ్రహించేరు''[25] దైవం పేర,మతం పేర అణచివేత విధానం కర్మం, రాత, గీత, పేర్లతో తరతరాల నుండి ఎలా సాగుతుందో ఈ సంభాషణ ద్వారా రావి శాస్త్రి స్పష్టపరచారు. అందుకే "Religion is a opium" అని మార్క్స్ మహనీయుడు ప్రవచించింది.

అందితే జుట్టు, లేకుంటే కాళ్ళు, మానవ సంబంధాన్ని కేవలం లాభ నష్టాల బేరీజు దృష్టిలో కలుషితం జేసిన పెట్టుబడిదారీ వర్గాల ప్రతినిధి భీమసేనరావు. మూరెడు లాభానికి, చారెడు ఖర్చు బెడతానికి వెనుదీయడు. డబ్బు వస్తుందంటే ఏ అడ్డమైన గడ్డి కరవటానికైనా వెనుదీయడు. జనాన్ని మతం మత్తు ఊబిలో దింపటానికి పూజలు నిర్వహించే 'పరమ భక్తుడు'.

"తను తప్ప సర్వం మిథ్య''[26] అనేంత దురహంకారం బలిసిపోయిన వ్యక్తి ఇతను. నియంతృత్వపు ధోరణి, బడ్జెట్ మనస్తత్వమున్న భటాచోర్.

ఈ లోకంలో డబ్బుకన్నా బంగారం కన్నా విలువైంది మరొకటి లేదనే మనస్తత్వమున్న భీ.సే.రావు; జమిందార్ల వంశానికి చెందిన పురుషోత్తం కూతురు శ్యామలని తన ముప్ఫైవ ఏట పెళ్ళి చేసుకుంటాడు. పెళ్ళికి ముందే ప్రేమలోబడ్డ శ్యామల తన శపథం ప్రకారం 'పద్మజ'ని కని ప్రాణం దీసుకుంటుంది. ఎన్నో ఒడుదుడుకుల్ని

తట్టుకున్న భీ.సే.రావు ఈ సంఘటనలతో చలించిపోతాడు. పద్మజపేర అపారమైన ఆస్తి విల్లు ద్వారా సంక్రమించటం, శ్యామల అక్క, విధవరాలైన విశ్వమోహిని భీ.సే.రావు పంచన జేరటంతో మళ్ళీ అతని జీవిత వేగం పుంజుకుంటుంది. చక్కర ఫ్యాక్టరీ, బ్యాంకు డైరెక్టర్ పదవులు, నాలుగుసార్లు పురపాలక సంఘాధ్యక్ష పదవి.... ఇలా భీ.సే.రావు లేకుండా ఏ పని జరగనంతటి ప్రముఖ్య వ్యక్తి అయ్యాడు.

"ప్రతి విషయం వెనుక ఓ స్త్రీమూర్తి ఉంటుంద"నే విధంగా భీ.సే.రావు అభివృద్ధిని మెట్టుమెట్టు కట్టుకుంటూ వెళ్ళింది; విశ్వమోహిని.

దాదాపు 55 సం॥ల వయసులో భీ.సే.రావుకి చిన్న యాక్సిడెంట్ జరిగి ఆసుపత్రి పాలవుతాడు. ఆ తరువాత 'రాజు-మహిషి' కథ ఎంతో జరిగింది; అయినా భీ.సే.రావుతో ముడిబడిన కథేమీ ఉండదు.

సాంఘిక పరిస్థితులను తనకు అనుకూలంగా మలచుకొని పైకెగిసినాక, ఊతమిచ్చిన నిచ్చెనను కాలితో తన్ని; అధికార, ధనమదంతో మొత్తం సమాజాన్ని, తన గుప్పెట్లో బెట్టుకుని 'తను' లేకుంటే ఏదీ సాగదనే దురహంకారి భీ.సే.రావు ఫ్యూడల్ మనస్తత్వం, పెట్టుబడిదారీ లక్షణాలు జీర్ణించుకున్న వ్యక్తి.

"మానవులు తమ చరిత్రను తాము నిర్మించుకుంటారు. కాని తమ ఇష్టం వచ్చినట్టు కాదు. ఈ పరిస్థితులు వారి చెప్పుచేతలలో ఉండవు. గతం తమకు అందించిన పరిస్థితి ఆధారంతో వారు కృషిచేయాలి"[27] అనే సత్యాన్ని విస్మరించి అంతా 'తనే'ననే అభిజాత్యం, అహంకారం ఉన్న పాత్ర భీ.సే.రావు.

**4. మందుల భీముడు**

అసలు పేరు భీమసేనరావు అయినా ఓ మందుల షాపు వ్యవహారాలు చూడటంవల్ల ఇతనికి మందుల భీముడనే పేరు స్థిరపడింది. "అతనికి ధైర్యమూ, పట్టుదలా ఉన్నాయని అతనంటే ఇష్టం వున్నవాళ్ళంటారు. అతనికి సిగ్గూ, లజ్జా లేవని అతనంటే ఇష్టంలేనివారంటారు. అతణ్ని చూస్తే ఆ రెండు మాటలూ కూడా నిజమే అనిపిస్తుంది"[28] ఈ రెండు ధోరణుల మిశ్రమం భీముడు.

కౌన్సిలరైనాక భీముడి జీవితం మధ్యతరగతి క్రిందివర్గం నుండి పెట్టుబడిదారీ వర్గంవైపు పరుగులుదీసింది. బాగుపడటానికి వక్రమార్గమే దగ్గరి చుట్టమని" సిగ్గు, దైవభీతి, లజ్జ, పాపభీతి విడిచిపెట్టిన మార్గమే "భాగ్యలక్ష్మికి దగ్గర మార్గము"[29] అని నిశ్చయించుకొని వ్యాపారానికి, రాజకీయానికి ముడిబడి వున్న లంకెని అతను పట్టుకున్నాడు. రాజకీయాధికారాన్ని తన ఎదుగుదలకు 'బుల్లెట్‌ప్రూఫ్'లా వాడుకున్నాడు. తన అభివృద్ధికి ఆటంకంగా ఉన్న వాతావరణాన్ని రాజకీయాధికార అండతో అణచి వెయ్యటమే అధికార సూత్ర మూల రూపం గనుక ఆ ఆయువు పట్టుని భీముడు బాగా పట్టుకున్నాడు.

సమాజాన్ని మాయ, మోసం, దగ మరేదైనాగాని జేసి "మనం పెరగడం మనకి మంచిదన్నమాట. "అవతలోడి దెబ్బకి దొరక్కుండా మనం పెరగాల లేకపోతే ఆడే మనకి దెబ్బతీస్తాడు. మనం పోతే అడు ఏడ్డు. అంచేత ఆడుపోతే మనం ఏడకూడదు..." దెబ్బకి దొరక్కుండ మన బాక్కోసరం మనం ఏచ్చేస్తే అదే నాయెం"[30] అని తన కొడుకు

రంగారావుకి భవిష్యత్ హితబోధ చేశాడు భీముడు. ఈ బోధనా పునాదిపైన భీముడి జీవిత గోపురం రూపొందింది.

ఈ సూత్రంతోనే రంగారావుని రామారావు నుండి విడదీసి, అతని ఓటమికి, పరోక్షంగా మానసిక హింసకు తండ్రీ కొడుకులు కారకులయ్యారు. మనుషుల్ని లాభనష్టాల సరుకుల్లో లెక్కగట్టి ప్రసాద్, రాజమ్మల తగవులో తలదూర్చి, రాజమ్మ డబ్బులతో, ప్లీడర్ ముకుందుణ్ణి మంచి జేసుకొని తన కేసుల వ్యవహారాలు చక్కబెట్టుకున్నాడు భీముడు. రాజమ్మకి మాత్రం అతనిది 'కుచ్చితం బుర్ర'ని తెలుసు. స్వార్థబుద్ధితోనే "నా సెయ్యట్టి ఆణ్ణి కొట్టించడానికి పయనవైనా"[31] వని రాజమ్మ భీముడితో అన్నమాటలు అందుకు ప్రత్యక్ష సాక్ష్యాలు; రాజమ్మలాంటి వారు భీముణ్ణి ఆశ్రయించటానికి కారణం మరో దారిలేక; ఉన్న చట్రం నుండి బయటబడలేక, ఈ సానుకూల పరిస్థితుల్ని ఈ దుష్టులు బాగా వినియోగించుకుంటం వ్యవస్థాగత లక్షణమని తెలియజెయ్యటానికి రావిశాస్త్రి ఇలాంటి పాత్ర సృష్టి జేశారు. చివరికి రాజమ్మ "తెలిసిన వెధవే ద్రోహం చేస్తాడు"[32] అని భీముడి మోసాన్ని వెల్లడిజేసింది.

"భూమి తనచుట్టూ తాను తిరుగుతూ, ధనవంతుడు చుట్టూ తిరుగుతుందని' ' "తిలక్ చెప్పిన అర్థంలోనే" బుర్రలు మార్చే ఇద్యకైనా మనకి డబ్బుండాలిగాని బుర్రుండక్కర్లేదు"[33] అనే ధనపిచ్చి, సర్వం డబ్బుతోటే సాధించవచ్చనే మూర్ఖపు దృష్టిగలవాడు భీముడు. ధన; అధికార రుచి మరిగాడు గాబట్టే, నానాతంటాలుబడి ఛైర్మన్ కూతుర్ని తన కొడుక్కి చేసుకోవాలని విశ్వప్రయత్నం జేస్తాడు. ఈ మత్తులోనే కూతురు హెడియా, అదుపుదప్పి ప్రవర్తిస్తున్నా ఈ తండ్రి పట్టించుకోలేదు. "కర్ణుడు కూలిపోతే దుర్యోధనుడు మిగలనట్టు"మన వర్గ ప్రయోజనాల్ని మనం సంరక్షించుకోకపోతే, అది మొత్తంగా మనందరికి దెబ్బవుతుందనే సూత్రాన్నిగూడ భీముడు న్యాయవాదుల సంఘాధ్యక్షుడి దగ్గర వెల్లడిస్తాడు. అంటే తమ అస్తిత్వం కోసం, అవతలి వర్గాన్ని పూర్తిగా అణచివెయ్యటం, అణగదొక్కటం కోసం, చట్టాన్ని రాజ్యాంగాన్ని తమ ఇష్టానుసారంగా వ్యాఖ్యానించుకొని, తమ దారిలో పెట్టుకుంటానికి ఏ అడ్డదారి దొక్కటానికైనా వెనుదీయరాదనేది భీముడి ధర్మం. భీముడు పగబడితే ఎవణ్ణైనాసరే "ఆణ్ణి మర్చి పోను, మంట్లో కలిపేదాక ఆణ్ణి మరింక ఒగ్గ"[34]ననే సంభాషణగూడ అతని వర్గ స్వభావాన్ని సూచిస్తుంది.

మానవ విలువలు లుప్తమై వలువల్లా విడిచిపెడుతున్న కాలంలో స్త్రీ భోగ వస్తువుగా, బిడ్డలగనే యంత్రంగా మాత్రమే గనిపిస్తుంది భీముడి లాంటి వారికి. కాళ్ళరాధ సంబంధాన్ని; భీముడికి వరసకి కూతురైనా, విడవకుండా కాటేసిన నుంగ పరిస్థితిని ఈ కోణం నుండే చూడాలి.

ధనార్జన, దురాశ, దుర్మార్గత్వం, స్త్రీలోలత్వం, అణచివేత, పీడన అధికార కాంక్షకు ప్రతీక భీముడు. మధ్యతరగతి నేపథ్యంగల పాత్ర అయినా, స్వభావరీత్యా ఉన్నతవర్గాల ప్రతినిధి. రూపం, వేషంలో మధ్యతరగతిగా కనిపించిన; ప్రవృత్తి మాత్రం పైవర్గాలదే; పైశాచిక పద్ధతిలో పామరుల్ని అణచివేసే విధానమే స్వార్థ, కుటిల నైజమే.

## 5. భవాని శంకర్ ప్రసాద్

భవాని శంకర్ ప్రసాద్ శాంతమ్మ కొడుకు. సాధారణ మధ్యతరగతి కన్న దిగువరేఖ నున్న కుటుంబ వాతావరణం ఇతని చుట్టూ అలుముకొని ఉంటుంది. సాటి వ్యక్తులపై సానుభూతి, ఆపదలోనున్నవారిని ఆదుకుంటం, మానవతా స్పృహతో వ్యవహరించటం ఇతని లక్షణాలు.

అపోహలకు పోకుండ, సాదాసీదాగా తెలిసినవాళ్ళ జాగాలో ఒక కమ్మలింటి పాకవేసుకొని, తల్లి శాంతమ్మ, తను అందులోనే ఉంటున్నారు. ఆ పాక చుట్టూతా గేదెలు కట్టేస్తూ రాజమ్మే రాజుతో (ప్రసాద్‌ని రాజు అని కూడ పిలుస్తారు) తగువు రావటానికి కారకురాలైంది. రాజమ్మే మితిమీరిన దురుసుతనంతో రాజుతో తగాదాపడి, నలుగురిలో అతణ్ణి అవమానపరచటమే గాకుండా, అందరూ కలిసి చితక బాదుతారు.

తనకు మాట సాయంగా వచ్చిన అమ్మల్ని, రాజమ్మ చావగొడుతుంటే, ఆ అమానుషాన్ని భరించలేక రాజు రాజమ్మపై తిరగబడతాడు. కళ్ళముందు జరుగుతున్న దుర్మార్గత్వాన్ని సహించలేని వ్యక్తి రాజు.

పాముకాటుకి గురికానున్న పద్మని, తన ప్రాణాలను కూడ లెక్కచెయ్యకుండా కాపాడి ఆమె ప్రేమకు పాత్రుడయ్యాడు ప్రసాదు. ఆత్మీయ సంబంధాలు తరిగిపోతున్న కాలంలో ప్రసాద్‌లాంటి వ్యక్తులు ఆదర్శవంతులు.

తమ బంధువుల వ్యక్తి జబ్బుతో బాధపడుతూ మందులకు కూడ డబ్బులు లేకపోతే అతనికోసం ఇల్లిల్లు తిరగటం, ప్రసాద్‌లోని మానవత్వాన్ని గుర్తుజేస్తుంది. ఇతని ప్రవర్తనను, మంచి సౌందర్యాన్ని కాసేపు గమనించిన గిరిజ ఇతనంటే అభిమానపడుతుంది. ఎక్కువ ఫ్లాష్ బ్యాక్‌లతో నడిచిన ఈ నవలేతివృత్తంలో భవాని శంకర ప్రసాద్ పాత్ర ప్రాముఖ్యం గలిగినది. ప్రసాద్, రాజమ్మల గేదెల తగువుమీదే నవలేతి వృత్తం అధికభాగం నడిచింది.

పాక విషయంలో కౌన్సిలర్ భీమసేనరావుతో మాట్లాడిన పద్ధతి ప్రసాదు చాతుర్యాన్ని, మాట నేర్పరితనాన్ని సూచిస్తుంది. "బాధల వేదన భరించ"టానికి ఏదో ఒక శక్తి ఉండాలి. ఆ శక్తి వల్లే తన తల్లి వాటిని నెగ్గుకు రాగలిగిందని చెప్తు "మా అమ్మ చాల కష్టాలు పడిందండీ"[35] అని గిరిజతో చెప్పిన మాటలు అతనికి తల్లి మీదున్న మమకారానికి సూచికాలు.

ప్రసాద్ "మంచివాడని" ముసలమ్మ గిరిజతో చెప్పిన విధం, అమ్మలు, బంగారి, రాజమ్మ తగువులో ప్రసాద్‌కి నైతిక మద్దతు తెలిపిన తీరు, అతని ప్రవర్తనకు ఆకర్షితురాలైన పద్మ, గిరిజల ప్రేమాయణం - ఇవి భవానీ శంకర్ ప్రసాద్ సజ్జనత్వాన్ని తెలుపుతున్నాయి. చుట్టూతా కమ్ముకొని ఉన్న వ్యాపార సంస్కృతిని, అమానవీయ వాతావరణాన్ని అవకాశవాద పరిస్థితులను అధిగమించి, సగటు వ్యక్తి సజ్జనత్వాన్ని వెల్లడించిన పాత్ర ప్రసాదు.

## 6. గిరిజ

గిరిజ 'పేదింటిపిల్లాకాదు' పెద్దింటి పిల్లాకాదు ఓ మధ్యతరగతి కుటుంబ యువతి. ఆమె తండ్రి డెప్యూటీ తాసీల్దారుగా పని జేసి మరణించాడు. తల్లి వర్ధనమ్మ డబ్బు విషయంలో అతి జాగ్రత్తగా ఉంటుంది. భవాని శంకరం అర్ధరాత్రి డబ్బు కోసం తమ ఇంటికి వచ్చినప్పుడు, మొదటిసారిగా అతనిని చూసిన గిరిజ గూడ అందానికి, గుణానికి ఆకర్షితురాలవుతుంది. గిరిజ గూడ అందంగానే ఉంటుంది.

గిరిజకి ఎదుటి వాళ్ళ మనస్సుని గ్రహించగల నేర్పరితనముందని "డబ్బేమైనా కావాల్సుందా" అని ప్రసాద్‌ని ప్రశ్నించిన సన్నివేశాన్ని బట్టి తెలుస్తుంది. అతను పాతికరూపాయల కోసం వాళ్ళ ఇంటికి వస్తాడు. కాని తన తల్లి ఆ పాతికరూపాయలు లేవని చెప్పి ప్రసాదుకి ఇవ్వకుండ అబద్దం ఆడినప్పుడు గిరిజ మనసు విలవిల్లాడుతుంది. ఇంట్లో డబ్బులున్నాయని గూడ తల్లికి గిరిజ గుర్తుజేస్తుంది. ఆపదలోనున్న వారిని ఆదుకుంటానికి ఆయువక వయస్సులో గిరిజ ఎంత తపన పడిందో గ్రహించవచ్చు. 'మనకవసరం ఒచ్చినప్పుడు వాళ్ళు మనకి సాయం చేస్తారా?"[36] అని గూడ గిరిజ తల్లిని నిలదీస్తుంది. అత్యవసరమైనప్పుడు ఎవరికీ మనం సాయం చేయకపోతే ఇతరులెవరైన మనకెందుకు సాయం చెయ్యాలి? చేస్తారు? అనే నిజాయితి గిరిజలో ఉంది. ఏ మాత్రం మానవత లేకుండా నాపెళ్ళి కోసమే ఈ డబ్బు కూడబెడుతుంటే "నాకు పెళ్ళే అక్కర్లేదు' ' అని తెగేసి చెప్పగల మానవత, చిత్తశుద్ధి గిరిజలో తొణికిసలాడుతుంది. పాతిక రూపాయలు తీసుకెళ్ళి ఆపదలోనున్న ఆ వ్యక్తిని కాపాడటమే సమంజసమనిపించింది. ఈ డబ్బు తీసుకెళ్ళేలోగానే అక్కడ ఆ వ్యక్తి మరణించినందుకు గిరిజ, ఆ పాపం తనవల్లే జరిగినట్టు, తమద్వారా అందవలసిన డబ్బు సకాలానికి అందకపోవడం వల్లే ఆయన మరణించినట్టు బాధపడటం; మూర్ఛచెందటం ఆమెలోని మానవతకు మనిషికీ మనిషికి మధ్య ఉండవలసిన ఆత్మీయత, అనురాగానికి, ఆదరణకు, నిదర్శనం. మళ్ళీ ఆ డబ్బు తీసుకొచ్చి గిరిజ, తల్లికి అప్పజెప్పింది.

గిరిజ ఈ సంఘటనతో ప్రసాదుకు బాగా దగ్గరై అతని మీద ప్రేమాభిమానాలు పెంచుకొని, రాజమ్మ తగువు వలన ఆసుపత్రికెళ్ళింది. ఆనాటి నుండి కాలేజీ కూడ మానేసి ఆసుపత్రిలో ప్రసాదునే అంటిపెట్టుకుని ఉంది. మధ్యతరగతి జీవితాల్లో నుంచి మందారంగా వికసించిన మానవతా కుసుమం గిరిజ. రావిశాస్త్రి రచనా దృక్పథానికి, ఆయన మార్గానికి గిరిజ సన్నిహితురాలు.

## 7. రంగారావు

రంగారావు మందుల భీముడి కుమారుడు, పద్మవెనుక వున్న ఆస్తిని జూసి, దానికి తోడు తండ్రి భీముడు ప్రోత్సాహంతో ఆమెను వన్‌సైడెడ్‌గా ప్రేమిస్తున్న అపర ప్రేమికుడు. తన అక్క హెడియా ద్వారా ప్రసాదు, పద్మ ప్రేమించుకున్నారనే సంగతి తెలిసి వాళ్ళు అంతమైపోవాలని కోరుకున్న వినాశకారి రంగారావు.

స్థిరత్వం లేని కుటిల మనస్కుడు. సోనాప్యారి కంపెనీలోని సహోద్యోగి, అందరి మంచీ చెడు చూసే రామారావుతో స్నేహంచేసి తన తప్పిదాలకు మద్దతు

ఇవ్వలేదనే సాకుతో, కుట్రజేసి అతనికి ద్రోహం చేసిన దుర్మార్గుడు రంగారావు. శ్రమలేకుండా, అడ్డదారుల్లో అనతి కాలంలోనే ఎదిగి పోవాలనే దురాశపరుడు. "మంచిగా ఉంటే మంచోణ్ని! లేకపోతే దెబ్బకి దెబ్బ తీయగల్ను"[37] అని పద్మ ప్రసాద్‌ల ప్రేమ విషయాన్నుద్దేశించి పలికిన మాటలు ఇతని స్వభావాన్ని పట్టిస్తున్నాయి. ఇటు నుంచి ప్రసాద్‌ని అటు నుంచి రాజమ్మను రెచ్చగొట్టి తగాదా రేపిన తుంటరి రంగారావు. అవకాశవాది, అనాలోచనా పరుడు. మధ్యతరగతి ముఖం కప్పుకున్న కుహనా వ్యక్తి రంగారావు.

**8. పద్మ**

చైర్మన్ భీమసేనరావు ఏకైక కూతురు. పుడుతూనే తల్లిని కోల్పోయి, పెద్దమ్మ విశ్వమోహిని పెంపకంలో పెరిగింది. అహంకారం, అసూయలో తక్కువేంగాదు, అయినప్పటికి మంచికి తలొగ్గే ప్రవృత్తి గూడ ఆమెలో ఉంది. భవాని శంకర ప్రసాద్ పాముల ప్రమాదం నుండి తనని కాపాడినప్పటి నుండి అతనితో ప్రేమాయణం సాగించటం ఇందుకు మంచి నిదర్శనం.

రంగారావు లాంటి వాళ్ళను వదిలించుకుంటానికి ఆమె చేసిన ప్రయత్నాలు నిష్కళంక ప్రేమకు సూచికాలు. ఈమెలో తొందరపాటు తనం అధికం. తండ్రిని అమితంగా అభిమానించటం వల్ల ఆయన్ని ఆసుపత్రిలో చేర్చాలని చెప్పిన డాక్టరు సలహా విని హిస్టీరియాకి గురైన దుర్బల మనస్వి. పద్మ జీవితం ఉగాది పచ్చడి లాంటిది. సంపన్న వర్గపు అవలక్షణాలున్నా సహచరులతో మెలిగేప్పుడు మానవ సంబంధాలకు లోటు రానియ్యకుండా నడుచుకోగల విజ్ఞత పద్మలో ఉంది. తన చుట్టూతా జరుగుతున్న సంఘటనలకు స్పందించే హృదయం పద్మకుంది.

**9. వర్ధనమ్మ**

ఈమె గిరిజతల్లి. అతి జాగ్రత్తపరురాలు. బిడ్డల కంటే గూడ బంగారం, డబ్బు ముఖ్యమనే పిసినారి స్త్రీ. అప్పులకి, ఓటు వెయ్యటానికి, ఆఖరికి ముష్టి వెయ్యటానికి అన్నింటికి రూల్స్ ఫ్రేమ్ జేసుకొని లక్ష్మణరేఖల్లా వాటి వెంటే పరుగులు దీస్తుంది వర్ధనమ్మ. డబ్బు-డబ్బు- దానికే వర్ధనమ్మ ప్రాముఖ్యం ఇచ్చేది. స్వభావరీత్య ఆర్ధ్రతవున్నా, భద్రతలేని లోక పరిస్థితులు, భర్తలేని సంసార బాధ్యతలు, బిడ్డల చదువులు, పెళ్ళిళ్ళు, ఈ జంజాటనమంతా ఆమె అలా మారటానికి దోహదపడ్డాయి. సామాజికి వాతావరణం వల్ల ఆమె కఠిన మనస్కురాలైంది.

**10. శాంతమ్మ**

పధ్నాలుగు సంవత్సరాలకే శాంతమ్మ సంసార జీవితం తెల్లారి పోయింది. భర్త చనిపోయిన ఆర్నెల్లకి ఆమె భవాని శంకర ప్రసాద్‌ని కన్నది. తన చుట్టూ అలముకున్న వాతావరణానికి అర్ధమయ్యే మంచి మనసున్న వ్యక్తి శాంతమ్మ. సాంఘిక పరిస్థితులు ఎన్ని వెర్రితలలు వేస్తున్నా కొడుకుని కనిపెట్టుకొని, నీతిగా, నియమంగా, సామాజిక చట్రంలో మగ్గి పోతుందే గాని, వాటిని అధిగమించలేదు. ఆమె పేరుకి తగ్గట్టుగానే 'శాంతం' గానే జీవించింది.

**11. శ్యామల**

ఉత్తమ జమీన్దారైన పురుషోత్తం రెండవ కుమార్తె శ్యామల. పట్టుదల, పౌరుషం ఈమెకు జాస్తి. తమ ఇంట్లో బంట్రోతుగా పనిజేసిన వ్యక్తి కొడుకుని ప్రేమించింది. అతణ్ణే పెళ్ళి జేసుకుంటానని చాలా మొండిగా తండ్రికి చెప్పటం ఆమె నిబద్ధతను తెలియజేస్తుంది. కాని తండ్రి ఆకుర్రవాణ్ణి చంపించి, భీమసేనరావుకు ఈమెను కట్టబెట్టినప్పుడు "నాతల్లి ఆత్మ సాక్షిగా ఆభగవంతుడి సాక్షిగా మీతో చెప్తున్నాను. ఈ రోజు నుండి తొమ్మిది మాసాలలోపున మీరు నా శవాన్ని చూస్తారు. తప్పదు"[38] అని తెగేసి చెప్పి, చెప్పినట్టుగానే పద్మకి జన్మనిచ్చి ఆమె బలవంతంగా ప్రాణాలు తీసుకుంటుంది. అన్నమాటను చెల్లించుకొనే మొండితనం ఆమెలో ఉంది. సమస్యకు చావు పరిష్కారం కాదు గదా!

**12. విశ్వమోహిని**

విశ్వమోహిని శ్యామల అక్క. శ్యామల లాగానే మొండితనం, పౌరుషం, అహంకారం, ఈమెలో అధికం. తను అనుకున్నదిసాధించే దాక నిద్రపోని మనస్తత్వం. విశ్వమోహిని భర్త స్వాభావికంగా మంచి వాడే అయినా స్త్రీలోలత్వం ఉంది. పెళ్ళి జరిగిన మరునాటి నుండే ఒకరికొకరు పంతాలకు పోయి జీవితాల్ని నాశనం చేసుకున్నారు. విశ్వమోహిని మొండిపంతం ఒక విధంగా ఆమె భర్త చావుకి కారణం.

భీమసేనరావు దగ్గరకు పద్మను తీసుకెళ్ళినపుడు గూడ చాల ఆభిజాత్యాన్ని ప్రదర్శిస్తుంది. అయితే భర్త చనిపోయినాక ఎవరితో ఏవిధమైన శారీరక సుఖాన్ని మాత్రం ఆమె కోరుకోలేదు. ఈమె రాకతోనే భీమసేనరావు జీవితం పూర్తిగా మారిపోయింది. "ప్రతి విజయం వెనుక ఓ స్త్రీ మూర్తి ఉంటుం"దనే సూక్తిని విశ్వమోహిని అక్షరాల నిజం చేసింది. అహంకారంతో పాటు విపరీతమైన ఆత్మవిశ్వాసం ఈమెలో అధికం. కొంచెం పట్టు విడుపుల మనస్తత్వముంటే ఈమె జీవితం మరోలా ఉండేది. సాధారణ జీవితాలకన్నా భిన్నమైన వ్యక్తిత్వం ఈమెది.

**13. రాధ**

చిన్నవయసులో పెళ్ళి, ముచ్చటైన జీవితం పెళ్ళైన మూడేళ్ళకే ముళ్ళకంపల పాలై, మరో మూడేళ్ళకి భర్త చనిపోవడంతో, కూతురు మంగతో రాధ జీవితం గడపటం కనాకష్టమైపోయింది మంత్రసాని వృత్తితో రాధ కొద్దిగా నిలదొక్కుకో గలిగింది. ఆ తరువాత మందుల భీముడి ప్రేమ వలలో తన సర్వస్వం ఆభీముడేనని "ప్రేమగుడ్డిద' 'నే సూక్తికి సాక్షిగా జీవితాన్ని గడిపింది. తన సంపాదనంతా వాడికి ధారబోసింది. కాని భీముడికి ఇతర స్త్రీలతో సంబంధముందని తెలిసి కుమిలి పోతుంది. అతను కౌన్సిలరైతే తనకు దక్కడని కౌన్సిలర్ కాకూడదని మొక్కుకుంటుంది. భీముణ్ణి దక్కించుకుంటం కోసం, అతనికి తనకూతురు మంగని కట్టబెడదామనే దాక ఆమె గుడ్డి ప్రేమ వెళ్ళింది. ఎంత గాడాంధంగా ఆమె భీముణ్ణి ప్రేమించిందో దీనిని బట్టి తెలుస్తుంది. మంగ జీవితాన్ని కాటేసిన భీముడు ఆమెని శాశ్వతంగా వదిలించుకునేసరికి, మంగ జీవితం నాశనమైపోయిందని, భీముడు తనకు దక్కకుండా పోతున్నాడని కుమిలిపోయిన రాధ [illegible]ంగా ఈలోకం నుండి దూరమైపోయింది. నిర్మల ప్రేమ, అమాయకత్వం,

నమ్మినవాడికి సర్వస్వం ధారపోసి, జీవితాన్ని అర్పణజేసి, క్రౌన్వోత్తిలా తమ బ్రతుకును అంతం జేసుకొనే ఆడవాళ్ళ జీవితాలకు ప్రతినిధి రాధ.

**14. అమ్మలు**

అన్యాయాన్ని, దుర్మార్గాన్ని సహించలేని జీవిత వాసన గల అట్టడుగు వర్గ స్త్రీ.

**15. బంగారి**

జీవిత ఎత్తు పల్లాల్ని చవి చూసింది. చిన్నచిన్న బడ్డీ కొట్టు నడుపుకునే స్త్రీలలో వివిధ వ్యక్తుల మనస్తత్వాన్ని గ్రహించి మాట్లాడగల నేర్పరితనం, అజమాయిషి చెయ్యగల నేర్పు పుష్కలంగా ఉంటుంది. ఆశక్తి బంగారిలో చాల ఎక్కువ. దౌర్జన్యం, దుర్మార్గం, కళ్ళముందు జరుగుతుంటే ఎదిరించగల ధైర్యం గూడ ఆమెకుంది.

**16. ముకుందరావు**

ముకుందుడికి ఆధునిక కాలంలో ఉండదగిన అన్ని లక్షణాలు ఉన్నాయి. అధికార, రాజకీయ నాయకులతో మంచి సంబంధాలు, పనులు చక్కబెట్టుకొనే నేర్పు, సామర్థ్యం ఉన్నాయి. ముకుందుడు రాసిక్యంలో గూడ తక్కువ్వాడేంగాదు మరదలితో హాయిగా కాలక్షేపం జేస్తున్నాడు. తిమ్మిని బమ్మిని జెయ్యటంలో తన లా పాయింట్లతో బాగా తలబండిపోయాడు; గంగరాజు; రాజమ్మ కేసు విషయంలో రాజమ్మ; ముందు; మూడు వందలిస్తే తను ఇలాంటి చిన్న కేసులు వాదించటం లేదని, అసలు క్రిమినల్ సైడు వెళ్ళటం లేదని నీలిగి, ఆ తరువాత భీముడి సలహాపై రాజమ్మ మరో రెండు వందలు ఇచ్చినాక కేసు విషయంలోకి సరాసరి దిగుతాడు. క్లయింట్స్ దగ్గర డబ్బు గుంజటంలో అవలంభించాల్సిన నక్క జిత్తులన్నీ ఇతనికి బాగా తెలుసు.

బార్ అసోసియేషన్‌ని అడ్డం బెట్టుకొని జూనియర్‌ని మేజిస్ట్రేటు అవమానపరచాడనే సాకుతో, ఆ మేజిస్ట్రేటుపై నిరసన తీర్మానాన్ని ప్రతిపాదింప చెయ్యటానికి రంగం సిద్ధంజేసి; చివరికి జిల్లా జడ్జి ద్వారా ముకుందుడు మేజిస్ట్రేటుతో రాజీపడతాడు. తాను అనుకున్న పని సాధించటానికి ఏదో ఒక సాకు వెతుక్కొని మందీ, మార్బలంతో పని సాధించే సత్తా ఉన్నవాడు ముకుందుడు. అందుకే ఇతణ్ణి గురించి భీముడు "మెత్తంగుంటాడేగాని మొఖ్మల్ పులి"అని సర్టిఫికేటు ఇచ్చింది. రావిశాస్త్రి ముకుందుణ్ణి గురించి జీవితపు "విలువలన్నీ రూపాయణాపైసల్లోనే ఉంటాయని ఆ తరువాత ఆయన తెలుసుకున్నారు."[39] అని చెప్పిన మాటలు ప్లీడరు ముకుందుడు వ్యక్తిత్వాన్ని పట్టిస్తాయి. అంతా "పసిడి గలుగువాని బానిస కొడుకులు"అన్న వేమన్న సూక్తి ఈ వాస్తవాన్ని ఇంకా సానబడుతుంది.

రాజ్యాంగ, న్యాయ వ్యవస్థలలోని లొసుగుల్ని ఆసరా జేసుకొని, తమ తెలివి తేటలు, తెలివి తేటలకంటే మించిన నక్క జిత్తులతో క్లయింట్స్‌ని ఎలా మోసగించి ప్లీడర్లు ధనార్జన జేస్తున్నారో తెలుసుకుంటానికి ముకుందుడి పాత్ర ఒక దర్పణంలా ఉపయోగపడుతుంది. తన న్యాయవాద వృత్తి; అనుభవం రావిశాస్త్రి ముకుందుణ్ణి బాగా లోతుగా చూసి మలచటానికి ఉపయోగపడింది.

కోర్టుల తతంగం గురించి రావిశాస్త్రి ఆయా సన్నివేశాల కనుగుణంగా పాత్రలను మలచిన తీరు ఆయన అనుభవాన్ని లోక పరిశీలనను తెలియజేస్తున్నాయి.

### 17. చిట్టిబాబు

చిట్టిబాబు ముకుందరావు ప్లీడరు దగ్గర జూనియర్‌గా పనిజేస్తున్నాడు. ఇంతకుముందు అభ్యుదయ వాదిగా వుండేవాడు. ప్రస్తుతం వయసు ప్రభావంవల్ల, అనుభవంవల్ల డబ్బుమీద అభిమానం ఎక్కువగా పెట్టుకున్నాడు.

చిట్టిబాబుకి ప్రభుత్వంతో పోరాడుతున్న సంజకెంజాయ పార్టీతో సంబంధాలు ఏర్పడినప్పుడు చాలా సంతోషించాడు. కాని అనతి కాలంలోనే చిట్టిబాబు పార్టీ రహస్యాలు పోలీసులకందించి పార్టీ నాశనానికి తోడ్పడిన ద్రోహి. ఒక అమ్మాయితో ప్రేమ కలాపం వెలగబెట్టి కాకినాడదాక వెళ్ళి తిరిగివచ్చిన కామవాంఛాపరుడు.

అవకాశవాదం, ద్రోహబుద్ధి, మోసకారి తనమున్న వ్యక్తి చిట్టిబాబు. ఇంకా ఇందులో హైదర్ ఆలీ, హిమ్మత్ సింగ్, వెంకన్న, పురుషోత్తం, రామారావు, కృష్ణారావు, జాని, ఆదినారాయణ, రాజబాబు, అప్పారావు, పీనుగ్గుమస్తా, రాజభాస్కరరావు, సుందరశివరావు, రాజశేఖర్, శ్రీధరరావు, సుబ్బారావు, పిడతల డాక్టరు, గీరహెడ్డు, రంగడు, సుకుమారరావు, జోగులబాబు, వైకుంఠరావు, రంగస్వామి మొదలైన పురుషపాత్రలు.

దమయంతి, పిక్‌నిక్‌కు వచ్చిన సుబ్బలక్ష్మి, వరలక్ష్మి మొదలగు లక్ష్మలు, మంగ, సానమ్మ, తెలికలి మాలక్ష్మి, సరస, కనకమ్మ, చిట్టెమ్మ మొ॥ స్త్రీల పాత్రలు చాలా ఉన్నాయి.

'రాజు-మహిషి'లో పేజీల పాత్రలు ముప్పయి రెండూ, పేరాల పాత్రలు ఓ ముప్ఫై, చిన్నా పెద్దా వ్యాసాల పాత్రలు మరో ఏభై వెరశి నూట పన్నెండు దాకా పాత్రలున్నాయి. ఇందులో ఏభైదాక ఆడవాళ్ళున్నారు. అందులో భారీగావున్న వాళ్ళు ఎక్కువ. వారిలో 40 ఏళ్ళ పైబడినవాళ్ళు హెచ్చు. ఇందులో చెప్పబడిన వృత్తుల సంఖ్య పాతిక. చావుల సంఖ్య ఇరవై ఒకటి. అందులో పదిహేను విధానాలున్నాయి. బెంగ చావులు, ఆత్మహత్యలు చెరో మూడు ఉంటే, పోలీసుల చేతుల్లో చావులు, సహజ మరణాలు చెరో రెండున్నాయి"[40] అని శ్రీ వి.వి.న.మూర్తి ఆసక్తితో పరిశీలించి లెక్కలతోసహా పాత్రల్ని చెప్పిన విధం అభినందనీయం.

## 3. గోవులొస్తున్నాయి జాగ్రత్త

స్పష్టమైన వర్గదృష్టితో రావిశాస్త్రి ఈ నవలని రచించారు. సంపన్న, అట్టడుగు వర్గ పాత్రలు దర్శనీయమవుతాయి. కొంతవరకు జానపద బాణీలో ఈ ఇతివృత్తం నడిచింది.

### 1. రాజయోగి

సువర్ణ సుందరి పురం (సు.సు.పురం) జమీందారు రాజయోగి భోగి. "ఆయనకి ముగ్గురు భార్యలవల్ల మూడు జాగీర్లొచ్చాయి.... వారి ముగ్గురు భార్యలుకూడా నిస్సంతుగా

కాలర జేసేరు"[41] ముగ్గురి భార్యలు మరణించటంతో చింతాక్రాంతుడైన రాజయోగి అయిదారు సంవత్సరాలదాక మళ్ళీ పెళ్ళి జేసుకుంటానికి ఇష్టపడడు. వేటకు వెళ్ళి లచ్చయ్యమ్మని చూసి ఆమెను బలాత్కారంగా తన కోటకి తెప్పించుకొని, అనుభవించి, చివరకు ఆమె కారణంగానే రాజయోగి అంతమవుతాడు.

తను అనుకున్నది సాధించాలని; తన కార్యక్రమాలకి ఎవరు అడ్డుపడరాదని, సమాజం మొత్తం ఏమైపోయినగాని తన పంతం నెగ్గాలనే మొండి పట్టుదల భూస్వామ్య మనస్తత్వం, మూర్ఖత్వమున్న వ్యక్తి రాజయోగి.

లచ్చయ్యమ్మని తనదానిగా చేసుకుంటానికి రాజయోగి సామ, దాన, దండోపాయాలను ప్రయోగించాడు. ఆమె కుటుంబీకులకు ఎన్నో ఆశలు కలిపించి లొంగదీసుకుంటానికి ప్రయత్నించటం రాజయోగి నక్కజిత్తుల మనస్తత్వాన్ని సూచిస్తుంది. లచ్చయ్యమ్మను ఉంచుకుంటానికి సిద్ధపడ్డాడేగాని; ఆమెను భార్యగా స్వీకరించటానికి ఇష్టపడని నీచుడు రాజయోగి. ఆమెను భార్యగా అంగీకరిస్తే యోగికే ఇస్తానికి గూడ ఆమె తల్లిదండ్రులు ఇష్టపడతారు.

లచ్చయ్యమ్మని బలవంతంగా తన కోటకు తెప్పించుకొని, మత్తెక్కించి, మోసగించి ఆమె శీలాన్ని కాటువేసిన వంచకుడు రాజయోగి. ఆమెతో కులకటానికి అడ్డురాని ఆమె కులం; ఆమెను భార్యగా స్వీకరించటానికి అడ్డుపడుతుంది.

తన ద్వారా ఆమెకు పుట్టిన బిడ్డను తన కుమారుడిగా స్వీకరించటానికి అడ్డుపడుతుంది. నలుగుర్లో ఆ బిడ్డ 'ఒరే అయ్యా' అని పిలిచినందుకు తన పరువు ప్రతిష్టలు మంటగలిసి పోయినట్లు కుమిలిపోతాడు. తను సర్వోన్నతుడనే మను సంస్కృతికి; ధన అహంకారానికి ప్రతీక రాజయోగి.

"పెట్టుబడిదారులు తమ ఆధీనంలో ఉన్న శ్రామికుల భార్యల్నీ, కుమార్తెల్నీ బలాత్కరించి సౌఖ్యం అనుభవిస్తున్నారు. అంతటితో సంతృప్తి చెందక పడుపు వృత్తిచేసే వేశ్యలుకూడా వారికి కావలసి వచ్చారు. కాని వారు చాలడం లేదు. ఒండొరుల భార్యల్ని అనుభవించటంలో కూడా వారు అమిత సౌఖ్యం పొందుతున్నారు"[42] ఈ వాస్తవికాలోచన రాజయోగికి పూర్తిగా వర్తిస్తుంది. అతని కాముక దృష్టికి ఇది దర్పణం లాంటిది. స్త్రీ లోలత్వంతోపాటు అతనిలో కుల దురహంకారం గూడ ఉంది. గాబట్టే "నేను ఆ కులం తక్కువదాన్ని ఎత్తుకుపోయి బలవంతంగా చెరచడం నిజం"[43] అని అనగలిగాడు. ఇంకా లచ్చయ్యమ్మ తమ్ముడిగాడిది ఏం కులం? దమ్మిడీ కులం కాకపోవచ్చు, కాని కాణీ కులం కంటే మించిన ఎక్కువ కులం కాదే వాడిది. కాణీ దమ్మిడీ కులాలవారు ఈరోజున ముప్పావలా రూపాయీ కులాలమీద ఎదురు తిరిగి తిరగబడ సాహసించేరూ అంటే రేపొద్దున్న వాళ్ళు పావలా కులాలవాళ్ళకి అంతకంటే మర్యాదా ఇచ్చి ముద్దిస్తారా?"[44] కొంతమంది యువకులతో కలిసి లచ్చయ్యమ్మ తమ్ముడు యోగిపై తిరుగుబాటు ఉద్యమాన్ని లేపినప్పుడు, తన వర్గం నుద్దేశించి ఇచ్చిన సందేశం అతని స్వభావాన్ని

పోలీసువాళ్ళు తనపై చర్య తీసుకోబోతున్నప్పుడుగూడ "శత్రువుల్ని శత్రువులుగా ఉంచుకుంటూనే మీ మిత్రుల్ని గూడ శత్రువులుగా చేసుకుంటున్నారని అంటాడు. అంటే

తనలాంటి జమిందారీ వర్గమంతా పాలకవర్గానికి కొమ్ము కాస్తుందని, వాళ్ళ దగ్గర తాను చేసిన తప్పు ఒప్పుకొని మొసలి కన్నీరు కార్చిన నయవంచకుడు. పోలీసుల్ని, పత్రికల్ని మభ్యపెట్టి సాంఘిక సమస్యని రాజకీయ సమస్యగా మలిచి ఖద్దరు నాయకుడు శివకేశవరావు ద్వారా వ్యవహారాన్ని చక్కబరుచుకుంటాడు.

లచ్చయ్యమ్మ జీవితంతోపాటు ఆమె కుటుంబం మొత్తాన్ని తన చేతులుకి మట్టి అంటకుండా నాశనం జేసిన సచ్చి మోసకారి రాజయోగి. వర్గద్వేషి రాజయోగి. లచ్చయ్యమ్మ బిడ్డను మాయంజేసి ఆమెకు పిచ్చెత్తేలాజేసి; చివరకు ఆమెను గూడ అంతం చెయ్యటానికి పథకం సిద్ధం జేసిన హంతకుడు, అణగదొక్కే స్వభావమున్న వాడు కాబట్టి "మానవ సమాజంయొక్క గత చరిత్ర అంతా వర్గ వైషమ్యాల తీవ్రతమీద ఆధారపడుతూ వచ్చింది. ఈ వైషమ్యాలు వివిధ దశల్లో వివిధ రూపాలు ధరిస్తూ వచ్చాయి. కాని ఏయే రూపాలు ధరించినప్పటికి అన్ని దశల్లోను ఒకటి మాత్రం స్పష్టంగా మనకు కనిపిస్తుంది. అది యేమంటే మానవ సమాజంలో ఒక భాగానికి చెందినవారు మరొక భాగానికి చెందినవారిని దోచుకోవటం"[45] గా గుర్తించాలి. అట్టడుగు వర్గానికి చెందిన లచ్చయ్యమ్మ కుటుంబం ఈ క్రమంలోనే ధ్వంసమయ్యింది.

మొత్తం జీవరాసిని రెండు తెగలుగా రాజయోగి విభజించాడు. అవి "తినేవి, తినబడేవి.... చంపేవి, చంపబడేవి"అని చెప్పి, తను "చంపి బ్రతుకుతాని"కే ఇష్టపడటమేగాక; "అందుకోసం ఏదైనా, ఏదైనా చేస్తాను అలా చేస్తే అందులో తప్పుందా?"[46] అనిగూడ ప్రశ్నిస్తాడు. ఈ మాటల సారాంశం రాజయోగి జీవన లక్షణ సారాన్ని పట్టిస్తుంది. అయితే వర్గపీడన, జాతుల్ని అణగదొక్కే విధానం నిరాఘాటంగా, నిరంతరం కొనసాగదనే సూత్రాన్ని గూడ రాజయోగి పసిగట్టాడు గాబట్టే "చచ్చేజాతి వీటన్నింటిమీద తిరగబడుతుందని"[47] అణగారిన అట్టడుగు ప్రజానీకమంతా, ఉక్కుపాదాల దౌర్జన్య శక్తుల్ని చీల్చి చెండాడి ఛండ సింహాల్లా జూలు విదిల్చి తిరగబడతారనేది చారిత్రక సత్యం. చారిత్రక పరిణామక్రమాన్ని అడ్డుకొంటూ ఎల్లకాలం దోపిడీ, దౌర్జన్యం చేసేవాడు, చేస్తూనే బతకాలని, పులిపంజా దెబ్బలకి బలైపోవాలనే దుర్మార్గపు ఆలోచనలున్న వ్యక్తి, ఇతను.

తన వర్గాన్ని మాత్రం జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తు "దేనికైనా సరే ఎందుకైనా సరే ఎల్లప్పుడూ తయ్యారుగా ఉండాలంటాను, అందుకే పుల్లుకి కత్తుల్లాంటి కోరలుండాలంటాను. బాకుల్లాంటి గోళ్ళుండాలంటాను. అందుకే గుర్రాలకి కళ్ళాలుండాలంటాను. పశువులకి పలుపులూ, గొలుసులుండ కూడదంటాను. చంపేజాతి చావకూడదంటాను. చచ్చేజాతి బతక్కూడదంటాను"[48] అని రాజయోగి తన కాబోయే వారసుడు కిరీటికి భవిష్య జీవన సందేశాన్నందిస్తున్నాడు.

ఎవరికి చిక్కకు, మొక్కకు, దొరక్కు అని కిరీటికి బోధించిన రాజయోగి చివరకు "అజ్ఞానులూ, మూఢులూ, నీచులూ (వాళ్ళ దృష్టిలో) అయిన మనుష్యులకైనా కాదు వారు తలవంచినది. పశువులకి .... పశువులకి వారు బలైపోయారు. ఏ గోవులకైతే కన్నెలు తగిలించి, బంధాలు బిగించి, ఏ గోవులనైతే మనం మన పర్మనెంటు బందీలుగా

ఉంచుకోవాలన్నారో, ఆ గోవులకే వారు ఎరయి పోయేరు .... మన జీవన ధర్మాన్ని మనం సరిగా కాపాడుకొని నిలబెట్టుకోలేక పోతే ఏం జరుగుతుందో కూడా వారు వారి నెత్తుటి వరద ద్వారా మనకి తెలియచేసారు"[49] అని రాజయోగి బలైపోవటాన్ని గురించి కిరీటి చెప్పిన మాటలు యధార్థం.

రావిశాస్త్రి గోవుల్ని సింబాలిక్‌గా చెప్పారు. రాజయోగి ఆలోచనలన్ని తలకిందులయ్యాయి. రాజయోగిని, పెట్టుబడిదార్ల, సంపన్నవర్గాల ప్రతినిధిగా స్వీకరిస్తే, లచ్చయ్యమ్మని గోవుల్ని, అణగదొక్కబడుతున్న అట్టడుగు ప్రజానీకానికి ప్రతీకలుగా పరిగణించాలి.

విపరీత అణచివేత, దుర్మార్గం, దౌర్జన్యం, పెత్తందారీతనం నిరంతరం కొనసాగదని, అణచివేతకు గురవుతున్న అసంఖ్యాక ప్రజానీకం తిరుగుబాటు జెండాని ఎగురవేస్తారని, పీడనకు గురైన శక్తుల్నుండి పిడికిళ్ళు బిగించే ప్రభంజనశక్తి అవతరిస్తుందని, అంతిమ విజయం పీడిత వర్గాలదేననే సత్యాన్ని రావిశాస్త్రి రాజయోగి పతనం ద్వారా రుజువు చేసారు.

## 2. కిరీటి

గోవులొస్తున్నాయి జాగ్రత్తలోని "కథకుడు (Narrater) కిరీటిరావు. ఆంగ్ల మానసపుత్రుడు. పెట్టుబడిదారీగా మారిన ఫ్యూడల్ భూస్వామి. కిరీటిరావు తన జాతి వాళ్ళకోసం (పెట్టుబడిదారుల కోసం) మనస్సు విప్పి, దాపరికం లేకుండా మాట్లాడతాడు. వర్గతత్వాన్ని బాగా అర్థం చేసుకున్న అతడు తన కథనాన్ని పేదలు వినకూడదని, వింటే చెడిపోతారని హెచ్చరిస్తాడు. కాబట్టి "గోవులొస్తున్నాయి జాగ్రత్త"లోని కథన శిల్పాన్ని Dramatic monologue అనవచ్చు"[50] మరొక విధంగా Internal monologue గా కూడా పరిగణించవచ్చు. కథా కథన ప్రారంభం; ముగింపుగూడ వర్గ పరంగానే ఉంటుంది.

"కిరీటిరావు బోల్షివిక్ విప్లవం జరిగిన 1917వ సంవత్సరం పుట్టి, భారతదేశంలో ఉప్పు సత్యాగ్రహం జరిగిన 1930వ సంవత్సరంలో ఆయన పెదనాన్నగారి జమీందారీ గ్రామమైన సువర్ణ సుందరపురంలో గోవుల తిరుగుబాటును చూచాడు"[51] కనుక తన పద్నాలుగవ ఏట సు.సు.పురం వెళ్ళినప్పుడు ఒకటిన్నర రోజుల్లో (35 గం॥) జరిగిన సంఘటనలపై ఆధారపడివున్న వృత్తాంతాన్ని కిరీటి వివరించటమే 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' నవల. ఉత్తమ పురుషలో ఇతివృత్తం నడుస్తుంది.

పెట్టుబడిదారీ వర్గ పరిరక్షణ కోసం కిరీటి ఈ వృత్తాంతాన్ని వివరిస్తాడు. పేదసాదల పట్ల ఇతనికేమాత్రం కనికరం, దయ, జాలి లేనేలేవు. తను పుట్టిన రోజున తమపాలేరు కొడుకు గోదాసు పుట్టటాన్ని గూడ సహించలేనంతటి వర్గ ద్వేషి.

తన శీలాన్ని, కన్న కొడుకుని, కుటుంబ సభ్యుల్ని హత మార్చిన రాజయోగిపై ప్రతీకారం తీర్చుకుంటానికి లచ్చయ్యమ్మ సిద్ధపడితే, అమెను అంతం చెయ్యటానికి రాజయోగి ప్రయత్నాలు సాగిస్తున్న సమయంలో కిరీటి సు.సు.పురంలో అడుగు బెట్టటం వలన; కథ పతాక సన్నివేశాల్ని అతడు చూడగలిగాడు. ఆ అనుభవం అతనికి; అతని వర్గానికి జీవితంలో ఉపయోగపడింది.

కిరీటికి ఆ చిన్నవయసులోనే తననెవరన్నా పెంచుకోవాలని తద్వారా గొప్ప ఆస్తికి వారసుణ్ణి కావాలనే విపరీత ధన ఆశ వుంటుంది. తన బిడ్డని గాకుండా ఈ కిరీటిని రాజయోగి తన వారసుడిగా ప్రకటిస్తున్నాడని తెలిసి లచ్చయ్యమ్మ కిరీటిని భయపెట్టేసరికి, అతను గజగజవణికిపోయి, ఆ తరువాత అక్కడి వాతావరణాన్ని అర్థంజేసుకుంటాడు. పెద్దయ్యాక ఈ అనుభవాన్ని దృష్టిలో బెట్టుకొని కిరీటి "ప్రజలు మూర్ఖులు, అజ్ఞానులు ... వాళ్ళ కష్టంమీద మనం బతుకుతున్నాం అది వాళ్ళు తెలుసుకొకపోవడం మనకి ఇష్టం.... బాధలు వాళ్ళు భరించలేక వాళ్ళు తిరుగుబాటు చేస్తుంటారు ... అయితే వాళ్ళు ఎప్పుడైనా తిరుగుబాటు చెయ్యొచ్చుననడానికే ఇదంతా నేను వివరంగా మనవాళ్ళకి చెప్తున్నాను"[52] అని వివరిస్తాడు. తనకు జరిగిన అన్యాయాన్ని భరించలేక లచ్చయ్యమ్మ తిరుగుబాటుకు సిద్ధపడినట్లే దోపిడికి గురవుతున్నామనే స్పృహ లేకుండా ప్రజల్ని జోకొట్టి తమ పని గడుపుకు పోతుండాలనే కుహనావేదాన్ని తనవర్గ ప్రజలకందిస్తున్నాడు కిరీటి. ప్రజానాడిని పసిగట్టి కిరీటిని రూపొందించారు రావిశాస్త్రి.

రాజయోగి లచ్చయ్యమ్మ కుటుంబం మొత్తాన్ని అంతం జేస్తాడు. మానవత్వ మున్న ఎవరైనా దీనిని నిరసిస్తారు. కాని కిరీటి "వాళ్ళందరికీ ఇదే నాజవాబు. సృష్టిలో దయాధర్మాలు తక్కువ. క్రౌర్యం, అన్యాయం ఎక్కువ. లోకంలో కారుణ్యాన్ని పెంపొం దించేది మనిషే తప్ప ఆపని దేముడు చెయ్యడు.... మనకి నష్టం కలిగే విధంగా మరొకరి యెడల మనం జాలిపడకూడదు. మనజాతి లాభం కోసం పై జాతి బలి అవవలసిందే ... మనది పాముల పట్నం, మనం లోకాన్ని కాటేసి బ్రతకాలి. మనం వర్ధిల్లాలంటే మనం అన్యాయాలు చెయ్యాలి. అన్యాయం జరక్కుండా ఉంటేనే అలగాజనం వర్ధిల్లుతుంది"[53] అని స్పష్టమైన వర్గదృష్టితో చెప్తాడు. ఈ దృష్టితో జూస్తే లచ్చయ్యమ్మ కుటుంబం అంతమవటం అన్యాయం గాదని, పులులకి మేకలు ఆహారమవటం మామూలేనని, ఆర్తిజెందిన ప్రజానీకం, తిరగబడితే వాళ్ళను నిర్దాక్షణ్యంగా అణచివెయ్యటమే నీతి అని, మానవత, గీనవత, పనికిరాదని కిరీటి ఉద్దేశం. పెట్టుబడిదార్ల ప్రతినిధిగా కిరీటి పాత్ర ఇంతకంటే భిన్నంగా మాట్లాడక పోవటం విడ్డూరంగాదు. ఎందుకంటే "పెట్టుబడిదారీ యుగం యొక్క ప్రత్యేక లక్షణమేమంటే అది వర్గ వైషమ్యాలను నిశితం చేసింది. మొత్తం సమాజమంతా అంతకంతకు రెండు శత్రు శిబిరాలుగా, రెండు పెద్ద వర్గాలుగా చీలిపోతుంది. అవే పెట్టుబడీదారీ వర్గం, శ్రామికవర్గం"[54] కాబట్టి తన వర్గ పరిరక్షణార్థం కిరీటి ఆ విధంగా చెప్పాడు.

"పాఠకులకి చెప్పినదానికంటే కూడ రచయితకు తన పాత్రలను గురించి ఎక్కువ తెలుసు. వ్యక్తి స్వభావాన్ని, అతని నడవడినీ విశద పరచేటటువంటి ఘటనలను జీవిత వివరాలను, ఆలోచనను, భావాలను రచయిత ఎన్నుకుంటాడు"[55] ఈ దృష్ట్యా చూసినప్పుడు కిరీటిని ఎవరి పక్షాన చిత్రీకరించుకుందీ రావిశాస్త్రికి స్పష్టమైన అవగాహన ఉంది. అతని స్వభావం పాఠకులకి పూర్తిగా అంతుబట్టటం కోసమే ఇలాంటి సంభాషణను చిత్రీకరించారని అర్థం చేసుకోవాలి.

ఇలా కిరీటి గోదాసుని, సత్యమూర్తిని నిష్కారణంగా ద్వేషించే స్వభావాన్ని అధికం చేసుకుంటాడు. ప్రభుదాసులాంటి వాళ్ళు తమ వర్గానికి మిత్రపక్షంగా భావిస్తాడు.

తమ శత్రువర్గమంతా సమూలంగా నాశనమవ్వాలనే విధ్వంసక స్వభావి కిరీటి. ప్రభుదాసులాంటి వాళ్ళను దృష్టిలో బెట్టుకొని "సాధ్యమైనంత వరకూ వాళ్ళని అజ్ఞానంలో ఉంచి వాళ్ళలో మనం దుర్గుణాల్ని పెంచాలి, ధనదాహం పుట్టించాలి. ఏదో విధంగా వాళ్ళకి వాళ్ళల్లో కొందరిచేత ద్రోహం చేయించాలి"[56] తద్వారా ఇలాంటి లంపెన్ వర్గాన్ని చేరదీసి వాళ్ళతోడ్పాటుతో శత్రువర్గాన్ని అంతం చెయ్యాలని కిరీటి సూచన. ఈ సూత్రంపైనే ప్రభుదాసుని, మరోవిధంగా శివకేశవరావుని తమ పక్షం తిప్పుకొని రాజయోగి శత్రుశేషం లేకుండా చేసుకుంటానికి ప్రయత్నించింది. ఇంతకంటే ముందు చూపున్న స్వభావం కిరీటిది. అందుకనే కిరీటి చచ్చేజాతి చస్తూనే ఉండాలని, తన జాతి మాత్రం ఆ లిస్టులో ఉండకుండా నిరంతరం చంపుతూనే బతకాలని కోరుకుంటాడు. అయితే ఎంత మేకపోతు గాంభీర్యాలు పోయినా అసంఖ్యాకమైన పీడిత ప్రజానీకం ముందు తమ వర్గం అల్పసంఖ్యాకమైనదనే భయం ఉండటం వల్లే "నన్ను చంపకండి బాబుల్లారా నన్ను చంపకండి. నేను ఇంటికెళ్ళిపోతాను. నన్ను చంపకండి"[57] అని కిరీటి కలవరించింది.

ఎదిరి పక్షాన్ని అణగదొక్కుకుంటూ, వారిలో చైతన్యం పెరగకుండా జాగ్రత్తపడుతూ, నిరంతర పరిశీలన, నిఘాలతో నెట్టుకురావాలని, సముద్రం పొంగినట్టు అట్టడుగు ప్రజానీకం తిరగబడితే ఆ విప్లవ జంఝామారుత ప్రవాహంలో అధికార, దోపిడీ శక్తులు పెత్తందారీ ప్రభువులు కొట్టుకు పోతారనే హెచ్చరికను గూడ తన వర్గానికి కిరీటి అందించాడు. రావిశాస్త్రి తన లోకానుభవాన్ని, చారిత్రక గమనాన్ని దృష్టిలో ఉంచుకొని, కిరీటిని అధికార, పెట్టుబడిదారీ వర్గ ప్రతినిధిగా చిత్రీకరించారు.

### 3. లచ్చయ్యమ్మ

రాజయోగి జమీ ప్రాంతంలోని ఓ పశువుల కాపరి కుమార్తె లచ్చయ్యమ్మ. అద్భుత సౌందర్యరాశిగా పుట్టటం ఆమె జీవితం నాశనమవటానికి దోహదపడిన కారణాల్లో ఒకటి. రాజయోగి ఆమెపై మోజుపడి, బలాత్కారంగా అనుభవించి, ఆమెకు పుట్టిన బిడ్డను మాయంజేసి ఆమెను కుక్కలతో భయపెట్టి బందీని జేస్తే, చివరికామె బంధాలు తెంచుకొని, బందీ చేసిన యోగినే బలితీసుకుంటుంది.

రావిశాస్త్రి, పెద్దకథైన ఈ నవలకు "మరిడీ మహాలక్ష్మి కథ" అనే మరో పేరును గూడ సూచించింది, లచ్చయ్యమ్మను దృష్టిలో బెట్టుకొనే, ఆవిడ ఆకారం నగ నట్రా ధరించినపుడుచూస్తే అచ్చంగా మరిడీ మహాలక్ష్మిలా వుంటుందని నవల ఇతివృత్తంద్వారా తెలుస్తుంది.

లచ్చయ్యమ్మపై రాజయోగి కన్నుబడటానికి ముందే ఆమెకు 'రంగం బావ'తో వివాహం నిశ్చయమయింది. అయినప్పటికీ యోగి ఆమెను విడిచిపెట్టక తన కోటలో బంధించి కూడు, నీళ్ళు లేకుండా ఆమెను స్థంబానికి కట్టేసి ఆరు రోజులు తీవ్ర మానసిక క్షోభకు గురి చేసాడు. "లచ్చలూ, నాలచ్చరూపాయ్లూ" అని రంగం బావ పిలిచినట్లుగా రాత్రిపూట పిలిచి లచ్చయ్యమ్మతో శారీరక సుఖాన్ని అనుభవిస్తాడు యోగి. ఈ జరిగిన మోసం తెలిసాక లచ్చయ్యమ్మ డెలీరియంలో పడి నెలరోజులు తీవ్ర అస్వస్థతకు గురవుతుంది. ఆ తరువాత తాను గర్భిణీనని ఆమె గ్రహిస్తుంది. గర్భస్థ శిశువు కోసం

ఆమె యోగిని ఆ తరువాత తిరస్కరించకుండా "నువ్వేనా నాబిడ్డకి తండ్రివి" అని అడిగి అతని చేత 'అవున'ని పించుకొని కాస్త నెమ్మది పడుతుంది. ఆమెకు కొడుకు పుట్టిన తరువాత "ఇయ్యాల్టికాణ్నించి నీరాజ్జెం నా కొడుకుది! గేపకవెట్టుకు మసలుకో"[58] అని హెచ్చరిక జేసింది లచ్చయ్యమ్మ. తన బిడ్డ కోసమే తాను బ్రతుకుతున్నాననే పుత్రమమకారం, ఏ అస్తిపాస్తులు జూసుకొని నన్ను లొంగదీసుకున్నావో అవన్నీ ఇక నాబిడ్డ పరమవుతున్నాయనే ధీమాని గూడ యోగికి సూచించినట్లయింది. అయితే యోగి మాత్రం ఆమెను 'జాతి తక్కువ' దానిగా భావించి, ఆమెకు తన ద్వారా పుట్టిన బిడ్డను తన వారసుడిగా స్వీకరించటానికి అంగీకరించక, ఆ నాలుగు సంవత్సరాల బిడ్డను మాయంజేసి కిరీటిని తన వారసుడిగా ప్రకటించటానికి ప్రయత్నించేసరికి లచ్చయ్యమ్మ ప్రతిఘటిస్తుంది. తన బిడ్డను యోగి మాయం చేసాడని వజ్రాలహారం సాక్ష్యంగా లభించే సరికి ఆమె యోగిపై తిరగబడింది. కన్నబిడ్డ మాయమవటంతో ఆమెకు పిచ్చెక్కుతుంది. బంధాలు తెంచుకొని బయటకు వచ్చి చెట్టుని యోగని భ్రమించి ముక్కలు ముక్కలుగా ఆమె నరికింది. తన జీవితాన్ని నాశనం చేసి, తనతల్లి, తండ్రి, అన్న, తమ్ముడు, కన్నబిడ్డ అందరినీ అంతం చేసిన రాజయోగిపై లచ్చయ్యమ్మ అంతగా కసిపెట్టుకుందన్నమాట. ఆ సమయంలో అతను కనిపించినా అలానే చేసి ఉండేది. చర్యకు ప్రతిచర్య తప్పదనే సూత్రాన్ని ఈ సన్నివేశం రుజువు చేస్తుంది. అయితే అది ఫలవంతం కావటానికి కొంత సమయం పట్టవచ్చు. ఒక స్త్రీ అలా తిరగబడటం సాధారణ పరిస్థితుల్లో జరిగే పనికాదు. కాని ఆమె అప్పటి అస్తిత్వం అలా పురికొల్పింది.

అందుకే కిరీటి వారసత్వాన్ని లచ్చయ్యమ్మ ఎదిరించి కిరీటిని "నా కొడుకుని తేకండ ఆణ్ణి అక్కడెక్కడో ఒగ్గేసి, ... ఆ రాజబాబు ... నిన్ను పెంచుకున్నాడో జేగర్త .... పెంచుకున్నాడంటే ....ఆడిమెడకాయ.... పటక్మని ఇరిసేస్తాను .... నీ మెడకాయ కటక్మని కొరికేస్తాను"[59] అని మేడమించి దిగొచ్చి హెచ్చరించి భయపెట్టింది. అంతేగాకుండా 'ఇయ్యాళ్నించి నాకింక బందికానా సరి! ఇయ్యాళ్నించి నా ఊసులన్నీ నాయి, నా ఊపిరంతా నాదీ"[60] అని పిచ్చి తగ్గాక చావో బతుకో తేల్చుకుంటానికై సిద్ధమై లచ్చయ్యమ్మ ధైర్యంగా చెప్పగలిగింది. లచ్చయ్యమ్మలో పరిణామం మొదలయ్యింది. రాజయోగి గెడ్డపోడు నాకు మొగుడుగాదు, కానీ నాబిడ్డకు మాత్రం వాడే తండ్రి అని చెప్ప గలిగే సత్తా సంపాదించుకుంది. అంతేగాక "ఈ రాజ్జెంలో ఈ కోట ముందర నా కొడుకు బావుటా వెగరాలే కానీ, మరోడి బావుటా వెగరడానకీల్లేదు .... ఆకాశం, బూ దేవతల సాచ్చిగ సెపుతున్నాను విందుకు మరింక తిరుగునేదు"[61] అని ప్రకటించి రాజయోగితో ప్రత్యక్ష పోరుకు లచ్చయ్యమ్మ సిద్ధపడింది. తనను తాను 'మరిడీ మాలచ్చిగా' గూడ లచ్చయ్యమ్మ ప్రకటించుకుంది. ఈ తెగింపుతోనే తన మీదకు ఉసిగొలిపిన కుక్క జాకీని చాకిరేవులో బట్టలుతికినట్టు ఉతికేసింది లచ్చయ్యమ్మ.

చివరికి లచ్చయ్యమ్మ తన కొడుకు సమాచారాన్ని సాయంకాలం లోపల అందించాలని రాజయోగికి కబురుబెడుతుంది. కాని సంప్రదింపుల తర్వాత మూడు రోజుల గడువుని పొడిగిస్తుంది. లచ్చయ్యమ్మ మీదికి లోగడవలే మళ్ళా జాకీని వదిలేసరికి ఆమె క్రౌర్యంతో దాన్ని చంపేస్తుంది. సింబాలిక్‌గా ఆమెకు ఆవులు, ఒంటి కొమ్ము ఎద్దు

సహాయం లభించి, రాజయోగితో పాటు అక్కడున్న అతని తొత్తులు అంతమవటానికి మార్గం ఏర్పడుతుంది.

లచ్చయ్యమ్మ అట్టడుగు వర్గ ప్రతినిధి. భూస్వామ్య అణచివేతకు సాక్షీభూతురాలు. బలవంతపు రాక్షసరతిలో మానం కోల్పోయిన మానవతి. 'నెత్తురు కార్చిన కళ్ల నుండి' నిప్పులు ఎగజిమ్మిన వీర వనిత. తన కుటుంబ సర్వనాశనానికి 'కందుక న్యాయంతో' ప్రతివాదిని పాతాళానికంట పాతేసిన సాహసి. బానిస బంధిఖానాలో నిత్యం కుమిలి చచ్చేకన్నా స్వేచ్ఛకోసం బ్రతుకుబాటలో పోరాటమే శరణ్యమని తెగించిన చైతన్య వెలుగురేఖవైపు నడిపించింది.

పెత్తందార్ల పైశాచిక జులుంని, అహంకారాన్ని, అణచివేత ధోరణిని, రావిశాస్త్రి ఎండగట్టటమే గాకుండా, పేదోళ్ళ పరువుప్రతిష్టలు, ఆత్మాభిమానాన్ని అణచివేతను ధిక్కరించే విప్లవమార్గాన్ని, ఆయన లచ్చయ్యమ్మ పాత్రద్వారా పరిరక్షించారు.

"ఉన్నత ఆశయాలతో ప్రేరితుడైన రచయిత, సామాజిక అభివృద్ధిని అర్థం చేసుకున్న రచయిత తాను సృష్టించిన పాత్రలలో కొన్నింటికి జీవమూ, న్యాయమూ, జీవనశక్తి వుండటం, మరికొన్ని పాత్రలలో అన్యాయము, తప్పని సరియైన పతనమూ వుండటం గమనించుతాడు"[62] "పై మాటలు లచ్చయ్యమ్మ"కి క్రింది వరుస రాజయోగికి వర్తిస్తాయి.

### 4. ప్రభుదాసు

ఇతనొక లంపెన్ క్యారెక్టర్. లచ్చయ్యమ్మకి ఇతను పెద్దమ్మ కొడుకు అయినా ఇతనామెపై జాలి పడకుండా, ఆమె కుటుంబీకుల సమాచారాన్ని రాజయోగికి అందించిన నీచ విభీషణుడు. ఆమెను కుక్కలతో భయపెట్టటమేగాక ఆమెను చంపటానికి యోగి పన్నిన కుట్రలో ఇతడు భాగస్వామి. తాత్కాలిక ప్రయోజనాలనాశించి పెత్తందార్ల అడుగులకు మడుగులొత్తే ఇలాంటి దుష్టస్వభావులు సమాజంలో నిత్యం తారసపడుతూనే ఉంటారు.

### 5. గోపాలదాసు

కిరీటి 'మాతామహుల వారి ఇంట్లో తోటమాలి' కొడుకు గోపాలదాసు సరిగ్గా కిరీటి పుట్టినరోజే పుట్టాడు. మంచి చాయ, ధైర్యం, వీటికి తోడు సద్గుణం ఉన్నవాడు. కిరీటితోపాటు గో.దాసు గూడ సు.సు.పురం వెళతాడు. వయసుకు చిన్నవాడైన తన జాతి లచ్చయ్యమ్మని 'మాలచ్చితల్లి' అని, యోగిని 'గెడ్డపోడు' అని సంబోధించటం ఇతని స్వభావానికి నిదర్శనాలు. లచ్చయ్యమ్మ రాజయోగి భరతం పడుతుందని కిరీటికి హెచ్చరిక చేస్తాడు.

కిరీటి గోదాసుని తీవ్రంగా కొట్టి హింసించినప్పుడు గోదాసు తిరుగుబాటు బావుటా ఎగురవేస్తాడు. కిరీటి పక్షాన వహించిన ప్రభుదాసుని "నువ్వోడివయ్యా, నన్ను దమాయించడానికి?".. ఇలా కొడితే పసువుగూడ ఒల్లకోదు, కొమ్మిసురుద్ది.... నీ గెడ్డపోడి క్కాడా నాను డోన్ట్‌కేర్"[63]అని ప్రభుదాసుని ఒకతన్నుతన్ని మాయమవుతాడు గోదాసు. పేరుకు గోదాసుడైనా దౌర్జన్యాన్ని ప్రతిఘటించే ఉక్కుపిడికిలి. ఈ పాత్ర చిత్రీకరణతో

రావిశాస్త్రి నిర్భయంగా దుర్మార్గం, దౌర్జన్యాలపై తిరగబడితే అంతిమ విజయం అన్యాయానికి గురవుతున్న వారిదేనని స్పష్టీకరించారు.

## 6. సత్యమూర్తి

పేరుకు తగ్గ పాత్ర. ఆత్మాభిమానమున్నవాడు. అన్యాయన్ని సహించలేని వ్యక్తి.

సత్యమూర్తి స్వాతంత్ర్య ఉద్యమంలో కూడ పాల్గొన్నాడు. కాస్తోకూస్తో అక్షర జ్ఞానముంది గాబట్టి ఇతర పాత్రలకన్నా ఇతని ఆలోచనలో తేడా, యోగి దగ్గర సూటిగా మాటాడగలిగిన నేర్పరితనం, ధైర్యం ఉన్నాయి. ఆవులు రాక, యేర్పాట్లలో సహాయపడ వలసిందిగా గ్రామ ప్రజలను అభ్యర్థించమన్నప్పుడు "వాళ్ళకే తినడానికి ఏ గడ్డి లేనప్పుడు వాళ్ళు ఏమివ్వగలరు"[64] అని పలికిన సత్యమూర్తి మాటలు నాటి రైతుల దుస్థితిని సూచిస్తున్నాయి. సామాజిక పరిస్థితులను అవగాహన చేసుకోగల నేర్పరి ఇతను.

విశ్వాస పాత్రమైన వ్యక్తి గనుక లచ్చయ్యమ్మ తన చివరి అల్టిమేటాన్ని సత్యమూర్తి ద్వారా యోగికి అందించింది. ఆవుల కిష్టయ్యతో ఘర్షణపడి, లచ్చయ్యమ్మ కొడుకుని తీసుకురావాలని హెచ్చరిక చేసి "అంచేత బాగా విను! ఆవిడకి అన్యాయం జరిగితే మేం ఎవరంకూడా ఒప్పుకోం! ఆవిడకి అన్యాయం జరగటానికి వీల్లేదు"[65] అని కిష్టయ్యతో సత్యమూర్తి తెగేసి చెపుతాడు. ఆ మాటలు అతని వ్యక్తిత్వానికి పదును పెడుతున్నాయి. రాజయోగికి కూడ, లచ్చయ్యమ్మగ్గాని అపకారం తలపెడితే "భూమి తల్లకిందులవుతుం"దనే హెచ్చరిక చేసిన ధైర్యశాలి సత్యమూర్తి. హెచ్చరికలు చెయ్యటంతోనే ఆగకుండా, చివరికి రాజయోగిని అంతం చెయ్యటంలో సత్యమూర్తి గూడ ప్రముఖ పాత్ర వహిస్తాడు.

వర్గ నీతితో, తన జాతికి జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించే ధైర్యంతో, శత్రుపక్షకుహనా నీతిని ఎండగట్టగల నేర్పరితనంతో, తన పక్షానికి చెందిన ద్రోహులకి బుద్ధిచెప్పగల యుక్తితో సత్యమార్గం వైపు పయనిస్తాడీ సత్యమూర్తి. దొంగ ఖద్దరు రాజకీయాలు నడిపి ప్రజల్ని ఉద్రేకపరిచి పక్కదోవ పట్టించే శివకేశవరావులాంటి దేశద్రోహి, రాజయోగి పెంపుడు కుక్కలా ప్రవర్తించే కుట్రదారుడైన ఆవుల కిష్టయ్య - వీళ్ళు సామాజిక చీడపురుగుల్లాంటివారు.

ఆర్థిక పరంగా, సామాజిక అట్టడుగు కుటుంబం నుంచి వచ్చినా లచ్చయ్యమ్మ తల్లి, తండ్రి, తమ్ముడు ఆత్మాభిమానమున్నవారు.

లచ్చయ్యమ్మ కుటుంబీకులు పనిజేసిన బుగత మేనల్లుడు పట్నం వాతావరణంవల్ల, చదువువల్ల సామాజిక అవగాహన వల్ల రాజయోగి లచ్చయ్యమ్మని బలవంతంగా తన కోటలో బంధించటాన్ని యువశక్తిని కూడగట్టి నిరసించగలిగాడు.

దీనిలోని పాత్రలు వర్గ నీతికి అద్దం పట్టే వని అవగతమవుతుంది.

## 4 రత్తాలు - రాంబాబు

స్త్రీల జీవితాలకి అధిక ప్రాధాన్యమిచ్చి రాసిన నవల 'రత్తాలు-రాంబాబు' వేశ్యరికపు జీవితాల దుస్థితిని చిత్రీకరించి సామాజికపు దుర్మార్గాన్ని ఎండగట్టిన నవల.

**I. రత్తాలు**

రత్తాలు రత్నం లాంటిది. 'నరత్నం అన్విష్యన్తి' అన్నట్లు రత్తాల్లాంటి స్త్రీని వెతికి పట్టుకోవాల్సిందే. అరుదైన స్వభావం విలక్షణ వ్యక్తిత్వం. రత్తాలు గురించి చెప్పటమంటే ఒక జీవితాన్ని తేరిపార జూడటం, ఒక జలపాతంలోతు కనుక్కోవాలనుకుంటం, ఒక కొండని చేతిలో పెట్టుకోవాలనుకుంటం, ఓ అగ్నిజ్వాలను మింగాలనుకుంటం, సూదిమొన, గోళ్ళ చిగుళ్ళకు గుచ్చుకుంటం.

ఈ లోకంలో కన్ను తెరవటానికి ముందే తండ్రిని, కన్ను తెరుస్తూనే తల్లిని కోల్పోయిన అనాథ రత్తాలు. రత్తాలు పెద్దమ్మ వరాలమ్మ ఆమెను పెంచి పెద్ద చేసింది. రత్తాలు జీవన ప్రవాహం మూడు ముఖ్యమైన మలుపులు దిరిగింది. పెద్దమ్మ దగ్గర పెరిగిన జీవితం, సింహాచలం వలన నరసమ్మ కంపెనీలో చిక్కుకు పోయిన జీవితం, రాధమ్మ ఇంట్లో వంటలమ్మ జీవితం. తప్పించుకొని వచ్చినప్పుడు సన్నమ్మ, ప్రెసిడెంటు సంరక్షిస్తే రత్తాలి జీవితం మరో మలుపు తిరిగేది.

అవిద్య, లోకానుభవ రాహిత్యం, వయసు ప్రభావం, అమాయకత్వంవల్ల బ్రోకర్ సింహాచలం మాయమాటలకులోనై రత్తాలు నరసమ్మ కంపెనీలో చిక్కుబడిపోయింది. తనతోపాటు మరో మిండగాణ్ణిగూడా సంతృప్తిపరచమని సింహాచలం కొత్తవ్యక్తిని తీసుకొచ్చినప్పుడు రత్తాలుకి అసలు సంగతి తెలిసింది. తాను 'యమకూపంలో' ఇరుక్కుపోయినట్లు గ్రహించి, తిరగబడిందేగాని, వాళ్ళకి తలొగ్గలేదు.

స్వయం ప్రకాశమున్న పాత్ర ముత్యాలు. ఆ నీడలో ఎదిగిన జీవితం రత్తాలుది. ముత్యాలు సహాయంతో కంపెనీ నుండి తప్పించుకొని తన పెద్దమ్మ దగ్గరకు వెళ్ళటానికి చేసిన మొదటి ప్రయత్నం విఫలమై అక్కడి హింసకు తట్టుకోలేక, వేదనకు గురై రత్తాలు ఆత్మహత్య చేసుకుంటానికి ప్రయత్నిస్తే, ఆమెను చితకబాది బట్టలు లేకుండా, కనీసం తాగే నీళ్ళుకూడా లేకుండా ఆ గదిలోనే బంధించటం మానవతకే సిగ్గుచేటు. తన జీవితాన్ని నరకకూపంలోనికి తోసిన సింహాచలంపైనేగాక, జీవితం మీదే రత్తాలుకి విరక్తి కలిగింది. అందుకనే డాక్టర్‌తో "బతకడవే పెద్ద బాధ బాబు"[66] అని తన బాధ గురించి చెప్తుంది. రాంబాబు తనని రక్షించినందుకు రత్తాలు అతని పట్ల కృతజ్ఞతా భావాన్నేగాదు, అభిమానాన్ని గూడ పెంచుకుంటుంది. రాంబాబు తాగి రోడ్డుమీద అపస్మారకంగా పడి వుంటే రత్తాలు, అతణ్ణి కాపాడి రాంబాబుపై ప్రేమాభిమానాలు పెంచుకుంటుంది. అయితే రాంబాబుని బ్రతికించటం కోసం డాక్టరు యాభైరూపాయల మందులు రాసినప్పుడు, ఆ మందుల డబ్బు కోసం అర్ధరాత్రివూట రత్తాలు తన మానమమ్ముకుంటానికి సిద్ధపడటం వాస్తవికంగా వుంటుందా? ఇది ఎంతవరకు సమర్ధనీయం? ఎవరితోను ఏ విధమైన సంబంధాలు లేని రత్తాలు ముత్తాలు వాదించినా వినకుండా, రాంబాబు కోసం తన మానాన్నే పణంగాబెట్టి, గోపాలంతో లాడ్జింగ్‌కు వెళ్ళి, రైడు జరగటం వలన కసికందకుండా అనాఘ్రాత పుష్పంగా, నాటకీయంగా బయటపడుతుంది. ఈ నవలలో ఇలాంటి సినిమా పక్కీ సీన్లు పెట్టారు రావిశాస్త్రి.

నరసమ్మ, ఆమె పరివారం కంపెనీలో లేదు గాబట్టి తప్పించుకు వెళ్ళటానికి మంచి సమయం అని ముత్యాలు చెపితే "నిన్ను నరసమ్మ నమ్మినాది. నన్ను ఆ బాబు

నమ్మినాడు... నువ్వు నరసమ్మని ఒగ్గిడం దరమం గాదు. నేను ఆ బాబుని ఒగ్గిడం ఈటయుంల నాకు దరమంగాదు''[67] అని రత్తాలు నమ్మిన మనిషిని కష్టంలో ఆదుకోవాలనే దృష్టితో చెప్తుంది. ఆసుపత్రిలో రాంబాబు రత్తాల్ని "నువ్వు రోడ్డుమీది అమ్మాయివి కదూ' '[68] అని అడిగే సరికి, రత్తాలుకి దుఃఖం ముంచుకొస్తుంది. తనేంటో తన అస్తిత్వమేమిటో, తన అడ్రసేమిటో ఆలోచించేసరికి ఆమెకు చాల బాధ కలుగుతుంది. రాంబాబు చేసిన సేవల నిమిత్తం డబ్బులివ్వబోతే "దేనికండి ఆ డబ్బు? అది ఆ బాబు పేనాల ఖరీదా? నేకపోతే కాకపోతే అది నా బతుక్కరీదా?''[69] అని వేసిన రత్తాలి ప్రశ్నలకి జవాబు దొరకదు. అమాయకంగా కనిపించినా, తళుక్కున మెరిసే పదునైన ఆలోచనా ధోరణి గూడా రత్తాలుకుంది. సాటి మనిషికి చేసిన సహాయాన్ని డబ్బులతో వెలగట్టటాన్ని రత్తాలు గర్హించింది. పెట్టుబడిదారీ వ్యవస్థలోని విష సంస్కృతికి ఈ డబ్బు సన్నివేశం నిదర్శనం.

కంపెనీనుండి తప్పించుకొని తన ఊరు చేరుకోబోతున్న రత్తాలిలో ఎన్నో ఆలోచనలు ముసురుకుంటాయి. పెంచి పెద్దచేసిన పెద్దమ్మకు చెప్పకుండా వచ్చాననే పశ్చాత్తాపంతో కాఫీ కొట్టు దగ్గర కొచ్చిన రత్తాలుకు పెద్దమ్మ, పెద్దమ్మ కూతురు చనిపోయిందని తెలియగానే రత్తాలు శోక దేవతవుతుంది. పెద్దమ్మ చనిపోవటాన్ని దిగమింగుకోలేక మంచం కోడుకేసి రక్తం వచ్చేలా తలబాదుకొని మరీ విలపిస్తుంది.

కట్టు కథలల్లి సింహాచలం మళ్ళీ రత్తాల్ని కంపెనీకి తీసుకెళ్తూ పోలీసులకి దొరికి పోతాడు. ఆ సమయంలో అడ్డబుర్ర యస్పై వేషంలో ఉంటాడు. ఈ సన్నివేశం రత్తాలు జీవితాన్ని మరో మలుపు దిప్పుతుంది. రత్తాలు 'అన్ కట్ డైమండ్' అని వైద్య పరిక్షల్లో రుజువయ్యే సరికి ఏ.యస్పీ శ్యామసుందరరావుకి రత్తాలుపై గౌరవం పెరుగుతుంది.

ఏద్దైనా పని చూపించమని రత్తాలు కృష్ణదగ్గరకు వెళ్ళినప్పుడు, కృష్ణ, రాంబాబు రత్తాల్ని కంపెనీ నుండి విడిపించటానికి పంపించిన వెయ్యిరూపాయలు రత్తాలికి ఇయ్యబోతే అవి తీసుకోకుండా, తన విముక్తి కోసం ఇంత త్యాగం చేశాడా ఆ బాబు అని రత్తాలు ఆశ్చర్య పోవటమేగాదు, బోరున విలపించిన పసిహృదయం రత్తాలుది. ఏడ్చినందుకు సంజాయిషీగా కృష్ణతో "దేవుళ్ళేడంటే దుక్కం ఒచ్చినాది. మడిసే దేవుడైనందుకు సంతోషం కలిగినాది. వందకు బాబు ఏడ్చినాను''[70] అని చెప్పిన నిర్మల హృదయ.

కృష్ణ అక్క రాధమ్మ ఇంట్లో వంట మనిషిగా రాధ మనసుని, పిల్లల మనసుని కొల్లగొడుతుంది రత్తాలు. రాధమ్మ ఇంట్లోనే రత్తాలు నాలుగక్షరం ముక్కలు గూడ నేర్చుకుంటుంది. డబ్బుతోటే అన్నీ సాధించవచ్చనే నరసమ్మ వ్యాపారధోరణిని, ఆమె ముత్యాలు ద్వారా పంపిన డబ్బుల్ని రత్తాలు తిరస్కరించి, డబ్బు కంటే ఆత్మీయత, సహభావుకత్వం ముఖ్యమనే విషయాన్ని రత్తాలు ముత్యాలు మాటల్ని గౌరవించి, కోర్టు కేసులు తప్పించటానికి అనుకూలంగా చెప్పిన మాటలు రత్తాలు వ్యక్తిత్వాన్ని రుజువు చేసాయి.

రత్తాల్ని యాభై రూపాయలకి బుక్ చేసుకున్న గోపాలరావు రాధమ్మ భర్త. అతను జైలు నుండి తిరిగి ఇంటికి వచ్చాక, రత్తాలుకు రాధమ్మ ఇంట్లో స్థానం లేకుండా పోతుంది. రత్తాలు రాధమ్మ ఇంటినుండి బయటకు వచ్చేప్పుడు "లేదండమా! ఇందులో ఏదైన ఉంటే నేను పుట్టినట్టుగా పుట్టి, నేను పెరిగినట్టుగా పెరిగి, నేను మోసపోయినట్టుగా

మోసపోవటం నాది తప్పు, కాకపోతే నాలాంటి వాళ్ళ బ్రతుకిలిలా మాడి తగలబడుతూంటే ఊరంతా అంటీ ముట్టనట్లు ఏవీ ఎరగనట్టు ఊరుకోవటం ఊరి తప్పు"[71] అని విశ్లేషణాత్మకంగా మాట్లాడగలిగిన స్థాయికి రత్తాలు ఎదిగింది. వాస్తవికంగా సామాజిక దురాన్యాయాన్ని ప్రశ్నించింది. తనలాగ బుగ్గి పోతున్న ఎందరో జీవితాల్ని గుర్తు చేస్తున్నట్లుగా ప్రశ్నించింది.

ఎంతోమంచి అవకాశం వచ్చినా, రాంబాబు కోసం, అతని గురించి వివరాలేమీ, తెలియకుండానే, రత్తాలు తప్పించుకు పోకుండా ఆగిపోవటం కొందరకు అసహజమనిపించవచ్చు. ఎన్ని మలుపులు దిరిగినా ఆదర్శం కోసం రావిశాస్త్రి రత్తాలు మానాన్ని కాపాడటం కూడ వాస్తవికత్వానికి దూరంగా ఉండవచ్చు కొన్ని మినహాయింపులున్నా రత్తాలు సజీవ జీవన దర్పణం లాంటిది.

**2. ముత్యాలు**

తెలుగు సాహిత్యంలో గొప్పపాత్రల సరసన ముత్యాలు ఉంటుంది. మధురవాణి లక్షణాలు ముత్యాలులో కనిపిస్తాయి. సాని వృత్తిలోనే జీవిస్తున్నప్పటికి ఇద్దరిలోను పరోపకార గుణం, సానుభూతి, త్యాగబుద్ధి ఈ సహగుణాలు ముత్యాలుని మధురవాణిని, ఏకం చేస్తాయి. అయితే చదువు, స్వతంత్రత, హోదా, సంపద మొదలైన విషయాలలో ఇరువురికి తేడా కూడ ఉంది.

ఈ నవలలోని ముత్యాలు, రత్తాలు ఇద్దరూ పల్లెటూరి నేపథ్యమున్నవారు. ముత్యాలుకి చిన్న వయసులోనే పెళ్ళి తల్లి, తండ్రి, భర్తని కోల్పోయి, అన్నా వదినల నిరాదరణకు గురై మరొకడి మోసానికి బలై చివరకు నరసమ్మ కంపెనీ ఆమెకు దిక్కవుతుంది. చిన్న వయసులోనే జీవన ముళ్ళపొదళ్ళని, వాటి మాటున దాగిన పులి కోరల్ని రుచి జూసింది.

రత్తాలు అమాయకంగా నరసమ్మ కంపెనీలో చిక్కుబడి పోయినందుకు; సచ్చాలు మరణించినందుకు ముత్యాలు ఎంతో దుఃఖిస్తుంది. తప్పించటానికి మంచి అవకాశం ఏర్పడటంవల్ల రత్తాలికి అన్నివిధాల తోడ్పడి ఆమెను ఆ నరకకూపం నుండి విముక్తి గావించటానికి ముత్యాలు మొదటిసారిగా ప్రయత్నం చేసింది. విలాసాలు రుచి చూడని మగాళ్ళని చెడిపోకుండా; మధురవాణి కాపాడితే; విలాసాల జీవితమెరుగని స్త్రీలు పక్కదోవబట్టకుండా ముత్యాలు రక్షించింది. తానెంతటి చీకటి గుయ్యారంలో చిక్కుకున్నప్పటికి ఆమెకు భవిష్యత్తుపై ఆశ చావలేదని "ఒప్పుటికైనా ఇయ్యేండ సల్లారదా, ఈ సీకటి తెల్లారదా? నోరూ ఓయిలేన్జనం ఇలా కుళ్ళి సస్తావుంటే ఊరొప్పుటికైనా, ఏనాటికైనా తిరగబడదా? తిరగబడి ఈ పాపాలకగ్గెట్టదా? అన్న ఆశ కడుపులెట్టుకు బతకతన్నాను"[72] అనే మాటలు ఋజువు జేస్తున్నాయి. దుర్మార్గం, దౌర్జన్యం అంతమై పీడిత ప్రజల జీవితాల్లో వెలుగురేఖలు విరజిమ్ముతాయనే ఆశని ముత్యాలు ద్వారా వ్యక్తపరచి,. రావిశాస్త్రి తన వ్యక్తిత్వాన్ని కూడా మనకు పట్టిచ్చారు.

కంపెనీపై రెయిడ్ జరిగినప్పుడు పోలీసాకతను ముత్యాలు సౌందర్యానికి ఆశ్చర్యపడి ఎవర్నువ్వు అని ప్రశ్నించినప్పుడు "నానెవర్నా? అరుగో ఆ గదిలున్నాడు

జోగులుగోడు; ఆ జోగులుగోడు పెళ్ళాడితే ఆడి పెళ్ళాన్ని, నీ గంగారాజెడ్డొచ్చి పెళ్ళాడితే ఆడి పెళ్ళాన్ని,...... నీ పెళ్ళాన్ని, ఒవుడు గంటకి పదిచ్చి పెళ్ళాడితే ఆడి పెళ్ళాన్ని... నాకు ఓయినేదు, ఒరసనేదు"[73] అని చెప్పిన ముత్యాలు వేదన ఓ దుర్మార్గ సమాజంపై మర ఫిరంగు; ఇలాంటి జీవితాలు గడుపుతున్న వారిని కేవలం వినిమయ వస్తువులుగా; ఆనందాన్ని పంచే ఆటబొమ్మలుగా; పరిగణించి, ఆ కాసేపు తాత్కాలికానందాన్ని కొనుక్కొని వస్తున్నారేగాని; వాళ్ళ జీవితాల గురించి ఎవరూ ఆలోచించటం లేదనే వేదన బ్రతుకు తెరువుకోసం; మరో మార్గం లేక ఇలా మానమమ్ముకొని జీవిస్తున్నామనే బాధ వ్యక్తమవుతుంది. మనసులో శాశ్వతంగా ముద్రలా నిలిచిపోయేలా ఇలాంటి సన్నివేశాల ద్వారా రావిశాస్త్రి తన ప్రాపంచిక అవగాహనతో ముత్యాలు పాత్రని తీర్చిదిద్దారు. అందుకే "And the first thing that we require of any novelist in his handling of character is that, whether he keeps close to common experience or bordly experiments with the fantastic and the abnormal, his men and women shall move through his pages like living beings and remain in our memory after his book is laid aside and its details perhaps forgotten"[74] అని చెప్పిన హడ్సన్ మాటలు ముత్యాలు పాత్రకి చక్కగా సరిపోతాయి. పిచ్చి జోగులు డబ్బిచ్చి ముత్యాల్ని అనుభవిస్తున్నాడేగాని, ఆమెకు ఇతని మీద ఎలాంటి మమకారం ఉండదు. ఇతనితోనేగాదు. సానికొంపకి ఆ ఉద్దేశ్యంతో వచ్చే ఎవరితోనైనా ముత్యాలు గడిపేది. యాంత్రిక జీవితమే. తనమీద మనసుపడ్డ, తను మనసుపడే జోగులుతో కలిసి కాపురంజేసే మంచిరోజు కోసం ముత్యాలు ఎదురు జూస్తుంటుంది. ఇదే జీవితపు పుటాశంటే. భగభగ మంటల్లో మాడుతూకూడా బతుకుపై ఆశ పెంచుకుంటుంది.

హాస్పటల్‌లో ముత్యాలు మాటాడిన మాటలు ఈ సమాజం పాలిట చెర్నాకోల దెబ్బలు. చదువుకొని, సామాజిక బాధ్యతని గుర్తించవలసినవారుగూడా తమలాంటి వాళ్ళను పట్టించుకోవడం లేదని గంటగంటకి రూపాయలకి అమ్ముడుబోవలసిన విష సంస్కృతిలో విలవిలలాడుతున్న తనలాంటి వాళ్ళ గురించి ఆలోచించేవారే కరువవటమేగాక, హేళనగా, హీనంగా, చులకనగా చూస్తున్నారని ముత్యాలు వాపోతుంది. బడాచోరులంతా, పెద్దమనుషులంతా, మొత్తం యంత్రాంగమంతా ఈ దుర్మార్గంలో ఈ దుర్నీతిలో పాలు పంచుకొని, వెన్నుదన్నుగా నిలిచి నడిపిస్తున్నారనే వాస్తవాన్ని బట్టబయలుజేస్తుంది ముత్యాలు. "మా బతుకులు తెల్లార్చడానికి ఒక్కడైనా, ముందల కొస్తే ఒక్కగానొక్క మొగోడు మా బంధాలు తెంపడానికి బయలెల్లి నాడంటే"'.... మా సెర్మాలు చెప్పులు కుట్టిస్తాం"[75] అని దీనంగా విలపించిన ధోరణిలో పలికి ముత్యాలు మాటలు హృదయమున్న ఎవర్నైన కదిలిస్తాయి.

రత్తాల్ని శాశ్వతంగా కంపెనీ నుండి పంపించటానికి ప్లాన్ సిద్ధంచేసి, రత్తాలు తాను వెళ్ళనని మారాంచేస్తే; ఆమెకు నచ్చజెప్పి నీకు, నాకు ఏ విధమైన సంబంధ బాంధవ్యాలు లేకపోయినప్పటికీ మనం "ఒక్కలాటోళ్ళం వెక్కడున్నా కలుస్తావో ఏవో? ఏటంటావు? మన ఓనరమ్మ మనవు ఒక్కసోటె వున్నాంగాని దానికి మనకు మాతరం కట్టు"[76] అని వర్గ దృష్టితో ముత్యాలు మాటాడుతుంది. దెబ్బ తగిలినవాడికే నొప్పి

దెలుస్తుంది గాబట్టి, మేకల వర్గం వేరు, పులుల వర్గం వేరు, ముత్యాలు, రత్తాలు బాధాసర్పదష్టులు కనుక ఒక్కలాంటివారు.

పథకం ప్రకారం రత్తాల్ని వాళ్ళ ఊరువెళ్ళేలాచేసి, రిక్షా జోగులికి, దెబ్బలు తగిలినందుకు దుఃఖిస్తూ కంపెనీకొచ్చిన ముత్యాల్ని నరసమ్మ 'లంజా' అని సంబోధించి కోప్పడ్డందుకు ముత్యాలు ఆమెను ఎదిరించి మాటాడిన మాటలు వాస్తవికంగా, హేతుబద్ధంగా, నరసమ్మ బుర్ర బూజు వదిలేలా ఉన్నాయి. మేం ఆకలి బాధకి, నీ చెరకిచిక్కి లంజలమైతే నువ్వు కొవ్వెక్కి మారక్తం తాగుతూ, డబ్బు సంపాదనే ధ్యేయంగాగల పెద్ద లంజవనే కఠోర సత్యాన్ని వెల్లడిజేస్తుంది ముత్యాలు. మా నెత్తుటి దీపంతో నీ కంపెనీని వెలిగించుకుంటున్నావని ముత్యాలు ఆక్రోశిస్తుంది. తప్పించుకుపోయిన రత్తాల్ని మళ్ళీ లాక్కురమ్మనమని సింహాచలంతో నరసమ్మ సంప్రదింపులు జరుపుతున్నప్పుడుగూడ ముత్యాలు "పంటపండతన్నాదిగాబట్టి నీ వాట నువ్వు పుచ్చుకుంటున్నావు; ... పంట మాత్తరం నాలాంటోళ్ళ నెత్తురు పంట... నెత్తురు తాగినంత తాగి పంచినంత పంచుతన్నావు. నెత్తురు మాత్తరం ఒవుళ్ళో నీకు గురుతుండదుమరి కాని నెత్తురిచ్చినోళ్ళం నువ్వు తాగేదీ పంచేదీ మా నెత్తురని మావు మర్సిపోగలవా"[77] అని జలగలా నెత్తురు పీలుస్తు, నల్లిలా కుడుతూ, తమ జీవితాల్ని పీల్చి పిప్పిజేసి, తద్వారా ఎదిగిపోతున్న నరసమ్మ లాంటి వారిని నిలదీస్తుంది ముత్యాలు. ఇలా మాట్లాడగలిగే దృష్టి రావిశాస్త్రి పాత్రలకి వుంటుంది.

ముత్యాలు మానవ జీవిత విలువలు దెలిసిన జాతిముత్యం. సామాజిక కుళ్ళును, కుట్రను, మోసాన్ని, దురన్యాయాన్ని కడిగేయగల ముత్యం. అహంకారంపై అధికార జులుంపై, అణచివేసే బానిసత్వంపై బాకు ఎక్కుపెట్టే అగ్నికణం ముత్యాలు; ఆదరణలో, ఆత్మీయతలో, ఆర్తిలో ఉన్నవారిని ఆదుకొంటంలో ఆదర్శవంతురాలు. మానవత మూర్తీభవించిన మహోన్నత మహిళామణి ముత్యాలు. తను కాలిపోతున్నా వెలుగును పంచగల త్యాగమూర్తి. నిప్పులు చిమ్మిన వారిపై మంచినే వర్షించగల కారుణ్యమూర్తి.

"నవలలోని పాత్రలు కేవలం. కళావిహీనమై తేజోరహితమై, చైతన్యంలేని గడ్డి బొమ్మలు, బుట్ట బొమ్మలుకాదు. జీవకళ ఉట్టిపడుతూ రక్తమాంసాలతో ఒప్పారుతూ మనలో ఒకరిగా ఉండే పాత్రలే, నిజజీవితానికి దగ్గరగా ఉండి ఆనందాతిశయాన్ని కలిగిస్తాయి. ఆ నవలా లోకంలో అవి నడయాడుతున్న వ్యక్తులా అన్నట్లు మన కంటికి కనిపించవలసిన అవసరముంది."[78] అని పాత్ర చిత్రణ గురించి వివరించిన ఆచార్య శ్రీ యస్. గంగప్ప అభిభాషణ దృష్ట్యా ముత్యాలు సజీవ సామాజిక పాత్ర. మధురవాణి సుబ్బి పెళ్ళి తప్పిపోవటానికి సహాయపడి ఉపకారం జేస్తే; ముత్యాలు రత్తాల్ని కంపెనీనుండి తప్పించి; ఆమె జీవితాన్ని కాపాడింది. మధురవాణి ఎవరు డబ్బిస్తే వాళ్ళతోటే ఉండేది. ఆ ఉండటంలో గూడ నీతిగా ఉండేది. అదే వేశ్య నీతి. కాని ముత్యాలుకి అదే డబ్బు ఉంటే కంపెనీ నుండి బయటపడి జోగులుతో హాయిగా కాపురం జేసేది. పిచ్చి జోగులు బాధతప్పేది. ఇద్దరిలోను మానవతా విలువలున్నాయి. మీనాక్షిని పెళ్ళి జేసుకోమని రామప్పంతులుతో మధురవాణి జెపితే; రత్తాలు రాంబాబుకి దగ్గరవటానికి ముత్యాలు ప్రయత్నించింది. వేశ్యా జీవితానికి లోనుగాని వారిని అందులోకి దించకుండా నీతిగా

వుంది మధురవాణి. వేశ్యరికం తెలియని రత్తాలులాంటివారిని; ఆ ఊబిలో దిగబడకుండా కాపాడింది ముత్యాలు. తనను అవమానపరచిన వారిపై మధురవాణి జాలిపడితే; ముత్యాలు తన జీవితం నాశనమై పోవటానికి కారణమైన కంపెనీపై జాలిపడింది. ఆమెది స్వతంత్ర జీవనమైతే; ముత్యాలుది అస్వతంత్ర బతుకు. ముత్యాలు ప్లెబియన్ (Plebian) మధురవాణి రాజసమైంది. ముత్యాలు పాత్ర రావిశాస్త్రికి చాలా ఇష్టమైంది. "సొమ్ములు పోనాయండి"లో 'సిలుక'ని వర్ణిస్తూ ముత్యాలమ్మకి 'కూతురు' అని వివరించారు. "ఉజ్జయిని వదిలితే వసంతసేన బ్రతకలేదు. ఆంధ్ర వదిలితే చింతామణి బ్రతకలేదు. కాని మధురవాణి ప్రపంచంలో ఎక్కడైన బ్రతకగలదని"శ్రీశ్రీ (మన గురజాడ) చెప్పినట్లుగానే ముత్యాలుగూడా మధురవాణి సరసన ఉండటానికి అర్హత గలది.

### 3. రాంబాబు తల్లి

ఈమె టీచరు. ప్రేమికుని మోసానికి గురై పెళ్ళి కాకుండానే గర్భవతి అవుతుంది. కనీసం బిడ్డ సంరక్షణార్థం కొంత ఆర్థిక సహాయం చెయ్యమన్నా ఆ మోసకారి గుండె కరగలేదు. భారత న్యాయస్థానంగూడ ఆమెకు మొండిచెయ్యి జూపింది. సామాజిక అవమానాలు తట్టుకోలేక తండ్రి చనిపోయినట్టు తలంచి గుండు చేయించుకున్న రాంబాబుని చూసి; ఈ సమాజం నన్నేగాక; నా బిడ్డనుకూడా నిత్యం అవమానాల పొలుగులతో పొడిచి పొడిచి చంపుతుందని ఆమె బావురుమని విలపించటం ఈలోక నీతిని ప్రశ్నించినట్లవుతుంది.

రాంబాబు వసంతలు ప్రేమించుకున్నారనే విషయాన్ని గ్రహించి, ఆ తల్లి వేదన చెందింది. కారణం వాళ్ళిద్దరి మధ్యనున్న కులాల అంతరం. అందుకే "ఎక్కువ్వాళ్ళు తక్కువ్వాళ్ళతో మసలుకోడం కష్టం. తక్కువ్వాళ్ళు ఎక్కువ్వాళ్ళతో మసలడం కష్టం"[79] అని అగ్రవర్ణ, అల్పవర్ణ వ్యత్యాసాల సామాజిక స్థితిని కొడుక్కి వివరించి తనలా చిక్కుల్లో పడకుండా జాగ్రత్త వహించమని హెచ్చరించింది.

తాను పనిజేసిన స్కూల్లో, తన దగ్గర చదువుకున్న తన బిడ్డ ఐ.ఏ.ఎస్. ఫస్టు ర్యాంకులో పాసయ్యేసరికి; ఆ తల్లి తన కష్టాలన్ని గట్టెక్కినట్లు, పరమానంద భరితురాలైంది.

మధ్యతరగతి దిగువవర్గ స్పృహ కలిగింది రాంబాబు తల్లి. వివేకవంతురాలు. మానవత, సహనం, శాంతస్వభావమున్న స్త్రీమూర్తి, ఆశాజీవి.

### 4. వసంత

ఈమె తండ్రి హనుమంతరావు. పిచ్చి జోగులతో చిన్నప్పుడే వివాహం నిశ్చయమైపోయిన అబల; రాంబాబు, కృష్ణలకి క్లాసమేట్. రాంబాబు ప్రేమికురాలు; తెలివైన పిల్ల.

తండ్రిచాటు బిడ్డ; స్వయంగా తనని ప్రేమిస్తున్న రాంబాబే వచ్చి అడిగినా కనీసం ఏ కొద్దిగానైనా డబ్బులు సహాయం చెయ్యలేక పోయింది. రత్తాలు రాంబాబు ఆపదలో ఉన్నాడని వచ్చి చెప్పినా; సహాయం చెయ్యలేకపోయింది. తండ్రి వద్దంటే హాస్పటల్‌కి గూడ వెళ్ళలేకపోయింది. రత్తాలంటే వసంతకి నీచమైన అభిప్రాయం.

బావిలో కప్పల్లాగా, ఆ కొద్దిపాటి లోకానికే పరిమితమైన వసంతలాంటి స్త్రీలకి రత్తాలు ప్రాస్టిట్యూట్‌లాగే కనిపిస్తుందిగాని; రాంబాబుకు ప్రాణదాతలాగ కనిపించదు; దృష్టిలోపం.

కులాల అంతరమున్న, రాంబాబుని ప్రేమించగలగటం కొంతలో కొంత మెరుగు. హంతకుడు, జూదరి, వ్యభిచారైన జోగుల వలనుండి తప్పుకుంటానికిగూడ వసంత రాంబాబుని ప్రేమించి ఉండవచ్చు; వసంత అస్వతంత్ర ప్రేమికురాలు; చదువున్నా తెగింపు; చొరవ లేని స్త్రీ; సాటి స్త్రీపై సానుభూతి లేకపోగా మాత్సర్యమున్న స్త్రీ.

**5. వరాలమ్మ**

రత్తాలు పెద్దమ్మ వరాలమ్మ. రంగూన్ డాక్ లేబర్లో మేస్త్రీగా పనిజేసి అక్కడే మరణించాడు వరాలమ్మ భర్త.

ఉన్న ఊళ్ళోనే వరాలమ్మ కాఫీకొట్టు బెట్టింది. తన మరిది, తోడికోడలు చనిపోతే రత్తాలు బాధ్యతని తానే చేపట్టింది. రత్తాలు సింహాచలంతో లేచిపోయి, కూతురి జీవితం కూలారిపోయి, దిగులుతో వరాలమ్మ మరణిస్తుంది. నమ్మకానికి, పరోపకార గుణానికి వరాలమ్మ పెట్టింది పేరు.

**6. రాధమ్మ**

తన బంధువైన గోపాలం అంటే రాధకి చిన్నప్పట్నించి అభిమానమే. తను ఇంతగా అభిమానించిన గోపాలం పెళ్ళికి ముందే అమ్మాయిలతో పెద్ద గ్రంథం నడిపాడని తెలిసినా పెద్దల పట్టుదలతో అతణ్ణి పెళ్ళాడింది.

"ఇదింటిదగ్గిర్లేదు. ఇంతకంటె మంచి చాన్సు ఇంకెక్కణ్ణించి వస్తుందన్చెప్పి మీరు ఏంచేస్తారో అని నా భయం"[80] అని రాధ ఊరువెళ్తూ భర్తతో అన్నమాటలు, గోపాలం స్వభావాన్ని, ఆమె ఆందోళనల్ని తెలియజేస్తున్నాయి. కాంట్రాక్టుల మోసం కేసులో గోపాలం మూడేళ్ళు జైలులో ఉంటే తన పిల్లలకి, ఆయన అమెరికాలో ఉన్నట్లు చెప్పి, తాను రోజురోజుకు కుమిలిపోతు, బిడ్డల్ని సముదాయించుకొచ్చిందా ఇల్లాలు.

కాని భర్త జైలునుండి వచ్చాక వంటమనిషి రత్తాలు అందానికి లోనై తన భర్త తనకు దక్కకుండా పోతాడనే అనుమానంతో ఆమెను ఇంటినుండి వెళ్ళిపోయేలా చేసింది రాధ. స్త్రీకి స్త్రీయే శత్రువంటే ఇలాంటి సన్నివేశాన్నిబట్టి నిజమేననుకోవాల్సి వుంటుంది.

రాధమ్మ సంపన్నవర్గ స్త్రీ. భర్త తిరుగుబోతు, తాగుబోతు, జూదరి, మోసకారి అని తెలిసి నిత్యం అనుమానంతో, దిగులుతో జీవించిన స్త్రీ. దుఃఖాన్ని దిగమింగుకొని జీవించటం తప్ప మరో దారిలేని స్త్రీ.

**7. నరసమ్మ**

సానికొంప యజమానురాలు నరసమ్మ; మనుషుల మానమమ్ముకొని మనుగడ సాగిస్తున్న 'మహిళామణి' స్త్రీలని మాంసం ముద్దలుగా, సంతలోని సరుకులుగా అమ్ముకుంటు, వాళ్ళ రక్తం తాగుతూ జీవిస్తున్న జలగ; తనకు ఏ కాస్త లాభం చేసే ఎవరితోనైనా సరసానికి వెనుకాడని స్త్రీ. అందరితో వ్యాపార సంబంధాలేగాని, హృదయగత సంబంధాలు ఏనాడూ పెట్టుకొని ఎరగదు.

సచ్చాలులాంటి స్త్రీలు ఎందరో తన కంపెనీలో మరణించినా, రత్తాలు, ముత్యాలు లాంటి స్త్రీల జీవితాలు నాశనమైపోతున్నా ఏమాత్రం చీమకుట్టినట్లయినా లేకుండా అంతా సజావుగా తన వ్యాపారాన్ని నిర్వహించుకుంటూ పోతుంది. రత్తాలేకాదు సింహాచలం లాంటి తార్పుడుగాళ్ళను గూడ మూతి పగిలేలా కొట్టగల దుష్టసంప్రదాయానికి నిదర్శనం నరసమ్మ. రైడ్స్, పోలీసు స్టేషన్స్, కోర్టుల చుట్టూ తిరగటాలు ఇవి సాధారణ కార్యక్రమాలు నరసమ్మకి.

రాజకీయ నాయకుల, పోలీసు అధికార్ల, డబ్బున్న బడా వ్యాపారవేత్తల అండదండలు ఆమెకు దండిగా ఉండటంవల్లే ఈ వ్యాపారాన్ని నెట్టుకురాగలుగుతుంది. అందుకని ఈ వ్యాపారపరంగా నరసమ్మ నొక్కదాన్నే తప్పుబట్టవలసిన పనిలేదు. మొత్తం సామాజిక వాతావరణమంతా మేడిపండులా ఉంది. ఈ దృష్టితోనే ముత్యాలు అమ్మేవాళ్ళున్నప్పుడు కొనేవాళ్ళ తప్పేముంది? అని ప్రశ్నించింది. ఎన్నాళ్ళ నుంచో గుట్టుగా నెట్టుకొస్తున్న వ్యాపారం రత్తాలి రాకతో, ఆమె తప్పుకుపోవటం, మళ్లీ పట్టుకురావటంతో మలుపులు దిరిగి చివరకు మూతబడే పరిస్థితి ఏర్పడింది. వ్యవస్థాగత దుష్ట సాంప్రదాయంలో, కుళ్ళు సంస్కృతిలో నరసమ్మ ఒక పావులాంటిది.

'యమకూపం'లో కుప్రిన్ దాదాపు సగభాగం నవలను సానికొంప వ్యవహారానికే కేటాయిస్తాడు. 'రత్తాలు-రాంబాబు' నవలలోకూడా ఎక్కువ భాగం సానికొంప చుట్టూతా పరిభ్రమిస్తుంది. 'యమకూపం'లోని సానికొంప యజమానురాలు. 'అన్నా'కి మరో యజమానురాలు 'ఎమ్మా'కి నరసమ్మకి చాలా పోలికలున్నాయి. ముగ్గురూ ఒక తానులోని గుడ్డలే. షేక్ బంగారప్ప మరో సానికొంప యజమానురాలు.

## 8. రాంబాబు

నమ్మించి గర్భవతినిజేసి, తాళి గట్టకుండా వెళ్ళిపోయిన వాడి మోసానికి గురైన పంతులమ్మ కొడుకు రాంబాబు. తండ్రి చేసిన మోసాన్ని తెలుసుకున్న రాంబాబు పదేళ్ళ వయసప్పుడే తండ్రి ఫోటోని ముక్కలు ముక్కలుజేసి, దానిపై ఊసి, అసహ్యించుకొని, ఆయన చనిపోయినట్లుగా శ్రాద్ధ కర్మకోసం గుండు చేయించుకున్న వినూత్న స్వభావి రాంబాబు. తమ కష్టాలకి, తల్లి బాధలకి ఆయన కారకుడని రాంబాబు నిశ్చయించుకున్నాడు. ఆ చిన్నవయస్సులోనే అంత తీవ్రమైన పనిచేశాడంటే, దాని వెనుక తండ్రిలేని రాంబాబు పొందిన అవమానంగూడ ఉంది. రాంబాబు చిన్నప్పటి నుండి తెలివైనవాడు, స్నేహశీలి, అభిమానవంతుడు.

రాంబాబు, కృష్ణ, వసంతలు క్లాస్‌మేట్స్. రాంబాబు, వసంతలు ప్రేమికులు. ఐ.ఏ.ఎస్. పరీక్షలనంతరం రాంబాబు కృష్ణతో కలిసి వసంతని చూడటానికి వాళ్ళ ఊరు వస్తున్నప్పుడు దారిలో రత్తాలు గొడవ జరుగుతుంది. రాకెట్టును చితకబాది రత్తాల్ని రక్షిస్తాడు. ఈ సన్నివేశంలో రత్తాలు రాంబాబుపై అభిమానాన్ని పెంచుకుంటుంది. రత్తాల్ని రక్షించినరోజు రాత్రి కృష్ణ మిత్రులతో కలిసి రాంబాబు మొదటిసారిగా మందుతాగి అదుపుతప్పి రోడ్డుమీద అపస్మారకంగా పడి వుంటే; సినిమానుండి తిరిగి వస్తున్న రత్తాలు, ముత్యాలు అతణ్ణి కాపాడి హాస్పటల్‌కు చేరుస్తారు.

రత్తాలు రాంబాబుకోసం చేసిన సహాయం గురించి విని ఆశ్చర్యపడి; రాంబాబుకి రత్తాలిపట్ల కృతజ్ఞతాభావం ఏర్పడుతుంది. హాస్పటల్‌లోని ముసలాయన, డాక్టరు, నర్సులు, అందరూ రత్తాలిసాయంవల్లే రాంబాబు బతికి బయటపడ్డాడని చెప్తారు. అయితే రత్తాల్ని రోడ్డుమీది అమ్మాయిగానే గుర్తుబెట్టుకుంటాడు. వసంత తనకోసం సపర్యలు చేస్తుందనే భ్రమలో ఉంటాడు రాంబాబు. రత్తాలి సేవకు కృష్ణ ద్వారా రెండు వందల రూపాయలిప్పించి, ఆమెకు కృతజ్ఞత చెప్తామనుకుంటాడు రాంబాబు. కాని ఆ డబ్బు ఎవరి బ్రతుకు ఖరీదని ప్రశ్నించిన రత్తాలి మాటలతో దిమ్మెరపోయి, రత్తాలిపై సానుభూతి ఏర్పడి ఆమెను రక్షించటానికి కృష్ణని సహాయం చెయ్యమని చెప్తాడు.

రత్తాలు చేసిన సహాయం గురించి తల్లికికూడ చెప్పి; రత్తాలు గురించి ముత్యాలు చెప్పిన సంగతుల్ని జ్ఞాపకం జేసుకొని, ఎలాగైనా నరసమ్మ కంపెనీ నుండి రత్తాలికి విముక్తి కలిగించటం కోసం ఆ వెయ్యి రూపాయలు సంపాదించాలనే ప్రయత్నంలో ఉంటాడు రాంబాబు. ఆ వెయ్యి కోసం తల్లిని, తన మాస్టార్ని, స్నేహితుల్ని సేట్‌ని-ఇలా ఎంతో ప్రయత్నం చెయ్యటం రాంబాబు చిత్తశుద్ధికి సూచకం. స్నేహితుడు బంగార్రాజు రాంబాబుకి ఐదు వందలు ఇస్తానన్నాడు. కాని ఆ డబ్బులు పార్టీలో అందరి ముందు ఇవ్వటం రాంబాబు అభిమానాన్ని దెబ్బతీసింది. పార్టీలో అమ్మాయిలను అందరి ముందు వివస్త్రలనుగా చెయ్యటాన్ని రాంబాబు భరించలేక బంగార్రాజు ముఖంమీద అతనిచ్చిన ఐదు వందలు ఇసిరిపారేసి "ఆ అమ్మాయి తాగదు. తాక్కపోతే ఏమిచేస్తావు" అని రాంబాబు తాగని కాంతం అనే అమ్మాయిని బలవంతంగా తాగమని హింసిస్తున్నప్పుడు ఆదుకొని అంటాడు. అందుకు గ్రూప్ కింగ్ కరుణాకరరావు ఆ అమ్మాయి మొఖంమీద విస్కీపోసి, మొఖంమీద గుద్ది "తాక్కపోతే అదీ చేస్తాను, మరింక ఆ లంజా, ఈ లాంజాకొడుకు ఏంచేస్తారు నన్ను?"అని ప్రశ్నించే సరికి రాంబాబు ఉగ్రరూపంతో ఆ గ్రూపు కింగుని ఒక దెబ్బతో నేలకూల్చి "ఏ లంజాకొడుకు, ఏ లంజాకొడుకునేంచెయ్యగల్డో తెలిసిందిరా లంజాకొడకా?"[81] అని వాళ్ళమీద తిరగబడి అక్కడి నుండి రాంబాబు వెళ్ళిపోయాడు.

రాంబాబు కళ్ళ ముందు జరుగుతున్న దుర్మార్గాన్ని భరించడు. స్త్రీలనెవరైన బలవంతంపెడితే ఏమాత్రం నిర్లక్ష్యం చెయ్యకుండా వాళ్ళ పక్షం వహిస్తాడు. పురుషాధికారానికి, మోసానికి బలైన తన తల్లి జీవితం ఇతర స్త్రీల బాధల్ని చూసినప్పుడు అతని కళ్ళ ముందు కదిలాడు తుండటం గూడ అతనిలా ప్రవర్తించటానికి ఒక కారణం. దనం, పెత్తందారీతనం ఇవన్నీ కలిసి ఇలాంటి దుర్మార్గాని నడిపిస్తున్నాయని, వట్టి మాటలతో ఈవ్యవస్థ మారదని "సంగరమున ఖడ్గముల్, గదలు గాండివముల్ చెరలాడ' '[82] వలసిందేననే భారత పద్యం రాంబాబుకి జ్ఞప్తికొస్తుంది. కాంతం అనే అమ్మాయి సన్నివేశం చూసినాక రాంబాబులో రత్తాల్ని ఆ నరక కూపం నుండి కాపాడదామనే కాంక్ష ఇంకా బలీయమై "ఎలాగైనా సరే వెయ్యి రూపాయలు సంపాదిస్తాను. నన్ను నేను అమ్మేసుకొనైనాసరే సంపాదిస్తాను[83] అనే నిర్ణయానికొస్తాడు.

రత్తాలు విముక్తికి రాంబాబు వెయ్యిరూపాయలు కృష్ణకు పంపిస్తాడు. ఫస్ట్ ర్యాంకులో ఐ.ఏ.ఎస్. పాసైనట్లు కృష్ణ దగ్గర నుండి టెలిగ్రాం అందుకొని రాంబాబు

ఆనందిస్తాడు. సినిమాలోలాగా రాంబాబు కలెక్టరుగా వసంత వాళ్ళ ఊరు వస్తున్నట్లు తెలుసుకొని వసంత సంతోషిస్తుంది.

చదువు; వసంతతో ప్రేమ; ఒక విధంగా సాగితే; రత్తాల్ని రక్షించటం; జబ్బుపడిన తనని ఆమె కాపాడటం ఇవి మరొక దిక్కుకు రాంబాబు జీవితాన్ని నడిపించాయి. కాంతం సన్నివేశం రాంబాబుకి అమ్మాయిల సాని జీవితాన్ని; పట్టెడు మెతుకుల కోసం పడరాని పాట్లు పడతారని కళ్ళకు కట్టినట్లు చూపించింది.

ఇంకా తన దారిద్ర్యం ధనమద వ్యత్యాసాలు గూడా రాంబాబు అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. కుల వ్యత్యాసాల కుంపటి సెగనుకూడా అతను అనుభవించాడు. వసంత గృహ బాధలుకూడా రాంబాబుకి తెలుసు. తను ఏ సామాజికస్థితి నుండి వచ్చాడో ఏ వర్గ నేపథ్యం నుండి ఎదిగాడో ఒకసారి బేరీజు వేసుకుంటే రాంబాబు రత్తాల్ని నిస్సహాయంగా కేవలం ధన సహాయంతోటే విడిచిపెట్టడని అర్థమవుతుంది. రావిశాస్త్రి రాంబాబుని మానవత్వమున్న మంచి మనిషిగా చిత్రీకరించారు. అయితే ఐ.ఏ.యస్. ఫస్టు ర్యాంకు-ఇవన్నీ సినిమా ఫక్కీలో అతనిపై ఆపాదించారు.

## 9. అడ్డబుర్ర

అడ్డబుర్ర అట్టడుగు పాత్ర; విశ్వాసపాత్రుడు. తన యజమానురాలు నరసమ్మ అప్పగించిన పనిని తు.చ.తప్పకుండా పాటించే రాంబంటు. అమ్మాయిల వ్యవహారాలన్ని వెయ్యికళ్ళతో కనిపెడుతుంటాడు. రత్తాలు ఆత్మహత్య చేసుకోబోయినప్పుడు ఆ ప్రయత్నం నుండి ఆపటమేగాదు. నగ్నంగా వున్న రత్తాలి పై మోజు బడ్డ 'మాయ్య'ని ఆప్రయత్నం నండి ఆపగలిగిన మంచి గుణమున్నవాడు అడ్డబుర్ర.

రత్తాలు గొడవ జరిగినప్పుడు, రత్తాలు వెళ్ళిపోయినప్పుడు ఆమెను తీసుకు రావటానికై సింహాచలం వత్తిడిపై 'సాయిబు' ఎష్టైవేషంలో వెళ్ళిందీ అడ్డబుర్రే రాంబాబు మందుల కోసం రత్తాలు తన మానమమ్ముకుంటానికి సిద్ధపడితే, ముత్యాలు అందుకు గుండెలు బాదుకొని దు:ఖిస్తుంది. అప్పుడు "పడ్డవేటే ముత్తేలు"! అందరం సెర్లోనే దిగబడిపోయినాక ఇంకె వరి కోసరవే! ఏడువు! సచ్చినోల్ల కోసరం సవ్వబోయీ వోళ్ళు ఏడ్సినట్టు! ఏడకేడక! నాలుగు డబ్బుల కోసం నియ్యప్పనీచానికి దిగినాదంటే ఏడ్సినా బావుంది! గాని మడిసి బతుక్కోసరం మానవమ్ముకుంటే తప్పేటుందే? మన అప్ప మరియాద పనిసేసిందంటాన్నేను"[84] అని పలికిన మాటలు అడ్డబుర్ర హృదయాన్ని పట్టిస్తాయి సాని కొంపలోనైనా? చేసేది ఏహ్యమైన వృత్తైనా, ఇతనికి ఓమనసుంటుంది. సమస్యలకి స్పందించే హృదయముంటుంది ఇలాంటోళ్ళంతా నీచులుకారు, బ్రతుకు తెరువు కోసం ఆయా వృత్తులలో దిగబడ్డారే గాని, చాల మంది దొంగ పెద్ద మనుషుల కంటే ఉత్తమం అని చెప్పటమే రావిశాస్త్రి అడ్డబుర్ర పాత్ర ద్వారా తెలియజేసింది.

ఊర్వశీ లాడ్జింగ్‌పై రైడ్ జరిగి రత్తాలి మానం సంరక్షింపబడ్డందుకు అడ్డబుర్ర పరమానంద భరితుడవుతాడు "ఆ సమయంలో అడ్డబుర్ర సైకిలెక్కి వెళ్ళాడనటం కంటే, స్వచ్ఛమైన సంతోషం సైకిలెక్కి వెళ్ళిందనటం సమంజసంగా ఉంటుందని రావిశాస్త్రి తన ఆనందాన్ని అడ్డబుర్రద్వారా తీర్చుకున్నారు.

సానికొంపలో పనిజేసే, ఆయుజమానురాలికి నమ్మిన బంటుగా వ్యవహరించే అతి చిన్న పాత్రలో గూడ మానవత్వం, కరుణ, మంచితనం, పరోపకారబుద్ధి ఉంటుందనే సత్యాన్ని రావిశాస్త్రి అడ్డబుర్ర పాత్ర ద్వార వ్యక్త పరచిన తీరు అద్భుతం. ఇలాంటి పాత్రలు సాధారణంగా అరుదుగా వుండే అపురూప పాత్రలు.

**10. కొంగ**

నరసమ్మది, కొంగరిక్షా అతనిది ఒకే ఊరు. ఆ అభిమానంతో ఆమెను 'మాయప్పగోరి బొట్టె' అని చెప్తుంటాడు. మానవత్వానికి, మంచితనానికి మహోన్నత ఉదాహరణ ఈ కొంగ. వ్యవస్థ దుర్మార్గాన్ని, మేడిపండు విధానాన్ని బట్టబయలుచేసే శ్రామికవర్గ, అట్టడుగు ప్రజానీక పాత్రలలో 'కొంగ' పాత్రని రావిశాస్త్రి చాల చైతన్యవంతంగా రూపొందించారు.

నరసమ్మ కంపెనీ 'ఘనత' గురించి, ఒక ఉపన్యాస పక్కీలో వివరంగా చెప్పటం 'రావిశాస్త్రి పాత్రలు ఉపన్యాసం చేస్తాయి'అనే విమర్శకు అవకాశమిచ్చినట్టుంది. "ఏ బొమ్మ పక్క ఏ బొమ్మ అమర్చాలో మాయప్పగోరి బొట్టికి దెలిసినట్టు ఓలుటేను మొత్తంమ్మీదర ఒలికీ తెల్దు"[85] అని నరసమ్మ గొప్పని వివరించటం, అతనికి నరసమ్మపైన ఆ కంపెనీ పైన ఉన్న అభిమానాన్ని తెలియజేస్తుంది.

నరసమ్మంటే తన కభిమానమున్నా కంపెనీ నడుస్తున్న తీరును ముసలి కొంగ అసహ్యించుకుంటాడు. కూలివాళ్ళ కష్టంతో కాంట్రాక్టర్లు ఎదిగిపోతున్నట్లు, 'ముండపాపల' శరీరాన్ని అమ్ముకొని, వాళ్ళ రక్తంపై ఓనరమ్మలు బాగుపడుతున్నారే గాని, వాళ్ళ బ్రతుకు బాధల్ని చూడటం లేదని, అందుకు మంచి ఉదాహరణ సచ్చాలు చావని, చాల వాస్తవికంగా కొంగ పెద్దలోకానుభవమున్నవ్యక్తిలా మాటాడతాడు. అలాగే యూనియన్ల పేరుతో నాయకులు చేసే మోసాన్ని గూడ కొంగ వెల్లడి చేసాడు. "పులిమేకన్దిండం నోకదరమ'మైతే---- గుండెట్టి మనం పుల్ని కాల్సేసి నోకదరమం మార్చడం"[86] సరైన ధర్మమని కొంగ యూనియన్ ప్రెసిడెంట్‌తో వాదిస్తాడు. అంతేగాక దోచుకు తినడం లోక ధర్మమైతే; ఎదిరించి ఆపి న్యాయం జరిగేలా చెయ్యటం మనం చెయ్యవలసిన లోకధర్మమని కొంగ తీర్పు చెపుతాడు. అతని ఆలోచనా సరళి వ్యవస్థ దుర్మార్గాన్ని నిలదీస్తుంది. పీడితప్రజల బానిస విముక్తిని కోరుకుంటుంది. రావిశాస్త్రి వామ పక్షరచనా తీరుకి, శ్రామిక పక్షపాత ధోరణికి కొంగ పాత్ర మంచి ఉదాహరణ.

నరసమ్మ వ్యాపారం గురించి చెపుతూ అద్భుత లోక సత్యాన్ని వివరించాడు కొంగ. "అమ్ముకు బతుకు నానొద్దన్ను ఉప్పమ్మకో పప్పులమ్మకో అంతేగాని మడిసి మానం అమ్ముకొని మడుసులు బతకడం నాయెం కాదు గదా"[87] అని నరసమ్మ అమ్మాయిల వ్యాపారాన్ని నిలదీశాడు. మనుషుల మానమమ్ముకుంటం మహాదుర్మార్గమని, ఇంతకంటే నీచత్వం లేదని కొంగ జెప్పిన మాటలు కంపెనీ నిర్వాహకులకు, దానిని కాపాడుతున్న పెత్తందార్లకు, పోలీసు యంత్రాంగానికి దానిలో భాగస్వాములైన మగమహారాజాలకి గడ్డి బెట్టినట్లున్నాయి. జ్ఞానోదయం కలిగించేలావున్నాయి.

మరోసారి ముత్యాలుతో మాట్లాడుతు ఈ రాజ్యం పైసలున్నోడిది, పోలీసోడిదనే వాస్తవాన్ని వెల్లడి చేస్తాడు కొంగ. చదువుకున్నోళ్ళు ఈసమాజానికి వెలుగు మార్గం

చూపించక పోగా చీడ పురుగుల్లా తయారైనారనే అసహనాన్ని బాధని గూడా వ్యక్తం జేస్తాడు: పీడితులు, బాధితులు, ఐకమత్యం కరువై తలోదారి తొక్కటం వల్ల శ్రామిక రాజ్యం రాకుండా, సంపన్న, దొంగలరాజ్యం ఏలుబడిలో ఉంటుందని: అందుకని ఐకమత్యం ముఖ్యమని చాల సులభంగా సామాజిక వాస్తవిక పరిస్థితుల్ని కొంగ వివరించిన తీరు హృదయాల్ని హత్తుకుంటుంది.

మనందరం ఎప్పుడు కలుస్తామని ప్రశ్నించిన ముత్యాలుతో "మన సెవట్లు పిండుకొని, మన్నెత్తురు తాక్కొని, మనల్నిమన్నుగొట్టుకు పోంద్రా నా కొడకల్లారా, మాటాణ్ణారంటే మూతుల మీద బొడిసీసి టుపాకెట్టి కాల్చిగలంజేగర్త కబర్దార్ అన్జెప్పి, మనల్ని దోసుకు బతికే దొంగనాకొడుకుల కాడ దోసిలొగ్గి బతికేకంటే నీట్లోనో నిప్పులలోనో దూకి సవ్వడం నయ్యిం, అని మన్లాశానా మందిరికి అని పిచ్చిన్నాడు. మన్లశానా మందిరివి కలుస్తాం"[88] అని రావిశాస్త్రికొంగని ఒక వ్యక్తిగా వాడుకొని ఈమాటలు రాసాడు. అంటే వ్యవస్థాగత దుర్మార్గం పైన: దోపిడిపైన, తిరగబడమని ప్రబోధం చెయ్యటమే ఈప్రసంగ ఉద్దేశ్యం. ఇంతకంటే మించిన సామాజక ప్రయోజనమరేంగావాలి? కొంగ పాత్ర ఉపన్యాస ధోరణితో నడిచినా, చాలా విలువైన సత్యాన్ని సామాజిక వాస్తవిక పరిస్థితుల్ని బట్టబయలు జేసి, సామాజిక చైతన్యం కలగటానికి ఈపాత్ర చాల దోహదపడుతుంది. రావిశాస్త్రి రచనాతీరు, ఆయన వర్గ దృక్పథం, వర్గ చైతన్యం ఈ పాత్ర ద్వారా స్పష్టమవుతుంది.

### II. రిక్షాజోగులు

రిక్షాజోగులు అట్టడుగువర్గ పాత్ర. ముత్యాలుపై మనసుపడి ఆమెను విడిపించుకొని తనదానిగా చేసుకోవాలని చాల తాపత్రయం పడుతుంటాడు. పరోపకార బుద్ధిగల పాత్ర. ధైర్యవంతుడు.

ముత్యాలు మాటపై రత్తాలు కంపెనీ నుండి తప్పుకుపోవటానికి కూడ సహాయపడతాడు. ముత్యాల్ని కంపెనీ నుండి విడిపించుకెళతానికి, పైసాపైసా కూడబెడతానికి, మనిషి, మనిషిని కూడగట్టటానికి ప్రయత్నాలు చేస్తున్నానని సమయం జూసి ఆమెను తప్పకుండా తీసుకెళతాననే ఆత్మ విశ్వాసాన్ని, రత్తాలుతో వ్యక్తపరుస్తాడు, జోగులు.

రత్తాల్ని కాపాడటం కోసం గల్లీ పులితో పులిలా పోరాడి, వాణ్ణి చావబాదిన శక్తి మంతుడు జోగులు. తనతో కలిసున్న వారిని రక్షించటం కోసం సాహసంతో ముందుకు దూకుతాడేగాని పిరికిగా పారి పోయే వ్యక్తి గాదనే విషయం దీని వలన స్పష్టమవుతుంది. "నోర్లేని మేకల్ని గొర్రెల్ని దుక్క పెట్టి కాల్సుకు తింది గదా! ఉప్పడయి కడుపుల పొడిసేస్తాయని బెంగట్టిపోయి తిరగకండి నంజ"[89] అని జోగులు రత్తాల్ని, ఇతరమ్మాయిల్ని దోచుకు బతికిన నరసమ్మ గురించి వాస్తవంగా వివరించాడు. తానుమనసు పడిన స్త్రీ శరీరం కన్నా మనసు పవిత్రంగా ఉంటే చాలు, అని ముత్యాలు కోసం ఎదురు జూస్తు ఆమెతో జీవితం గడపాలనే కోరికతోవున్న పాత్ర రిక్షా జోగులు. పవిత్ర ప్రేమికుడు.

**12. జోగులు (కారు)**

చిన్నప్పుడే జోగులు తల్లి దండ్రి రైల్వే యాక్సిడెంట్‌లో చనిపోతారు. మేనమామ కూతురు వసంతతో చిన్న వయసులోనే పెళ్ళి నిశ్చయమయ్యింది. తన చదువు ఆగిపోయినా వసంతని మాత్రం ఎం.ఏ దాక చదివించాలని ఆశపడ్డాడు. క్షణిక శారరక సుఖం కోసం డ్రిల్ మాస్టర్ని, అతని భార్యని అంతం చేయించిన హంతకుడు జోగులు. ఏ మాత్రం తీరుబడి దొరికినా నరసమ్మ కంపెనీకెళ్ళి ముత్యాలుతో కులికేవాడు. తాగుడు; జూదం, వ్యభిచారం, ఇతని నిత్యకృత్యం. దీపావళి సందర్భంగా రైతుల ఇళ్ళకి నిప్పుపెట్టించి నిర్లాక్షణ్యంగా ఎనిమిది మంది చనిపోవటానికి కారకుడయ్యాడు. జోగులు. నరసమ్మ కంపెనీలో ఉండగా పోలీసులు రైడ్‌చేసి ఇతన్ని పట్టుకొని చితకబాది కేసుబెడితే; తన ధనం, పలుకుబడితో డియస్పీని ట్రాన్స్‌ఫర్ చేయించి తన సత్తా నిరూపించుకున్నాడు. ఇలా ఇతనొక అసాంఘిక శక్తి. నేడు జరుగుతున్న డబ్బు, అధికార, రాజకీయ చదరంగానికి సరిపడే పాత్ర జోగులు.

ధన, అధికార, రాజకీయ మదం, అండదండలు, హత్యాస్వభావంతో, తాగుడు, పేకాట, ముండల ముటాకోరు స్వభావంతో, దౌర్జన్యం; దుర్మార్గంతో, ఒక అసాంఘిక ప్రవృత్తికి నిదర్శనంగా నిలిచిన వ్యక్తి జోగులు. ప్రతి నాయుక పాత్రలాంటివాడు జోగులు.

**13. హనుమంతరావు**

హనుమంతరావు వసంత తండ్రి. జోగులు తల్లిదండ్రులు చనిపోయిన దగ్గర నుండి, మేనమామగా అతని ఆస్తిపాస్తుల సంరక్షిణా బాధ్యత ఈయనే చేపట్టాడు. వసంతని జోగులకిచ్చి పెళ్ళి చేయాలనే స్థిర సంకల్పంతో ఉండి, రాంబాబుని ద్వేషించి; అతను ఇంటికొచ్చినప్పుడు అవమానిస్తాడు. అవినీతితో ఉద్యోగం నుండి డిస్‌మిస్ అయిన స్వార్ధపరుడు. జోగులుతో కుతంత్రం పన్ని నేల తల్లిని నమ్ముకున్న సన్నకారు రైతులకు భూమిని దక్కకుండా చేసిన, అట్టడుగు వర్గద్వేషి. పేదసాదలపట్ల ద్వేష స్వభావంతో, సంపన్న వర్గ కొమ్ముకాసే వ్యక్తి.

**14. గోపాలరావు**

రాధ భర్త, ఇంజనీరు. త్రాగుడు, పేకాట, ముండల ముటాకోరుతనం, మోసం, ఇలాంటి అవలక్షణాలన్నీ పుష్కలంగా వున్న వ్యక్తి. రత్తాల్ని బుక్‌చేసుకొని లాడ్జింగ్‌కి తీసుకెళ్ళింది ఈ మహానుభావుడే; దొంగ కాంట్రాక్టులు చేసి డబ్బు కాజేసి, ఫలితంగా మూడు సంగులు జైలుశిక్ష అనుభవించిన ఘనుడు. డబ్బువల్ల కలిగే అవలక్షణాలకి, వ్యాపార వృత్తిలో చేసే మోసాలకి, దుష్ట సాంప్రదాయానికి గోపాలం నిదర్శనం. స్త్రీని శారీరక సుఖానికి వాడుకునే ఆటబొమ్మగా భావించే వ్యక్తి.

**15. కృష్ణ**

సంపన్నవర్గ స్వభావమున్న పాత్ర కృష్ణ. రాంబాబు సాహచర్యం వలన తన పరిస్థితి మెరుగుబడుతుందని అతనితో కలిసి ఐ.ఏ.ఎస్. చదువుతాడు. రత్తాలు, ముత్యాలులాంటి సాధారణ ప్రజానీకమంటే ఇతనికి ఏవగింపు.

రాంబాబుని ఆసుపత్రిలో చేర్చి కాపాడిన రత్తాలుపై జాలిపడకుండా, వాళ్ళ సేవల్ని డబ్బుతో సరిపెట్టాలని జూసిన వ్యాపార మనస్తత్వమున్న వ్యక్తి.

రత్తాలి విముక్తికోసం రాంబాబు పంపించిన వెయ్యి రూపాయలు రత్తాలుకి ఇవ్వటానికి కృష్ణ ఎంతో బాధపడతాడు. పరుల సొమ్ము వేరే వాళ్ళకు ఇవ్వటానికి గూడ ఇష్టపడనంతటి డబ్బు కక్కుర్తిగాడు కృష్ణ. అంతేగాక రత్తాలి గురించి చాలా చులకన భావమున్న వ్యక్తి. కాని తన స్నేహితుడు పోలీసాఫీసర్; రత్తాలు అనాఘ్రాత పుష్పం అని చెప్పినప్పుడు రత్తాలిపై సానుభూతి గలిగి, ఆమెను తన అక్క రాధ ఇంట్లో వంటమనిషిగా కుదిర్చి, సహాయపడ్డాడు. కృష్ణ ఉన్నతవర్గ స్వభావి. పేదలపట్ల చులకన భావమున్న వ్యక్తి.

## 16. గంగరాజు హెడ్డు

పోలీసు డిపార్టుమెంటు పనితీరు తెలుసుకుంటానికి అన్నివిధాలా సరిపోయే పాత్ర గంగరాజు హెడ్డు. అసలు కేసులో లేనోణ్ణి, కేసులో ఇరికించగలడు. ఉన్నవాణ్ణి నిక్షేపంగా తప్పించనూగలడు. దొంగలతో సయ్యాటలాడగలడు. సాని కంపెనీ వాళ్ళతో సరసాలాడగలడు. పెద్దాఫీసర్ల బూట్ పాలిష్ చక్కగా చేయటం నేర్చుకున్న వ్యక్తి గంగరాజు. కలెక్టర్ పి.ఏ. భార్య బంగారంపోతే, ఆ కేసుని రకరకాల మలుపులుదిప్పి అసలు బంగారం ఎక్కడుందో తెలియదుగాని; ఎవరిదో కొంత బంగారం మాత్రం ఆమెకు ఇప్పించిన 'గొప్ప' పోలీసుహెడ్డు.

బొబ్బిలి పెళ్ళి కెళుతున్న ముసలమ్మ మనుమరాలిని సింహాచలం ఎత్తుకుపోతే; ఆ పాపని ఆ ముసలమ్మకి, అప్పగించి ఫిర్యాదుచేసిన ముసలమ్మ దగ్గర రెండు వందలు కాజేసిన దురాశపరుడు.

నరసమ్మతో, ఆమె కంపెనీ మనుషులతో స్నేహంగా మెలుగుతూ, వాళ్ళిచ్చే కొద్దిపాటి డబ్బుకి; సారాకి; శారీరక సౌఖ్యాలకి తలొగ్గి, డిపార్టుమెంటుకు సంబంధించిన రైడ్స్ తదితర రహస్యాలు అందిస్తూ; డిపార్టుమెంటుకి, సమాజానికి ద్రోహం చేస్తున్న స్వార్థపరుడు ఈ హెడ్డు.

సింహాచలాన్ని పట్టుకుంటానికి నరసమ్మ కంపెనీకి వెళ్ళి, సింహాచలం తన మంచం కిందే ఉంటే గమనించలేక; ఆ మంచంపైన నరసమ్మతో సరసాలాడిని

పోలీసు వ్యవస్థకు సరైన నకలు గంగరాజుహెడ్డు. ఇతని ద్వారా పోలీసు యంత్రాంగం ఎలా పనిచేస్తుందో రావిశాస్త్రి చిత్రీకరించారు. అవినీతి, లంచగొండితనం; 'మంచగొండితనం' ఆ డిపార్టుమెంట్లో ఎలా వర్థిల్లుతుందో గూడా వర్ణించారు.

## 17. సింహాచలం

స్వభావరీత్యానే సింహాచలం పెద్ద లంపెన్ క్యారెక్టర్. ఏదైన ఘోరమైన తప్పు చెయ్యబోయే సమయంలో కనీసం పరితాప పడటంగాని; చేసినాకన్నా పశ్చాత్తాప పడటంగాని ఇతనిలో మచ్చుకైన కానరాదు.

సన్నాసప్పడి కొడుకునని నమ్మించి, రత్తాలు పెద్దమ్మని, రత్తాల్ని మోసగించి; తనకు హార్బర్‌లో ఉద్యోగమని, రత్తాల్ని భ్రమపెట్టి, పెళ్ళిజేసుకుంటానని ఆశపెట్టి,

రత్తాల్ని వెయ్యి రూపాయలకి నరసమ్మ కంపెనీకి అమ్మిన బ్రోకర్‌గాడు సింహాచలం. నరసమ్మ కంపెనీలో రత్తాల్ని గదిలో ఉంచి తనతోపాటు మరొక వ్యక్తిని తీసుకొచ్చి "రత్తాలు, నా పెల్లవా, ఇవాళ్ళ నీకు నాతోను, నా బాసుతోను, ఇద్దరితోనూ పెల్లే, పెల్లిమీద పెల్లి, డబుల్ పెల్లి .... ఇద్దరు మొగుళ్ళనీ ఇమ్ముగ ఏలుకోయే"[90] అని చెప్పిన నీచుడు. పెట్టుబడిదారీ సమాజంలో స్త్రీని ఓ వ్యాపార వస్తువుగా, డబ్బుని పిల్లల్ని సంపాదించే ఓ యంత్రంలా భావించే భావజాలంలో ఈ మాటలు భాగస్వామ్యం.

సింహాచలం పచ్చి దొంగ; రాంబాబు తాగి పడిపోయినప్పుడు, అతని దగ్గరున్న డబ్బులు, వాచీ కొట్టేసిన లోఫర్. పసిపిల్లలమీదకూడా కరుణలేని కసాయివాడు. బొబ్బిలి పెళ్ళికి వెళ్తున్న ముసలమ్మని మాయమాటలతో మోసగించి, ఆమె నాలుగేళ్ళ మనుమరాలిని ఎత్తుకుపోతే గంగరాజు హెడ్డు కళ్ళల్లోబడటంవల్ల, ఆ పాప రక్షింపబడింది. లేకపోతే బంగారం కోసం, ఆ పాపని సింహాచలం బలితీసుకుంటానికి జంకడు.

రత్తాలు తప్పించుకు పోయినందుకు కోపంతో నరసమ్మ సింహాచలాన్ని కొట్టి అతణ్ణే రత్తాల్ని మళ్ళీ నరక కూపంలోకి లాక్కురావటానికి నియమిస్తుంది. సింహాచలం ఎంతటి అవమానమైనా డబ్బు ఎరతో మరిచిపోగలడు. మానవ విలువల్లేని డాఫర్.

అడ్డబుర్రని ఎస్సై వేషంలో తీసుకొనివెళ్ళి, మళ్ళీ రత్తాల్ని నరసమ్మ కంపెనీకి తీసుకువస్తూ పోలీసులకి కారుతోసహా పట్టుబడతాడు సింహాచలం. పోలీసుల్ని కూడా బూతులు తిట్టటానికి వెనుకంజవేయని, మూర్ఖుడు. వాళ్ళ దగ్గర గూడా రత్తాలు తన భార్యని మోసగించ బోయిన నీచుడు. కోర్టుదగ్గర గూడా రత్తాల్ని తిడుతూ, కొరకొరజూసిన పాషాణ దగుల్బాజీవెధవ సింహాచలం.

లంపెన్ క్యారెక్టర్లకి సర్వలక్షణాలతో సరిపోయేవ్యక్తి సింహాచలం. పరిస్థితుల ప్రభావం వల్ల లంపెన్‌గా మారిన పాత్ర గాదు. అసలు స్వభావ రీత్యా ఇతని జీవిత ఎదుగుదలలోనే ఆలోపం ఉంది. సామాజిక వాతావరణంలో సంభవించే పరిస్థితులకి ఏమాత్రం స్పందించక రాయిలా దగుల్బాజి జీవితాన్నే కొనసాగించే 'డాకునాకొడుకు' సింహాచలం. అందుకని ఇతని పాత్ర నిర్మాణంలో రావిశాస్త్రి ఎక్కడా మచ్చుకైనా మార్పువున్నట్లు చిత్రీకరించలేదు.

'యమకూపం'లోని తార్పుడుగాడు, అమ్మాయిలను సానికొంపలకు అమ్మేగోరిజాంటుకి, సింహాచలానికి దగ్గర పోలికలున్నాయి. సింహాచలం కంటే ఘోరమైన వ్యక్తి ఈగోరిజాంట్. ఒక గుడ్డలు కుట్టే అమ్మాయిని లేవదీసుకెళ్ళి కొన్నాళ్ళు అనుభవించి ఆతరువాత ఎవరికి బడితేవాళ్ళకు తార్పుతూ చివరికి ఆమెను యాభై రూబుల్స్‌కు సాని కొంపకు అమ్మేసిన కసాయివాడు. సింహాచలం రత్తాల్ని లేవదీసుకెళ్ళి నరసమ్మకు వెయ్యికి అమ్మిన నీచుడు. ఇలా వీళ్ళిద్దరికి ఎన్నో పోలికలున్నాయి. సింహాచలం పెళ్ళిజేసుకోబోతున్నట్లు నటించి, రత్తాల్ని మోసగించి లేపుకొస్తే: గోరిజాంట్ పదిహేను పెళ్ళిళ్ళు జేసుకున్నట్లు నటించి వాళ్ళ జీవితాలు నాశనం జేసిన పచ్చి దుర్మార్గుడు. గోరిజాంట్ కంటే కొంత సింహాచలమే నయం.

**18. శ్యామసుందర్**

క్రొత్తగా ఉద్యోగంలో చేరిన ఏ.యస్పీ. నిజాయితీ పరుడైన ఆఫీసర్. ఇతని వల్లే రత్తాలు రక్షింపబడింది.

**19. కమలమోహన్**

అడిషినల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ : కోర్టులలో జరిగే అవలక్షణాలన్నీ చక్కగా వంట బట్టించుకున్న వ్యక్తి : లేని సాక్షుల్ని ఉన్నట్టు , ఉన్న వారిని లేనట్టు మార్పించి తిమ్మని బమ్మిని చెయ్యగల ఘనాపాటి.

**20. మాధవరావు; ముసలాయన**

పరోపకార బుద్ధి వున్న సజ్జన వ్యక్తులు;

**21. బంగార్రాజు; మిత్రులు**

పచ్చివ్యాపారస్తులు. వీళ్ళ మనస్తత్వానికి దగ్గర వాళ్ళే, ప్లీడరు గుమస్తా రమణయ్య, కేశవరావు ప్లీడర్, అక్బరాలీఖాన్, ఛైర్మన్ తమ్ముడు, పోలీసులకి, కంపెనీ అమ్మాయిలకి ఇతరులకి డాఫర్‌గా బ్రోకర్‌గా సూది పోటు డాక్టర్ ; దాదాపు వీళ్ళంతా ఒక తానులోని వారు, రాకెట్టు, స్ప్రిట్టిక్క్, గల్లీపులి వీళ్ళు లంపెన్స్ పై వాళ్ళ కంటే వీళ్ళు కొంత నయం. కడుపు మంట కోసమే కక్కుర్తిపని జేసే డాకూలు వీళ్ళు; అన్నీ సరిగ్గా వుంటే వీళ్ళనన్నా మార్చవచ్చేమోగాని పైలిస్టులోని వాళ్ళని మార్చటం కష్టతరం.

**22. సన్నాసినాయుడు**

ఊరి ప్రెసిడెంట్, మోతుబరి రైతు. భర్త చనిపోయిన సన్నమ్మని ఉంచుకుంటాడు. దుర్మార్గ స్వభావమున్న వ్యక్తి. రత్తాలు పెద్దమ్మ వరాలమ్మ చనిపోయాక, ఆ కాఫీ కొట్టు ఆక్రమించుకొని ; రత్తాలుకి ద్రోహం చేసిన కుటిలుడు. భూములు కాజెయ్యటం కోసం, రైతుల్ని నక్సలైట్లని పోలీసులకి వర్తమానం, తద్వారా వాళ్ళని అడ్డు తొలిగించుకుంటానికి ప్రయత్నించే నీచుడు.

వసంత స్నేహితురాలు శకుంతల. జోగులు పనిమనుషులు రంగమ్మ, సూరన్నలు,జోగులు దుశ్చర్యచే బలైపోయిన డ్రిల్‌మాస్టర్, అతని భార్య , వరాలమ్మ కూతురు సిన్నాలు, సిన్నాలు భర్త దుర్మార్గుడైన సిన్నారావు నరసమ్మ కంపెనీకి సమాచార మందించే పోలీసు వెంకట్రావు, నారాయణ తదితర చిన్నా చితక పాత్రలు గూడ రత్తాలు రాంబాబులో దర్శనీయమవుతాయి.

## 5. సొమ్ములు పోనాయండి

భూమిని ఇరుసుగా జేసుకొని 'సొమ్ములు పోనాయండి' వృత్తాంతం ప్రెసిడెంట్ వర్గానికి, బోడి వర్గానికి మధ్య నడిచింది. వర్గ కలహం ప్రధానంగా ఉత్పత్తి సంబంధాలకి, ఆస్తి సంబంధాలకి మధ్యనున్న వైరుధ్యాన్ని ఆసరాజేసుకొని నడుస్తుందని మార్క్స్ చెప్పినట్లే, దీనిలో ఆస్తి గ్రామ ఫోను మీద వర్గకలహాల పిన్ను తిరిగిందని స్పష్టమవుతుంది.

### I. దాసరి బోడియ్య

ఎకరం నలభై సెంట్ల భూమున్న బక్కరైతు దాసరి బోడియ్య. మాటకి, నీతికి కట్టుబడే అట్టడుగు రైతు. ముగ్గురు బిడ్డలు, భార్య తను ఆభూమిని నమ్ముకొని బ్రతుకుతున్నారు. జతదున్నపోతులు కొంటానికి ప్రెసిడెంట్ దగ్గర మూడొందలు అప్పుగా తీసుకొని,ఆరు వందలకి నోటురాసి; నూటికి నెలకి ఇరవై అయిదు రూ॥ వడ్డీకి ఒప్పుకున్నాడు. కొన్న నెలరోజులకే ప్రెసిడెంట్ మాయోపాయం వలన జత దున్నపోతులు మాయమైపోయాయి. ప్రెసిడెంట్ బోడిని పిల్చి వారం రోజుల్లో నోటు రాసిన ప్రకారం ఆరువందలు తనకి కట్టాలని పట్టుబట్టేసరికి ఈ అన్యాయాన్ని సహించలేక బోడి భార్య సంద్రాలు ప్రెసిడెంట్‌ని తిట్టేప్పటికి ; ప్రెసిడెంట్ అన్న కొడుకు సిన్నారావు సంద్రాలుని రొమ్ములమీద గొట్టటం, బోడి వాణ్ణి కొట్టటం ఇలా తగువయ్యింది. ఊరి పెద్దల ద్వారా గూడ తగువు పరిష్కారం కాలేదు.

సిన్నారావు బోడిని, సంద్రాలుని ; ఏపాపం ఎరుగని కూతురు చిలుకనికేసులో ఇరికించి; పోలీస్ స్టేషన్ పాలుజేస్తాడు. కోర్టులో జామీను దీసుకొని ఇంటికి రావటానికి బోడికి తల ప్రాణం తోకకొస్తుంది. సన్న జీవుల్ని, మోతుబరులు ఎలా ఏడిపిస్తారో, ఎదగకుండా అణచివేస్తారో ఎంత దుర్మార్గంగా వేధిస్తారో బోడి పాత్ర ద్వారా తెలుస్తుంది. బోడి బావమరిది ; తోడల్లుడు జగిలీడు; బోడికి సహాయపడుతున్నారనే కసితో ప్రెసిడెంటు వాళ్ళు వీళ్ళని బైండోవరీ కేసులో ఇరికించారు. ఆరువందల నోటు తాలూకా కేసుతో బోడి పొలాన్ని ప్రెసిడెంట్ ప్రథమ జప్తు చేయిస్తాడు. కారణం ఈ పొలాన్ని బోడి జగిలీడుకి అమ్ముతున్నాడనే సాకు, ఏరైతైనా కన్న తల్లి కన్న నేల తల్లిని అమితంగా ప్రేమిస్తాడు. తను నమ్ముకున్న నేల తల్లిని అందరి ముందు చాటింపు వేసి జప్తు చేయిస్తున్నట్లు ప్రకటిస్తే ఏరైతైనా, ఆపరాభవాన్ని దిగమింగుకోగలడా! కాబట్టే "నా కడుపుల తగులుకున్న అగ్గండి. అయ్యాళ-సన్నమంటగ మార్నాదండి"91 అని బోడి తన కథని తానే వివరించుకున్నాడు. అంతగా మండిపోయినోడే ఎంతో బాధపడి "ఏట్ర బగువుత్తుడా నానేటి పాపం సేసేనర్రా నన్నిన్ని బాదలు పెడ్తున్నావు అని శాన ఏడ్సినానండి"92 నిష్కారణంగా తనని కష్టాల పాల్జేస్తున్నందుకు, ఈదురుగాలికి అల్లల్లాడేరెవటలా చలించి పోయాడు బోడియ్య. మానవ సహజమైన ఈసన్నివేశాన్ని రావిశాస్త్రి చాల వాస్తవికంగా చిత్రీకరించారు.

తను తీసుకున్న డబ్బుల నిమిత్తం నలభై సెంట్ల భూమిని జగిలీడుకి బోడి దాఖలు పరుస్తూ ప్రోనోటు రాస్తాడు. తను సన్నకారు రైతునని బోడి ప్లీడరు ద్వారా పిటీషన్ బెట్టుకుంటాడు.

బోడికూతురు చిలుక ఐదుగురు దుర్మార్గుల క్రౌర్యాన్ని ఎదిరించి, బలైపోయిన సన్నివేశంలో గుండెలు తరుక్కుపోయేలా విలపిస్తూ బోడి ఈ లోకరీతిని ప్రశ్నించినతీరు హృదయమున్న ప్రతివాణ్ణి కళ్ళు చమర్చేలా చేస్తుంది.

"పాపంసేసి నోళ్ళని పట్టిచ్చీవోడు ఒక్కడంటే ఒకడు నేక పోనాడండి. సుక్కలున్నాయి సూరెసెందుర్లున్నారు. కొండమీన కొటల్లాగ్గ ఇంతమంది అధికార్లున్నరు.

ఊరికోకలకటేరున్నడు ఈదికో పోలీసోడున్నాడు గాని అన్నేయం సేసినోళ్ళని అందుకున్నోడు ఒక్కళ్ళేక పోనాడండి'93 అన్యాయాన్ని అరికట్టే వాళ్ళే అన్యాయంజేస్తే; చివరికి భగవంతుడూ అలానే జేస్తే; అప్పుడు ఆ అన్యాయానికి గురైనవాడే తిరగబడాలని బోడి ద్వారా రావిశాస్త్రి సందేశమిస్తారు. సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని, విచ్చలవిడితనాన్ని సూటిగా ప్రశ్నించాడు బోడి.

బోడి తనకు రాయించి యిచ్చిన భూమి తాలూక ప్రోనోటుని జగిలీడు ప్రెసిడెంట్‌కు ట్రాన్స్‌ఫర్ జేస్తే ; ఆప్రెసిడెంట్ మిగతా డబ్బులు చెల్లిస్తాను ; కాబట్టి ఆ భూమిని తనకు రిజిష్టరు చెయ్యమని బోడికి నోటీసు పంపిస్తాడు. బోడి పనిమూలిగే నక్క మీద తాటికాయ బడ్డట్టైది. దీనికి తోడు సిన్నారావుకేసు. విషయమై బోడికి ఆర్నెల్లు శిక్షపడింది. ఇలా ఒకటొకటే కష్టాలు బోడిని వెంటాడి అతని మనో ధైర్యాన్ని దెబ్బతీసి; మరొక విధంగా అతనిలో తెగింపు ధోరణిని పెంచాయి.

ప్రెసిడెంట్ ప్రోనోట్ కేసు డిక్రీ అయ్యేప్పటికి బోడి కుటుంబ సభ్యులు బెంగబడతారేగాని; బోడిలో మొండి ధైర్యం ఇంకా పెరుగుతుంది. ఇంతలో కర్ణం అటు ప్రెసిడెంట్‌కి, ఇటు బోడికి ఒక రాజీమార్గం కుదురుస్తాడు. దాని ప్రకారం బోడి పొలం కొలిచి నలభై సెంట్ల భూమి ముప్పై సెంట్లే ఉందని చెప్పేసరికి; నడుస్తున్న కథ దేని కోసమో బోడికి అప్పుడు స్పష్టమవుతుంది. బోడి ప్రశ్నించిన తీరుకి కర్ణానికి సిగ్గు, లజ్జా వుంటే ఆమాటలు ఈటెలు కన్నా బలంగా గుచ్చుకొని వుండాలి. అందుకు కర్ణం చట్టం ప్రకారం ప్రెసిడెంట్ బోడిని పొలంలో అడుగు బెట్టనీయడనే సరికి; బోడి ఆగ్రహోదగ్రుడై "అందుసేత ఏటంటే పెసిడెంటు గోడు గాదు; ఆడి అమ్మమొగుళ్ళు ఒందమందిరి పోలీసోల్లని ఆడుయెలకేసు కొచ్చినా, ఆణ్ణి నా బూవిల అడుగెట్టనీయను''94 అని భూదేవి సాక్షిగా బోడి తేల్చి చెప్పటమే గాదు; ఆమాట మీదె నిలిచాడు. "దుమ్మైనా తింటాను గాని ఆడి కాలి కింద మాత్తరం దూరను''95 అని బోడి తీర్మానించుకుంటం, అతని మనోస్థైర్యానికి, చైతన్యానికి నిదర్శనం. ఆ తరువాత బోడియ్య జబ్బున పడతాడు.

ఇంతకి అసలు కథకి మూలమేమంటే భూమి. ప్రెసిడెంటు సొంత భూమికి ప్రెసిడెంట్ స్వాధీనంలో ఉన్న 'చిన్రా మూర్తి' భూమికి మధ్యలో బోడి పొలం అడ్డుగా వుంది. ఆ అడ్డు తొలగించుకోవటం కోసం ప్రెసిడెంట్ ఇంత గ్రంథం నడిపించి; చివరికి రౌడీలను పొలంలోకి దింపి; బోడిపొలాన్ని దున్నటం మొదలెట్టించాడు. ఆ తగువులో ఎదిరించి తలపడిన ఇటు వర్గంలోని జగిలీడు, బోడి భార్య, సంద్రాలు మరికొంతమంది మరణిస్తే; అటువైపు ప్రెసిడెంట్ అన్న కొడుకు సిన్నారావు, మరి కొందరు మరణిస్తారు ఆనేలనేలంతా రక్తసిక్తమవుతుంది. సిన్నారావుని ముక్కలుగా నరికిన బోడిని; ఇంకొంత మందిని జైల్లో బెడతారు. మూల కారకుడైన ప్రెసిడెంటుకు మాత్రం జామీనిచ్చి; పోలీసులు అతని ఆస్తుల్నిన కాపలాకుక్కలా పరిరక్షిస్తుంటారు.

మట్టి బిసుక్కుంటూ, మడి చెక్కని నమ్ముకొని, దాన్నిదున్ని దోకి, మొక్కేసి, చెమటలుకార్చి, ఆరుగాలం కాయకష్టం చేసి బ్రతికే బోడియ్యకి ప్రెసిడెంట్‌పై తిరగబడే శక్తి ఎక్కణ్నుంచి వచ్చింది? అని ఆలోచిస్తే, అతనికి జరిగిన అన్యాయం; మోసం; అణచివేత దగ, కుట్ర, నిర్బంధం, అవిద్య, "మేక పిల్లలు అడవికెళ్ళినట్టే నండి మనం

టౌనుకెళ్ళడం"96 అనే తీరు- ఇవన్నీ బోడియ్యలో ధైర్యాన్ని, స్థైర్యాన్ని, తిరుగుబాటుని; తెగింపుని కలిగించాయి. అతని చుట్టూ నెలకొని వున్న వాతావరణమే, అతని అస్తిత్వమే అతనిలో ఈ చైతన్యాన్ని కలిగించి, బానిస విధానంపై అణచివేత పద్ధతిపై గొడ్డలి పెట్టు పెట్టగలిగింది. కనుక మార్క్స్ మహనీయుడు చెప్పినట్టు " It is not the consciousness of men that determines their existence but on the contrary their social existence that determines their consciousness"97 అన్న మాటలు బోడియ్య పాత్రకి అక్షరాలా సరిపోతాయి. బోడియ్య చివర్లో 'జామీనిస్తే బైటికి ఎల్తాను. ఎల్తాను ఎల్లి ఆపెసినెంటు గోణ్ణి నరుకుతాను---- విందుకు తిరుగునేదు"98 అని కరాఖండీగా తేల్చి చెప్పగలిగాడు.

రావిశాస్త్రి వర్గ పక్షపాతాన్ని, వర్గ దృష్టిని చాలస్పష్టంగా బోడి పాత్ర ద్వారా, మరీ ముఖ్యంగా ఈనవల ద్వారా స్పష్టపరచారు.

## 2. బోడి బావమరిది

ఇతనిని బోడి బావమరిదిగానే రావిశాస్త్రి ఈనవలలో చిత్రీకరించారు. నమ్ముకున్న వ్యక్తుల్ని; కష్టకాలంలోచేయి విడిచి వెళ్ళకుండా వెన్నంటే ఉండే నమ్మదగిన మంచివ్యక్తి బోడి బావమరిది. దొంగ కొలతలతో దగా చెయ్యబోయిన కర్ణాన్ని 'నుచ్చావి' అని అతని మొఖం మీద అనగలిగిన ధైర్యశాలి. అన్యాయాన్ని ఎదిరించగల గుండెబలమున్నవాడు 'పాడని గొడ్లకు పోట్లాట నేర్పవద్దని; ప్రెసిడెంటు మనుషుల అన్యాయాన్ని సహించమని తెగేసి చెప్పిన సాహసవంతుడు దుర్మార్గాన్ని, అణచివేతని, మోసాన్ని అడ్డుకోవటంలో బోడి బావమరిది ఈ నవలలో ముందున్నాడు. అట్టడుగు వర్గ స్పృహ గలిగిన ధైర్యశాలి బోడి బావమరిది.

## 3. జగిలీడు

బోడికి తోడల్లుడు జగీలీడు. బోడికంటె కొంచెం జరుగుబాటు, ఆస్తి ఉన్నవాడు మొదటి నుంచి చివరవరకు బోడితోనే ఉన్న; భార్య సణుగుడు వలన; ప్రెసిడెంటు మాయమాటలకి లోనవటం వలన; ఈ తగువుల్లో కుటుంబం కూలారి పోతుందనే దిగులతోటి మధ్యలో తప్పటడుగులు వేస్తాడు జగిలీడు. బోడి తన పేర రాసిన నోటుని జగిలీడు ప్రెసిడెంటు పేర ట్రాన్స్ఫర్ జేసి పెద్ద తప్పు జేస్తాడు. ఇది అవగాహనా లోపం వల్ల గావచ్చు; కొంత మేర అవకాశవాదం వల్ల గావచ్చు అయితే బైండోవరీ కేసులో మొదట బోడితో పాటు ఉన్నా తరువాత జగిలీడు తప్పుకుంటాడు.

జరుగుతున్న మోసాన్ని, దుర్మార్గాన్ని ఇతను క్రమేపి పసిగట్టాడు. ఆఅవగాహన ఉండటం వల్లే "అక్కరుమానంగ ఏిటైన సేస్తె మట్టుకు ఓవురు ఒల్లకోరు"99 అని అనగలిగాడు. అనటమేగాదు చివరికి బోడిపక్షాన పోరులోకి దూకి బలైపోతాడు. మధ్యతరగతి, మధ్యతరగతి దిగువ వర్గంలో, అట్టడుగు వర్గంలోని ఊగిసలాట మనస్తత్వానికి; సరిగా కాలానలేని వ్యక్తిత్వానికి జగిలీడు ఉదాహరణగా నిలిచినా; అతనిలో చివరి పరిణామం; పోరాటపటిమని పెంచింది.

**4. సంద్రాలు**

సంద్రాలు బోడి భార్య. ముగ్గురు బిడ్డలతల్లి. కళ్ళెదుట జరుగుతున్న అన్యాయాన్ని, దుర్మార్గాన్ని సహించి ఊరుకోలేని హృదయస్పందనున్న స్త్రీ; ప్రెసిడెంటు ప్రోనోటు విషయంలో అన్యాయం చేయటానికి పూనుకున్నప్పుడు; తట్టుకోలేక ప్రెసిడెంటుని తిట్టి, దెబ్బలకి, అవమానాలకి గురవుతుంది.

కేసు విషయమై కోర్టుల చుట్టూ తిరుగుతూ కూతురు చిలుకని పోగొట్టుకొని హృదయ విదారకంగా విలపించిన నిర్భాగ్యురాలు. "ఉన్నది అమ్మేసి అప్పులెగ్గొట్టేసుకొని, మిగిలింది కాను, పరకో ఒట్టుకొని పట్టానికి పయినవయితె నువ్వు ఏకూలిపనో, సూసుకుంటే నాను ఏపాసిపనో సూసు కుంటాను. బిడ్డెట్టుకు మనం సల్లగ బతకొచ్చు. ఈపెసినెంట్లూ పెద్దల మద్దెమనం బతకలేవు. బతకాలాన్నా ఆల్లు మనల్ని బతకనియ్యరు' '[100] అని ఆమె విలపించిన విధం మానవత్వమున్న ఎవరికైనా గుండెలు తరుక్కుపోతాయి. పోయిన బిడ్డపోగా, మిగిలిన బిడ్డలనన్నా బ్రతకనియ్యమని భర్తని బతిమలాడిందంటే ఎంతగా వేదన చెందిందో ఊహించుకోవచ్చు. ఇలాఒక్క జీవుల్ని బతకనీయని బడాచోర్లని నిలదియ్యటమే రావిశాస్త్రి రచనా మార్గం. స్వాభావికంగా సానుభూతిని పొందేలా వున్న సంద్రాలు మాటలు, పాఠక హృదయాల్ని కదిలించి, సామాజిక అవగాహన వైపు దృష్టి మళ్ళేలా చేస్తే సంద్రాలు పాత్ర ప్రయోజనం నెరవేరినట్టవుతుంది. మర్రి చెట్టులా వ్యాపించి, నూతన అంకురాలని చిదిమివేసే ప్రెసిడెంట్ వాళ్ళ దుర్మార్గం బట్టబయలైనట్టవుతుంది.

నవల చివర్లో జరిగిన భూ ఆక్రమణ పోరులో సంద్రాలు వీరోచితంగా పోరాడి మరణిస్తుంది. తన పొలం దురాక్రమణకి గురవుతుంటే తట్టుకోలేక జీవన్మరణ పోరాటంజేసి తుదిశ్వాస విడిచిన వీరనారి సంద్రాలు. తన స్వార్థంకోసం ప్రెసిడెంటు ఊరిని వల్లకాటిని జేస్తే సంద్రాలు తన చావుతో ఊరిని మేల్కొల్పింది; ప్రెసిడెంటుని ఊళ్ళో అడుగెట్టనీకుండా చెయ్యగలిగింది. "ఒక వీరుడు మరణిస్తే వేయిమంది ప్రభవింతురు"అన్నట్లు సంద్రాలు మరణంతో ఈ పోరు ఆగేదికాదు.

**5. "సిలుక"**

బోడి కూతురు. చిలుకలా చక్కగా ఉండేదని చిన్నప్పుడు ముచ్చటపడి 'సిలుక' అనే పేరు బెట్టుకున్నారు. కేసుల విషయమై కోర్టులచుట్టూ తిరుగుతూ, కోర్టు గుమస్తా నిర్వాకం వలన ఐదుగురు దుర్మార్గుల మానభంగ దుశ్చర్యలకు తలొగ్గక పోరాడి మరణిస్తుంది.

అతి చిన్న వయసులోనే విరిసీ విరియని ఈ లేతమొగ్గ పెనుగాలికి నేలకొరిగింది. ఆమె పసుపు పారాణి చవిచూడకుండానే పెనుమంటల్లో కాలి బుగ్గైపోయింది. సభ్య సమాజానికిది సిగ్గుచేటు.

**6. మిరపకాయల సిన్నారావు**

సిన్నారావు ప్రెసిడెంటు అన్నకొడుకు. ప్రెసిడెంట్ తెరవెనుక నాటకానికి, ఇతను తెరమీది బొమ్మ; సంద్రాలు ప్రెసిడెంటుని తిట్టినప్పుడు; ఆమె పైటలాగి,

గుండెలమీద గుద్దిన పరమ దుర్మార్గుడు. విష సంస్కృతికి తమ్ముడు. అరెస్టై పోలీస్టేషన్లో వున్న, బోడి కుటుంబ సభ్యుల్ని అర్ధరాత్రి సమయంలో, ఆ స్టేషన్ దగ్గరకొచ్చి, అవమాన పరచ ప్రయత్నించిన దుష్ట స్వభావుడు సిన్నారావు.

కర్ణం బోడి పొలాన్ని కొలిచి ముప్పై సెంట్లే ఉంది అని చెప్పటంలోగూడ, సిన్నారావు పాత్ర వుంది. బోడి భూమిని, తన మద్దతుదార్లచేత దున్నిస్తూ, తను అనుకున్న పథకం ఫలించినందుకు పరమానందంగా ఉంటారు. ఆ తగవులో సంద్రాల్ని ఈటెతో పొడిచి చంపిన కసాయివాడు. అయితే ఆ వెంటనే బోడి సిన్నారావుని ముక్కలు ముక్కలుగా నరికేస్తాడు. దుర్మార్గానికి, పల్లె వాతావరణానికి సిన్నారావు వొక ఉదాహరణ. పల్లె పెత్తందారీతనానికి, దోపిడీకి నిదర్శనం సిన్నారావు పాత్ర.

## 7. ప్రెసిడెంట్

కనబడని సూత్రధారి ఈ ప్రెసిడెంట్. తన సొంత పొలానికి, తన స్వాధీనంలో ఉన్న పొలానికి కంట్లో నలుసులా గుచ్చుకుంటూ, అడ్డుగా వున్న బోడి నలభై సెంట్ల భూమిని కాజెయ్యటానికి; ఈ తోలుబొమ్మలాటంతా నడిపించిన సూత్రధారి ప్రెసిడెంట్. బోడి జత దున్న పోతుల్ని కొనుక్కుంటానికి మూడొందలు అప్పుబెట్టి, ఆరు వందలకి నోటు రాయించుకొని పాతిక రూపాయల వడ్డీ కాజెయ్యజూసిన పచ్చి మోసకారి. బోడి కుటుంబం, బోడి కూతురు చిలుక బలైపోవటానికి ప్రెసిడెంట్ గూడ పరోక్షంగా కారకుడే. బోడి పొలాన్ని ఆక్రమించుకొని అతని భార్య సంద్రాలు, జగిలీడు, ఇంకా ఎందరో మరణించటానికి కారకుడైన కుటిలుడు.

ప్రెసిడెంటు పంజా దెబ్బతిననివాడు ఊళ్ళో ఎవరు లేరుగాబట్టి; అందరూ తిరగబడే సరికి; అధికార, రాజకీయ, ధనబలంతో ప్రెసిడెంటు జామీను పొందినప్పటికి ఊళ్ళోకి అడుగుబెట్టలేదు. ఇది ప్రజా విజయం. కండబలమున్న ప్రెసిడెంటుకి నైతిక బలం లేదు. భూ దురాక్రమణకి; అణచివేతకి, దుర్మార్గానికి ప్రజలు అడ్డుకట్ట వేసినట్లయింది.

## 8. కర్ణం

కర్ణం, మున్సబులు ఇప్పటికీ పల్లెటూళ్ళల్లో నిరంకుశ రాజులుగా చెలామణి కావటం సామాజిక దుస్థితికి నిదర్శనం. చాణక్య నీతితో, అధికారం పంచన జేరి, సామాన్య ప్రజానీకాన్ని కష్టాలు పాలు జెయ్యటానికి పథకాలు రూపొందించేది ఈ మహనీయులే. నవ్వుతూ విషపాత్రని నోటికందించగలరు.

బోడికి నోటు రాసిపెట్టేప్పుడు; ఆరు వందలకి ఇవ్వవలసింది మూడు వందలేనని నమ్మకంగా చెప్పి; తీరా ప్రెసిడెంటుతో తగువు పడ్డాక; ఆ నోటులో రాసివున్న; ఆరు వందలు ఇయ్యవలసి ఉందని తీర్పుచెప్పిన న్యాయవాది కర్ణం లంచగొండి కర్ణం.

నక్కజిత్తులతో ప్రెసిడెంటుకి, బోడికి రాజీ ప్రయత్నాలు జరిపి; నలభై సెంట్ల బోడి భూమిని ముప్పై సెంట్లే ఉందని, కొలతల్లో దగా చెయ్యటానికి సిద్ధపడ్డ దగాకోరు. దొంగకొలతల గురించి బోడి కోప్పడ్డప్పుడు కర్ణం "నానేటి నుచ్చా నంజికొడుకు ననుకుంటున్నావా తప్పుడు కొల్తలు కొలడానికి"అని అన్నప్పుడు బోడి బావమరిది ఆ మాటతో కర్ణాన్ని ఉతికేస్తాడు.

"మూడొందలిప్పిచ్చి, ఆరొందలకి కాయితం రయ్యిచ్చి, చాచ్చి సంతకంవెట్టి తప్పుడు చాచ్చీకం ఇచ్చిన నుచ్చావి నువ్వుగాని మాంగావు. పెసిడెంటు గోడు - ఆడికిందా. ఆడి సొంత మడుసుల కిందా ఒంద లెక్కరాల బూవుండగ-ఆడు చన్నకారైతన్జెప్పి దొంగ చాచ్చీకం ఒలికి నన్నుచ్చావీ నువ్వే .... నుచ్చా పెసిడెంటుకి నుచ్చా సపోటా సేస్తన్న నువ్వున్నుచ్చా కర్నానివిగాక ఇంకేటవుతావు.[101] అని ముక్కుమీద గుద్ది చెప్పినట్లున్న ఈ మాటలు కర్ణం స్వభావాన్ని పట్టిస్తాయి. ఇరువర్గాల మధ్య; వ్యక్తుల మధ్య రకరకాల తగువులు బెట్టి, ఆర్థికంగా, మానసికంగా వాళ్ళను దిగజార్చే, నక్కజిత్తుల కర్ణం పాత్రని శాస్త్రి సమర్థంగా చిత్రించారు.

## 6. మూడు కథల బంగారం

ధనదాహం, బంగారంపై వ్యామోహం ఏర్పడితే మనిషి ఎన్నెన్ని అవతారాలెత్తుతాడు; వాటి కోసం ఎంతటి నైచ్యానికి ఒడిగడతాడు; ఆధన సంస్కృతితో తన అవినీతిని ; దోపిడీవిధానాన్ని చట్టాన్ని అణచివేసే తీరును; ఎలా నిర్వహించుకుంటూ వస్తాడో బంగారుబాబు, బంగారిగాడు, బంగారయ్యల అవతారాల ద్వారా రావిశాస్త్రి స్పష్టపరిచారు. మూడు వర్గాల పాత్రల చుట్టూ పరిభ్రమించిన కథని కలిపే అంతః సూత్రం గూడ దీనిలో ఉంది. ఈమూడింటికి తోడు 'వియత్నాం విమల వృత్తాంతం.'

### I. వియత్నాం (వీరవల్లి)విమల

సామ్రాజ్యవాద మదంతో మత్తెక్కి తనపై దాడి జేసిన అమెరికాకి వీర వియత్నాం ప్రజలు బుద్ధి జెప్పినట్లు; వీరవల్లి విమల గూడ వివాహవ్యవస్థకు ఒక గుణపాఠం జెప్పి వియత్నాం విమలగా పేరు బడ్డది. రావిశాస్త్రి వర్గదృష్టికి; ప్రాపంచిక అవగాహనకి ఇదొక నిదర్శనం.

రైల్వేలో ఇంజనీరుగా ఉద్యోగం జేసి నిజాయితీ పరుడిగా రిటైరైన ఓతండ్రికి ఆఖరి ఆరవ సంతానం విమల. అన్నలిద్దరూ కుటుంబ విషయాలు పట్టించు కోకుండ వేరైపోవటం; ఇద్దరు అక్కలకి అతి కష్టమీద పెళ్ళి జేసి ఆర్థికంగా చితికిపోయిన పరిస్థితిని విమల గమనిస్తూనే ఉంది. ఆర్థిక దుస్థితికి విమల తల్లి "ప్రతిరాత్రీ వెక్కి వెక్కి ఏడ్చికాని నిద్రపోయేది గాదు" ఈపరిస్థితులకి తల్లడిల్లి విమల, మూడో అక్క సరళ చిలకల దాసుతో లేచిపోయి, మోసానికి గురై ఆత్మహత్య చేసుకుంటుంది. దాసువల్ల తన అక్క ఆత్మహత్య చేసుకుందని తెలిసిన విమల, అమెరికా వాడి మీద వియత్నాం వీరులు తిరగబడ్డట్టు తిరగబడి "వెళ్ళి చిలకలదాసుని వాడింట్లోనే కసితీరా చెప్పుతో కొట్టింది"[102] ఇది సాధారణంగా అరుదుగా జరిగే సంఘటన. కాని అక్క జీవితం తన కళ్ళముందే బుగ్గైపోయినందుకు, వ్యధచెంది; పట్టలేని కోపంతో వాణ్ణి చెప్పుతో కొట్టగలిగింది. ఆ సన్నివేశ తీవ్రతనిబట్టి రావిశాస్త్రి విమలపాత్రనట్లా మలిచారు.

అంతటి కష్టంలోగూడ తల్లిదండ్రులతో "నాన్నా ఇదిగో అమ్మా! మనం బ్రతకటానికి భయపడొద్దు"అని విమల వాళ్ళకి ధైర్యం చెప్పి బ్రతుకు పోరాటానికి దూకుతుంది. చిన్నపిల్లలకి పాఠాలు చెప్తూ : ఆ పిల్లల్లో చనిపోయిన తన అక్క సరళని

చూసుకోగలిగిన విశాల హృదయం; ఆ పసి మనసులోనే అలవరచుకుంది విమల. ధైర్యంగా ఏ విషయమైనా ఎదిరించగల "మగరాయుడు" లాంటిది విమల అని ఆ చుట్టుప్రక్కలవాళ్ళ నోళ్ళల్లో పడింది.

ఆస్తికోసం ఆత్మీయుల్ని దూరం చేసుకుంటూ, కుక్కల్లా కొట్లాడుకునే తన అన్నల్ని అసహ్యించుకొని, వాళ్ళ ప్రమేయం లేకుండానే తండ్రి తన పెళ్ళి చెయ్యగలడని నిరూపించటం కోసం విమల పెళ్ళి చేసుకుంటానికి సిద్ధపడుతుంది.

కట్నం డబ్బుల్లో ఎడ్వాన్సుగా ఇచ్చిన మూడు వేలు కాకుండ మిగిలిన డబ్బులుకూడా ఇప్పుడు ఇస్తేనే తన కొడుకు తాళిబొట్టు కడతాడని, లేకపోతే ఈ పెళ్ళి పీటలమీద ఆగిపోతుందని శేషారావు చెప్పేసరికి విమల దుఃఖిస్తుంది. వెన్నెముకలేని చవటని పెళ్ళాడే కంటే విడిచిపెట్టడమే మేలని తలంచి "కట్నం ఇచ్చేగానే కట్టేస్తాను"అని చెప్పిన పెళ్ళి కొడుకు చెంప చెళ్ళుమనిపించి అతని మెడలో తాళిగట్టి "నువ్వు నాకు మొగుడివిగా ఉండలేవు. అంచేత ఇకమీంచి కనీసం నా పెళ్లంగా అయిన బతుకు, పో' '[103] అని విమల ఆ పెళ్ళికొడుక్కి తగిన బుద్ధి చెపుతుంది. మామూలు పరిస్థితుల్లో ఇది జరిగే పనిగాదు కాని కట్న దురాచారాన్ని అంతం చెయ్యటం కోసం; స్త్రీలలో చైతన్యాన్ని రగిలింపజెయ్యటం కోసం; ఒక ఆదర్శాన్ని ప్రబోధించటం కోసం విమల పాత్రని అలా ముగించారు రావిశాస్త్రి.

'వియత్నాం విమల వృత్తాంతం'లో విమల ఈదురుగాలికి ఎర్రజెండా ఎండలో నిలబడ్డట్టు నిలబడింది"[104] అంతేగాదు వంటరిగానైన అధైర్యపడకుండా వజ్ర సంకల్పంతో తిరుగుబాటు బావుటా నెగురవేసిన అభ్యుదయ యువతి.

## 2. విమల వృత్తాంతం

వియత్నాం విమల ఈ నవలలో మొదటి కథలో ప్రత్యక్షమై తరువాత బంగారయ్యగారి కథలో దర్శనమిస్తుంది. ఆమె నర్స్ వృత్తిలో స్థిరపడి చాల నిజాయితీపరురాలిగా సహాయకారిణిగా పేరు తెచ్చుకుంది.

తన బావ రామచంద్రయ్యని హాస్పటల్‌లో చేర్పటానికి వెళ్ళినప్పుడు బంగారయ్యకి విమల తటస్థపడుతుంది. ఆనాడు రాములవారి గుళ్ళో పీటలమీద పెళ్ళి ఆగిపోయినప్పుడు మొగుడు కావాల్సినవాడి మెళ్ళో తాళిగట్టిన అమ్మాయిగా విమలను బంగారయ్య గుర్తించి ఆమెను తనదాన్నిగ చేసుకుంటానికి వజ్రం ద్వారా ప్రయత్నాలు సాగిస్తాడు. బంగారయ్య డబ్బు అహంకారాన్ని విమల ఛీకొడుతుంది. అంతేగాక; బంగారయ్య సారారెంటర్ అని తెలిసాక ఆమె అసహ్యించుకుంటుంది.

"మీలాంటి పెళ్ళికూతురు దొరక్క" ఇంతవరకు నేను పెళ్ళి చేసుకోలేదని బంగారయ్య పెళ్ళి విషయమై ప్రశ్నించిన విమలతో అనేసరికి ఆ సమాధానానికి విమల ఆశ్చర్యపడి "నువ్వు ధైర్యశాలివే"అని అంటుంది.

విమలకోసం విశ్వప్రయత్నంచేస్తున్న బంగారయ్య ఒక సినిమా సీనుపెట్టి; విమలకు దగ్గరవుతాడు. విమలకు పిల్లలమీదుండే మమకారాన్ని కనిపెట్టి; ఆ బలహీనతమీదే దెబ్బకొట్టి ఆమెచేతగూడా "అవున్నా/నా బంగారు దొంగలంరూ... కొడకా! నాకు బిడ్డ,

బిడ్లు, బిడ్డలు కావాలి''[105] అని అనిపించగలిగి; ఇద్దరూ భార్యాభర్తలు కాబోతున్నట్లు ఆసుపత్రిలో అందరి ముందు ప్రకటిస్తారు.

ఏ రాములవారి గుళ్ళో తన పెళ్ళి ఆగిపోయిందో; అదేచోట విమల బంగారయ్యను పెళ్ళాడింది. 'బంగారు, నాకు సారా కావాలి''[106] అని తొలినాడే అనే సరికి బంగారయ్య తల దిమ్మెక్కుతుంది. సారావలన, శ్రామిక, మధ్యతరగతి కుటుంబాలు ఈ వ్యసనం నుండి బయటపడలేకపోతున్నాయి. కాబట్టి; ఆ సారా వ్యాపారాన్ని మాన్పించటం కోసం విమల బంగారయ్యతో అలా మాట్లాడింది. మానెయ్యకపోతే "నీకు నాకు విడాకులే''అని కరాఖండితంగా విమల చెప్పిందంటే సారా వ్యాపారాన్ని మాన్పించే విషయంలో ఎంత దృఢంగా ఉందో దానినిబట్టి తెలుస్తుంది. వ్యక్తుల సామాజిక బాధ్యతని విమల బాగా గుర్తించింది. విమల ఒకసారి దృఢనిర్ణయం తీసుకుంటే ఆ నిర్ణయానికి బలవుతున్నవారు తన రక్తసంబంధీకులైన మార్పులేదని తెలుస్తుంది. ఇందుకు మంచి ఉదాహరణ ఆమె అన్నలకు బంగారాన్ని డబ్బులివ్వద్దని; హెచ్చరించి మరీ చెప్పటం. బంగారయ్య అవినీతి మొత్తాన్ని ఒక ఉత్తరం ద్వారా పోలీసులకు పంపిస్తుంది. అవినీతికి, దోపిడీకి, దుర్మార్గానికి ఒడిగట్టినవాడు ఎవడైనాసరే విమల వాటిని అరికట్టకుండా ఆగదనే సత్యాన్ని ఈ సన్నివేశం రుజువు చేస్తుంది.

చివరకు విమలగూడ దేవాలయం మెట్లమీద బంగారానికి బలైపోతుంది. ఎవరికి ఏ విషయంలో గూడ లోపడని వ్యక్తిత్వం విమలది. అన్వర్థనామధేయి. వ్యవస్థాగత దుర్మార్గాన్ని ఎండగట్టే స్వభావం ఆమెది. ఎంతటి కష్టాన్నైనా మొండిగా ఎదిరించగలిగే ధైర్యశాలి. మంచి ఆదర్శాలు, అభ్యుదయ భావాలుగల ఉత్తమ స్త్రీగా రావిశాస్త్రి విమల పాత్రను తీర్చిదిద్దారు. సారా వ్యాపారాన్ని; దాన్ని ఆశ్రయించుకొని నడుస్తున్న అక్రమాన్ని, అవినీతిని, దుర్మార్గాన్ని అడ్డదారుల్లో బంగారాన్ని, సంపదని పోగేసుకొనే పద్ధతుల్ని రావిశాస్త్రి నిరసించినట్లు విమల పాత్ర ద్వారా బోధపడుతుంది. కాని స్వాతంత్ర్యానికి పూర్వం గాని; స్వాతంత్ర్యానంతరం గాని ఈపద్ధతుల్లో మార్పులు జరిగినా ఫలితం శూన్యమని అవగతమవుతుంది.

"నవలలో వియత్నాం విమల అద్భుతమైనది. రావిశాస్త్రి మరో చోట అన్నట్టు' ' మంచిగా ఉండాలంటే చాల ధైర్యం ఉండాలి. "ఈ లక్షణానికి మూర్తి విమల. వియత్నాం విమల ఒక బలమైన కార్మిక వర్గ ఉద్యమానికి సంకేతం. కొంత ప్రేమించి-చాలపోరాటం చేస్తేనే తప్ప బంగారయ్యలు మనుషులుకారు. వారిని మనుషుల్ని చేసే శక్తి కూడ ఉద్యమానికే తప్ప మరెవరికి లేదు''[107] అని చెప్పిన మాటలు ఆలోచింపదగ్గవి.

### 3. బంగారి బాబు

బంగారిబాబు పేరుకు తగ్గట్టే బంగారుబాబు కాని జీవితంలో ఎదురైన సన్నివేశాలు, కళ్ళముందు జరిగిన దుర్మార్గులు, సమాజంలో బంగారానికున్న విలువ, తద్వారా జరిగే సౌలభ్యాలు, వీటన్నింటితో ముడిబడివున్న అతని జీవన ఆస్తిత్వం పతన దిశలో పయనించి బంగారి గాడిగా అవతారమెత్తి; బంగారయ్యగా అవతారాన్ని చాలింపజేసింది. అయితే స్వభావరీత్యా (Inherent) అతనిలో దాగి వున్న మానవత్వం బంగారయ్య పాత్ర అంతిమ దశలో మేల్కొని మంచి వైపు ప్రయాణిస్తుంది.

ఒకపేద గుమాస్తా కొడుకు బంగారు బాబు. ఇతనికొక అక్కా,చెల్లి, చేసిన అప్పులు తీర్చటం కోసం తనతల్లి మెళ్ళోని పుస్తెలతాడు; తండ్రి అమ్మటాన్ని తెలుసుకున్న బంగారం బాధ పడతాడు. "ఈ జీవితంలో బాధల్ని జయించటానికి బంగారం పనికొస్తుందని నాకు ఆనాడు బాగా తెలిసివచ్చింది"[108] అని బంగారమే స్వయంగా చెప్తాడు అతని దృష్టి మొదటిసారిగా బంగారంపై మళ్ళింది. అంతే గాకుండా "మనిషి కష్టం=మంచి బంగారం" అని గూడ ఈ బంగారుబాబు తన పుస్తకంలో రాసుకున్నాడు.

తండ్రి చనిపోయాక, చెల్లి, అమ్మతో బంగారుబాబు వాళ్ళ బావ దగ్గరే ఉంటారు. వాళ్ళమ్మ దహన సంస్కారానికి వాళ్ళక్క అమ్మ చేయించిన గాజుల్ని అమ్మేస్తుంది. అప్పుడు బంగారి బాబుకి "బాధల్లో బంగారం మనల్ని ఆదుకుంటుంది కదా"[109] అని అనిపిస్తుంది. జీవితంలో అతనికి తారసపడిన ప్రతి సన్నివేశం బంగారంతో ముడిపడి ఉండటం, దాని ఆధిపత్యాన్ని రుచి చూపించటంతో బాబు దృష్టి బంగారంపై మళ్ళుతుంది. "కులము గలుగువాడు,..... పసిడి గలుగు వాని బానిస కొడుకులు" అని శతాబ్దాల క్రింద వేమన చెప్పింది లోకానుభవంతోనే. తనకి పిల్లలు కలగరనే దిగులుతో వాళ్ళ అక్క ఆత్మహత్య చేసుకుంటుంది. బావ రెండో పెళ్ళి చేసుకోవటం; తమంతట తాముగా బ్రతకటానికి మరోదారి లేక పోవటం ; తన చెల్లి పని పిల్లలాగ బావగారింట్లో పడి ఉండటం; ఇక్కడ ఉండే కంటే మరోమార్గం చూసుకుంటే బాగుంటుందని బావ సూచనా మాత్రంగా రెండో భార్య వచ్చినాక చెప్పటం; ఇవన్నీ బంగారిబాబు జీవితంపై బాగా ప్రభావాన్ని చూపి, అతని ఆలోచనల్ని క్రమేపి కలుషితం చేసాయి. అయితే కొంత గుడ్డిలో మెల్లగా తన స్నేహితుడు కాము; అతని కుటుంబం వాళ్ళు చాల వరకు బాబుని, అతని చెల్లిని ఆదరిస్తారు. బాధల్లో వాళ్ళ సానుభూతి కొంత ఓదార్పునిస్తుంది.

బంగారుబాబు చెల్లి మరణం అతని జీవితాన్ని పూర్తిగా మలుపుదిప్పుతుంది. తూర్పుకు వెళ్ళాల్సిన జీవితం పడమరగా సాగుతుంది. బంగారానికి తన చెల్లి బలైపోయిందని బాబు గ్రహించాడు. "బంగారం అది మా నాన్న కష్టం. బంగారం అది మాచెల్లి అందం బంగారం అది మా చినబావ దుర్మార్గం; బంగారం అది నాజీవితానికి నాశనం; బంగారం బంగారం బంగారం"[110] అని బాబు వెర్రి కేకలేస్తాడు.

సుఖ, సౌఖ్యాలతో బతకటానికి బంగారం కావాలని; బంగారం సంపాదించే క్రమంలో న్యాయన్యాయాల విచక్షణ ఉండకూడదనే దురాలోచనకు నాంది ఇక్కడే జరుగుతుంది.

**4. బంగారిగాడు**

జీవన పర్వంలోని, చీకటి తెరకి; కుళ్ళుకి; అవకాశాలను అవసరాలకి మళ్ళించుకొనే తీరుకి; కుట్రలు, కూహకాలకి; దౌర్జన్యం, దుర్మార్గాలకి; దొంగతనం; రంకుతనం; బొంకుతనం; మాయ; మోసం, దగాలకి నిలువుటద్దం లాంటిది. బంగారి గాడి పాత్ర; బంగారి బాబు జీవితానికి పాడిన భరత వాక్యం; బంగారి గాడి జీవితానికి నాందీ వచనం.

పిక్ పాకెటింగ్, చీటింగు దగ్గర నుంచి, డెకాయిటీ దప్ప అన్ని రకాల చోరీలు చేసాడు. సారా వ్యాపారమేంటి; రావులమ్మతో గలిపి ముండల కంపెనీ వ్యవహారమేంటి-

ఇంకా ఇదీ అదీ అని హద్దేమి లేకుండా అసాంఘిక జీవితాన్ని యథేచ్ఛగా సాగించాడు బంగారిగాడు.

బంగారు నగలతో సహా అమ్మల్ని లేవదీసుకుపోయి; ఆమె బంగారాన్నంతటిని కాజేసి; ఆమెను గాలికి వదిలేసిన మోసకారి బంగారిగాడు. ఆమోసగించిన బంగారాన్ని డబ్బుగా మార్చుకుంటానికి తెలిసిన పోలీసోడి సాయంగోరి; చివరకి వాడివలలో ఇరుక్కుపోతాడు. అందుకని" మనిషి కష్టం బంగారం; మనిషి మాయ బంగారం"[111] అని బోధ పర్చుకుంటాడు.

సత్తరకాయ, సిత్తరలేఖ, సిలకముక్కు, వీళ్ళతో గలిసి సినిమాహాళ్ళ దగ్గర పర్సులు కొట్టెయ్యటం; పోలీసులతో లాలూచీపడి దొంగతనాలతో జీవించటం సాగిస్తాడు. అంటే ఒక లంపెన్ క్యారెక్టర్‌గా బంగారిగాడు కనిపిస్తాడు.

కొంతకాలం గంగా భవానితో సారా వ్యాపారం; ఆమెతో సాని వ్యవహారం నిర్వహిస్తాడు. తెగిన గాలి పటంలా ఏది లాభదాయకంగా వుంటే ఆవ్యవహారాన్ని నిర్వహించాడు. పోలీసు సూర్రావుహెడ్డు, నారాయణ, నాయుడు పరివారంతో గలిసి దొంగ నోట్ల కింగ్‌గా చెలామణి అవుతూ; ఆవ్యాపారంలో వచ్చిన వాటాలతో కొంతకాలం జీవితాన్ని సాగిస్తాడు. ఈ దొంగ నోట్ల వ్యాపారంతోరకరకాల టక్కుటమారాలు, ట్రిక్కులు, మోసం మాయల్లో బాగా పండిపోతాడు. అయితే సామాన్య వ్యక్తి అయిన బైరాగి నాయుణ్ణి మోసగించినాక బంగారి గాడిలో కొంత పరివర్తన కలుగుతుంది ఆఖరికి బైరాగి డబ్బుల్ని తిరిగి ఇచ్చెయ్యటానికి గూడ సిద్ధపడతాడు. కాని మొత్తా గుట్టురట్టవుతుందని ఆగిపోతాడు. "బైరాగి నాయుడి ఆపరేసన్ మేం జేసిం తర్వాత నాకు మనస్సు ఇకలవైపోయ్యి సెదిరి పోయింది--- నేనెక్కడ బుట్టేను? నేను మంచిగా ఉండిసెడిపోయ్యేను సెడ్డగా నూరి బాగు పడ్డాను. దేవుడే ఉంటే ఇలా జరగటం నాయెవా!"[112] అనే ఆలోచనకు గురవటం మంచి పరిణామం. అంటే పరిస్థితుల ప్రభావం వల్ల చుట్టూ అలముకున్న వాతావరణం వల్ల అలా మారిపోయ్యాడే గాని వాస్తవంగా బంగారి గాడు కాదు. ఏవ్యక్తి పుట్టుకతో దొంగో, మోసకారో గాడు వారి సామాజిక జీవన స్థితిగతులే వారి బతుకు మార్గాన్ని నిర్ణయిస్తాయి.

తిరుపతివెళ్ళి దైవ దర్శనం చేసుకుందామనే ఆలోచనతో స్టేషన్ కొచ్చేసరికి; అక్కడ దూదిపులి కనిపించి; ఆ తిరుపతి కెళ్ళే రైల్లో పెళ్ళి బృందం దగ్గర భద్రంగా బోలెడు దాచి పెట్టిన బంగారం ఉంది. ఈ ప్రయాణంలో నీవు దాన్ని చేజిక్కించుకుంటే దాన్లో నాకు కాస్తవాటా ఇవ్వమని ఒట్టేయించుకొని ఈసమాచారాన్ని బంగారానికి అందిస్తాడు. బంగారి గాడుతన అనుభవాన్ని ఉపయోగించి; ఆపెళ్ళి బృందంలోని ఒకావిడతో సరసమాడి కొంత సమాచారాన్ని రాబట్టుకొని చివరికి, బంగారమున్న, సజ్జని లంకించుకొని బెజవాడ స్టేషన్‌లో గలాట జరుగుతున్న సమయంలో తప్పించుకుంటాడు. "మనిసి కష్టం బంగారం, మనిసి దోపిడి బంగారం బంగారం బాబు,బంగారం"[113] అని చెప్తాడు బంగారిబాబు. ఈ బంగారంతో బంగారిగాడి జీవితం మరోమలుపు దిరిగింది. తన తండ్రి కష్టపడి సంపాదించుకున్న బంగారం; అది కష్టకాలంలో ఆదుకుంది; అదే బంగారం తన చెల్లిచావుకి కారణమైంది. మళ్ళీ అదే బంగారం తన జీవిత రూపు రేఖల్ని

మార్చబోతుంది. అయితే తన గత, వర్తమాన జీవితం తాలూకా వాసన ఇతనిలోఉంది. అందుకని జీవిత పోరల్లో ఎక్కడో అణగారి దాగివున్న మానవత్వం అప్పుడప్పుడు తొంగి చూస్తున్నట్లు ఈపాత్రని మొత్తంగా పరిశీలిస్తే అవగతమవుతుంది. మోసకారిగా మారిన వ్యక్తి జీవితమే బంగారిగాడి కథ; ఇప్పటికి దాదాపు అర్ధశతాబ్దినాటి (1952) సామాజిక పరిస్థితుల్ని ఈపాత్ర ద్వారా రావిశాస్త్రి సూచించారు. అయితే అప్పటికే అంతమోసం; దుర్మార్గత్వం, దొంగనోట్లు, సారా వ్యాపారం వ్యాపించి ఉందన్నమాట మోసపూరిత స్వభావానికి అలవాటుబడ్డవారికి తన, పర అనే భేదం లేదు. అంతా గిరీశం ప్రవృత్తే, నిగమశర్మ సంస్కృతే అలవడుతుంది.

### 5. బంగారయ్య

బంగారయ్య తన అసలు పేరుని కడవలూరి వీరవెంకట సత్యనారాయణ మూర్తిగా చెప్పుకుంటాడు. మూడు కథల బంగారం కథ, విశాఖ, శ్రీకాకుళం, అనకాపల్లి ప్రాంతాల మధ్య నడుస్తుంది. బంగారయ్య పుట్టుక 1934 ; అయిన కథ ఊపందుకొని మలుపుదిరిగింది. 1968 తరువాతే. కోస్తా ప్రాంతాలలో మద్యనిషేదం అమలులో ఉన్నకాలం, చాలా మంది 'మహనీయులు' సారారెంటర్స్ అవతారాలెత్తి కోట్లకు పడగలెత్తారు. వాళ్ళల్లో బంగారయ్య కూడ భాగస్వామి. "ఆడదాన్ని వాడుకొని డబ్బు పారేస్తే అది పుచ్చుకొని అదే పోతుందనే భావం"[114] తో వుంటే 'ఆడది కూడా మగవాళ్ళాగే ప్రకృతిలో ఓ సమానశక్తి అని నా జీవితంలో నాకు నిరూపించినా పతనానికి కారుకరాలయి వెళ్ళిపోయింది. ఒకావిడ"[115] అని వియత్నాం విమల గురించి; తన పతనం గురించి బంగారయ్య చెప్తాడు. ఈమాటలు బంగారయ్య స్వభావానికి కీలకమైనవి.

తనకు దగ్గరైన రామచంద్రయ్యని హాస్పటల్లో చేర్చినప్పుడు డబ్బు అహంకారం చూపి భంగపడతాడు, బంగారయ్య. డబ్బుతో ఎవరినైన లొంగదీసుకో వచ్చనే సూత్రానికి విమల అడ్డుకట్ట వేసి బంగారయ్యని ఆలోచన వైపు నెడుతుంది. విమల సౌందర్యాన్ని జూసి మోహించి, ధనాల వజ్రం ద్వారా ఆమె వివరాలు సేకరించి; ఎలాగైనా "ఈమెని పెళ్ళాడి తీరాలి, లేకపోతే అంతే నాప్రాణం పోవాలి" అని ఓ ప్రతిజ్ఞ కూడా చేసుకున్నాడు.సారా రెంటర్నని బంగారయ్య విమలకి తను చేస్తున్న వ్యాపారం గురించి చెప్పి "మీలాంటి పెళ్ళి కూతురు దొరక్క" ఇంత కాలం వరకు తాను పెళ్ళి చేసుకోలేదనే విషయాన్ని ధైర్యంగాచెప్పి చిన్నగా విమల మనసులో చోటు సంపాదిస్తాడు.

రామచంద్రయ్య ఆసుపత్రి నుండి డిశ్చార్జి అయిన తరువాత విమలను కలవటం వీలు పడక బంగారయ్య ఒక సినిమా సీనుని సృష్టించి, విమలను దక్కించుకోవాలని నిర్ణయించుకుంటాడు. సీను మామూలు సినిమా ఫక్కీలోనే, కొందరు విమల వెంట బడటం; ఆమెని బంగారయ్య రక్షించటం మూమూలే, కాని రంగాకింగు తన అన్న మెడలో తాళి బొట్టు కట్టిన అమ్మాయే ఈవిమలఅని గుర్తించి బంగారయ్య మీద తిరగబడటంతో సీనుమారిపోతుంది. రంగా కింగువిసిరిన కత్తి దెబ్బ వల్ల బంగారయ్య ఆసుపత్రి పాలవుతాడు. ఈ పరిస్థితిలో తాను బంగారు బాబు నుండి, బంగారిగాడిగా, బంగారయ్యగా అవతారాలెత్తి చేస్తున్న మోసం గురించి అతనిలో మరో సంఘర్షణ

బయలుదేరుతుంది. ఇది ఆహ్లాదకర పరిణామం. ఆసుపత్రిలోని అందర ముందు తామిద్దరం భార్యాబర్తలమని విమల, బంగారయ్యలు ప్రకటిస్తారు.

బావ, రామచంద్రయ్య బంగారయ్యకి ఎన్నో బుద్ధులు చెపితే, తను తెలిసో, తెలియకో చాల అపకారాలు చేశానని, నిరపరాధుల్ని గూడ బంధించానని, బంగారయ్య బాధపడటం శుభపరిణామం గత స్మృతులుఅతని అంతరంగాన్ని కలచివేసాయి. ఈ సందర్భంలో రామచంద్రయ్య బంగారయ్యకి ఒక విషయం స్పష్టపరుస్తాడు. అదే మంటే 'ఆ తప్పుల్ని నీదేవుడు క్షమించొచ్చు కాని క్షమించమన్చెప్పి దేవుడు దిగొచ్చి చెప్పినా నీ భార్య మాత్రం అందుకు నిన్ను క్షమించదు. ఆసంగత్తెలుసా''[116] అని చెప్పటం

తన పెళ్ళి ఏగుళ్ళో ఆగిపోయిందోఅక్కడే విమల బంగారయ్యని పెళ్ళాడింది. పెళ్ళయ్యాక విమల చేసిన పరోక్ష హెచ్చరిక వల్ల బంగారయ్య సారా వ్యాపారాన్ని తన పేరు మీద మానేసి,చాటుమాటుగా నిర్వహిస్తుంటాడు. విమల మీది ప్రేమతో, విమల వద్దన్నా వినకుండా ఆపదలో ఉన్న వాళ్ళని ఆదుకోవాలనే తలంపుతో విమల అన్నలకి డబ్బు సర్దటం బంగారయ్యలో మానవతచావలేదనే విషయాల్ని తెలియజేస్తుంది. దూదిపులి కొడుకు తన ఇంట్లో చేసిన దొంగతనం విషయంలో గూడ బంగారయ్య ఉదారంగానే వ్యవహరించాడు. ముందు అతణ్ణి పట్టుకొని కొట్టేప్పుడు తనని తాను "ఇతణ్ణి కొట్టటానికి నాకేమిహక్కుంది" అని ప్రశ్నించుకుంటమేగాక; "నేను పచ్చి పదహారణాల దొంగని విమలా"[117] అని అంగీకరించి; తన గత చరిత్రంతా ఆమెతో చెప్పి కుమిలిపోతాడు. చివరకి విమలగూడ దేవాలయం మెట్లపై బంగారానికి బలైపోయిన సన్నివేశాన్ని తలచుకొని బంగారయ్య విలపిస్తాడు. 'నా చెల్లి బంగారానికి బలైపోయింది. నాభార్యని నేనే చేజేతులా బంగారానికి బలిపెట్టుకున్నాను."[118] అని బంగారయ్య బాధపడతాడు. తన చెల్లి చావు తనలో మానవత్వాన్ని నశింపజేసి, సమాజంపై పగ, ద్వేషంతో, బంగారు సంపాదనకి, మోసానికి పురి కొలిపితే భార్య విమల మరణం బంగారయ్యలో పరివర్తనని, పశ్చాత్తాపాన్ని సామాజిక బాధ్యతని, మానవత్వపు విలువల్ని రేకెత్తింపజేసింది. మొదటి చావు (చెల్లి) చీకటి గుయ్యారంలోకి నెడితే, రెండవది (విమల) అగుహ నుండి, వెలుగుబాటవైపు నడిపించింది. కాబట్టి జైలు నుండి విడుదలైనాక బైరాగి నాయుడితో కలసి "మంచి ధర్మానికి నుడుం" బిగించాడు.

### 6. చిలకల ఆంజనేయదాసు

మోసకారి. స్త్రీని అనుభవించి వదిలివెయ్యవచ్చు అనే కళలో ఆరితేరిన వ్యక్తి సరళని ప్రేమించి, పెళ్ళి చేసుకుంటానని మోసగించి ఆమె శీలాన్ని దోచుకొని, ఆమె ఆత్మహత్యకు కారకుడైన నీచుడు. విమల జీవితంలో పెనుమార్పుకు దాసు కొంత వరకు కారణం.

### 7. కనకరాజు

పరోపకార దృష్టి కలవాడు. ఆమనస్తత్వంతోనే రాజు సరళకి సహాయపడితే; దాసు ఆమెను మోసగించటాన్ని భరించలేక కసితీర దాసుని కొట్టి, కష్టాల పాలవుతాడు. మానవత్వమున్న పాత్రగా కనకరాజుని చిత్రీకరించారు రావిశాస్త్రి.

**8. సరళ**

కుటుంబ ఆర్థిక దుస్థితిని చూచి కట్నం ఇచ్చుకోలేని తన తండ్రికి భారం తగ్గిద్దామని దాసుని నమ్మి అతనితో లేచిపోతే ; దాసు ఆమెను గర్భవతిని జేసి పెళ్ళి చేసుకుంటానికి అంగీకరించక పోయేసరికి లోకానికి మొఖం చూపించలేక ఆత్మహత్య చేసుకుంటుంది. ఆత్మహత్య పరిష్కారం కాకపోయినప్పటికి; కామదాహానికి, మోసానికి, పేదరికానికి ఎందరో ముక్కుపచ్చలారని యువతులు బలైపోవటాన్ని సరళ ద్వారా ... సూచించారు.

**9. శేషారావు**

శానిటరీ ఇన్స్పెక్టర్. ఇతనికి డబ్బు దప్పితే మరొకటి కనిపించదు. ఉద్యోగంలో డిస్మిస్ అయిన ఘనుడు. కట్నం డబ్బులిచ్చిన తరువాతే కొడుకును తాళి గట్టమన్న పరమనీచుడు. లోభితనానికి, నీచత్వానికి శేషారావు నిదర్శనం.

**10. వరహాలు**

తండ్రి ఏది చెపితే అది, చివరకి పెళ్ళాం విషయంలో గూడ, ఆచరించే తలలేనోడు వరహాలు. కట్నం డబ్బులిచ్చాక తాళిగడతానన్న వరహాలు చెంప చెళ్ళుమనిపించి; విమల తాళి బొట్టుని, ఇతని మెళ్ళో గట్టి మొగుడిగా కంటే, తనకి పెళ్ళంగా బ్రతకమని ఘోరంగా అవమాన పర్చటం ఇతనికి జీవితంలో మాయని మచ్చలాగ మిగిలి పోయింది. వెన్నెముక, సొంత ఆలోచనలేని డూడూ బసవన్నా లాంటి వ్యక్తి వరహాలు.ఇది 1952నాటి విషయమైన ఈనాటికి సమాజంలో ఇలాంటి మహనుభావులకి కొదవ లేకపోవటం దురదృష్టకరం.

**11. అమ్మలు**

సినిమా మోజులో పడి, బంగారిగాడి వలలో చిక్కుకు పోయింది. సామాజిక అవగాహన లేక, పైపై భ్రమలకు లోనై జీవితాల్ని బుగ్గిపాలు జేసుకొనే వారికి అమ్మలు జీవితం గుణపాఠం లాంటిది.

**12. సత్తరకాయ, సిత్తర్లేఖ, సిలకముక్కు, దూదిపులి**

వీళ్ళంతా లంపెన్ పాత్రలు. వ్యవస్థాగత అవ లక్షణాలుగూడ, వాళ్ళలోని దురాలోచనకు దోహదపడ్డాయి. నారాయన; నాయుడు; ప్రెసిడెంట్ పర్వతాలు; కర్రిపంతులు పైకి పెద్దమనుషులుగా చెలామణి అవుతూ; లోలోపల మోసాలు, కుట్రలు, దొంగనోట్ల వ్యాపారాలు చెయ్యటంలో ఆరితేరిన వ్యకులు. హెచ్చుతగ్గులున్నా ప్రవృత్తి పరంగా అంతా ఒకే నేతలోంచి వచ్చినవారు. ఏమాత్రం కష్టపడకుండా తెల్లారేసరికి కోటీశ్వర్లుగా మారిపోవాలనే దురాశపరులు. దొంగనోట్ల వ్యాపారాన్ని రావిశాస్త్రి వాస్తవికంగా చిత్రీకరించారు.

**13. బైరాగినాయుడు**

దొంగనోట్ల భ్రమలో; ఉన్న కొద్దిపాటి ఆస్తిని గూడ ధ్వంసం జేసుకొని, జీవితాన్ని చేతులారా పాడుజేసుకున్నవ్యక్తి.

**14. "నరసిమ్మూర్తి"**

పోలీసు వ్యవస్థకు ప్రతినిధి; తెలిసిన వారిని గూడ ఇంటికి పిలిచి మరీ'పోలీసు మర్యాద' చెయ్యకుండా ఉండలేని వ్యక్తి. బంగారి గాడిచ్చిన గాజుల్ని చాకచక్యంగా మార్చిన ఘనుడు.

**15. సూర్యారావుహెడ్డు**

మోసాన్ని, దొంగతనాన్ని, దుర్మార్గాన్ని, దొంగనోట్ల వ్యాపారాన్ని అరికట్టవలసిన పోలీసు శాఖ ఆచీకటి వ్యవస్థ సజావుగా సాగటానికి ఎలా కొమ్ముకాస్తుందో తెలుసుకుంటానికి సూర్రావెడ్డు పాత్ర దోహదపడుతుంది. బంగారంగాణ్ణి పెంచి, పోషించి పెద్దోణ్ణి జేసి, దొంగనోట్ల వ్యాపారాన్ని భాగస్వామ్యంతోదగ్గరుండి మరీ నడిపించిన దేశద్రోహి; సంఘద్రోహి సూర్రావెడ్డు.

**16. రామచంద్రయ్య**

విమల బంగారయ్యల జీవితాలుపెనవేసుకు పోవటానికి రామచంద్రయ్యే కారణం. ఈ రామచంద్రయ్య బావేలేకపోతే అసలు బంగారమే ఉండేవాడుగాడు. మానవత్వమున్న వ్యక్తి ఇతను.

**17. ధనాలవజ్రం**

అట్టడుగు వర్గ పాత్ర; వ్యక్తుల స్వభావాన్ని పసిగట్ట గల నేర్పు ఎజ్రాని కుంది. వ్యసనపరుడు.

బంగారం అక్క బావ, కామేశ్వరరావు కుటుంబీకులు మానవత్వమున్న వ్యక్తులు. ఇంకా సత్తరకాయ; రంగాకింగు తదితర పాత్రలు దీనిలో వస్తాయి.

**7. ఇల్లు**

"ఇల్లు"-కొందరికి అది ఉండటానికి గూడు. మరి కొందరికి అది సంపాదించవలసిన ఆస్తి". కాబట్టి ఆ బంగారు బాతు కోసం ఎవరెవరు ఎలాంటి దుర్మార్గాలకు దిగుతారో ఈ 'ఇల్లు'ద్వారా రావిశాస్త్రి స్పష్టపరచారు. రానురాను మానవత్వం నశించి దుర్మార్గం దౌర్జన్యం, డబ్బే ప్రధానమైన విష వ్యాపార పెట్టుబడిదారీ సంస్కృతి ఎలా వ్యాపించి పోతుందో తెలుసుకుంటానికి రావిశాస్త్రి ఈచిన్న ప్రయత్నం చేసారు. అందులో సఫలీకృతులయ్యారు.

**1. చిట్టెమ్మ**

చిట్టెమ్మ అసలుపేరు బొల్లా ప్రగడ సుందరమ్మ. 16సం॥నాటికే చిట్టెమ్మకు కరణంతో వివాహమైతే; 20 సం॥ల వయసుకే ఆమె విధవరాలై, ఆస్తులు కరిగిపోయి,

ఇంటిపైన వచ్చే అద్దెలతో, పొలం నుండి వచ్చే కొద్ది పాటి ఆదాయంతో కాలక్షేపం చేస్తుంటుంది. విధవరాలైన ఆడబడుచు వెంకటలక్ష్మి; ఆమె కుమారుడు అరుణ ప్రకాశం గూడ చిట్టెమ్మ దగ్గరే ఉంటారు.

సామాన్య కుటుంబీకులైన అనంతం కుటుంబం ఆరు సం॥ల పైబడి నెలకు 60 రూ॥ అద్దె యిస్తూ చిట్టెమ్మ ఇంట్లో ఉంటారు. సోమయాజుల సాహచర్యంతో చిట్టెమ్మలో మార్పువచ్చి; అద్దె సక్రమంగా చెల్లించటం లేదని నెలకి అద్దె 150 చొప్పున చెల్లించాలని; ఇల్లు ఖాళీ చెయ్యాలని అనంతానికి నోటీసుపంపిస్తుంది. కాని చిట్టెమ్మ స్వతహాగా మంచి మనసున్న వ్యక్తి. సోమయాజుల దుర్బోధల వల్ల నోటీసు పంపించిందే గాని తనంతట తానుగా చెయ్యలేదు. "ఈ సోమయాజులుగారి మాటలు విని అనవసరంగా దావా చేసేను. స్నేహం మానుకొని విరోధం తెచ్చుకున్నాను"1[19] అనే చిట్టెమ్మ మాటలు ఆమె మనస్తత్వాన్ని సూచిస్తున్నాయి.

సోమయాజులు దావా కోసం చిట్టెమ్మకు రెండు వేలు అప్పు పెట్టి ; చాల కాయితాల మీద నమ్మకంగా చిట్టెమ్మ చేత సంతకం చేయించుకుంటాడు. కాని చిట్టెమ్మ సోమయాజులు తనని మోసగిస్తాడని ఊహించలేక పోయిన అమాయకురాలు. ఈ అమాయకత్వం వల్లే; తన ఆడపడుచు కొడుకు ఉదయం దగ్గర నుండి వచ్చే ఉత్తరాల సంగతి; అతను నక్సలైట్లతో చేరిన విషయం; పోలీసులు అతని ఆచూకీ కోసం గాలిస్తున్న సంగతిసోమయాజులతో చెప్తుంది. వీటిని తనకు అనుకూలంగా మార్చుకుంటాడు సోమయాజులు. అమాయకత్వం కన్నా కూడ ఒక వ్యక్తిని నమ్మకంగా; విశ్వాసపాత్రంగా తలచే సద్గుణం ఆమెలో ఉంది. మానవత్వం మంచితనంఉండటంవల్లే సోమయాజులు తనని బలాత్కరించినా సహించి మళ్ళీ అతణ్ణి; అన్నయ్యా అనగలిగింది; వెంకటలక్ష్మి , జబ్బు పడితే; అప్పుచేసి ఐదువేలు; మళ్ళీ రెండు వేలు పంపించగలిగింది. సగటు వ్యక్తి యొక్క జీవన వేదన అంతరాంతరాల్లో దాగి ఉండటం వల్లే అనంతం అద్దె విషయాలు; కోర్టుల గొడవని; అరుణ ప్రకాశం చెప్పినట్లు ఒప్పుకుంది.

గొఱ్ఱె కసాయి వాణ్ణి నమ్మినట్లు; తను విశ్వసించింది. ఒక "లుచ్చాల్లో లుచ్చా' (అరుణ సోమయాజుల్ని ఉద్దేశించి అన్నమాట) మోసకారియైన సోమయాజుల్ని! అనే విషయంఆమె; సోమయాజులు పంపించిన నోటీసుతో గ్రహిస్తుంది. నమ్మకంలో నాగుబాములుంటాయని అప్పుడే ఆమె తెలుసుకుంటుంది.

చివరికి ఆమె పోలీసుల బాధలకిగురై విసుగెత్తి అంతకుముందే మనోహరానికి కూడ అమ్మటానికి సిద్ధపడిన ఇంటిని చిట్టిబాబు వాళ్ళ సో.మ.నా ఎంటర్ ప్రైజెస్ వారికి; లక్షకి అమ్మి; ఆ లక్షని అరుణ పేర బ్యాంకులో వేసి; జ్యోతిర్మయిని; అరుణని వివాహం చేసుకొని సుఖించమని; ఆపొలాన్ని అమ్మి శేష జీవితాన్ని 'కృష్ణా', 'రామా' అనుకుంటూ గడుపుదామని నిర్ణయించు కుంటుంది. ఆమె మానవత్వానికి; ఉదార స్వభావానికి ఇది నిదర్శనం.

చిట్టెమ్మ మధ్య తరగతి; దిగువ కుంటుంబ జీవన వాసనలున్న వ్యక్తి. పరోపకార గుణమున్న స్త్రీ. మోసం;దగ;కుట్ర, కల్లా, కపటం తెలియని ఉత్తమురాలు

సోమయాజుల్లాంటి దుర్మార్గుల ప్రలోభాలకులోనైన, స్వభావరీత్యా సహృదయురాలు. రావిశాస్త్రి చిట్టెమ్మని ఉత్తమురాలుగానే చిత్రీకరించారు.

**2. శాంతమ్మ**

ఆసుపత్రి గుమస్తా అనంతం భార్య శాంతమ్మ. నేతి బీరకాయ లాంటిది ఈమె పేరు. అందరితో కస్సుబుస్సులాడటం వల్ల ఈమెను 'లంకిణమ్మ' అని గూడ పిలుస్తారు.

భర్త అనంతంపై చాల చిన్న చూపున్న భార్యఈమె. "మా ఆయన ముష్టి ఎలాంటి ముష్టో నీకు తెలుసుకదా; వీధిలో ముష్టి కుష్టు రోగ పాడికి పైస విదల్చకపోడం సరికదా, వాణ్ణే పావలాకి చిల్లరడుగుతాడు"[120] అని భర్తని గురించి పరాయి వాళ్ళ దగ్గర అనగలిగే స్త్రీ. బేటామీను ఇల్లు ఖాళీ చెయ్యమని శాంతమ్మకి కోర్టు నోటీసు గురించి చెప్పినపుడు గూడ, వాళ్ళందరి ముందు భర్తని ఘోరంగా అవమాన పరచిన అనాగరికురాలు; 'దొంగసచ్చినాడా" అని భర్తని తిట్టి చొక్కా బట్టుకొని వెనక్కి ముందుకి ఊపి; కిందకు తోసేసిన వీరనారి. సెలవురోజు ఆసుపత్రి కెందుకెళ్ళావని ప్రశ్నించి "అక్కడెవరైనా ముండలతోటి కులకటానికి వెళ్ళావా?" అని సంకోచం లేకుండా భర్తని అనగలిగిన స్త్రీ. అంతేగాక డబ్బు ఆశ వలన ఏ సంబంధం వచ్చిన కన్న కూతురి పెళ్ళిగూడ "ఏదో విధంగా అన్ని సంబంధాలు తేలగొట్టేస్తావు నీచుడా! నీకు డబ్బే కావాలి" అని నిలదీయగలిగిన తెగువ గల స్త్రీ. సగటు కుటుంబీకురాలైన శాంతమ్మ ఇంత అల్లరి చేస్తుందంటే బాధ కొద్దీ. వయసు దాటి పోతున్న బిడ్డలకి పెళ్లి కాలేదనే ఆర్తి కొద్దీ. భర్త పిసినారి తనాన్ని భరించలేక; ఆకోపంలో విచక్షణని మరిచి అలా మాటాడగలిగింది.

భర్తకి చివాట్లు బెట్టడంతో ఆగలేదు శాంతమ్మ. బేటామీను వాళ్ళు ఇంట్లోని సామాన్లు బయటెయ్యబోతుంటే 'కదిలేరంటే లంజకొడకల్లారా, కాళ్ళూ చేతులూ విరిచేసి కట్టకట్టేసి చాపచుట్టేసి కాలవలోకి విసిరేస్తాన్చూసుకోండి. కాసుకోండి"[121] అని నానా తిట్లు తిడుతూ వాళ్ళ మీద తిరగబడుతుంది. ఎవరుఏమనుకున్నా; తన మనసులోని మాటని బయటకి వెళ్ళగక్కేమనిషి.

చిట్టెమ్మ ఆస్తి అంతా తనదయ్యే అవకాశముంటే తన భర్తని, చిట్టెమ్మని, తానే గదిలోకి పంపించి; గడియబెడతానని ఆలోచించటం; చిన్నకూతురు జ్యోతిర్మయి అరుణని ప్రేమించినందుకు సంతోషించటంతో ఆగక; పెద్ద కూతురు గూడ ఇలాగే ఎవరినో ఒకరిని వలలో వేసుకుంటే బాగుండునని ఆలోచించటం, భర్తని అవమాన పరచటం; ఇలా సాధారణ పరిస్థితి కంటే భిన్నమైన మహిళ శాంతమ్మ. ఏదైన విషయాన్ని తిరస్కరించవచ్చు; అవసరమైతే తిరుగుబాటు చెయ్యవచ్చు. కాని, దానికి ఒక పద్ధతి వుంటుంది. అయితే ఆమె దురుద్దేశ పూరితమైన స్త్రీ మాత్రంగాదు ఆమెను గురించి ఆమె చెప్పినట్లు "ఒడితనం, మోటుతనం" వున్న స్త్రీ శాంతమ్మ.

**3. వెంకటలక్ష్మి**

వెంకటలక్ష్మి గూడ చిన్నతనంలోనే విధవరాలైంది. పెద్ద కుమారుడు ఉదయం నక్సలైట్లలో కలసి పోయాడని అతని కోసం దిగులు బెట్టు కుంటుంది. తన మరదలి

ఇంట్లో ఉంటున్నప్పటికి. వంటపని జేసుకొని; కుటుంబ పోషణని నెట్టుకొస్తున్న ఆత్మాభిమాన మున్న స్త్రీ. క్యాన్సరు వ్యాధితో మరణిస్తుంది.

**4. జ్యోతిర్మయి : (చిన్న)**

శాంతమ్మ, అనంతంల చిన్న కూతురు జ్యోతిర్మయి. చలాకియైన పిల్ల. తెలివితేలున్నా అమ్మాయి.అరుణప్రకాశాన్ని ప్రేమిస్తుంది. అరుణని పెళ్ళి జేసుకొని; అతనితోనే జీవితాన్ని గడుపుతుంది. అభ్యుదయ మహిళ.

**5. పెద్ది**

అనంతం పెద్ద కూతురు; చిరుద్యోగి. అలాగే సువర్ణసుందరి; సూర్య కాంతం పాత్రలు గూడ 'ఇల్లు'లో దర్శనీయం.

**6. అనంతం**

వంగల అనంతం ఆసుపత్రిలో గుమాస్తా. భార్య చాటు భర్త. పిసినారుల్లో పరమ పిసినారి.ముష్టివాడికి పైసా ఇవ్వకపోగా;వాడి దగ్గర పావలాకి చిల్లరడిగే 'ధర్మదాత' ఆరు సంవత్సరాల పైబడి చిట్టెమ్మ ఇంట్లో అద్దెకుంటూ నెలకి అరవై రూ॥చొప్పున చెల్లిస్తూ అద్దె పెంచమన్న చిట్టెమ్మతో తగాదా పడి; ఇద్దరూ కోర్టుకెక్కుతారు. "ముడ్డికి సెంటు, మూతికి పేడా రాసుకొని తిరుగుతున్నాడని"[122] అనంతం గురించి సోమయాజుల అభిప్రాయం "పేడ మీద కాసు పడితే నాలికతో తీస్తాడు" అని రెడ్డి నాయుడి గుమస్తా సూరిబాబు అభిప్రాయం "నెలకోసారి గెడ్డం గీస్తాడు. మూణ్ణెల్ల కోమారు బుర్ర గీయిస్తాడు.'
'[123] కూతురికి కట్నమివ్వడు పెళ్ళిచెయ్యడు. దాని జీతం గూడా జేబిలో తోసేస్తాడు. రెడ్డి నాయుడిని బాగా "పొగిడి, పొగిడి ఫీజు ఎగదొబ్బే లంజకొడుకుల్లో మొదటి లంజ కొడుకువాడే! ఇవి కూడా అనంతంపై సూరిబాబు అభిప్రాయాలు. భార్యతో సరదాగా గడిపేప్పుడు కూడా గడ్డం గీసుకొని వెళ్ళాలంటే; గడ్డానికి ఖర్చవుతుంది గదా అని ఆలోచించే పరమలోభి. ఇతని కంటే కన్యాశుల్కంలోని లుబ్ధావధానులే నయ్యమేమో. ఆదివారాలు, సెలవరోజుల్లో గూడ లంచాలు వస్తాయంటే ఆసుపత్రికి వెళతాడు. ఆడవాళ్ళని చూసి లొట్టలు వేసుకుంటాడు. నలుగురిలో భార్య కొట్టిన, తిట్టిన, కిమ్మనకుండా ఉండటమే గాదు; ఆమె ఇంకా మీద బడి కరుస్తుందేమోనని పారిపోయే పిరికి పంద. సామాజికంగ ఇలాంటి వ్యక్తులు ఎందరో వున్నారు. డబ్బు-డబ్బు-డబ్బు ఇవి మినహాయించి మరే విషయాలు పట్టని పరమ లోభులు వీరు. మొత్తం మీద అనంతాన్ని ఓ చచ్చుపీనుగ్గా, లేక ఓ వెర్రి పీనుగ్గా రావిశాస్త్రి చిత్రీకరించారు. చుట్టూ వున్న వాతావరణం కంటే అతని స్వభావంలోనే ఏదో వెలితివుంది.

**7. సోమయాజులు**

సోమయాజుల అసలు పేరు ముసునూరి అప్పల నరసింహ సోమయాజులు. కౌన్సిలర్. సాధు స్వభావియైన చిట్టెమ్మలో విషం నింపి అనంతంపై దావా వేయించి; ఆమెకు రెండు వేలు అయాచితంగా అప్పు పెట్టి; ఆరెండు వేలని ఇరవై రెండు వేల క్రింద మార్చి, నమ్మకం మీద చిట్టెమ్మ చేత స్టాంపులపై, ప్రోనోటుపై సంతకం చేయించుకొని

ఆమె జుట్టు తన చేతికి లంకించుకొని, ఆమె ఇంటిని కాజేయటానికి ప్లాను వేసిన దుర్మార్గుడు సోమయాజులు. మానవత్వం; దయ ఇతని జీవిత పుస్తకాలలోదొరకని మాటలు. అందుకనే అరుణ ప్రకాశం సోమయాజుల్ని "పరమలుచ్చాల్లో లుచ్చాగా" ఛీ కొట్టాడు. పచ్చని కాపురాల్లో చిచ్చు బెట్టటం ; పవిత్ర స్నేహబంధాన్ని పరమనీచంగా ధ్వంసం జెయ్యటం ఇతని నైజం.

'అన్నయ్యా' అని పిలిచే చిట్టెమ్మని బలాత్కరించిన కాముకుడు. చిట్టెమ్మ ఇల్లు తనకు దక్కకుండా పోతుందని తెలిసేసరికి; ఆమె తనకు డెభ్భైఐదు వేలకి ఇల్లు అమ్ముతానని అంగీకరించి అడ్వాన్సుగా ఇరవై రెండు వేలు పుచ్చుకుంది గనుక, మిగతాడబ్బు తీసుకొని ఆ ఇంటిని తనకు రిజిష్టర్ చెయ్యవలసిందిగా నోటీసు పంపించిన నక్క జిత్తుల స్వభావి.

ఇంటి పన్నుని సోమయాజుల సహాయంతో తగ్గించుకుందామని చిట్టెమ్మ సోమయాజుల్ని ఆశ్రయిస్తే "గుమ్మటంలా వుంది కదా, కాస్త వాడుకోవచ్చునేమో"[124] అనే దురాలోచన మొదలై చివరికి చిట్టెమ్మ ఇంటినే కాజేసే దుర్బుద్ధి పుడుతుంది సోమయాజులకి. ఈ నవల కథ అధిక భాగం సోమయాజుల్ని చుట్టేసుకొని నడుస్తుంది. "ఎదుటివారి సొమ్ములెల్ల వారికి తీపి" అన్నట్లు; చిట్టెమ్మ ఆస్తిని కాజేయాలనే తపన వలన సోమయాజులు రకరకాల కుతంత్రాలు పన్నాడు. చిట్టెమ్మ మేనల్లుడు ఉదయం నక్సలైట్లలో కలసిపోయాడని; అప్పుడప్పుడు చిట్టెమ్మకు లెటర్స్ రాస్తుంటాడనే సంగతి తెలుసుకున్న సోమయాజులు బి.సుందరమ్మ; ఉరఫ్ చిట్టెమ్మ పేర వచ్చిన లెటర్ని పాశుపతాస్త్రంలా ఉపయోగించుకుంటా నికి విశ్వప్రయత్నం చేస్తాడు. ఈ ఉత్తరాన్ని తన స్నేహితుడైన డి.యస్.పి చిటికెల చిట్టిబాబుకిచ్చి; తద్వారా తనకు ఆచిట్టెమ్మ ఇల్లు దక్కేలా చెయ్యమని సోమయాజులు చిట్టిబాబుని అర్థిస్తాడు.

మోసానికి మారుపేరుగా; పరుల సొమ్ముని వట్టినే కాజేసే దురాశపరునిగా, నమ్మిన వ్యక్తిని కాటేసే కాలనాగులా, నక్క జిత్తులకుయుక్తులు పన్ని; అన్యోన్యంగా మెలిగేవారి మధ్య అగ్గి రవ్వలు పెట్టి ఆనందించే దుర్మార్గునిగా; మానవ విలువలు ఏమాత్రం మచ్చుకైనా కానరాని, అసాంఘికశక్తిగా సోమయాజుల్ని రావిశాస్త్రి చిత్రీకరించారు. మనిషికీ మనిషికీ మధ్య మనీ సంబంధాలు ఎక్కువై మానవత కరువై ప్రతిదాన్ని స్వలాభాపేక్షతో జూసే స్వార్థ పరత్వం బలిసిపోతున్న కాలంలో సోమయాజులు పాముకాట్ల నుండి తప్పించుకోవటానికి చిట్టెమ్మలాంటివారు నానాయాతన పడకతప్పదు. ఆస్తివ్యాపారాలు, వ్యామోహాలు పెరిగేకొద్దీ ; సోమయాజుల్లాంటివారు శరవేగంగా పుట్టుకొస్తుంటారు. కొంత గిరీశం సంస్కృతీ ఇతనిలో ఉంది. భ్రష్ట రాజకీయ వారసత్వం గూడ ఇతని ప్రవృత్తిలో ఇమిడిఉంది. సోమయాజులు శాంతమ్మన్నట్లు ఒక "గొంగళీపురుగు' ' లేక చీడపురుగు.

"సిలుకలా అవుపించే గెద్ద! కోరలు కనిపించని రాచ్చసుడు మేకలా అవుపించే సిరుత పులి"[125] అని సోమయాజుల్నుద్దేశించి గవర్రాజు చెప్పిన పలుకులుయాథార్థం.

## 8. అరుణప్రకాశం

వెంకటలక్ష్మి చిన్నకుమారుడు అరుణప్రకాశం తెలివైన యువకుడు. వయసుకు చిన్నే అయినా; తనమేనత్త చిట్టెమ్మ; అనంతంల ఇంటి అద్దె కోర్టు కేసుని క్షణంలో పరిష్కరించిన నేర్పరి అంతేగాదు సోమయాజుల నిజస్వరూపాన్ని అకళింపు జేసుకొని అతణ్ణి పరమ నీచంగా పరిగణించిన విచక్షణాపరుడు.

ఈభూమిపై కన్ను తెరవటానికి ముందు తండ్రిని పోగొట్టుకున్న అరుణకి తల్లంటే అమితప్రేమ. అనంతం కూతురు జ్యోతిర్మయి అరుణలు ప్రేమించుకుంటారు. ఆమెను అరుణ ఆదర్శవంతంగా పెళ్ళిచేసుకుంటం అతని నిండుప్రేమకు నిదర్శనం.

తన అత్త; ఇల్లు అమ్ముకొని వెళ్ళిపోయి నందుకు; మానవ సంస్కృతి శరవేగంగా వ్యాపార సంస్కృతిగా మారుతున్నందుకు విలపిస్తాడు. చిన్నతో వివాహానంతరం; సామాజిక మార్పుకు దోహదపడేది చదువేగనుక; ట్యూటోరియల్ కాలేజి పెడతారు. అరుణ ఊళ్ళో లేనప్పుడు వచ్చిన ఉత్తరం ఫలితంగా ఇద్దరు ఉగ్రవాదులు మరణించినందుకు; ఉదయం వాళ్ళు అరుణని, చిన్నని కిడ్నాప్ చేస్తారు. కిడ్నాప్ చేసిన నక్సలైట్లు అరుణ ఆరోజున రాయి వెల్లూరిలో తల్లి మరణించిన దగ్గరున్నాడని ఋజువు చేసుకున్నాక అతణ్ణి విడిపిస్తారు. నక్సలైట్లడిగిన ప్రశ్నలకి ఏమాత్రం భయపడక కత్తితో కత్తి మాట్లాడినట్లు అరుణ మాట్లాడటం అతని నిజాయితీని, నిర్భీతిని, ధైర్యాన్ని సూచిస్తున్నాయి. సామాజిక అవగాహనగల నవయువకునిగా ; ఆదర్శవంతునిగా 'ఇల్లు' లో దర్శనమిస్తాడు.

## 9. సూరిబాబు

రెడ్డి నాయుడి ప్లీడరు గుమస్తా సూరిబాబు. "ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా' వచ్చినావాడు మొల్లోంచి చిక్కంతీస్తేనే వాడితో మాట్లాడతాడు. చక్కగా, డోన్ట్‌కేర్ మేస్టరు ముడ్డిలేపాలంటే ముడుపు చెల్లించవసిందే"[126] ఇది సూరిబాబు స్వభావం ఎదుటివాడు ఎవడైన ఎంతటివాడైన సూరిబాబుకి లెక్కలేదు. డబ్బు లేకపోతే, నోరు తెరవడు సామాజిక లాసుగుల్ని తూర్పారబట్టే స్వభావమున్నప్పటికి; డబ్బుకి ఆశపడి ఎంతటి నీచానికైన పాల్పడే లంపెన్ క్యారెక్టర్ సూరిబాబు.

ఎలా ఉన్నావని పలకరించిన సోమయాజులకి వాతలు బెట్టి "లంజకొడుకులు అవసరం వుంటే చెరుగ్గడలా మాట్లాడతారు. లేకపోతే కాకర కాయల్లా మాట్లాడతారు" [127] అని డోన్ట్‌కేర్ మాస్టరు- అదే మన సూరిబాబు వ్యక్తం చేసిన పలుకులు లోకరీతికి నిలువెత్తు అద్దం లాంటివి. రావిశాస్త్రి రచనా తీరుకి ఈమాటలు ఉదాహృతాలు.

అనుభవంతో, అవకాశవాదంతో, డబ్బుపై అత్యాశతో ఎదుటివాళ్ళను ఎంతటి అఘాతంలోకైనా నెట్టివెయ్యటానికి వెనుకాడని దుర్మార్గత్వంతో, న్యాయవ్యవస్థ చిట్కాలతో జీవితం వెళ్ళ బుచ్చుతున్న ప్లీడరు గుమస్తా సూరిబాబు.

## 10. మనోహరం

మనోహరం అసలుపేరు గోపికా మనోహరం. 'మనిషి'ని మునుముందుకు సాగించేదీ! వాడికి "పెను నిద్దుర వదిలించేదీ" డబ్బు డబ్బు డబ్బేనని అతను

గ్రహించుకున్నాడు''. మనోహరం స్వభావం ఈ మాటలపై ఆధారపడి ఉంది. 'ధనం మూలమిదం జగత్' అనే సూత్రాన్ని తూ.చ.తప్పకుండా మనోహరం పాటిస్తున్నాడన్నమాట. భూములు, స్థలాలు చౌకగాకొని, వాటిని రెండు మూడు రెట్లు రేటుకి అమ్ముకొని సొమ్ము చేసుకునే పద్ధతికి అలవాటుపడ్డాడు.

డబ్బు వ్యామోహంతో, భార్యా, బిడ్డల్ని, కన్నవారిని గూడా విడిచిపెట్టి విదేశాల కెగబాకి, కోట్లకి పడగెత్తి ఆ సొమ్ముని స్వదేశంలో ఇళ్ళ స్థలాలు, పొలాలు కొంటానికి వినియోగించే సంస్కృతికి మనోహరం కుటుంబం ఒక ఉదాహరణ. వ్యాపార సంస్కృతిలో భాగంగానే చిట్టెమ్మ ఇంటిని కొంటానికి సౌందరి సిద్ధపడ్డాడు. గవర్రాజు ఇతనికి సహాయకారిగా వున్నాడు. స్థలాలు, పొలాలు, ఇళ్ళు అమ్మకాలు, కొనటాలు, డబ్బును, రొటేట్‌చేసి, వ్యాపార పరిశ్రమగా ఈ సంస్కృతిని వంటబట్టించుకున్న పాత్ర మనోహరం. ఈ వాతావరణాన్ని తెలియజేయటానికి రావిశాస్త్రి మనోహరం పాత్ర సృష్టిచేశారు.

### 11. గవర గవర్రాజు

సోమయాజులు, గవర్రాజు ఒకే పార్టీకి చెందిన కౌన్సిలర్లైన, ఇద్దరు ఎడమొఖం పెడమొఖం. గవర్రాజు డబ్బున్న మనోహరం లాంటి వాళ్ళకి సలహాదారుగా; సహాయకారిగా వుండి కమీషన్లతో తన మనీ కలెక్షన్స్ పెంచుకుంటున్న రాజకీయ కమీషన్ల ముడుపులదారుడు. సాధారణవర్గం నుండి రాజకీయంగా పైకెదిగినప్పటికీ ఆవర్గ ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడని వ్యక్తి.

### 12. చిటికెల చిట్టిబాబు

చిటికెల చిట్టిబాబు పోలీస్ డిపార్టుమెంట్లో చిన్న ఉద్యోగిగా చేరి రిటైరయ్యేనాటికి అదనపు సూపరింటెండెంట్ స్థాయికి ఎదిగాడు. అడ్డువచ్చినవాళ్ళని పక్కకు నెట్టేసి, అడ్డదారుల్లో అధికార, పలుకుబడిగల వాళ్ళ అడుగులకు మడుగులొత్తి ప్రమోషన్లతో అధికార నిచ్చెనమెట్లు ఒక్కటొక్కటే అధిరోహిస్తూ ఉన్నతస్థానాన్నధిరోహించిన పోలీస్ ఆఫీసర్. తను అనుకున్నది సాధించటానికి ఎంత నీచానికైనా దిగజారే దగుల్బాజీ.

బంగారం కేసులో డి.ఐ.జీ.ని ఎదిరించి; డిమోట్ అయిన చిట్టిబాబు "పాదరక్షల పాలిష్" చెయ్యటమనే విద్య బాగా వంటబట్టిన వాడవడంవల్ల ఎవరి చదివింపులు వాళ్ళకి అందించటంవల్ల మళ్ళీ నెల తిరక్కుండానే అదే పోస్టుకి ప్రమోట్ అవుతాడు చిట్టిబాబు. నక్సలైట్లనే వంకతో అరెస్టులు చెయ్యటంలో చిత్రహింసలు పెట్టటంలో, బెయిల్, తదితర వ్యవహారాల పేర డబ్బు గుంజటంలో చిట్టిబాబు అందెవేసిన చెయ్యి. పోలీసు డిపార్టుమెంటు అవినీతిని, అసమర్థతని, లంచగొండి విధానాన్ని బట్టబయలుచేయటానికి రావిశాస్త్రి చిట్టిబాబు పాత్రని ప్రవేశపెట్టారు. సోమయాజులు దురాశతో తెచ్చిన రహస్య సమాచార ఉత్తరాన్ని, అంతకంటే దురాశతో ప్రమోషన్ కోసం ఎదురుజూస్తున్న చిట్టిబాబు చాకచక్యంగా వినియోగించుకుంటాడు.

నక్సలైట్లు ముఖ్యమంత్రిని చంపటానికి వేసుకున్న పథకాన్ని, చిట్టిబాబు సమర్థవంతంగా అణచివెయ్యటంతో, అతని జీవితాశయమైన అడిషనల్ ఎస్పీ పదవి దక్కుతుంది. చిట్టెమ్మని వేధించి, బెదిరించి, ఆమె ఇంటినిగూడా చిట్టిబాబు సో.మ.నా ఎంటర్‌ప్రైజెస్ పేర కాజేస్తాడు.

పోలీసు సంస్కృతికి చిట్టిబాబు ఒక ఉదాహరణ. వాళ్ళ క్రౌర్యానికి, దౌర్జన్యానికి దబాయింపు సెక్షన్‌కి ఇతనో నమూనా. ఈ వ్యవస్థతో రావిశాస్త్రికి సన్నిహిత సంబంధం ఉండటంవల్ల ఈ పాత్రకు సంబంధించిన మలుపుల్ని సమయస్ఫూర్తితో చిత్రీకరించ గలిగారు.

రెడ్డినాయుడు ప్లీడరు, పరమబ్రహ్మశాస్త్రి సుందర శివరావు ప్లీడరు, ప్లీడరు ప్రభాకరం, నూకరాజు, అనంతం తండ్రి, బేటామీను తదితర పాత్రలుగూడ ఇందులో ప్రత్యక్షమవుతాయి. సువర్ణ సుందరి, ఝూన్సీ మొ॥ స్త్రీ పాత్రలు ఉన్నాయి.

వ్యవస్థపై విసుగెత్తి నక్సలైట్లు రాజకీయాల్లో చేరి కిడ్నాపులు; వ్యవస్థ కంటకుల్ని అంతం చెయ్యటాలు, ప్రజా కోర్టుల నిర్వహణలు మొ॥ విషయాలకు నిలయమైన పాత్ర ఉదయం.

దాదాపు 'ఇల్లు' నవలలోని పాత్రలన్నీ దిగువ మధ్యతరగతి పాత్రలే.

'అల్పజీవి' దగ్గర్నుండి 'ఇల్లు'వరకు రావిశాస్త్రి తన నవలల్లో సంపన్న; మధ్యతరగతి; మధ్యతరగతి దిగువవర్గ, అట్టడుగువర్గ, జీవితాలతోపాటు లంపెన్‌వర్గ జీవితాలనుగూడా చిత్రీకరించారు. పేకాటరాయుళ్ళను; కేడీలను బ్రోతల్స్‌ను, తాగుబోతులను; జేబు దొంగలను; రిక్షా కార్మికులను కూడా శాస్త్రి తన నవలల్లో పాత్రలుగా ప్రవేశపెట్టారు. వీళ్ళ జీవితాల గురించి ఆలోచించాలనే స్పృహను సాహితీకారులకు కలిగించారు.

సుబ్బయ్య, చిట్టెమ్మలు మధ్యతరగతి దిగువవర్గంలో లేక సగటు జీవితాల్లో సమసిపోని మానవత్వానికి ప్రతీకలు. ఛైర్మన్ భీమసేనరావు; కారు జోగులు, రాజయోగి, కిరీటి; సంపన్న పెట్టుబడిదారీ వర్గ పాత్రలు; విశ్వమోహిని; పద్మలుగూడా ఈ వర్గ పాత్రలే. అడ్డబుర్ర; కొంగ రిక్షా అతను; దాసరి బోడి మొ॥వారు అట్టడుగు వర్గ పాత్రలు. ముత్యాలు, రత్తాలు; మంగ; వరాలమ్మ మొ॥ స్త్రీలు అట్టడుగు వర్గ పాత్రలైతే, సిలక ముక్కు; సిత్తర్లేఖ; ప్రభుదాసు; బంగారిగాడు మొ॥వారంతా లంపెన్ క్యారెక్టర్స్ సమాజంలోని వివిధ వర్గాల నిశిత పరిశీలనతో రావిశాస్త్రి ఆయా వర్గ స్వభావాలను; ఆ పాత్రల ద్వారా చిత్రీకరించగలిగారు. అంతేగాకుండా న్యాయ; రాజకీయ; పోలీసు యంత్రాంగం పని తీరుతెన్నులను తెలియజెయ్యటానికిగూడా ముకుందరావు ప్లీడరులాంటి వారిని; మందుల భీముడు; శివకేశవరావులను; గంగరాజు హెడ్డులను సృష్టించారు. సామాజిక కాలుష్య వాతావరణాన్ని ఈ పాత్రల ద్వారా విశదం చేసి; మేడిపండు వ్యవస్థ నిజరూపాన్ని బట్టబయలు జేశారు. పొట్టకూటికోసం పతితలుగా మారి సానికొంప ఊబుల్లో బ్రతుకులు తెల్లార్చుకున్న స్త్రీమూర్తుల ఆక్రందనని ఈ లోకానికి ఆయన వినిపించారు. సామాజిక ఆలోచనా ధోరణిలో మార్పుని చైతన్యాన్ని రగిలించిన పాత్రలు రావిశాస్త్రి నవలల్లో దర్శనీయమవుతాయి. నడుస్తున్న సామాజిక చరిత్ర; ప్రాపంచిక పోకడపై రావిశాస్త్రికి విచక్షణాయుతమైన అవగాహన ఉంది గాబట్టే; ఆయన తన నవలల్లో సమర్థంగా పాత్ర చిత్రీకరణ చెయ్యగలిగారు.

# 4. సామాజిక వాస్తవికత

ప్రకృతిగతిని, సామాజిక జీవన గమనాన్ని, శాస్త్రీయదృష్టితో, అనుభవజ్ఞానంతో అవగాహన జేసుకొని తాత్వికంగా విశ్లేషించుకొనే సామర్థ్యం, నేర్పరితనం, కళాదృష్టి రచయితకవసరం. సరియైన ప్రాపంచిక దృక్పథం లేనప్పుడు, సామాజిక లోతుపాతుల్ని, మంచిచెడుల్ని, ప్రగతి, ప్రతిఘటల్నీ, హేతుబద్ధంగా అంచనా వెయ్యటం కష్టం. వాటిని బేరీజు వేసుకొనే శక్తి కొరవడినప్పుడు అభివృద్ధి కాముకత్వమేదో, ప్రగతి నిరోధకత్వమేదో తెలుసుకోలేని డోలాయమాన పరిస్థితి యేర్పడుతుంది. దానివలన రచయిత నాలుగుదారుల కూడలిలో నిలబడినా, తన మార్గమేదో; ఎటువైపు వెళ్ళాలో తెలియని అస్పష్ట, గందరగోళ పరిస్థితిని ఎదుర్కోవలసి ఉంటుంది. "ఈనాడు అలాంటి ప్రాపంచిక దృక్పథం గతితార్కిక భౌతికవాద దృక్పథం మాత్రమే. అదే ఈనాడు కళలో సామ్యవాద వాస్తవికతకు జన్మనిచ్చిన దృక్పథం"[1] అని రాల్ఫ్ ఫాక్స్ పేర్కొన్నాడు.

ఏ వ్యక్తి జీవితం సరళరేఖలా ఉండదు. జీవితం ప్రవాహప్రాయమైంది. ఒట్టి బోవటం, ఒడ్డు లారుసుకుపారటం బురద, మురికిమయంగా ఉండటం, స్వచ్ఛత, శుభ్రతతో తేటపడి ఉండటం దాని లక్షణం. రచయిత ఈ మలుపులన్నింటిని, ఎత్తుపల్లాల్ని తన ప్రతిభతో, శాస్త్రీయ అవగాహనతో పట్టుకొని, తన రచనలలో వాటికి యధార్థ స్థానాన్ని కేటాయించగలగటం సామాజిక వాస్తవికత అవుతుంది. అంతర్గత, బహిర్గత, సాంఘికాంశాలని నిష్పక్షపాతంగా నిజాయితీగా వివరిస్తూ వాటి నేపథ్యాన్ని పరిణామక్రమాన్నికూడా విశదం చెయ్యాలి.

ఒకొకసారి సవ్యంగా ఉన్న వాతావరణమంతా హఠాత్తుగా అడ్డదిడ్డంగా, దుర్మార్గంగా, దౌర్జన్యకరంగా, అసాంఘికంగా, వ్యాపార విషసంస్కృతీపరంగా మారుతుంది. అలా మారటానికి దారితీసిన పరిస్థితులేమిటి? ఏ భూమిక ఆ వాతావరణం అలా కలుషితం కావటానికి దోహదపడిందో విపులంగా వివరించటం, వీలైతే దాని పరిహారానికి మార్గాన్ని సూచించగలగటం సామాజిక వాస్తవికత అవుతుంది. ఆ పరిస్థితుల అస్తిత్వ క్రమ ప్రదర్శన నూతన చైతన్యానికి దారి తీస్తుంది. అంతేగాని ఉన్నదున్నట్లుగా ఫొటో తీయటం, రికార్డు చెయ్యటం, క్యాలెండర్‌లాగా, లేక దస్తావేజులాగ పేర్కొనటం సామాజిక వాస్తవికతకాదు. ఉన్న పరిస్థితికి అద్దం పట్టడంతోటే రచయిత బాధ్యత నెరవేరినట్లుగాదు. సమాజపరంగా ఉన్న పాత్రల్ని యథాతథంగా వర్ణించటంతోపాటు ఆ పాత్రలు ఏ సామాజిక వాతావరణంలో ఏ ప్రాపంచిక పరిణామక్రమంలో మంచికో చెడుకో యెందుకు అలా మలచబడ్డాయో కూడా రచయిత విశ్లేషించగలగాలి.

"ఒక నవలలోని పాత్రలు ఫొటోగ్రాఫ్‌ల సంపుటికాదు లేక వ్యక్తికి సంబంధించిన శాఖలో ప్రశ్న పరంపరల ఫైలుకాదు. రచయిత ఊహాచిత్రాలే ఆ వ్యక్తులైన, వారు వాస్తవిక వ్యక్తులే. ఎందుచేతనంటే జీవితాన్ని లోతుగా చూచి అన్వయించే నైపుణ్యంగల రచయిత ఆ పాత్రలకు జీవం పోస్తాడు"[2] అని పేర్కొన్న ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ ఆలోచన ఈ సందర్భంలో గమనార్హమైంది.

"మామూలు పరిభాషలో సమాజానికి అద్దంపట్టడం సామాజిక వాస్తవ చిత్రణ అనే అర్థంలో వాడుతుంటారు. సమాజానికి అద్దం పట్టినపుడు అది సహజ రూపాన్ని (appearance) మాత్రమే ప్రతిభింబిస్తుంది. ఈ రూపంలో సామాజిక వైరుధ్యాలన్నీ విధిగా ఉండాల్సిన అవసరం లేదు. అంటే సమాజ సారాంశాన్ని (essence) అది ప్రతిబింబించలేదన్నమాట. అయితే వాస్తవ ప్రపంచం సారాంశంలో వైరుధ్యాల పోరాటం, ఐక్యత అనే సూత్రంమీద నడుస్తుందని మనం భావిస్తున్నాం. అంటే ఈ 'అద్దం పట్టడ' మనేది మన దృష్టిలో వాస్తవికతకాదు. గతితార్కిక దృష్టిలో వాస్తవికత అంటే సమాజంలోని వైరుధ్యాలను అది చూపించగలిగింది అని అర్థం"[3] అని గెస్ట్ డేవిడ్ అభిప్రాయాన్ని కొడవటిగంటి కుటుంబరావు సమన్వయంతో శ్రీ వరవరరావు పేర్కొన్నారు.

ఫ్రెంచి విప్లవం, సామాజిక, రాజకీయ, సాహిత్యాదిరంగాలపై తన ప్రభావాన్ని ప్రగాఢంగా ప్రస్ఫుటింపజేసింది. తత్ఫలితంగా వచ్చిన కాల్పనికవాద ధోరణులను అధిగమించి రకరకాల వాస్తవికవాదాలు ముందుకు వచ్చాయి. వీటిలో భాగమైన ప్రకృతివాదమొకటి. ఈ సిద్ధాంతకర్త ఫ్రెంచి రచయితైన ఎమిలీ జోలా (1840-1902) "మేము సామాజిక చెడుగులకుగల కారణాలను వెదుకుతాము. వర్గాల, వ్యక్తుల నిజరూపాన్ని అధ్యయనంచేసి, సంఘంలో, మనిషిలో కలిగే మార్పులను విశదీకరిస్తాము. దానికోసం తరచుగా కలుషిత వ్యక్తుల్ని చిత్రీకరించాల్సి ఉంటుంది. మనిషి తప్పిదాల మధ్యకు హైన్యాల మధ్యకు పోవాల్సివస్తుంది. కాని దానివలన మాకు విషయాలు అర్థమవుతాయి. అలా తెలుసుకోవటం వలన మంచిని చెడును ఆధీనంలో ఉంచుకోవటానికి శక్తివస్తుంది"[4] అని వివరించారు. కొంతమేరకు ఈ పద్ధతిగూడ ముసుగుల్ని తొలగించి, నిజరూపాన్ని అవగాహన జేసుకుంటానికి తోడ్పడుతుంది.

బాల్జాక్, డికెన్స్‌లు ప్రాతినిధ్యం వహించిన అభ్యుదయ వాస్తవికత (Progressive Realism), నిరాశావాద వాస్తవికతను(Pesimetic Realism), గుస్టావ్, ఫ్లాబర్ట్, థామస్ హార్డీలు భుజానవేసుకున్నారు. ఆంద్రే బ్రెటోన్, అధివాస్తవికతావాదం(Sur Realism), క్రిటికల్ రియలిజమ్,ప్రోలిటేరియన్ రియలిజమ్ హీరోయిక్ రియలిజం"[5] ఇలా ఎన్నో వాస్తవిక వాదాలు వచ్చినా ప్రజామోదం పొందింది సోషలిస్టు వాస్తవికతా వాదం మాత్రమే.

అందుకనే "జీవితం క్రియాశీలం,సృజనాత్మకం అని సోషలిస్టు వాస్తవికత చాటుతుంది." అని గోర్కి అన్నాడు.

"జీవిత పునరుజ్జీవనకు, దానిని మానవ కళ్యాణం కోసం తీర్చిదిద్దేందుకు తోడ్పడేభావాన్ని వ్యకం చేయగల వాస్తవికతను గురించి నేను మాట్లాడుతున్నాను. కేవలం చింతనకే పరిమితం అవడాన్నిగాని, వాస్తవికత నుంచి దూరంగా ఉండడాన్నిగాని, నిరాకరిస్తూ మానవాభ్యుదయాన్ని సాధించే పోరాటానికి పిలుపునిచ్చే ప్రపంచ దృక్పథం ఆ వాస్తవికతకు ప్రత్యేకలక్షణంగా ఉంటుంది"[6] అని షోలోకోవ్ పేర్కొన్నాడు. రచయిత అంతరంగానికి, ఆలోచనా ధోరణికి, సామాజిక వాస్తవిక పరిస్థితులకి మధ్య భేదం ఉండవచ్చు. అంతమాత్రంచేత రచయిత డీలాపడి నిరంకుశంగా తన భావాల్ని పాత్రలపై రుద్దకూడదు. చిత్తశుద్ధితో, విశాల ప్రాపంచిక దృక్పథంతో భౌతిక పరిస్థితులను

అర్థంచేసుకొని విశ్లేషించగలగటం సామాజిక వాస్తవికతలో భాగమవుతుంది. ఈ ధోరణినే మార్క్స్, ఏంగెల్స్ కోరుకుంది; గోర్కీ మహాసాలు సూచించింది.

రచయిత డైరెక్టుగా ఉపన్యాసాలు చెయ్యకూడదు పాత్రలపై తన అభిప్రాయాలు రుద్ది స్వారీ చెయ్యటంగాని, స్లోగన్స్ ప్రచారం చెయ్యటం కోసమే సంఘటనలను చిత్రించినట్లుగా ఉండరాదు. రచయిత అభిప్రాయాలు ఎంత అంతర్లీనంగా ఉంటే అంత మంచిది. "పాత్రలకు రాజకీయాభిప్రాయాలుండవచ్చు, ఉండాలికూడా. కానీ, అవి రచయిత అభిప్రాయాలుగా మాత్రమే ఉండాలి. అవి పాత్రల సొంత అభిప్రాయాలుగా మాత్రమే ఉండాలి. కొన్ని సందర్భాలలో రచయిత అభిప్రాయాలు, పాత్రల అభిప్రాయాలు ఒకటే కావచ్చు. అప్పుడు వాటిని పాత్రల సొంత గొంతుకతోనే వాటిని వ్యక్తంచేయాలి. అంటే ప్రతి పాత్రకు ఒక సొంత గొంతుకా, ఒక సొంత చరిత్ర ఉండాలి"[7] అని రాల్ఫ్‌ఫాక్స్ వ్యక్తంచేసిన భావాలు విలువైనవి. సామాజిక వాస్తవికతా విశ్లేషణలో వస్తువు; శిల్పం; పాత్రలు నడిచిన తీరును గూడా గమనించాలి. కాబట్టి "A great literature can not exist without profound ties to the whole complex of social existence"[8] అని గమనించాలి.

నడుస్తున్న సామాజిక జీవన స్థితిగతులను చిత్రీకరించకుండా ఏ ప్రగతిశీల రచయిత మనలేడు. "A work of literature always reflects, whether consciously, or unconsciously the psychology of class which the writer represents or else as often happens, it reflects a mixture of elements in which the influence of various classes on the writer is revealed; and this must be subjected to a close analysis"[9] కనుక రచయిత తన వర్గ దృక్పథాన్ని తప్పనిసరిగా తన రచనల్లో ప్రతిబింబింప జేస్తాడనేది యథార్థం. చైతన్యయుతమైన వర్గస్పృహ గలిగిన రచయిత సామాజికవర్గ తారతమ్యాలని; అందుకుగల కారణాలని వాస్తవికంగా తన రచనల్లో విశదపరచి; ప్రజల్ని మేలుకొలుపుతాడు. అందుకనే "Marxist critic is a fighter and a builder" అంతేగాక; Marxism embraces but cannot replace realism in literary and artistic creation; just as it embraces but can not replace the atomic and electronic theories in physics. (Mao; "Selected works of Mao Tse Tung" Volume-III; Page : 94.) కాబట్టి "As he deals with life, he must deal with the moral facts and issues every where involved in life, he must deal with the moral facts and insight and upon the whole spirit and tendency of his philosphy, that the real greatness of his work very largely depends"[10] వామపక్ష ధోరణిగల నవలాకారుడు జీవన సత్యాలను వెల్లడిజేసి, ప్రజాభ్యుదయానికి దోహదపడతాడు. "Realism in this sense means art that sets out to present a comprehensive reflection and interpretation of life from the point of view of social relations. 'Socialist' means in accordence with the policy of the communist party. Socialist realism is there fore based on a direct relationship between the artist and the process of building a new society. It is art coloured by the experience of the working class in its struggle to achive socialism"[11] అందువలన నూతన అభ్యుదయ కాముకమైన; చైతన్యవంతమైన సామాజిక నిర్మాణానికి తోడ్పడేదే "సామాజిక వాస్తవికతావాదం"గా మనం గుర్తించాలి. ఈ భావజాలాన్ని రావిశాస్త్రి తన నవలల్లో వ్యాపింపజేశారు.

అస్తవ్యస్తంగా; వర్గ, వర్ణమయంగా ఉండి; ధనిక, పేద వర్గాల నడుమ దూరాన్ని రోజురోజుకు ఇంకా పెంచుకుపోతున్న నేటి సామాజిక వాతావరణాన్ని రావిశాస్త్రి వాస్తవికంగా తన నవలల్లో చిత్రీకరించటమేగాదు; వాటి మూలాలని; తత్పర్యవసానాన్ని గూడా వివరించి; అసంఖ్యాక పేద ప్రజల పక్షాన అరుణోదయంలా నిలిచారు; సామాజిక వాస్తవిక ధోరణిలేని; రావిశాస్త్రి నవల లేదు. అల్పజీవి; రాజు-మహిషి; రత్తాలు-రాంబాబు; మూడు కథల బంగారం; ఇల్లు నవలల్ని ఈ అధ్యాయంలో పరిశీలిద్దాం.

## I. అల్పజీవి

రావిశాస్త్రి సొంతపేరుతో మొదటిసారిగా 'అల్పజీవి' ప్రచురితమవటంతో ఆయన; సామాజిక బాధ్యతని, ముసుగుల్లేని తనాన్ని గుర్తించినట్లయింది.

మనిషి అంతరంగ బాహిర విషయాలు పరస్పర సంబంధకాలు. సుబ్బయ్య జన్మతః అసమర్థుడు, భయస్తుడు కాడు; కాని అతని బావమరిది వెంకట్రావు సుబ్బయ్యని అసమర్థుడిగా పరిగణించటం; ఆఫీసులోనివాళ్ళు అతనిని అశక్తుడిగా ముద్రవెయ్యటం, తెలిసినవాళ్ళెవ్వరు తనకు సరిఅయిన విలువ నివ్వటంలేదనే దృష్టి సుబ్బయ్యలో పెరగటం, ఆఖరికి ఇంట్లో భార్యగూడా అతనిని పనికిరానివాణ్ణిగా పరిగణించటం-ఈ సామాజిక వాతావరణమంతా సుబ్బయ్య మనసుపై పనిజేసి, అతనిని నిర్వీర్యుణ్ణి చేసింది.

అంతేగాక చిన్నప్పుడే తల్లి చనిపోవటం; సవతి తల్లి కాపురానికొచ్చిన మరునాటినుండే సుబ్బయ్యని హింసించటం; చీకట్లో; తన కళ్ళముందే దొంగలు తండ్రిని కొట్టిపారిపోయిన సంఘటన; అతని జీవితంపై బాల్యంనుండే బలమైన ముద్రవేసి సుబ్బయ్యని పిరికివానిగా, అశక్తునిగా తయారుచేశాయి.

తనుచుట్టూ వున్న సామాజిక పరిస్థితులు ఏ వ్యక్తినైనా తప్పక ప్రభావితుణ్ణి జేస్తాయి. ఇలాంటి వాతావరణం నుండి ఎదిగిన సుబ్బయ్య ప్రతిదానికి భయపడటం, ఎదుటివాళ్ళు ఏమన్నా అనుకుంటారేమోనని సందేహించటం; స్వయం నిర్ణాయక శక్తి లేకపోవటం, చొరవలేని వ్యక్తిగా పెరగటం వల్లే గవరయ్యని ఐదువందలు అడగాలంటే హడలిపోయింది. ఆఐదువందల సన్నివేశంతో అంతగా అతలాకుతల మవనవసరం లేదు. కాని సామాజిక వాస్తవిక పరిస్థితులను సరియైన దృష్టితో అంచనా వేసుకుంటంలో సుబ్బయ్య మొదటినుండి, అచేతనంగా వున్నాడు, గాబట్టి ఆ పరిస్థితిని ఎదుర్కోవలసి వస్తుంది. సామాజిక అవగాహన వ్యక్తి జీవితాన్ని మలుస్తుంది. అది లేకపోతే జీవన ఎదుగుదల కుంటు బడుతుంది. అయితే మనోరమ సాహచర్యం సుబ్బయ్య జీవన క్రమాన్ని మలుపుదిప్పింది. భయం తనకొక్కడికేకాదు, ప్రతి ఒక్కడికి ఉంటుంది. ఆభయం వల్లే, ఆఫీసులో గవరయ్య తనని డబ్బులడగటానికి జంకుతున్నాడు; అనే జీవన సత్యాన్ని సుబ్బయ్య తెలుసుకున్నాక అతని ఆలోచనల్లో పెను మార్పులు చోటు జేసుకున్నాయి. భౌతిక పరిస్థితులను అధ్యయనం చెయ్యటంలో, అర్థంచేసుకుంటంలో మెలకువ ఉంటే జీవితం వెలుగుబాటలో లేకపోయినా, ముళ్ళపొదల్లో కూరుకుపోదు. చీకటి అరల్ని, అడ్డుగోడల్ని కట్టుకోకుండా, సామాజిక అవగాహనను పెంపొందించుకోవాలి. సగం జీవితం గడిచిపోయినా తానేమిటో, తన అస్తిత్వమేమిటో ఎక్కడున్నాడో, ఏం

చేస్తున్నాడో, ఎవరి కోరల్లో ఇరుక్కు పోయాడో; ఊదగాకోరు సమాజంలో ఎలా జీవించాలో, తెలియక తికమకపడి విలవిల్లాడి పోయాడ. సుబ్బయ్య లాంటి ఊగిసలాట వ్యక్తుల జీవితాల్ని వాస్తవికంగా విశదం చెయ్యటం వల్ల సమాజానికి మేలు జరుగుతుంది. తాడేదో, పామేదో తెలుసుకుంటానికి దుర్మార్గుల కొరల్లో ఇరుక్కోకుండా జాగ్రత్త పడటానికి ఈ 'అల్పజీవుల' వృత్తాంతం ఉపయోగపడుతుంది.

సుబ్బయ్య జీవనస్థితి తెలియక సతమతమైపోతుంటే, ఏరోటి దగ్గర ఏరాగంతో జీవన రాగాన్ని మీటాలో తెలుసుకొని గవరయ్యలు, వెంకట్రావులు హాయిగా సుఖంగా బ్రతుకుతున్నారు. ఈనాడు సమాజంలో సుబ్బయ్యలకంటే గవరయ్యలు, వెంకట్రావులు ప్రబలి పోతున్నారు. దోచుకుతింటం, అవినీతి, లంచగొండితనం నిచ్చెన్లతో పైకిఎగబాకటం అధికార, రాజకీయ, అండదండలతో సమాజంపై పట్టు సంపాదించటం తద్వారా నిస్సిగ్గుగా ధన సంపాదన జెయ్యటం వీళ్ళ జీవిత ప్రధాన ధ్యేయం. సిగ్గు, లజ్జ, నీతి, న్యాయం, ధర్మం ఇలాంటి మాటలు వీళ్ళకి చెవిటి వాడి ముందు శంఖం లాంటివి. తాశీల్దారు ఆఫీసులో అటెండరుగా చేరిన గవరయ్య; భార్య తప్పటడుగుని, పణంగా బెట్టి, అన్నీ విడిచిపెట్టి పెద్ద కాంట్రాక్టరుగా కాలు కింద బెట్టకుండా తిరుగుతున్నాడంటే; ఈవాతావరణాన్ని వంటబట్టించుకుంటంవల్లే.

అప్పులతో ఆస్తిధ్వంసమైపోయి, ఐదు వందల రూపాయలకు గూడ బావ సుబ్బయ్యని దేబిరించాల్సి వచ్చినా, దర్జాగా 'అడుక్కొని' ఆ డబ్బుల్తో బావని చిక్కుల్లోకి నెట్టి, తను మాత్రం ఇంట్లో ఉండి కూడ లేదనిపిస్తూ; గవరయ్య విడిచిపెట్టిన మొదటి భార్య రామయ్యమ్మతో కులుకుతూ; ఏమాత్రం మానవత్వపు విలువల్లేకుండా వెంకట్రావు జీవిస్తున్నాడంటే ఈ విషవాతావరణ ప్రభావమే. అందుకనే రావిశాస్త్రి ఈకుహనా వాతావరణాన్ని నిలదీశారు. ఈమేడి పండు సంస్కృతిని బట్టబయలు జేసారు. గవరయ్య, వెంకట్రావు లాంటి అసాంఘిక శక్తుల చేతుల్లో ఇరుక్కోవద్దని; తన తనుభవంతో సాంఘిక అవగాహనతో హెచ్చరిస్తున్నారు. సమాజంలో; దాని చుట్టూతా, అలముకున్న వాతావరణాన్ని సహేతుకంగా విశదం చేసి ప్రజానీకాన్ని వెన్నుతట్టి మేలుకొలిపే రచయితే అభ్యుదయ కాముకుడు.

దేనికైనా "కార్యకారణ సంబంధముంటుందనే సూత్ర బద్ధమైన ఆలోచనలతో సుబ్బయ్యలో గూడ సహేతుక ఆలోచన కలిగి తాను భయపడటం వల్లే లోకమంతా భయపెడుతుందని; గవరయ్య అవినీతి పనులు జెయ్యటం వల్లనే ఆఫీసులో డబ్బులు అడగలేక పోతున్నాడని; వెంకట్రావు మోసం తోటే జీవిస్తున్నాడని-కనుక ప్రతిదానికి ఒకకారణం తద్వారా కార్యం ఉంటుందనే జీవన సత్యాన్ని సుబ్బయ్య ఆలస్యంగానైన గ్రహిస్తాడు. అంటే ఈ సామాజిక అస్తిత్వాన్ని సుబ్బయ్యలాంటి కూపస్త మండూకాలు కాస్త ఆలస్యంగా గ్రహిస్తారనే వాస్తవాన్ని తెలియజేసారు. సుబ్బయ్య ఆలోచనల్లో మార్పుని; అతని అస్తిత్వాన్ని తెలియజేసి, సామాజిక పోకడని వివరించి; అతనిలో చైతన్యాన్ని రగిలింప జెయ్యటం కోసమే మనోరమను సృష్టించింది.

మానవ ప్రవర్తనకు ఎన్నోకారణాలుంటాయని చెప్పిన ఫ్రాయిడ్ ఆలోచనని ఇంకా విస్తృత పరచిన ఆడ్లర్ సూత్రం ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించే మానవ ప్రవృత్తి

ఎదుగుతుందనేది. అంతేకాని ఏప్రయోజనం లేకుండా ఏమానవ ప్రవర్తనారీతి ఉండదు. అంటే ఒక వ్యక్తి యొక్క సత్ప్రవృత్తి, లేక దుష్ప్రవృత్తిని బట్టి వచ్చే ఫలితాలు, ప్రయోజనాలు ఉంటాయి. రావిశాస్త్రి సుబ్బయ్య ప్రవృత్తిలో నవలాంతానికి మంచి మార్పేదీసుకొచ్చారు.

ఆర్థిక పరిస్థితి గూడ సుబ్బయ్యని కుంగదీసింది. వెంకట్రావు జమిందారీ అహం; ఆ వారసత్వానికి ప్రతీకైన భార్య, గవరయ్య నడమంత్రపు సిరి మదం ఆఫీసువారి నిరాదరణలు గూడ సుబ్బయ్య ప్రవర్తనా తీరుని ప్రభావితం చేసాయి. వీటన్నింటిని అధిగమించి చివరికి సుబ్బయ్య జీవితం వెలుగుమయమయ్యింది.

ఈసాంఘిక వాతావరణాన్ని రావిశాస్త్రి విశదం చేసి, నడుస్తున్న సాంఘిక చరిత్రని జాగరుకతతో గమనించి, మంచి చెడులను అంచనా వేసుకొని వ్యక్తి సంఘ శక్తిగా మంచి వైపేపయనించాలని సుబ్బయ్య పాత్ర ద్వారా సూచించటం సముచితంగా ఉంది.

## 2. రాజు-మహిషి

రాజు-మహిషి రావిశాస్త్రి నవలల్లో చాల విలక్షణమైంది. "ఒక నవల మొదటి అధ్యాయం ప్రారంభించే ముందు వివరంగా పథకం వేసుకొనే రచయితలున్నారు."[12] అలా రావిశాస్త్రి పథకం వేసుకొనే ఇరవై రెండు అధ్యాయాల్లో ఈనవలేతి వృత్తాన్ని నడిపించారు. అయినప్పటికీ ఇంకా ఇది అసంపూర్ణ నవలే. కొంత మేరకు ఉపన్యాసాలు, వర్ణనలు అధిక మనిపించినా; నడుస్తున్న సామాజిక జీవన పోకడలను విస్తృతంగా వర్ణించిన నవల. చిన్న చిన్న కథల సమాహారంలాగ సాగింది దీనిలోని ఇతివృత్తం.

స్వార్థం, ధనదాహం, రాజకీయాధికారం కోసం వెంపర్లాటతనం, వీటి స్వభావాన్ని తెలియజేయటం కోసం రావిశాస్త్రి కొన్ని పాత్రల నాశ్రయించి, నవలేతి వృత్తాన్ని నడిపించి, సామాజిక నిజ స్వరూపాన్ని బట్టబయలు జేసారు.

దీనిలో అధిక భాగం కథ మరో దృక్కోణం నుండి చూస్తే ప్రేమ వ్యవహారాన్ని ఆసరా జేసుకొని నడిచింది. ఇంకా రాజకీయాధి కారంతో డబ్బు సంపాదన దృష్టిపై కథ నడిచింది. న్యాయవ్యవస్థ లొసుగుల్ని బహిర్గతం, జేస్తూ; న్యాయ పరిరక్షకులలో గూడ కుల, మతా తత్వాలెలా నుడుస్తాయో, తద్వారా న్యాయస్థానానికి కొచ్చిన వాణ్ని కాటికెలా నడిపిస్తారో రావిశాస్త్రి చూపించారు. ఉద్యోగభద్రత కోసం కప్పదాటుడు నాటకాలెలా కొనసాగుతాయో వివరించారు. అయితే ఇంతటి సామాజిక వక్రగమనంలో గూడ మానవత్వం చావలేదని, మరుగునబడలేదని, మధ్యతరగతి, మందహాసంలో ఇంకా బ్రతికే వుందని గూడ ఆయన ఈనవలా నడకలో పొందు పరచారు. అధ్యాయం, అధ్యాయానికి కథని రకరకాల మలుపులు దిప్పుతూ పాఠకుల్లో ఉత్సాహం, ఉత్సుకతను ప్రేరేపించారు. తన స్వార్థం కోసం, తన బ్రతుకు స్థిరత్వం కోసం; రక్తం పంచుకుపుట్టిన అక్క చావాలని మనసార కోరుకుంటమే గాదు, దేవతలకు కూడ మొక్కుకునే చెల్లి ఉంటుందనే కఠోర సత్యాన్ని రాజమ్మపాత్ర ద్వారా శాస్త్రి తెలియజేసారు. వింటామేగాని రాజమ్మ లాంటావారుగూడ ఉంటారని ఆలోచించం. తన అస్తిత్వం కోసం ఎవరు ఏమైపోయినా పట్టించుకోని జీవితాలు వీరివి. ఈ స్వభావం సమాజానికొక హెచ్చరిక

లాంటిది. అంతటి దుష్ట స్వభావంతో రాజు జీవితంలో ప్రవేశించిన రాజమ్మ అతని ఆర్థిక సామాజిక, జీవన క్రమంలో పెనుమార్పులు కలిగించింది. ఏ సూత్రం మీద సమాజం నడుస్తుందో తెలిసిన రాజమ్మ రకరకాల వ్యాపారాలతో దోపిడి మార్గంలో రాజును ముందుకు నడిపించింది. ఆర్థిక స్థితిలో మార్పు వచ్చిన, రాజమ్మ స్వభావంలో మార్పేమి లేదు, గాబట్టి చిన్న కారణానికే కమ్మలింటి రాజుతో తగువుపెట్టుకొని, అతనిని చితకబాది కోర్టుకెక్కింది. అంటే తన మార్గానికి అడ్డు వచ్చిన వాళ్ళని సహించలేని తత్వం రాజమ్మది.

ఇంకా రంగారావు, పద్మజ ఆస్తికోసం ఆమెపై నకిలీప్రేమ ప్రదర్శించటం, బంట్రోతు కుర్రాడితో శ్యామల ప్రేమాయణం, విశ్వమోహిని ఆమె భర్త మధ్య సాగిన అహంకారం, ప్రేమవృత్తాంతం, మందుల భీముడికి, రాధకి మధ్య సాగిన ప్రేమాయణం, ప్లీడరు ముకుందుడు మరదలితో సాగించిన ప్రేమకథ, చిట్టిబాబుకామ ప్రేమయాత్ర, రాజమ్మ రాజుతో పెళ్ళికాకముందు సాగించిన ప్రేమ జీవితం, బంగారి తన భర్త పోయాక సాగించిన ప్రేమజీవితం, కాలి బూడిదైపోయిన సరస ప్రేమాయణ జీవితం, హెడియా రకరకాల ప్రేమ వ్యవహారం, జిల్లాజడ్జి శ్రీధరరావు చిన్నమామ కూతుర్ని గాకుండ పెద్దమామ కూతురిపెళ్ళి ప్రేమవృత్తాంతం. గిరిజ, ప్రసాద్‌ల స్వచ్ఛమైన ప్రేమ, శాంతమ్మ భర్తతో గడిపిన అన్యోన్య దాంపత్య ప్రేమ జీవితం-ఇలా ఈ నవల కథంతా ఈ ఉపరితలాంశాలపై నడిచినా; వీటికి పునాది స్వార్థం, ధనదాహం, అధికార, రాజకీ ఆకాంక్షలే, కొన్ని మినహాయింపులు తప్ప.

రంగారావు పద్మజని ఆమె డబ్బుని చూసి, ఆమె తండ్రి రాజకీయ అధికారాన్ని జూసి ప్రేమించినట్లు నటించాడు. మందుల భీముడు కాళ్ళ రాధని తన సుఖం కోసం, ఆమె ఆర్థిక వెసులు బాటు తనాన్ని, తన స్వార్థానికి ఉపయోగించు కోవటం కోసం ప్రేమించాడు. జిల్లాజడ్జి శ్రీధరరావు చిన్నమామ కూతుర్ని కాదని పెద్ద మామకూతుర్ని పెళ్ళి జేసుకుంటానికి కారణం, అధికార రాజకీయ ఎదుగుదల కోసం; చినమామ కూతురు వ్యాధితో చనిపోవటం అతనికి ఆమె అడ్డు తొలగినట్లయింది. ఎవరి వల్ల ప్రయోజనం ఉందంటే వాళ్ళ వైపు వొంగే ప్రేమ హెడియాది. భర్త పోయాక జీవితంలో నిలదొక్కుకుంటం కోసం బంగారి చాల మందితో ప్రేమవొలకబోసింది- ఈ ప్రేమంతా గూడ స్వార్థంతో, డబ్బు ఆశతో నడిచిందేగాని ఆత్మీయ మానవ సంబంధాలతో గాదు. ఈతీరుని వాళ్ళ ప్రవర్తనల ద్వారా వాస్తవికంగా వెల్లడిజేసి రావిశాస్త్రి సామాజిక బాధ్యతని గుర్తెరిగిన రచయితగా మిగిలారు.

పద్మజ తనకు దక్కకుండా పోతుందని తెలిసే సరికి ఆమెని చంపాలనేంత కోపం వస్తుంది రంగారావుకి, ఆమెను ప్రేమిస్తున్నాడని తెలిసిన ప్రసాద్‌ని చిక్కుల్లో పడేయాలనే రాజమ్మపై ఉసిగొలిపి, కేసులో ఇరికించింది. దీనికంతకు కారణం పద్మజ వెనకున్న ఆస్తి, ఆమె తండ్రి రాజకీయ వారసత్వం తనకు దక్కకుండా పోతుందనే దుగ్ధ. రంగారావు ఇంతటి స్వార్థ బుద్ధితో ఉంటే, ఆయనకి శిక్షణనిచ్చిన మందుల భీముడెంతటి దుర్మార్గ బుద్ధితో ఉంటాడో ఊహించుకుంటేనే భయమేస్తుంది. "బుర్రలు మార్చే ఇద్యకైనా మనకి డబ్బుండాలిగాని బుర్రుండక్కరలేదు"[13] ఇంతటి దుర్మార్గ స్వభావుడు

గాబట్టే, తన స్టేటస్ పెరిగి కౌన్సిలరైనాక రాధని విడిచి పెట్టటమేగాదు అంతకు ముందే మంగజీవితాన్ని కూడ కాటేసిన కుటిలుడు. అంటే తనకవసరమున్నంత వరకు సంబంధాలు కొనసాగించుకొని తన పబ్బం గడిచాక, ఒడ్డెక్కాక, నట్టేట ముంచే నీచులున్న సమాజంలో వున్నాం గనుక జాగ్రత్తగా మసలుకోమని రావిశాస్త్రి హితవు చెప్తున్నారు.

పెద్ద పెద్ద కబుర్లు చెప్పేవారంతా గూడ, కులాలు, మతాలు వచ్చే సరికి గఫ్‌చిఫ్‌గా ఎవరి దోవనవాళ్ళు వెతుకుతుంటారేగాని, వీసమెత్తైన అటు, ఇటు బెసగరు. పురుషోత్తం గూడ మానవతాదృష్టితో తన బంట్రోతు కుర్రాణ్ణి చదివిస్తాడే గాని, అదే కుర్రాడు తన కుమార్తెని ప్రేమిస్తే సహించలేకపోతాడు అతణ్ణే పెళ్ళి జేసుకుంటానని కూతురు శ్యామల మొరపెట్టుకున్న ఆలకించకపోగా ఆకుర్రాణ్ణి చంపించిన నీచుడు. ఇది వర్ణాన్ని పరిహరించలేని వర్గ సమాజం. కులాల అంతరాన్ని చదువు, సంస్కారంతో తగ్గించలేని సమాజం. ఆర్థిక ఉన్నతత్వంగూడ కులాల మధ్య అడ్డుగా నిలిచే కాలం, చిన్న చిన్న కులాల వాళ్ళని తమ ధన, అధికార, రాజకీయ అండతో అంతం జేసే కాలం. ఈ వృత్తాంతం క్రీస్తుపూర్వానిది కాదు, స్వాతంత్ర్యం సిద్ధించినాక జరిగింది.

వ్యాపార, రాజకీయాధికార సంస్కృతికి అలవాటు బడ్డాక, ఏనైచ్యానికైన సిద్ధపడతారేగాని, వెనుదిరికి చూడటం ఉండదు. ఈవాస్తవాన్ని రావిశాస్త్రి మందుల భీముడు, ఛైర్మన్ భీమసేనరావు; పాత్రల ద్వారా విశదం చేశారు.అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలో ఉద్యోగియైన భీమసేనరావు విశ్వమోహిని సలహాలతో పెద్ద వ్యాపారస్తుడుగా ఎదగటమేగాదు, మున్సిపల్ ఛైర్మన్‌గా స్థిరపడి పోవటం వెనుక ఎన్నో మెట్ల చరిత్ర ఉంది. పచ్చి మోసకారి, స్త్రీలోలుడైన కౌన్సిలర్ భీముడు, రాజకీయపదవితో ఎన్నో దుర్మార్గులు చేస్తాడు. రాజమ్మ లాంటి తనను నమ్మిన వాళ్ళను మోసం చెయ్యటానికి కూడ వెనుకంజవెయ్యడు. ఈవృత్తిలో ఉన్నవారి నుండి నీతి, నిజాయితీ ఆశించటమంటే గొంగళిలో తింటూ వెంట్రుకలు వచ్చాయన్న సామెతగా ఉంటుంది. 'సిగ్గు,లజ్జా' విడిచిపెట్టి, ధన సంపాదన, స్వార్థబుద్ధే ధ్యేయంగా ఎదిగిన పరమ దుర్మార్గుడు భీముడు. ఇలాంటి దుర్మార్గులు తమ బిడ్డల్ని గూడ ఆదోవలోనే ఎదగాలని ఆకాంక్షిస్తారు. అందుకనే రంగారావు పద్మజ వెంటబడింది. ఫ్యాక్టరీలో రామారావుతో స్నేహాన్ని, మానుకొని,దొంగతనం కేసుని మాఫీ చేయించుకొని, యాజమాన్య తొత్తుగా రంగారావు మారింది గూడ, తండ్రి భీముడి వల్లే. ఈస్వభావం ఒక భీముడిలోనో, రంగారావులోనో గాక సమాజమంతా విస్తరించిందని జాగరూకతతో మెలగాలనే హితవుని శాస్త్రి అందించారు.

కండ బలంతో, నోటి దురుసుతో రాజమ్మ, గంగరాజు వాళ్ళ పరివారం కమ్మలింటి రాజుపై తిరగబడి, చితగ్గొట్టి, అతన్ని ఆసుపత్రి పాల్జేయటం గూడ వ్యాపార సంస్కృతిలో భాగమే.

ప్లీడరు ముకుందరావు, చిట్టిబాబు, రంగస్వామి, సూర్యచంద్రరావు , జిల్లాజడ్జి శ్రీధరరావు, మేజిస్ట్రేటుల మధ్య సాగిన గంగరాజు-రాజమ్మల కేసు వ్యవహారం కోర్టుల్లో సాగే న్యాయవ్యవహార లొసుగుల్ని, న్యాయమూర్తులకీ, న్యాయవాదులకీ మధ్య ఉండే రాజకీయాభి ప్రాయ భేదాలు, కుల, శాఖ, వర్గ, ముఠా, భేదాల వల్ల సామాన్యులు నలిగిపోయి, నష్టపోయే విధానాన్నిబట్ట బయలు జేసింది. తమ తెలివి తేటలతో, కుహనా

ఎత్తుగడలతో కేసుల్లో చిక్కుకొని, కోర్టులకొచ్చేవాళ్ళని, ఎలా పీల్చిపిప్పి చేస్తారో గూడ తెలియజేస్తుంది.

నానాటికి మానవ విలువలు దిగజారిపోతున్న సమాజంలో గిరిజ, శాంతమ్మ, భవాని శంకర ప్రసాదు (కమ్మలింటిరాజు) లాంటి మంచి మనుషులు లేకపోలేదు. ప్రసాదు తన ప్రాణాల్ని గూడ లెక్కచెయ్యకుండా; సాన్నిహిత్యం లేని పద్మజని పాముల బారి నుండి రక్షించటం, ఒకసారిపరిచయమైన ప్రసాదుకి, ఇంట్లో డబ్బు ఉండి కూడ తన తల్లి పాతిక రూపాయలు సహాయం చెయ్యకపోవటం వల్ల, అవతలి వ్యక్తి మరణించిన ఉదంతంతో చలించి పోయిన మానవత్వమున్న గిరిజ వృత్తాంతం; ఇంకా మానవత చావని సామాజిక జీవనానికి ఉదాహరణలు. నిండు మానవత్వంతో, కరుణార్ద్రహృదయంతో జీవితాన్ని గడిపిన శాంతమ్మ; సమాజానికి ఆదర్శప్రాయులు.

ఏనాడు సమాజం పరమ దుర్మార్గంగానో ప్రబల కారుణ్యంతోనో నిండి ఉండదు గాబట్టి; ఈ మిశ్రమ జీవితాలు మనకు తారస పడటం సహజత్వమే. ఈ మంచి చెడుల అనుభవాన్ని విశ్లేషించుకొని మంచి మార్గం వైపు మళ్ళటం మానవత్వమున్న వారి లక్షణం.

"కాబట్టి నిజమైన సామాజిక సంబంధాలను వర్ణించటం ద్వారాను, సామాజిక సంబంధాల గురించి ఉన్న భ్రమల్ని ధ్వంసం చెయ్యటం ద్వారాను, బూర్జువా ప్రపంచం యొక్క ఆశావాదాన్ని తల్లకిందులు చెయ్యటం ద్వారాను, ఇప్పుడున్న సామాజిక వ్యవస్థ శాశ్వతం కాగన్న సందేహాన్ని కలిగించటం ద్వారాను ఇప్పుడున్న పాక్షిక సామ్యవాద నవల తన ప్రయోజనాన్ని పూర్తిగా నెరవేర్చుతుంది. రచయిత ఒక నిశ్చితమైన పరిష్కారాన్ని సూచించకపోయినా, ఏదో ఒక పక్షాన్ని పూర్తిగా అంగీకరించకపోయినా కూడ ఈ ఉద్దేశం నెరవేరుతుంది."[14] కనుక జీవితాన్ని వాస్తవికంగా, చారిత్రకంగా చిత్రించటమే రచయిత కర్తవ్యం"[15]గా మనం గుర్తించాలి. ఈ మార్గాన్ని రావిశాస్త్రి తన రచనలన్నింటిలోను అనుసరించారు.

డబ్బుమదం, స్వార్థం, రాజకీయ అధికార జులుం వల్ల మధ్యతరగతి, అట్టడుగుప్రజల జీవితాలు యెలా అర్థంతరంగా నలిగిపోతున్నాయో అన్యోన్యంగా మెలగవలసిన దంపతుల మధ్య అహంకారం వల్ల, సంసారాలెలానాశనమైపోతున్నాయో ప్రేమ, స్నేహం, విశ్వాసాల స్థానంలో కుల, కుటిలత్వం, స్వార్థం యెలా గూడు కట్టుకుంటుందో, వ్యాపార విషసంస్కృతి వల్ల మానవతా విలువలెలా ధ్వంసమైపోతున్నాయో; న్యాయశాస్త్ర తెలివితేటలు, ఎత్తుగడలు వ్యక్తిగత భేషజాల వల్ల సామాన్యులెలా నలిగిపోతారో కూడ ఈనవలా చిత్రణలో విశదం చెయ్యటం జరిగింది. స్వాతంత్ర్యానంతర (1947) సామాజిక వాతావరణాన్ని; విస్తరిస్తున్న అమానవీయ సంస్కృతిని శాస్త్రి ఈ నవలల ద్వారా విశదం జేసారు. మానవ సంబంధాలలో వస్తున్న దిగజారుడు విధానాన్ని ఆయన వాస్తవికంగా చిత్రీకరించారు.

ఉపన్యాస ధోరణిని, వర్ణనాత్మక విధానన్ని కొంచెం తగ్గించి; పద్మజ ఆదివారం కాలేజీకి వెళ్ళినట్లు చెప్పకుండ ఉండవలసింది.

అట్టడుగు జీవితాల నుండి సాంఘిక ఎదుగుదల సూత్రం తెలిసికొని, కొంతమేరస్థిరపడిన వాళ్ళ గురించి, మధ్యతరగతి, ఉన్నత వర్గం వాళ్ళ గురించి,

విశ్లేషించారేగాని, సాధారణ ప్రజల గురించిగాని, అట్టడుగు, శ్రామిక వర్గ పాత్రల గురించిన వర్ణన గాని దీనిలో పెద్దగా లేదు.

## 3. రత్తాలు-రాంబాబు

రత్తాలు-రాంబాబు తెలుగు నవలా సాహిత్యంలో సంచలనం లేపిన నవల. ఇరవయ్యో శతాబ్దపు ప్రారంభంలో (1904 ) పెద్దదుమారం లేపిన అలెగ్జాండర్ కుప్రిన్ నవల 'యామాదిపిట్' (యమకూపం) అంతగా కాదు గాని, పాఠకుల్ని ఆకర్షించి, ఆలోచింపజేసిన నవల 'రత్తాలు-రాంబాబు' అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

దుర్భర దారిద్ర్యానికి, పురుషాహంకారానికి, మోసానికి బలైన స్త్రీల జీవితాలు; సాని కొంప బతుకులు; లంపెన్ వర్గ జీవన సరళి, పోలీస్ వ్యవస్థ నడవడి; ఉన్నత వర్గ జీవన తీరు; రాజకీయాధికార పరోక్ష, ప్రత్యక్ష అండదండల వలన సర్వనాశనమవుతున్న సామాజిక వ్యవస్థ - ఇవి ప్రధానంగా ఈనవలేతి వృత్తంలో విశ్లేషింపబడిన అంశాలు.

అవిద్య, సామాజిక అవగాహనాలోపం; వయసు ప్రభావం, మరియు సామాజిక మోసం; దుష్ట సంస్కృతి ఇవి రత్తాలు సింహాచలం, విషపు కోరల్లో చిక్కుకుంటానికి దారితీసిన పరిస్థితులు; దాదాపు ఈ కారణాలవల్లే ముత్యాలు; సచ్చాలుల జీవితాలుగూడా ధ్వంసమైపోయాయి. అయితే చదువుకొనిగూడ; పురుషాహంకారం నుండి; మోసపూరిత చర్యల నుండి బయటపడలేక; పెళ్ళి కాకుండానే రాంబాబుని కడుపులో మోయవలసి వచ్చింది; అతని తల్లి. గోపాలం తాగుబోతుతనం; తిరుగుబోతుతనం; మోసపూరిత వ్యక్తిత్వం తెలిసిగూడ; అస్వతంత్రత ఇతర అభిమాన కారణాలవలన వంటఇంటి కుందేలు జీవితం నుండి బయటపడలేక పోయింది రాధ. తమకు చేస్తున్న ఆర్థిక సహాయంవల్ల; తండ్రి అదుపాజ్ఞలవల్ల; ఉన్నత విద్యనభ్యసించినప్పటికీ హంతక ప్రవృత్తి; సర్వ అమానవీయ లక్షణాలున్న జోగుల బంధాల నుండి బయటపడలేకపోయింది వసంత. వరాలమ్మ కూతురు సన్నాలు జీవితమూ అంతే. వ్యవసాయం, మార్కెటింగ్ వ్యవస్థ అమలులోనికి వచ్చినప్పటినుండి స్త్రీలపై పురుషాధిక్యం పెరిగిందని డి.డి.కోశాంబి విశదం చేశాడు. బలమైన ఆర్థిక వ్యవస్థతోపాటు, సామాజిక వ్యవస్థగూడ స్త్రీ వ్యక్తిత్వాన్ని నిర్వీర్యం చేసింది. దీనికంతటికి కారణం సామాజిక నిర్మాణ క్రమంలోని, ఎదుగుదలలోని లోపాలే అని రావిశాస్త్రి ఈ నవలద్వారా స్పష్టపరిచారు.

పెట్టుబడిదారీ వ్యవస్థ స్త్రీని ఒక లాభాన్ని సమకూర్చు వస్తువుగా; పిల్లల్ని కనే యంత్రంగా పరిగణించే వాతావరణాన్ని సమకూర్చుకుంది. సింహాచలంలాంటి 'డాకు నా కొడుకులు', 'డాఫర్లు' ఈ సంస్కృతికి ప్రతినిధులు. రత్తాల్ని మాయమాటలతో లేవదీసుకొచ్చి; వెయ్యి రూపాయలకి నరసమ్మకమ్మితే; ఆమె ఆ వెయ్యి పెట్టుబడితో రత్తాలిపై వేలకువేలు సంపాదించవచ్చునని ఆశపడింది. ముత్యాల్ని, సచ్చాల్ని, జలజని, పైడితల్లిని, ఇంకా ఇలా ఎందరో స్త్రీలని రోజూ విలాస పురుషులకు తార్చి; తద్వారా లాభాన్ని సమకూర్చుకుంటుంది నరసమ్మ. అంటే స్త్రీ వ్యాపార సరుకయ్యింది. ఈ వ్యాపారం సక్రమంగా మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్థిల్లటానికి; మధ్యలో ఎలాంటి ఆటంకాలు లేకుండా నడవటానికి; అమ్మాయిల రక్తం పిండి లాభాలు

గుంజుకుంటానికి; నరసమ్మ, షేక్ బంగారప్పలాంటి సానికొంప యజమానురాళ్ళకి, రాజకీయాధి నాయకుల, పెత్తందార్ల, ధనస్వాముల, పోలీసుల, న్యాయవాదుల అండదండలు దండిగా ఉన్నాయనేది వాస్తవం; ఛైర్మన్ తమ్ముడు నరసమ్మ చిక్కుల్లో ఉన్నప్పుడు, పోలీస్ స్టేషన్‌లో చిక్కుబడిపోయినప్పుడు, ఈ వ్యాపారం కుంటుబడకుండా తన పలుకుబడిని ఉపయోగించి, నరసమ్మను కాపాడితే; అందుకు ప్రతిఫలంగా నరసమ్మ అతనికి కావలసినవన్నీ 'మర్యాదల' గదిలో అమర్చి ఆనందపరుస్తుంది. పోలీసు వ్యవస్థనుండి గంగరాజు హెడ్డు; అతని శిష్యుల సహకారం షరా మామూలే.

మరి అటు రాజకీయ వ్యవస్థ, ఇటు పోలీసు యంత్రాంగం; మరోవైపునుండి న్యాయవ్యవస్థ, ఇంకోవైపునుండి విలాసవంతమైన ధనికవర్గం ఈ దుర్మార్గాన్ని, ఈ పరమ ఏహ్యమైన పనిని ఒళ్ళమ్ముకునే దుస్థితిని పరిరక్షిస్తుంటే ఇది ఎలా అరికట్టబడుతుంది? ఈ అమానవీయ కారుమంటల్లో చిక్కుకొని; బయటకు వెళ్ళలేక; చావలేక, బతకలేక, జీవితానికి మరో మార్గం కనపడక; నాఅనే వాళ్ళెవ్వరూలేక; కుమిలి కుమిలి ఏడుస్తూ కుళ్ళిపోతూ, కునారిల్లుతూ నిరాదరణగా బ్రతుకులు ఈడుస్తున్న వీళ్ళేమో పతితలా? కులటలా? వేశ్యలా? చెడిపోయినవాళ్ళా? గుట్టు చప్పుడు కాకుండా ఈ యంత్రాన్ని మొత్తాన్ని రిపేర్లు రాకుండా నాజూకుగా, కాపాడుకొస్తున్న నయవంచకులేమో పెద్దమనుషులా? రాజకీయ నాయకులా? పోలీసు అధికార్లా? న్యాయవాదులా? ధనవంతులా? ఏమిటీ దుర్మార్గం అని ఈ మేకవన్నెపులి సంస్కృతిని, తేనెబూసిన కత్తి వ్యవస్థని వాస్తవిక దృష్టితో నిలదీస్తున్నారు రావిశాస్త్రి.

అసలు స్త్రీలను అమ్ముకొనే సాంప్రదాయం సమాజంలో వ్యాపించినప్పుడు నరసమ్మ కాకపోతే మరో అమ్మ కొంటుంది. ఈ సాంప్రదాయమే దుర్మార్గమైందని శాస్త్రి ప్రశ్నించారు. అలా కొనుబడి సరుకైన స్త్రీలని ఎవరని వివరిద్దాం. 'ఒవుడు గంటకి పదిచ్చి పెళ్ళాడితే ఆడి పెళ్ళాలు వీరు. రోజు వాళ్ళకి ఎన్ని పెళ్ళిళ్ళో, ఎందరు మొగుళ్ళో ఈ నీచ వ్యవహారాన్ని అంతం చెయ్యటానికి "ఒక్కగానొక్క మొగోడు" అయినా వీళ్ళ బంధాలు తెంపటానికి ముందుకు రాలేని విధానాన్ని శాస్త్రి ముత్యాలు ద్వారా ప్రశ్నింపజేశారు. తన సొంత ఆస్తులపై, వస్తువులపై ఎవరికైన స్వయం నిర్ణాయక శక్తి ఉంటుంది. కాని తమ శరీరంపై తమకే హక్కులేని, తమను తామే స్వతంత్రంగా చూసుకోలేని ఈ స్త్రీల దారుణ పరిస్థితులకి కారకులెవరు? వీళ్ళెందుకీ నీచపు గోతుల్లో కుక్కబడ్డారు? అని ప్రశ్నింపజేసి, పాఠకుల్ని ఆలోచింపజేసి; వాళ్ళపై సానుభూతి కలిగేలా చెయ్యటం రావిశాస్త్రి సామర్థ్యానికి నిదర్శనం.

సానికొంపకు బలికాకపోయినా; ఈ క్రమంలోనే అస్వతంత్రంగా; మగాడి మోసానికి, కామానికి, దుష్ట స్వభావానికి బలైపోయారు. రాంబాబు తల్లి, సన్నాలు, మరొకవిధంగా రాధ, వసంతలు, కామందుల ఉంపుడుగత్తెగా, ఒక సామానులా ప్రెసిడెంటుకి జీవితమంతా అంకితమై పోయింది సన్నమ్మ. వీళ్ళంతా ఈ వ్యవస్థాగత దుర్మార్గ చట్టంలో ఇరుక్కుపోయి నలిగిపోతున్నవారు.

ఇక నరసమ్మ, షేక్ బంగారప్పలు, అసలు వ్యక్తులుగానే దుష్ట స్వభావులు, దానికితోడు వ్యవస్థ స్వభావం బాగా తెలిసినవారు. ఈ వ్యవస్థ ఉపరితల శక్తుల సహాయ సహకారాలతోటే వీళ్ళు వ్యభిచారవృత్తిని వ్యాపారంగా నిర్వహించగలుగుతున్నారు.

"ఇక వ్యభిచారం బహిరంగంగాను, విశృంఖలంగాను, పెట్టుబడిదారీ సమాజంలో వ్యాప్తిజెందింది. వ్యభిచారాన్ని, శ్రామికుల కుటుంబరహిత జీవితాన్ని; నిర్మూలిస్తే పెట్టుబడిదారీ కుటుంబం దానంతట అదే మాయమవుతుంది. పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంజేసిన నాడు పెట్టుబడిదారీ కుటుంబమూ ఉండదు; శ్రామికుల కుటుంబ రహిత జీవితమూ ఉండదు, వ్యభిచారమూ ఉండదు"[16] అని ఇప్పటికి వంద సంవత్సరాలకి పూర్వం చెప్పిన అంశం ఈనాటికీ సత్య పరీక్షకు నిలిచింది. ఈ స్త్రీల జీవితాల్ని, వాళ్ళ కుటుంబరహిత బతుకుల్ని, వాళ్ళ వృత్తుల్ని, పరాధీనతని; నిస్సహాయ పరిస్థితిని; రావిశాస్త్రి ఈ దృక్కోణం నుండి పరిశీలించినట్లు ఈ క్రమాన్ని అవగతం చేసుకోవాలి.

రత్తాలి జీవితానికీ; తన తల్లి బ్రతుక్కీ సంబంధముందని, రాంబాబు, ఆమెను ఆ నరకకూపంనుండి విడిపించటానికి వెయ్యి రూపాయల కోసం విశ్వ ప్రయత్నంజేసింది. స్త్రీ కట్టుబానిసత్వం విముక్తి కోసం, అంగట్లో వ్యాపార సరుకుగా అమ్ముడుబోకుండా ఆమె జీవితాన్ని కాపాడటంకోసం;

బంగార్రాజు; అతని మిత్రులు అంగట్లో సరుకుల్లా అమ్మాయిలని బుక్ చేసుకొచ్చి; వాళ్ళతో ఆటబొమ్మలతో ఆడుకున్నట్లూ; వాళ్ళను చిత్రహింసలకి గురిచేసిన దౌష్ట్యాన్ని కళ్ళారా జూసిన రాంబాబుకి స్త్రీలపై జాలి; రత్తాల్ని ఆ నరకకూపం నుండి విడిపించటానికి ప్రయత్నించిందిగూడ ఇందువల్లే. సామాజికంగా వ్యాపించివున్న ఈ దుర్భర పరిస్థితులను సానుభూతితో అవగాహన జేసుకుంటేనే; వాటికి పరిష్కారమార్గం లభించేది.

పెట్టుబడిదారీ ప్రధాన లక్షణాల్లో ఒకటైన డబ్బు పోగుబడే పద్ధతిని; వడ్డీ వ్యాపారాన్నిగూడా రావిశాస్త్రి బహిరంగపరిచారు.

సారాజుల్ని, తార్పుడుగాళ్ళని, బ్రోకర్లని, రిక్షా కార్మికుల్ని; రౌడీలని, కేడీలని; పాత్రలుగా ప్రవేశపెట్టి; వాళ్ళ జీవితాలకి సాహిత్యంలో చోటు కల్పించారు రావిశాస్త్రి. పతనమవుతున్న సామాజిక విలువల్లో వాళ్ళ భాగస్వామ్యముంది గనుక వాళ్ళని చూపించారు. సామాజిక పరిణామక్రమంలో లంపెన్స్ పుట్టుకొచ్చారేగాని లంపెన్‌గానే పుట్టి ఎవరూ పెరగరు. వాళ్ళు అలా తయారు కావటానికి దారితీసిన పరిస్థితుల్ని; వాళ్ళకి తర్ఫీదునిచ్చి దగ్గరుండి వాళ్ళ జీవితాల్నలా మలచిన పెద్దమనుషుల కుటిలత్వం గురించి; ఇక ఆ గానుగెద్దుగాడి నుండి తప్పుకోలేని జీవన సరళిని గురించీ తెలుసుకుంటే వాళ్ళమీద అసహ్యంకంటే జాలివేస్తుంది. ద్వేషంకంటే సానుభూతి కలుగుతుంది. ఆదరణ, అభిమానం వాళ్ళపై పెరుగుతుంది. రాకెట్టో, స్ఫుత్నిక్కో, గళ్ళీపులో మొదలయినవాళ్ళంతా లంపెన్స్‌గా ఎందుకు తయారయ్యారో తెలుస్తుంది. ఈ కోవలోనే అతి దుర్మార్గ స్వభావంతో కలుషిత వాతావరణ నైజాన్ని పసిగట్టి; ఏమాత్రం మానవతా విలువల్లేని; డబ్బుదప్ప మరొకటి కంటికి కనిపించని కసాయి వ్యక్తి సింహాచలం. పావలా డబ్బులికి ప్రాణాలు సైతం తియ్యడానికి వెనుకాడని పచ్చి డాఫర్. వ్యవస్థాగత చక్రం వెంట పరుగులు దీసేవాడేగాని ఏమాత్రం సామాజిక మార్పుకి దోహదపడే వ్యక్తిగాదు; వీడు తప్పనిసరిగా శిక్షింపబడవలసిన వాడేగాని; సంస్కరణకు ఏమాత్రం వీలుపడని వాడని స్పష్టమవుతుంది. 'మొయ్యి'గూడ లంపెన్‌వర్గ జాబితాలోనివాడు.

అయితే అట్టడుగు వర్గంలో పుట్టి; బ్రతుకుబాటలో నరసమ్మ కంపెనీని ఆసరాజేసుకొని బ్రతుకుతున్న అడ్డబుర్ర, కొంగ రిక్షా అతను; రిక్షా జోగులు మానవత్వమున్న మంచి వ్యక్తులు. పెద్దపెద్ద పుస్తకాలు తిరగవెయ్యకుండానే; నిర్మాణాత్మక సామాజిక అవగాహనతో; పాలకవర్గ సంస్కృతిని పసిగట్టి వర్గ దృక్పథాన్ని అలవరచుకోవచ్చునని కొంగ ఉపన్యాసాల ద్వారా తెలుస్తుంది. అలానే బ్రతుకు తెరువు కోసం నరసమ్మ కంపెనీలో పనిజేస్తున్న మానవత్వం మరచిపోలేని పాత్ర అడ్డబుర్ర. తను ఏ వర్గం నుండి వచ్చాడో, ఆ బ్రతుకు నిచ్చెనని తొంగి చూడగల చూపు అలాంటి వ్యక్తుల్లో ఉంటుంది. ఈ అమ్మకం కొనటమనే వ్యాపార సంస్కృతిలో ఏదైనా అమ్ముకోవచ్చుగాని "మడిసి మానవమ్ముకొని మడుసులు బతకటం న్యాయం కాదుగదా" అని నరసమ్మ అమ్మాయిల వ్యాపార వృత్తిని కొంగ నిలదీయటం సబబుగా వుంది. చదువుకున్న వాళ్ళు సామాజిక ఐకమత్యం కోసం గాక ఈ వ్యవస్థని చీలికలు పేలికలు చిన్నాభిన్నం చేస్తున్నారని; అలా కాకుండా అందరూ కలిసి ఈ దోపిడీ దొంగలపై తిరగబడే చైతన్యాన్ని ఐకమత్యాన్ని సాధించాలని, రావిశాస్త్రి కొంగరిక్షా అతని రూపంలో వివరించి; రచయిత సామాజిక వాస్తవికతను విస్తృతంగా వివరించటమేగాదు, ఫలప్రదమైన పరిణామంవైపు ప్రజల్ని మొగ్గేలా చైతన్యపరుస్తున్నారనే విషయాన్ని యధార్థం చేశారు. ముత్యాలు శరీరంకన్న మనసుకి ప్రాముఖ్యతనిచ్చిన రిక్షా జోగులు విశాలహృదయుడు.

పాలకవర్గ తొత్తుగా, కాపలాదారీగా పనిజేసే పోలీసువ్యవస్థ నిజస్వరూపాన్నిగూడా రావిశాస్త్రి స్పష్టపరిచారు. అవినీతిని నియంత్రించి; అన్యాయాన్ని అరికట్టి; దుర్మార్గత్వానికి అడ్డుకట్టవేసి సన్నజీవులకి రక్షణ కల్పించవలసిన రక్షకభట వ్యవస్థే కాటేస్తుంటే? కాపలాదార్లుగా ఉండి మృగతత్వంతో మేకల్ని బలిచేస్తుంటే; ఇంక దానిని అరికట్టేవారు రాజకీయ పాలకులా? అంటే; ఈ రెండు వర్గాలు ఒక తానులోని గుడ్డలే గాబట్టి, అది వట్టి భ్రమే అవుతుంది. గంగరాజు హెడ్డు, సింహాచలం నుండి చిన్నపిల్లని కాపాడి, రక్షణ కోరిన ముసలమ్మ దగ్గర డబ్బులు గుంజటమేంటి? నరసమ్మ కంపెనీకి కొమ్ముకాసి; ఆ వ్యాపారాన్ని చక్కగా నడిపించటం ఏ చట్టం క్రింద కొస్తుంది? వ్యభిచారాన్నరికట్టవలసిన పోలీసుహెడ్డు నరసమ్మతో కంపెనీలో కులుకుతూ; మంచం కిందున్న దొంగ సింహాచలాన్ని పట్టుకోలేక పోవటం అసమర్థత కాదా - కాబట్టి ఇదీ పోలీసు వ్యవస్థ 'తీరూ-తెన్నూ' అని విశదపరిచారు శాస్త్రి.

అయితే ఏయస్పీ శ్యామసుందర్ లాంటి నిజాయితీపరులు ఒయాసిసులాంటి వారు సంపన్న సంస్కృతిలో పెరిగిన కృష్ణ జోగులు (కారు); జోగులు సంపదనాసరా జేసుకొని బ్రతుకుతున్న హనుమంతరావు, ధనస్వామ్య, వ్యాపార సంస్కృతి తెలిసిన బంగార్రాజు, అతని మిత్రవర్గం, వీళ్ళకి పేదప్రజలన్నా, వాళ్ళ సంస్కృతన్నా ఏవగింపు, అసహ్యం. ఆ దృష్టితోనే రత్తాల్ని చాలా చులకనగా జూసి; చివరికి తానే భంగపడ్డాడు కృష్ణ. డబ్బు పారేస్తే ఏ స్త్రీనైనా అనుభవించవచ్చుననే దుర్బుద్ధున్న జోగులు; తనకు ఎదురు తిరిగినవాడు పోలీసు డియ్యస్పీ అయినాసరే డబ్బుతో క్షణంలో ట్రాన్స్‌ఫర్ చేయించగల ధన సంస్కృతికి మారుపేరు.

రాంబాబు కలెక్టరు కావటం; సినిమా ఫక్కీలో ఇతివృత్తాన్ని మలుపులు తిప్పటం; ఉపన్యాసధోరణిలాంటివాటిని పరిహరిస్తే మొత్తంమీద సామాజిక మేడిపండు

వ్యవస్థయొక్క నిజరూపాన్ని సమర్థంగా చిత్రీకరించి; అట్టడుగు, మధ్యతరగతి, ముఖ్యంగా స్త్రీల జీవితాన్ని వారి బాధల్ని; పోలీసు యంత్రాంగాన్ని, లంపెన్‌వర్గాన్ని; ఉన్నతవర్గ సంస్కృతిని, వ్యభిచారవృత్తిని; ధనసంస్కృతిని; మోసమయ జీవితాల నిజరూపాన్ని, రాజకీయధినాయకత్వాన్ని స్పష్టపరచి; పాఠకుల్లో సహేతుక ఆలోచనలు రేకెత్తించారు రావిశాస్త్రి.

## 4. మూడు కథల బంగారం

పేరుకు 'మూడుకథల బంగారమైన; దీనిలో వియత్నాం విమల వృత్తాంతాన్ని కలుపుకొని నాలుగు కథలున్నాయి. చిన్న కథగా ప్రారంభించబడిన వృత్తాంతం 'అదుపుదప్పి' నవలై కూర్చుంది. బంగారం సర్వవస్తువుల వినిమయానికి, విలువకి మూలమైంది. మనిషి సౌందర్యాన్ని ఇనుమడింపజేస్తుంది. గనుక "మనిషి అందం బంగారం" సామాజిక మూల సూత్రమైన ఆర్థిక విధానానికి ముఖ్యమైన బంగారం లోపిస్తే; కరువైతే మానవజీవితం కష్టాలపాలవుతుంది. కష్టకాలంలో వ్యక్తులు; వాళ్ళ వ్యక్తిత్వాలనుబట్టి అసాంఘిక శక్తులుగా మారటానికి అవకాశం ఉంది. ఆ చీకటి జీవితంలో సంపదని పోగేసుకుని క్రమేపి సమాజ ఉపరితలాంశాల్లో ప్రముఖమైన రాజకీయ, చట్ట; తదితర వాటిని తమ చెప్పుచేతల్లో ఉంచుకొని; మొత్తం సమాజాన్ని తమ గుప్పెట్లో పెట్టుకోగల స్థాయిని సంపాదించి, ఈ అసాంఘిక శక్తులే పెద్దమనుషులుగా; పెత్తందార్లుగా, చెలామణి అవుతారు. అంటే ధనం; సంపదని పోగేసుకుంటే; అలాంటివాళ్ళు పూర్వపు; ప్రస్తుతపు చరిత్ర ఏదైనా; ఆ ధనస్వామ్య సంస్కృతితో అంతా కొట్టుకుపోయి, వాళ్ళే మహనీయులు; మహానుభావులవుతారని వ్యంగ్యాత్మకంగా రావిశాస్త్రి ఈ మూడు కథల బంగారం ద్వారా స్పష్టపరిచారు.

చిన్నదేశమైన వియత్నాం తమపై దాడిచేసిన గుత్త పెట్టుబడిదారీ దేశమైన అమెరికాకు మంచి బుద్ధిచెప్పిన స్ఫూర్తితో శాస్త్రి విమలకి; వియత్నాం విమలని సింబాలిక్‌గా పేరుపెట్టారు. సార్థక నామధేయురాలైన విమల "ఈదురు గాలికి ఎర్రజెండా ఎండలో నిలబడ్డట్టు" నిలబడి; వివాహ తంతుకి; కట్న దాహానికి కొత్త నిర్వచనం చెప్పటం ముదావహం.

ఇద్దరక్కల పెళ్ళితో అన్నలు కుటుంబానికి దూరమవటంతో ఆర్థికంగా చితికిపోయిన కుటుంబానికి, తన పెళ్ళి భారం కారాదని, సరళ చిలకల దాసుతో లేచిపోయి; అతని మోసానికి బలైపోతుంది. దాసు తనని పెళ్ళిజేసుకుంటానని మాటిచ్చాకే సరళ అతనితో లేచిపోయినా; అది నెరవేరక ఆత్మహత్య చేసుకుంటుంది. ఆర్థిక దుస్థితి; మోసపుటుచ్చులోకి నెడితే; అది జీవితానికే ఉరితాడైన వాస్తవాన్ని శాస్త్రి వెల్లడిచేశారు.

విమల తండ్రిపేర ఎక్కడో కాస్త ఖరీదుచేసే పొలం ఉందని తెలియగానే, బెల్లంచుట్టూ మూగిన చీమల మూకలా విమల అన్నలు, ఆ ఆస్తికోసం, జన్మనిచ్చిన తండ్రినిగూడ కర్ణం; మున్సబులతో చేరి మోసగించబోయారు పెట్టబడి దారీ సమాజంలోఆస్తి, ధన,వ్యామోహాలేగాని, అనురాగం ఆత్మీయతలు చాల తక్కువని ఒకళ్ళపై ఒకళ్ళు కొట్లాడుకొని, కాట్లాడు కుంటాలే ఉంటాయని తెలియ జెప్పారు. "ఇవాళ నిస్సంకోచంగా ఒకళ్ళకేసిఒకళ్ళు తమ పంజాలనీ, కోరలనీ బాహాటంగా చాటేటు వంటి దోపిడీ దొంగల మధ్య పరస్పర విశ్వాసపు అవకాశాన్ని గురించి మాట్లాడేవాడు

పరమవంచకుడేనా గావాలి; లేదా శుద్ధ అమాయకుడైన గావాలి"[17] కాబట్టి దోపిడీ వ్యవస్థలో పంజాని విసురుతుంది, తల్లిమీదా? తండ్రిమీదా అనే విచక్షణేవుండదు.

విమల కట్నం కోసం అట్టిపెట్టిన డబ్బు ఆమె తల్లి చావుతో కొంత ఖర్చైపోతే; పెళ్ళి వాళ్ళు మొత్తం కట్నమిస్తేగాని పుస్తెకట్టమని భీష్మించుకునే సరికి పీటలమీద పెళ్ళి ఆగిపోతుంది. డబ్బులిచ్చాకే తాళి గడతానన్నపెళ్ళి కొడుకు గూబ గుయ్యి మనిపించింది. ఆతాళి బొట్టు పెళ్లికొడుకు మెడన గట్టి 'తనపెళ్ళంగా' బతకమని విమల శాసించటం; అపూర్వ సంఘటనే అయినా ఆశించదగినది. కట్న పిశాచాలకి ఇలాంటి శాస్తి జరగాల్సిందే. విమల స్వభావంలో అంత తీవ్రత ఉంది. కాబట్టి తన అక్కకి ద్రోహం చేసిన చిలకల దాసుని చెప్పుతో కొట్టింది. తనని మరో పెళ్ళంగా చేసుకుంటానన్న చిన్న బావకి గూడ దాసుకు జరిగిన సత్కారం గురించి చెప్పగలిగింది. ఆస్తి, ధన దాహం మానవ జీవితాన్ని నియంత్రిస్తు, స్వార్థం బలిసి పోవటాన్ని శాస్త్రి విశదం చేసారు.

మొదటి కథలోని బంగారు బాబు స్వభావరీత్యా ఉత్తముడు. మధ్య తరగతి దిగువ వర్గ సంస్కృతి ఉన్న వ్యక్తి. తండ్రి కష్టాల్ని బంగారం ఆదుకున్నప్పుడు అతనికి బంగారం అంటే ఏంటో, తెలిసొచ్చింది. తన తల్లి మరణించినప్పుడు తన అక్కగాజులు అమ్మేసి, తల్లి దహన సంస్కారాలు జరిపించినప్పుడు బంగారం విలువ ఏంటో; సమాజంలోదాని శక్తేమిటో తెలిసొచ్చింది. తన చెల్లిని బంగారం కోసం చిన బావ చంపేసినప్పుడు బంగారుబాబుకి పూర్తిగా బంగారం కథ అర్థమై అతనిని బంగారం దెయ్యంలా పట్టుకొని, మనిషే బంగారపు పిశాచంలా మారిపోతాడు. "We say to day that we are living in an age of transition, "between two worlds:" the lesson of the master is that human life is always in transition"[18]మానవ జీవితం నిరంతర పరిణామ శీలమైంది. గనుక, బంగారుబాబు బంగారంలాంటి జీవితం అతని చెల్లిచావుతో బురదగుంటగా; రొచ్చు గుంటగా మారి, మళ్ళీ అతని భార్య విమల చావుతోగాని జ్ఞానోదయం కాలేదు. బావ మంచి తనం; స్నేహితుడైన కామేశ్వరరావు; వాళ్ళ కుటుంబసభ్యుల ఆదరణ బాబుని మంచిగా నిలిపితే; చెల్లి మరణం; అక్కచావు, బావపిన తల్లి ఈసడింపులు చిన బావ దుర్మార్గం; బావ రెండవ భార్య నిరాదరణ ఇవన్నీ బాబు జీవితాన్ని మార్చివేసాయి. తమ కష్టాలు; సమాజంలో; బంగారం విలువ; ఇవి అతనిని పూర్తిగా మార్చి; ధన సంపాదనే ధ్యేయంగా గల జీవితం వైపు నెట్టాయి. ఆ లక్ష్య సాధనకు ఏది దగ్గర మార్గమైతే దానిని అవలంభించాడు. నీతి నియమాలకి ఆమార్గంలో తావు లేదు.

పచ్చని బంగారుబాబు బంగారుగాడిగా మారిపోయాడు. జీవన అస్తిత్వానికి, ధన సంపాదనకి, అవిచోరీలా, పిక్‌పాకెటింగులా, చీటింగులా, సారావ్యాపారాలా, ముండల కంపెనీలా, దొంగనోట్ల వ్యాపారాలా; బంగారం కొల్ల గొట్టటాలా ఒకటేంటి ఏదిబడితే అది చేసాడు. సమాజ పోకడని ముఖ్యంగా వ్యవస్థాగత లొసుగుల్ని బట్టుకొని; దొడ్డిదోవ సుఖంగా సునాయాసంగా ఉంటుందని గమనించాడు.

సినీ భ్రమకు లోనుజేసి అమ్మల్ని లేవ దీసుకొచ్చి ఆమె బంగారాన్ని కాజేస్తాడు. సిత్తర్లేఖ,సిలకముక్కు, సత్తరకాయతో గలిసి దొంగతనం జెయ్యటంలో, గంగాభవానితో

సారా, సాని వ్యవహారం నిర్వహించటంలో, నారాయుడు; నాయుడితో గలిసి దొంగ నోట్ల వ్యాపారం చెయ్యటంలోబంగారిగాడికి పోలీసుశాఖకి పూర్తి సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. ఈలొసుగుల్ని అరికట్టవలసిన పోలీసు వారు వీటిని దగ్గరుండి సజావుగా నడిపించి తమ వాట తాము హాయిగా పుచ్చుకుంటున్నారనే వాస్తవాన్ని శాస్త్రి బట్ట బయలు చేసారు. పోలీసులంటే పాలక వర్గ భాగ స్వామ్య లేగనుక మొత్తం పాలక వర్గం ఈదుష్ట సంస్కృతిని పోషిస్తుందనే కీలక అంశాన్ని శాస్త్రి వాస్తవికంగా విశ్లేషించారు. 'సుర్రావు హెడ్డు'ని పోలీసు శాఖకు ప్రతినిధిగా చిత్రీకరించారు. రాజకీయనాయకులంతా దొంగనోట్ల వ్యాపార భాగస్వాములేననటానికి చింతపాలెం ప్రెసిడెంట్ ఉదాహరణ.పైకి మాత్రం రకరకాల ముసుగులతో కనిపించినా వ్యవస్థ స్వరూపం దోపిడీ; దుర్మార్గత్వం అనే సత్యాన్ని నిరూపిస్తుంది. మనిషి లంపెన్‌గా మారటానికి చుట్టూతా అలముకొని ఉన్న ఈవిష సంస్కృతి కారణం. సారావ్యాపారం అట్టడుగు మధ్యతరగతిని నాశనం జేస్తుంటే దొంగనోట్ల వ్యాపారం బైరాగి నాయుడు లాంటి అతి సామాన్య పేద వర్గాలని ప్రలోభపెట్టి హతమారుస్తుందనే నిజాన్ని శాస్త్రిదీనిలో నిరూపించారు. ఈపెట్టబడిదారీ, వ్యాపార సంస్కృతి రకరకాల రూపాల్లో దర్శనమిస్తూ, సమాజాన్ని పతనం అంచుల్లోకి తీసుకు వెళతానికి ఎందరో బంగారు గాళ్ళు అవతారాలెత్తుతారు. అయితే బంగారిగాడిలో 'బైరాగి నాయుణ్ణి' మోసగించిన ఉదంతం, అతని పూర్వ చరిత్రని గుర్తుకుదెస్తుంది. తనుఎందుకిలా దుర్మార్గ జీవితానికి అలవాటుబడ్డాననే పరివర్తన అతనిలో గలుగుతుంది. బాబుకి అతని పూర్వపు జీవిత వాసనలు అతనిని వెన్నంటే ఉంటాయి. ఊగిసలాట వ్యక్తిత్వం వల్ల దైవదర్శనం కోసం తిరుపతి వెళ్తూ గూడ రైల్లో పెద్దబంగారాన్ని కాజేసి బంగారిగాడు బంగారయ్యగా అవతార మెత్తుతాడు. "మనిసి కష్టం బంగారం మనిసి దోపిడీ బంగారం'' అని బంగారి గాడికి, అవగతమవుతుంది.

బంగారయ్యకి, అతని బావ రామచంద్రయ్యని ఆసుపత్రిలోచేర్చటం వల్ల విమలతో పరిచయమవుతుంది. విమల పెళ్ళిరాముల వారి గుళ్ళో విఫలమైనపుడు పకోడీలు తింటూ అక్కడున్న కడవలూరి వీర వెంకట సత్యనారాయణమూర్తను బంగారుబాబు, బంగారిగాడిగా, బంగారయ్యగా అవతార మెత్తినట్లు తరువాత విమలకు అవగతమవుతుంది. సారా రెంటరుగా సంపాదించిన పిచ్చిడబ్బుతో దేన్నైనా కొనొచ్చని, డబ్బు పారేసి స్త్రీ సుఖాన్ని అనుభవించవచ్చుననే బంగారయ్య అభిప్రాయాన్ని విమల తల్లక్రిందులు చెయ్యటం, అతనికి చెంపపెట్టులాంటిది. ధనాల వజ్రం ద్వారా అన్ని వివరాలు సేకరించి, ఒక సినిమా సీను జరిపించి బంగారయ్య విమలకి దగ్గరై, మొదటిసారి విమల పెళ్ళి ఆగిపోయిన రాముల వారి గుళ్ళోనే బంగారయ్య విమలని పెళ్లిజేసుకుంటాడు. సినిమాలోలాగా విమలని రంగాకింగు వాళ్ళు అపహరించటానికి ప్రయత్నించటం బంగారయ్య రక్షించటం, ఈసన్నివేశం చౌకబారు పద్ధతి, రావిశాస్త్రి నవలల స్థాయికి తగినది కాదు.

నేనుసారా తాగుతానంటేనే నీకు బాధగా ఉంటుంది. కాని నీ సారా వ్యాపారంతో లక్షలాది కుంటుంబాలు నాశనమవుతుంటే నీకు చీమకుట్టినట్లైన వుండటం లేదుకదా! కాబట్టి సారా వ్యాపారం మానమని బంగారయ్యని సారా వ్యాపారం నుండి తప్పించటానికి

విమల ప్రయత్నించటం మహిళా చైతన్యానికి నిదర్శనం. అయితే వ్యాపారంలో ఆరితేరిన బంగారయ్యకి చాలా దారులున్నాయని విమలకి ఆలస్యంగా తెలుస్తుంది.

ఏ వ్యక్తికైనా అతని అంతరాత్మ అతని చర్యలకి సాక్షి. బంగారయ్య తను బంగారిగాడిగా ఎందరిగో అపకారాలు చేసాడు. ఎన్నో దుర్మార్గాలకు ఒడిగట్టాడు. అవన్నీ తలచుకొని అతను విపరీతంగా చలించిపోవటం శుభపరిణామం. అతను భ్రమల నుండి క్రమేపి మంచి వైపు మరలుతున్నాడనటానికి నిదర్శనం ఈమార్పే. విమల వద్దంటున్నా వినకుండా అతను ఆమె అన్నలకి ధన సహాయం చెయ్యటం గూడ. దొంగతనానికొచ్చిన దూది పులి కొడుకుని కొట్టేప్పుడు గూడ బాధపడి, అతణ్ణి కొట్టే అర్హత తనకు లేదని వివరించి, "నేను పదహారణాల దొంగని విమల" అని తన కల్మషాల్ని కడిగేసుకున్న మనసుతో బంగారయ్య విమలకి చెప్పటం గూడ అతనిలోని మార్పుకు సంకేతం.

విమల దేవాలయం మెట్లపై బంగారానికి బలైపోయినప్పుడు బంగారయ్యలో వున్న భ్రమ (illusion) దానిని పూర్తిగా స్వాధీన పరచుకొని దాని వలన కలిగే అనర్థాలని గూడ అనుభవించిన తరువాత వదలిపోయి వాస్తవాన్ని (Realilty) గ్రహించగల్గుతాడు. చెల్లి చావు 'బంగారం' జీవితాన్ని పూర్తిగా మార్చి, సమాజంపై కసి, పగ, ద్వేషం, మోసాన్ని దోపిడీని పెంచితే, భార్య విమల మరణం అతనిలో పరివర్తనని, సామాజిక బాధ్యతని పెంచింది. ఎక్కడో జీవిత పొరల అడుగున దాగిన మానవత్వాన్ని మళ్ళీమేలుకొలిపింది. పతనమైన మనిషిలో జీవితానుభవం, సామాజిక అవగాహన; లోకం పోకడలు పరివర్తనను గలిగించి; మళ్ళీ మంచి మనిషిని జేస్తాయంటానికి బంగారయ్యజీవితమే నిదర్శనం.

పెట్టుబడిదారీ సమాజంలో డబ్బు దాని విషసంస్కృతి వేళ్ళూనుకొని వెర్రితలలు వేస్తుంది. రాజ్యాంగ యంత్రాంగం పాలక వర్గమంతా దానికొమ్ము కాస్తుంది. ఆ వ్యవస్థ మూలస్థంభాలైన బంగారయ్యలు ఎదురులేకుండా ఎదుగుతూ, బంగారిగాళ్ళను తయారు జేస్తూ సాధారణ ప్రజాజీవితాలను ఛిన్నాభిన్నం చేస్తుంటారు. ధనస్వామ్య, వ్యాపార సంస్కృతి వెర్రితలలు వేసి సామాజిక జీవనాన్ని అతలాకుతలం జేసి ప్రజాజీవితాలని ధ్వంసం జేస్తుందని రావిశాస్త్రి విశదం చేశారు. అయితే విమల లాంటివారు ఈ వ్యవస్థని సరిదిద్దటానికి పూనుకుంటారని కూడ శాస్త్రి సూచించారు.

మానవులు పరాయీకరణ చెంది పనిముట్లుగా మారి సంపాదనే ధ్యేయంగా వాటిని పోగుజేసుకుంటూ అకృత్యాలతో సంపాదించిన సంపదతో గౌరవాన్ని కొనుక్కుంటున్న దారుణ పరిస్థితి అంతమై మానవత్వం మనిషిలో మేల్కొనాలని రావిశాస్త్రి ఈ నవల ద్వారా సూచించారు. బంగారయ్య ఐదు సంవత్సరాల జైలు శిక్ష అనుభవించి విడుదలైనాక బైరాగి నాయుడితో కలిసి సామాజిక మేలుకి బెయలుదేరింది గూడ దీనిలో భాగమే.

## 5. ఇల్లు

పరుల సంపదల్ని ఆస్తిపాస్తుల్ని అతిసునాయాసంగా కాజేసి ఏమాత్రం కష్టపడకుండా, ఇటుపుల్లతీసి అటుపెట్టకుండా రాత్రికి రాత్రే కోటీశ్వరులుగా చెలామణి కావాలనే వ్యాపార దుష్ట సంప్రదాయం ఈనాడు సమాజంలో విస్తృతంగా వ్యాపించింది. సోమయాజులు, గవర్రాజు, మనోహరం, సూరిబాబు, చిట్టిబాబులు ఈవిషనాగు సంస్కృతికి అనలు కొనలుసాగిన విషవృక్షాలు.

ధన పిశాచ స్వభావమున్న అనంతంలో కొన్ని 'అల్పజీవి' సుబ్బయ్య లక్షణాలు కూడ ఉన్నాయి. స్త్రీ వ్యామోహత్వం భార్యని చూసి భయపడటం, లాంటివి. ఆరుగాదు, అరవై సంవత్సరాలైన పైసా అద్దె పెంచకుండా చిట్టెమ్మ ఇంట్లోనే మకాం వేద్దామనే ఆలోచనున్న పరమపిసినారి అనంతం. పరుల సొమ్ము తేరగా మనకుపయోగపడాలి. మనది మాత్రం పైసా గూడ పోగూడదనేలోభి. పై సంపాదన వల్లే ఉద్యోగం నుండి సస్పెండవుతాడు. ధర్మాసుపత్రులు అధర్మాలకి, అన్యాయాలకి; లంచాలకి నిలయంగా వున్నాయనే వాస్తవాన్ని గూడ రావిశాస్త్రి అనంతం ద్వారా తెలియజేసారు.

చిట్టెమ్మ మీద; ఆమె ఆస్తిమీద కన్ను వేసిన 'లుచ్చాల్లోలుచ్చా' అయిన కౌన్సిలర్ సోమయాజులు 'వెలనాటి వేరు పురుగు' నక్కజిత్తులకి, నయవంచనకి మారుపేరు. మనుషుల విశ్వాసాన్ని, నమ్మకాన్ని కాటేసే కాలనాగులుంటారు, జాగ్రత్త పడండని శాస్త్రి సోమయాజుల పాత్ర చిత్రీకరణ ద్వారా సూచించారు. సోమయాజులు ధనాశని, భ్రమల్ని చిట్టెమ్మకు కలిగించి తన ఇంటికి నెలకి నూటయాభై అద్దె ఇవ్వాలని ఇల్లు ఖాళీ చెయ్యాలని చిట్టెమ్మ చేత, అనంతానికి కోర్టు నోటీసిప్పించి , చిచ్చు లేపిన చుప్పనాతి పరుడు. అన్యోన్యంగా మెలిగే వారి మధ్య అగ్నిమంటలు లేపే దుర్మార్గులెలా ఉంటారో తెలుసుకుంటానికి సోమయాజులు నిదర్శనం. 'అన్నయ్యా' అని పిలిచే చిట్టెమ్మని కాముకత్వంతో కాటేసే కాలనాగు, ఇతను నమ్మించి గొంతులు కోసే కసాయి మనసున్నవాడు గనుక, చిట్టెమ్మని వశరచుకొని, రెండు వేలు అప్పు బెట్టి; ఆ ప్రోనోటుని ఇరవై రెండు వేలుగా మార్చి నమ్మకంతో చిట్టెమ్మ చేత దస్తావేజుల మీద ఇతర కాయితాల మీద సంతకం చేయించుకొని ఆమెజుట్టు తన చేత లంకించుకున్న దుర్మార్గుడు, అతి నమ్మకంగా ఉండటం వల్ల, ఆలోచించకుండా ఏకాయితంపై బడితే ఆకాయితంపై సంతకాలు బెట్టటం వల్ల ఎన్ని అనర్థాలు వస్తాయో రావిశాస్త్రి 'ఇల్లు' వృత్తాంతంలో విశదంచేశారు. ఫోర్జరీలు, దొంగనోట్లు ముద్రిస్తున్న వ్యవస్థల, మేకవన్నె పులులపట్ల జాగరుకతతో మెలగకపోతే చిట్టెమ్మలా కష్టాలుకొని తెచ్చుకొవలసి వస్తుంది.

కుటుంబం గడవటం కష్టమని, వచ్చే ఆదాయం తరిగి పోతుందని, కన్న కూతురు పెద్దికి పెళ్ళి సంబంధాలు కుదరకుండా జేసే కుటిలాత్ముడు అనంతం, లోకంలో ఇలాంటి తండ్రులున్నారంటే ఆర్థిక దుస్థితా? స్వభాంలో వామనత్వమా? సభ్యసమాజం ఆలోచించాలి. ముష్టికుష్టి రోగికి పైసా విదల్చకపోగా వాణ్ణే డబ్బులడిగే 'ధర్మాత్ముడు' తన భర్తని శాంతమ్మ అనంతాన్ని గురించి వివరించటం, అతని స్వభావనికి అద్దం పడతుంది. ఈ పరమ లోభితనమే ప్లీడరు గుమస్తా సూరిబాబు ఇతణ్ణి మోసగించటానికి సిద్ధపడిన కారణాల్లో ఒకటి. సోమయాజులు మోసకారి, దురాశపరుడైతే ఇతను తన సొంతానికి గూడ పైసావిదిల్చని పిసినారి. పిసినారి తనాన్ని దాని వలన కలిగే అనిర్థాలని తెలుసుకుంటానికి ఈఅనంతం ఒక్కడుచాలు.

పోలీసు, న్యాయవ్యవస్థలు రావిశాస్త్రి నవలలన్నింటా పరచుకొని ఉంటాయి. న్యాయవాదులు, వాళ్ళ గుమస్తాలు, చిన్న చిన్న లొసుగుల్ని ఆసరా జేసుకొని ఎన్నెన్ని ఘాతుకాలు జేస్తారో, తత్ఫలితంగా ఎంతటి ఘోరాలు జరుగుతాయో వాస్తవిక దృష్టితో

శాస్త్రి తెలియజేసారు. సోమయాజులు బెట్టిన చిన్నపాటి డబ్బుఎరకి మందు వ్యసనానికి, లొంగి సూరిబాబు ఉన్న పళాన అనంతం ఇల్లు ఖాళీ చెయ్యవలసిన కోర్టు ఆర్డర్లు వచ్చేలా చేసిన కుయుక్తిపరుడు న్యాయ వ్యవస్థ చుట్టూతా మూగిన చీకటిని ఈవ్యవహారం ద్వారా గమనించవచ్చు.

అయితే మూర్ఖంగా కనిపించినప్పటికీ, ఇల్లు ఖాళీ చెయ్యించటానికి వచ్చిన బేటామీను వాళ్ళను శాంతమ్మ 'లంజకొడకల్లారా' అని సంబోధించి రోకలితో తిరగబడటం మహిళా చైతన్యానికి నిదర్శనం.

వ్యాపార సంస్కృతిలో పడిపోయిన మనోహరం పెట్టుబడి దారీ వ్యవస్థ లక్షణాల్ని బాగా జీర్ణించుకున్న వ్యక్తి. కాసుల కోసం కన్నవాళ్ళకి దూరమై అమెరికా కల్పవృక్షాన్ని కావిలించుకున్న ధనదాహపరులకుగోపికా మనోహరం కుటుంబం ఒక ఉదాహరణ. అమెరికాలో స్థిరపడ్డ కూతురు, అల్లుడు ఉన్నారు. అమెరికా నుండి స్వదేశం రాబోతున్న , కొడుకు పరిశ్రమల స్థాపన కోసం వందలాది ఎకరాల పొలాలు, స్థలాలు కొనటం మనోహరం వ్యాపార సంస్కృతికి నిదర్శనం. గత రెండు దశాబ్దాలుగా విస్తరించిన స్థలాల (Plots) వ్యాపారం, అపార్టుమెంట్స్ సంస్కృతి, భూమిని వ్యాపార వస్తువుగా మార్చి వట్టినే కాలడ్డం బెట్టి, అతి తక్కువ కాలంలోపెట్టిన పెట్టుబడి రెండింతలు, మూడింతలు కావాలని ఆశించే దురాశకు, వాయిదాల పద్ధతిపై స్థలాలపై పెట్టుబడి పెట్టిన వారి డబ్బుతోనే స్థలాలు, పొలాలు కొని అదిక లాభాలు గుంజే స్థలాలవ్యాపారస్తుల సంస్కృతికి జీవనాధారమైన భూమి బిజినెస్ వస్తువుగా (Commodity) పరివర్తన చెందిన క్రమాన్ని గమనింపవచ్చు. అందుకనే చిట్టెమ్మ ఇంటిని లక్షకైనా కొంటానికి మనోహరం సిద్ధపడతాడు. స్థలాల, ఇళ్ళ, క్రయవిక్రయాల్లో పర్సంటేజీలు, వేలకు వేలు మార్జన్లు పొందే బ్రోకర్సుకు ప్రతినిధిగా గవర్రాజునుపరిగణించవచ్చు. ఆదృష్టితోనే లక్షకు పైన వచ్చిన బేరంపై చిట్టెమ్మను గవర్రాజు వాటా అడుగుతాడు. కోస్తా ప్రాంతంలో ముఖ్యంగా సాగుతున్న ఈస్థలాల ఇళ్ళ వ్యాపార ధోరణిని రావిశాస్త్రి చిట్మెమ్మ ఇంటి వ్యవహారంతో బహిర్గతం చేస్తారు.

చిట్టెమ్మ ఇంటిని ఎలాగైనా కాజేయాలని, ఆ ఇంటితో ఎక్కువ లాభాలను గుంజాలని సోమయాజులు, మనోహరం చిట్టెమ్మ ఇంటిని బేరం చేస్తున్నాడని తెలిసి, ఇక తన మోసపు విశ్వరూపాన్ని చిట్టెమ్మకు కోర్టునోటీసు రూపంలో చూపించి, చిట్టెమ్మను మూర్ఛబోయేలా చేసాడు. దగా కోరు రాజకీయానుభవం, కోర్టు పక్షుల పరిచయాలు, నక్కజిత్తుల ఎత్తుగడలు సోమయాజులకి బాగా తెలుసు ఇరవై రెండు వేలు చిట్టెమ్మ తన దగ్గర అడ్వాన్సుగా తీసుకొని డెబ్భై అయిదువేలకు తనకు ఇల్లు అమ్మినట్లు మిగిలిన డబ్బు తీసుకొని ఆ ఇంటిని రిజిస్టరు చెయ్యవలసిందిగా సోమయాజులు నోటీసును చిట్టెమ్మకే కాదు మనోహరానికి కూడా పంపించటంతో, ఈలోకపు మోసం, గోముఖ వ్యాఘ్ర స్వభావం పరపీడనా నీతిని శాస్త్రి వెల్లడి జేసినట్లైంది.

ఉదయం ఇది దొంగల రాజ్యం అని చెప్పి నక్సలైట్లతో కలసిపోయాడు. అతని దగ్గర నుండి అప్పుడప్పుడు బి.సుందరమ్మ ఉరఫ్ చిట్టెమ్మ పేరుతో తన తమ్ముడు

అరుణ ప్రకాశం కోసం లెటర్సు వస్తుంటాయి దీనిని గమనించిన సోమయాజులు, ఉదయం కోసం వెతుకుతున్న పోలీసులకి, తనకు మిత్రుడైన పోలీసాఫీసర్‌కి చిట్టిబాబుకి, ఉదయం చిట్టెమ్మకి రాసిన అతిముఖ్యమైన ఉత్తరాన్ని అందించి, అందుకు ప్రతిఫలంగా చిట్టెమ్మ ఇంటిని తనకు రిజిష్టరు అయ్యేలా చెయ్యమని కోరతాడు.

ఉదయం వాళ్ళు రాసిన ఉత్తరంలో ముఖ్యమంత్రిని అంతంచెయ్యటానికి పథకం ఉంటుంది. ఈలేఖ ఉదంతం పోలీసుల పాశవికత్వాన్ని ఋజువు జేస్తుంది. చిట్టిబాబు ఆర్డర్స్‌తో చిట్టెమ్మ రోజుల తరబడి నిర్బంధించబడి, వాళ్ళ హింసకు గురవుతుంది. చిట్టిబాబు చాకచక్యంతో ముఖ్యమంత్రిని ఆ ఆపదనుండి కాపాడటం కోసం ఇద్దరు తీవ్రవాదుల్ని బలిపెట్టి తద్వారా పదోన్నతి పొందుతాడు. సామయాజులకి గూడసున్నం బెట్టి; చిట్టెమ్మ ఇంటిని సో.మ.న ఎంటర్ ప్రైజెస్ పేర కాజేస్తాడు ఆతిని అధికారాన్ని, ధనాన్ని, రాజకీయ అండని ఆసరాజేసుకొని, చిట్టిబాబు ఈస్థాయికి ఎదగగలిగాడు. పోలీసు శాఖలో అంతర్గతంగా ఉన్న తప్పులతడకల విధానాన్ని, అశ్రిత పక్షపాత, రాజకీయదొరల అండతో ఉన్నత పదవులకి ఎగబాకే విధానాన్ని గూడ శాస్త్రి తూర్పారబట్టారు. చిట్టెమ్మ పొలాన్ని సాగు జేసుకుంటున్న రైతులకే తక్కువ ధరకు ఇద్దామనుకుంటం, మధ్యతరగతి దిగువ వర్గంలో ఇంకా మానవత్వం చావలేదని, మంచితనం కనుమరుగవ్వలేదని తెలియజెయ్యటానికే రావిశాస్త్రి చిట్మెమ్మని చిత్రీకరించారు. ఇల్లు అమ్మగా వచ్చిన లక్షరూపాయల్ని చిట్టెమ్మ అరుణ పేర బ్యాంక్ చెక్ తీసుకుంటం గూడ దీనిలో భాగమె.

తీవ్రవాదుల కిడ్నాప్ వ్యవహారాన్ని గూడ శాస్త్రి 'ఇల్లు'లో దర్శింపజేసారు. అనంతం కూతురు జ్యోతిర్మయి, అరుణ ప్రకాశం ప్రేమించుకున్నారు. పోలీసుల కిరాతానికి తీవ్రవాదులు బలైన రోజునే రాయవెల్లూరులో అనారోగ్యంతో బాధపడుతున్న ఉదయం, అరుణల తల్లి వెంకటలక్ష్మి మరణిస్తుంది. కాని అరుణ ద్రోహం వల్లే తీవ్రవాదులు మరణించారని అనుమానించిన ఉదయం, అరుణని అతని భార్య జ్యోర్మయిని కిడ్నాప్ జేసి అడవుల్లోకి తీసుకువెళతారు. నిజం తెలుసుకున్నాక వాళ్ళను విడిపిస్తారు. కిడ్నాప్‌లు ఎక్కువ భాగం అమానుష వాతావరణంలో అనుమానాస్పదంగా జరుగుతున్నాయనేది వాస్తవం. అందుకే రావిశాస్త్రి ఈ అరణ్యంలో గూడ తినడం, తినబడటం, ఉందని మేకలు, పులులున్నాయని, సూచించారు. తీవ్రవాద ఉద్యమాన్ని నెత్తినెక్కించుకోవాల్సిన పనిగాని, కాల రాయాల్సిన పనిగాని లేదు. అలాజేస్తే అది మాసిపోయేది గాదు. ఏభూమికపై, ఎలా నడుస్తుందో ఎలాంటి తప్పిదాలు చేస్తుందో తెలియజెప్పటానికే ఇలా సూచించారు. తప్పిదాలతోపాటు సామాజికంగా మేలు గూడ ఈ ఉద్యమాల వల్ల జరుగుతుందనేది యధార్థం. సమాజంలో నానుడిగా వ్యాపించిన కులాల శాఖల ప్రస్తావనను'ఇల్లు''లో తీసుకురావటం, రావిశాస్త్రి ఇతరనవలల్లో అంతగా కనిపించని ఒక నూతనాంశం. అయితే కులాల, శాఖల ప్రస్తావన అంత అవసరమా? అనేది చర్చనీయాంశం.

"పరుల కష్టాన్ని దోచుకొని, పరద్రవ్యాన్ని కాజేసే పరమ దుర్మార్గులు ఎంత మంది ఎలా వుంటారో"[19] తెలియ జెయ్యటానికే శాస్త్రి 'ఇల్లు'ని చిత్రీకరించారు. వ్యాపార ధన సంస్కృతి, ఈ పెట్టుబడి దారీ యుగంలో. ఎంత క్రూరంగా విస్తరించి, ఆత్మీయతల్ని, విశ్వాసాలని కాటేస్తుందో, సంపద సమార్జన కోసం ఎన్నెన్ని కుయుక్తులు పన్నుతుందో తెలియజెయ్యటానికి ; తద్వారా జాగరుకతతో మెలగమని సమాజాన్ని హెచ్చరించటం కోసం రావిశాస్త్రి 'ఇల్లు' కట్టారు.

మధ్యతరగతి వ్యక్తుల జీవన వాస్తవిక పరిస్థితులను 'అల్పజీవి,'ఇల్లు' ద్వారా వ్యక్తపరచి, అవకాశమొస్తే, పరిస్థితులు అనుకూలిస్తే వీళ్ళు మంచి వైపే పయనిస్తారనే ఆలోచనకు చిట్టెమ్మ, చివరలోసుబ్బయ్యపాత్రల ద్వారా తెలియజేసారు. ధన ప్రభావం, దాని వలన వైయక్తిక, సామాజిక జీవితాల్లో కలిగే పరిణామాలు, దుష్ఫలితాలు అమానవీయ సంస్కృతి క్రమేపి వ్యాపిస్తున్న విధానాన్ని శాస్త్రి 'రాజు-మహిషి' 'మూడు కథల బంగారం' నవలల ద్వారా వాస్తవికంగా వెల్లడి జేసారు.

స్త్రీల బతుకులు సామాజిక దుస్థితి వల్ల ఎలా మాడి మసై పోతున్నాయో వ్యభిచార గృహాల విషపు కోరల్లో ఇరుక్కున్న విరిబోణులు, నిర్బంధలైంగిక చర్యలకు తలొగ్గవలసిన తీరు, పోలీసు, రాజకీయ, న్యాయ వ్యవస్థలు సామాజిక దుస్థితిని దురన్యాయాన్ని అసాంఘిక వాతావరణాన్ని ఎలా పెంచి పోషిస్తున్నాయో రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు' ద్వారా విశదం జేసారు. అడ్డబుర్ర, కొంగ, ముత్యాలు, రత్తాలులాంటి అట్టడుగు జీవితాల్లోని మానవత్వాన్ని సమాజానికి ఎరుకపరిచారు. సామాజిక వాస్తవికతకు నిలువుటద్దాలు ఈ నవలలు.

# 5. మార్క్సిస్ట్ దృక్పథం

ఇరవయ్యో శతాబ్దంలో మానవజాతికి లభించిన మహత్తర సిద్ధాంతం మార్క్సిజమ్. ప్రాపంచిక అవగాహనను విస్తృత పరిచేది మార్క్సిజమ్. "మార్క్సిజమ్‌లో తత్వశాస్త్రం, రాజకీయ అర్థశాస్త్రం, శాస్త్రీయ సోషలిజం అనే మూడు విభాగాలున్నాయి. గతితార్కిక, చారిత్రక భౌతిక వాద తత్వశాస్త్రమే యావత్తు మార్క్సిజానికి పునాది"[1] గతి తార్కిక భౌతిక వాద దృక్పథం "జరుగుతున్న ప్రతి విషయానికి కార్యకారణ సంబంధం చెపుతుంది. పదార్థాన్ని ప్రాతిపదికగా తీసుకునేది గతి తార్కిక భౌతికవాదం"[2] గతి తార్కి భౌలిక వాదాన్ని చరిత్రకన్వయించి విశ్లేషించుకుంటమే గతి తార్కిక చారిత్రక భౌలిక వాద దృక్పథమవుతుంది.

"మానవ సమాజం యొక్క గత చరిత్ర అంతా వర్గవైషమ్యాల తీవ్రత మీద ఆధారపడుతూ వచ్చింది. ఈ వైషమ్యాలు వివిధ దశల్లో వివిధ రూపాలు ధరిస్తూ వచ్చాయి. కాని ఏయే రూపాలు ధరించినప్పటికి అన్ని దశల్లోను ఒకటి మాత్రం స్పష్టంగా మనకు కనిపిస్తుంది. అది యేమంటే మానవసమాజంలో ఒక భాగానికి చెందినవారు మరొక భాగానికి చెందిన వారిని దోచుకోవటం అందుచేత సమాజం యొక్క చైతన్యం గత యుగాలలో ఎన్ని రూపాలు ధరించినప్పటికీ అన్ని యుగాలకు సమానంగా వర్తించే కొన్ని సాధారణ రూపాలలో, కొన్ని సాధారణ భావాలలో అది వ్యక్తమవుతూ వచ్చింది. ఇది ఆశ్చర్యకర విషయమేమి కాదు. ఇవన్నీ వర్గ వైషమ్యాలు నాశనం అయిపోతేగాని మాయం కావు"[3] వర్గ సమాజంలో బలమైన వర్గం అట్టడుగు, శ్రామిక ప్రజానీకాన్ని నిరంతరం దోచుకుతింటూనే వుంటుందనే సత్యాన్ని మార్క్స్, ఏంగెల్స్ వివరించారు.

"గతి తర్కాన్ని మనం సమాజానికి అనువర్తింపజేసి, అందులోని పరిణామాలను తెలుసుకోవాలంటే అందులోని వైరుధ్యాలనూ, విరుద్ధ పక్షాలనూ పరిశీలించాలి. సమాజంలోని ప్రధాన వైరుధ్యం వర్గపోరాటంలో వ్యక్తమయిందని చప్పున అనిపిస్తుంది. కాని సమాజం అభివృద్ధి చెందే కొద్దీ పోరాటంలో పాల్గొనే వర్గాలలో మార్పులు కలిగాయి. ప్రతి సామాజిక విప్లవంలోనూ ఒక రకం వర్గ పోరాటం సఫలమై, కొత్తవర్గాలూ, కొత్త సంఘర్షణలూ రావటం జరుగుతుంది.... వర్గకలహం యొక్క మూలం ఉత్పత్తి విధానాలకూ, ఆస్తి సంబంధాలకు మధ్య గల వైరుధ్యమని మార్క్స్ కనిపెట్టాడు"[4]

వర్గ వైషమ్యాలతో నిండిన సమాజంలో కళ వర్గ వైరుధ్యాలతోనూ, ప్రత్యేక వర్గానికి చెందిన రాజకీయాలు, సిద్ధాంతాలతోనూ ప్రభావిత మవుతుందని మార్క్స్ ఏంగెల్స్ స్పష్ట పరిచారు. ఈ వర్గ సమాజంలో సాహిత్యం అణ్వాయుధం కన్న శక్తివంతమైంది.

ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందే కొద్దీ, ఉత్పత్తి సంబంధాల్లో తప్పనిసరిగా మార్పు వస్తుంది. ఉత్పత్తి శక్తుల క్రమాభివృద్ధి నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. అయితే "At a certain stage of development the material productive forces of society come into conflict with the existing relations of productions.... with in the frame work of which they have operated hitherto, From forms of development of the productive forces these relations turn into

their fetters, Then begins an era of social revolution" [5] అని మార్క్స్ విశదం చేసారు.

కీలక ఉపరితలాంశమైన సాహిత్యాన్ని విశ్లేషించుకొనేప్పుడు సామాజిక పునాదియైన ఆర్థికాంశాలను దానితో అన్వయించుకోవాలి. క్రమానుగుణంగా సాగే ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని, ఉత్పత్తి సంబంధాలలో వస్తున్న మార్పులను దృష్టిలో ఉంచుకొని సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యాలి. సామాజికంగా వస్తున్న అన్ని రకాల మార్పులను పరిగణలోనికి తీసుకొని సాహిత్యాన్ని పరిశీలించుకోవాలి. జీవితానికీ; సామాజిక సంబంధాలలో ఏర్పడుతున్న మార్పులకీ కార్యకారణ సంబంధాన్ని సాహిత్యం ద్వారా విశ్లేషించుకోవాలి కాబట్టి "భౌతిక జీవనానికి సంబంధించిన ఉత్పత్తి విధానమే మొత్తంమీద సామాజిక రాజకీయ భౌతిక జీవిత క్రమాన్ని నిర్దేశిస్తుంది. మానవుల అస్తిత్వాన్ని నిర్దేశించేది వారి చైతన్యం కాదు. తద్భిన్నంగా, వారి సామాజిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది" [6] అని మార్క్స్ స్పష్టీకరించారు. అస్తిత్వ క్రమాన్ని అర్థం జేసుకుంటే ఆ అవగాహనే పరిణామ, చైతన్యమార్గాన్ని సూచిస్తుంది. సామాజికంగా ఎక్కడున్నాం? ఎలా ఉన్నాం? ఆ స్థితికి కారణం తెలుసుకుంటే; అదే మార్పుకు దోహదపడుతుంది. ఈ దృష్టితో సాహిత్యాన్ని అధ్యయనం చేసుకోవాలి.

ప్లెఖనోవ్ మార్క్సిస్టు విమర్శ ప్రారంభకుడైతే దానిని వెలుగులోకి తీసుకొచ్చింది గోర్కి. అయితే తెలుగునాట ఈ నాటికీ సరైన మార్క్సిస్టు విమర్శ ఎదగలేదు. తెలుగు సాహిత్యంలో మద్దుకూరి చంద్రశేఖరరావు, జి.వి. కృష్ణారావులను మార్క్సిస్టు విమర్శకు ప్రారంభంలో దోహద కారులుగా పరిగణిస్తే దానిని కొనసాగించిన వారిలో రాచమల్లు రామచంద్రారెడ్డి, కె.వి. రమణారెడ్డి, కొడవటిగంటి కుటుంబరావులు ముఖ్యులు. తెలుగు సాహిత్యంలో మార్క్సిస్టు ఆలోచనలకు తావిచ్చిన మొదటి నవలగా ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి మాలపల్లిని పరిగణించవచ్చు. శ్రామిక, దోపిడీ వర్గాల పోరులో, అంతిమ విజయం అట్టడుగు వర్గాని దేనిని ఆయన నిరూపించారు. తరువాత వట్టికోట ఆళ్వారుస్వామి- ఈ క్రమం, 1970 వచ్చేసరికి బాగా స్పష్టపడింది. అభ్యుదయ సాహిత్యోద్యం, అనంతం దిగంబర కవుల అలజడి, నక్సల్బరీ, శ్రీకాకుళోద్యమాలు; విరసం ఆవిర్భావం ఇవి అందుకు బాగా దోహదపడ్డాయి. "70లో ప్రారంభమైన మార్క్సిస్టు విమర్శ లక్ష్యం ఏమిటంటే ప్రజావ్యతిరేక సాహిత్యాన్ని తీవ్రంగా ఖండించటం ప్రజాసాహిత్యాన్ని అభివృద్ధి చెయ్యటం- నిర్మూలన, నిర్మాణం అనే రెండు లక్ష్యాలతో మార్క్సిస్టు విమర్శ ప్రారంభమైంది. 70లో వస్తువులోనే విప్లవం వచ్చింది" [7] ఈ మార్పు రావిశాస్త్రి నవలల్లో కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. 1952లో 'అల్పజీవి'తో మొదలైన రావిశాస్త్రి నవలా ప్రస్థానం 'రాజు-మహిషి' నవలతో కాని ముందుకు సాగలేదు. డెబ్బైవదశకం నుండి రావిశాస్త్రి నవలా వస్తువులో మార్పు చోటు చేసుకుంది. మార్క్సిస్టు వెలుగుబాటలో రావిశాస్త్రి నవలా సాహిత్యం నడిచింది. ఆయన ఇతర నవలలకంటే స్పష్టమైన వర్గదృక్పథం; మార్క్సిస్టు దృష్టి 'గోవులొస్తున్నాయి' జాగ్రత్తలో 'సొమ్ములు పోనాయండి'లో కనిపిస్తుంది. కనుక వాటిని ఈ అధ్యాయంలో పరిశీలిద్దాం.

## 1. గోవులొస్తున్నాయి జాగ్రత్త

సువర్ణ సుందరపురం జమీందారు; ఒక అట్టడుగు వర్గ పల్లెపడుచుని చూచి మోహించి; కామంతో కైపెక్కి, ఆ అమ్మాయిని కిడ్నాప్‌చేసి; మోసగించి, ఆమెను

అనుభవించి; ఆమెకు పుట్టిన బిడ్డను మాత్రం తన వారుసునిగా అంగీకరించక; తన బంధుపు కిరీటికి ఆస్తి అప్పగించటానికి ప్రయత్నించి; చివరకు ఆ జమిందారు బలైపోయిన ఇతి వృత్తమే 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'.

కిరీటి చిన్ననాట ఈ ఇతి వృత్తం జరిగింది. దాని పరిణామాలు కళ్ళారా చూసిన కిరీటి; వివిధ ఉద్యోగాల్లో, వ్యాపారాల్లో స్థిరపడుతున్న తన బిడ్డలకి, బంధువులకి; తన వర్గప్రజానీకానికి, ప్రస్తుతం కాని; భవిష్యత్తులో కాని అలాంటి విపత్తు సంభవించకుండా ఉండటం కోసం; ఒక హెచ్చరికగా ఈ కథని వివరిస్తాడు. తన వర్గ ప్రయోజనాన్ని ఆశించి; వాళ్ళకోసమే చెప్తున్నాడు గాబట్టి "పేదలెవ్వరు ఇది చదవరాదు చదివినచో వారు శిక్షలకు పాత్రులగుదురు" అనే హెచ్చరిక గూడ కిరీటి ఈ నవల ప్రారంభంలోనే చేసాడు. దీనిని బట్టి ఈ వృత్తాంతం పేద, ఉన్నత వర్గాల పునాదిపై నడుస్తుందనేది స్పష్టం. "మానవజాతి చరిత్రంతా వర్గపోరాటాల చరిత్రయే" అనే సూక్తి ఇక్కడ ఋజువవుతుంది. స్వాతంత్ర్యానంతరం ఆర్థిక పరిస్థితులలో వచ్చిన మార్పులు; ఉద్యోగ, వ్యాపార నిచ్చెనల కాంక్ష దొడ్డిదోవ రాజకీయాల చుట్టూ పరిభ్రమిస్తున్న వాళ్ళు తమ దరిదాపులకు ఎవరూ చేరకుండా ఉండటం కోసం; ఎదురులేకుండా తమపనిని తాము చేసుకోవటం కోసం, కింది వర్గాలను అణచివేసే పద్ధతిని ముమ్మరం జేసే విధానాన్ని, అన్యాయానికి గురైన వాళ్ళే అన్యాయాన్ని ఎదిరించే వాళ్లవుతారనే తీరును శాస్త్రి ఈకథ ద్వారా వ్యక్తపరచారు.

సోవియట్ విప్లవం జరిగిన 1917లో పుట్టిన కిరీటి; 1930లో సువర్ణ సుందరపురం (సు.సు.పురం) పాలేరు కొడుకైన గోపాలదాసుతో కలిసి వెళతాడు. తను సు.సు.పురం వెళ్ళినప్పుడు ఒకటిన్నర రోజుల్లో జరిగిన వృత్తాంతాన్నే కిరీటి వివరించింది. లచ్చయ్యమ్మ అందాన్ని చూసి మోహించిన రాజయోగి ఆపశుల కాపరి కూతుర్ని పైసలతో, పొలాలతో చేజిక్కించుకుందామని బేరం పెడితే; అందుకు వాళ్ళు మేము కులానికి పేదవాళ్ళమైన; కాసులకి అమ్మాయిని అమ్ముకునే వాళ్ళంగాదని చెప్పి రాజయోగికి బుద్ధి చెపుతారు. సంతలో సరుకును కొన్నట్లు ఆమె ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా డబ్బుతో భ్రమపెట్టి తెచ్చి అనుభవించ వచ్చనే వ్యాపార దృష్టి రాజయోగికి పెట్టుబడిదారీ సమాజ సంస్కృతిలో భాగంగా అబ్బింది ఆమెకు రంగం బావతో పెళ్ళి సిద్ధమైందని తెలిసిగూడ రాజయోగి తమ ప్రయత్నాలు విరమించలేదంటే; అతనిలో అహంకారం; ధనమదం ఎతంగా వ్యాపించివున్నాయో తెలుసుకోవచ్చు.

అర్థబలం, అంగబలం వున్నవాళ్ళు సమాజంలో ఎలాంటి దుర్మార్గాన్నైన అవలీలగా చేసి, సులభంగా తప్పించుకోగల్గుతున్నారు. లచ్చయ్యమ్మ పెళ్లి చెడగొట్టి, వాళ్ళ కుటుంబంలో చిచ్చులేపి; చివరకి ఆమెను భార్యగా స్వీకరించటానికి ఇష్టపడని కుటిలాత్ముడు యోగి; ఆమెను భార్యగా స్వీకరించటానికి, కులం, జాతి అడ్డువచ్చాయి. చాటుమాటుగా అనుభవించటానికి మాత్రం ఇవేవి అడ్డుకాదు. స్త్రీని విలాస వస్తువుగా, ఆటబొమ్మగా భావించటమేగాని, జీవిత భాగస్వామిగా స్వీకరించే గుణం ఇతనిలో లేదు. అప్పటికి ముగ్గురు భార్యలు చనిపోయినా ఇతనిలో కామదృష్టేగాని, దాంపత్యజీవితపు ఆలోచనలు లేవు. ధనసంస్కృతి బలిసిపోయిన వాతావరణం నుండి రాజయోగి

బయటపడలేక పోతాడు. తన మనుషుల ద్వారా బలవంతంగా లచ్చయ్యమ్మను ఎత్తుకొచ్చి మోసంతో ఆమెను అనుభవించి, ఆమె కుటుంబసభ్యుల్ని నాశనం జేయించిన హంతకుడు రాజయోగి; ఒక వర్గం మరో వర్గాన్ని అణచివేసే విధానం; తన విస్సృంఖల స్వేచ్ఛకు అడ్డు వచ్చేవారిని అంతం జేసేతీరును, లచ్చయ్యమ్మ కుటుంబం నాశనమైపోయిన పరిస్థితి నుండి మనం గమనించవచ్చు. "పాలకవర్గం తన వర్గ శత్రువుల ప్రతిఘటనను అణచడానికి, ఉపయోగించుకొనే సాధనమే రాజ్యాంగ యంత్రం"[8] అప్పుడు (1930) పాలక వర్గం బ్రిటీషు వాళ్ళే అయినప్పటికి, వాళ్ళ అడుగులకు మడుగులొత్తే స్వభావానికి అలవాటు బడ్డయోగి; అధికార అండతో పాలనా లొసుగుల వలన కలిగిన సౌలభ్యంతో తన కెదురైన ఆటంకాల నుండి బయట పడగలిగాడు. డబ్బుతో, కుహనా తెలివి తేటలతో అడ్డంకులను అధిగమించగలిగాడు.

ఈ క్రమంలోనే లచ్చయ్యమ్మను అపహరించినందుకు నిరసనగా యువతరం నుండి నిరసనోద్యమం బయలుదేరితే రాజయోగి; చాకచక్యంగా దానిని నీరుగార్చటమే గాకుండా; దానిలో ప్రధానంగా వున్న లచ్చయ్యమ్మ తమ్ముణ్ణి అంతం జేయించాడు. "రోజుకి పావలా డబ్బుల కూలాడితేగాని, కుండాడని పద్దెనిమిదేళ్ళ గోచి పాతరాయుడు, లచ్చయ్యమ్మ తమ్ముడుగాడు. ఈ రోజున నామీద తిరగబడబోయే మెట్టుదాకా ఒచ్చేడూ అంటే; రేపొద్దున్న మీపని ఏమవుతుందో ఆలోచించుకోండి"[9] అని కులాల అంతరాన్ని, పేద, గొప్ప తేడాలని తీసుకొచ్చి; వర్గ వైషమ్యాలతో లచ్చయ్యమ్మపై వచ్చిన ప్రజాసానుభూతిని చల్లార్చాడు యోగి.

జిల్లా కలెక్టర్, పోలీసు ఉన్నతాధికారులు రాజయోగి ఉదంతాన్ని సాంఘిక సమస్యగానే గుర్తించారు గాని, దీన్ని రాజకీయంగా మార్చలేదు. క్రింది అధికార్లు మాత్రం రాజయోగికి తాబేదార్లుగా ప్రవర్తించారు. కాంగ్రెస్‌పార్టీ ఉన్నత వర్గాల కొమ్ముగాస్తుంది గాబట్టి ఈ ఉదంతాన్ని ఆసరా జేసుకొని పేదప్రజల సంరక్షణార్థం నిలిస్తే; పేదలంతా తమ వెంట ఉంటారనే ఆలోచనలతో బ్రిటీష్‌ప్రభుత్వం రాజయోగిపై చర్య తీసుకుంటానికి వేగవంతమవటం; పాలకవర్గపు విభజించి పాలించే నీతికి నిదర్శనం. ఈ విషయం తెలుసుకున్న యోగి; నేను ఆకులం తక్కువదాన్ని ఎత్తుకుపోయి బలవంతంగా చెరచడం నిజం, "రుజువులు, సాక్ష్యాలు వున్నా నన్ను ఎవరు ఏమి చేయలేరని" ధీమాగా ఉన్నతాధికార్లతో మాట్లాడాడు. అంటే ప్రభుత్వాన్నే శాసించగల, పోటీ ప్రభుత్వంలాగా నెగ్గుకు రాగల సామర్థ్యం, స్థోమతు రాజయోగికి ఉందని తెలుస్తుంది. అందుకనే అంత అహంకారంగా ప్రవర్తించగలిగాడు.

అహంకారం కొంత తగ్గించుకొని బ్రిటీష్ వాళ్ళకి లొంగి పోయినా, వాళ్ళు కనికరించక పోయేసరికి; ఎత్తుకు పైయెత్తుగా ఖద్దరు కాంగ్రెసు నాయకుడు శివకేశరావుని రంగంలోనికి దింపుతాడు యోగి; మోసం, జిత్తుల మారి తనంతో ప్రజల్ని జోకొట్టి తనపబ్బం గుడుపుకుంటున్న దొంగ; యోగి. శివకేశవరావు వాస్తవంగా దేశభక్తుడు కాకపోగా; ప్రజాద్రోహియోగితో లాలూచియై సాంఘిక సమస్యని రాజకీయ సమస్యగా మార్చిన కుయుక్తి దారుడు. లచ్చయ్యమ్మ సమస్యని ప్రజల్లోకి తీసుకెళ్ళి వాళ్ళను రెచ్చగొట్టి; చివరకు ప్రభుత్వం ఆఫైలును మూయించేలా చేసి; ప్రజా ఉద్యమంలో

హింసచోటు జేసుకుంది గాబట్టి, తానే ఉద్యమాన్ని ఆపేస్తున్నానని ప్రకటించి, ప్రజలచేత దేహశుద్ధి చేయించుకున్న ద్రోహి శివకేశవరావు ఉన్నతవర్గం, పాలకవర్గం, రాజకీయనాయకులుగా చెలామణి అవుతున్న డబ్బుకు అమ్ముడుబోయే ముసుగు వీరులు ఎలా ప్రజలని ప్రక్కదోవ బట్టిస్తున్నారో ఈ సన్నివేశం ద్వారా రావిశాస్త్రి విశదం చేశారు.

లచ్చయ్యమ్మ కుటుంబం అంతమవటంపై కిరీటి "మనకి నష్టం కలిగే విధంగా మరొకరి యెడల మనం జాలిపడకూడదు.... మేకల్ని చంపుకు తినడం పాపమా పుణ్యమా అని పుల్లూ, సింహాలు తర్కిస్తూ కూర్చుంటే ఎలా? మనది పాముల పట్నం, మనం లోకాన్ని కాటేసి బతకాలి. మనం వర్ధిల్లాలంటే మనం అన్యాయాలు చెయ్యాలి అన్యాయం జరక్కుండా ఉంటేనే అలగాజనం వర్ధిల్లుతుంది. అందుచేత వాళ్ళకీ మనకీ వైరుధ్యం ఉంది..... మనది దొంగలరాజ్యం ...... శత్రుశేషం ఉండకూడదు"[10] అని వ్యక్తం చేసిన అభిప్రాయాలని పరిశీలిస్తే అతని వర్గ దృష్టి పేదప్రజలపై ఉన్న కసి, ద్వేషం తెలుస్తుంది. అంటే అన్యాయాలకి గురై అందులో మగ్గిపోతున్నవారు అలానే పిసుక్కుచావాలని; దానితో అందలమెక్కి; ఆ స్మశాన పునాదులపై స్వారీ చేసే వాళ్ళు అలానే కొనసాగాలనే యథాతథవాదాన్ని కిరీటి బలపరుస్తున్నాడు. చచ్చేవాళ్ళు చస్తూనే ఉంటే; చంపేవాళ్ళు చంపుతూనే ఉండాలని అతని కోరిక; కాని 'నెత్తురు కార్చిన కళ్ళు నిప్పులు చిమ్ముతాయని; అల్లర చిల్లర రాళ్ళు గుళ్ళై ఎగురుతాయని; సింహాద్రి శిఖరంపై చీమలు పాముని చెండుతాయనే మహాకవి శ్రీశ్రీ వ్యక్తపరచిన చారిత్రక వాస్తవాన్ని దృష్టిలోకి తీసుకుంటే కిరీటి కలలు కల్లలయ్యాయని ఈ నవలేతి వృత్తమే నిరూపించింది.

లచ్చయ్యమ్మ యోగివలన తనకు కలిగిన మగబిడ్డను చూసి మురిసిపోయి, "ఇయ్యాల్టికాణ్నించి నీరాజ్జెం నా కొడుకుది గేపక వెట్టుకు మసులుకో" అని ప్రకటించే సరికి యోగికి ఆకాశం కూలి నెత్తిన బడ్డట్టు" పాతాళం కంట భూమి కుంగిపోయినట్టు అనిపించింది. లచ్చయ్యమ్మ కుమారుడికి నాలుగు సం॥లు వయసు వచ్చేసరికి; నలుగురూ ఆ పిల్లవాణ్ని తన కొడుకుగా చెప్పుకుంటాన్ని యోగి భరించలేకపోయాడు. ఆమెతో లైంగిక సుఖాన్ని పొందటానికి అడ్డురాని కులం, జాతి, ఆయనకు అప్పుడు అడ్డువచ్చాయి. తన రక్తాన్ని పంచుకు పుట్టిన బిడ్డను తనవాడిగా పరిగణించటానికి యోగి నిరాకరిస్తాడు. తన ఆస్తి, హోదా; మొత్తం సర్వ సంపదకి తనవాణ్ణి తన బంధువర్గం వాణ్ని తీసుకురావలసిందేగాని 'కడజాతి' లచ్చయ్యమ్మ కొడుకుని మాత్రం తన వారసుడిగా అంగీకరించరాదనే నిర్ణయానికొచ్చి ఆ పిల్లవాణ్ణి పథకం ప్రకారం మాయం చేయిస్తాడు రాజయోగి. 'వర్గ కలహం యొక్క మూలం ఉత్పత్తి విధానాలకు, ఆస్తి సంబంధాలకు మధ్య గల వైరుధ్యమ"ని చెప్పిన మార్క్స్ మహనీయుని సూక్తిపై ఇక్కడ వైరం ప్రారంభమైంది. తన వర్గానికి లచ్చయ్యమ్మ వర్గానికి సాంఘికంగా, ఆస్తిపాస్తుల దృష్ట్యా చాల అంతరం ఉంది. అందుకని తన ఆస్తికి ఆమె బిడ్డను వారసుని చేయటానికి యోగి అంగీకరించలేదు.

అయితే లచ్చయ్యమ్మ మాత్రం ఈ ఆస్తి అంతా తన బిడ్డకే చెందాలని; ఇక్కడ మరొకడు కాలు మోపటానికి వీలు లేదని ప్రకటించింది. అటు లచ్చయ్యమ్మ, ఇటు

రాజయోగి ఇద్దరు ఆస్తిపైనే దృష్టిసారించారు. లచ్చయ్యమ్మకు తనద్వారా లభించే సాంఘిక గౌరవాన్ని, ఆస్తిని దక్కకుండా చెయ్యటాన్ని గురించి యోగి తీవ్రంగా స్పందిస్తే; లచ్చయ్యమ్మ తన బిడ్డకు ఆస్తిని దక్కించుకుంటానికి ప్రయత్నించింది. ఈ నవలలో ఇది చాలా ప్రధాన అంశం దీనిపైనే పతాక సన్నివేశం ఆధారపడింది.

తన బిడ్డని రాజయోగే మాయం చేశాడని సాక్ష్యాలతో బయటపడేసరికి లచ్చయ్యమ్మ తెగించి యోగిపై తిరగబడటం సహజంగా వుంది. తీవ్ర మానసిక వత్తిడికి లోనైన లచ్చయ్యమ్మకి పిచ్చెక్కుతుంది. ఈ సందర్భంలోనే యోగి కిరీటిని తన వారసునిగా చేసుకుంటానికి; అతనిని సు.సు.పురం రప్పించాడు.

తన బ్రతుకును నాశనం చేయటం; తనవాళ్ళను సమూలంగా అంతంజేసి; తన బిడ్డను మాయం జేసి; జైలు జీవితంలా నిర్బంధంలో ఉంచబడిన తన జీవితానికి ఏమిటిమార్గం; చావా? బతుకా ఈ పాశవిక కబంధ హస్తాల నుండి బయటపడాలని; తమ జీవితాలను అంతం జేసిన రాజయోగితో అంతిమపోరు జెయ్యాలని లచ్చయ్యమ్మ నిర్ణయించుకుంది. ఆమె అస్తిత్వం నుండి, అణచివేత నుండి, నిర్బంధం నుండి ఈ చైతన్య జ్వాల ఉద్భవించి ఉంటుంది. కుక్కలతో కరిపించుకుంటూ; కుక్కలా పడి ఉండే కంటే తాడో, పేడో తేల్చుకుంటమే మంచిదనిపించి వుంటుంది. ఈ ఆలోచనతో ఆమెకు పిచ్చికూడా తగ్గిపోయి; కిరీటి ప్రవేశాన్ని ఆమె తీవ్రంగా వ్యతిరేకిస్తుంది; తన బిడ్డను దాచేసి ఈ రాజ్యం నీకు కట్టబెడితే 'ఆడిమెడకాయ' 'నీమెడకాయ' కొరికేస్తానని తీవ్రంగా కిరీటిని ఆమె హెచ్చరించి భయపెట్టింది. అంతేగాకుండా "ఇయ్యాళ్ళించి నాకింక బంధికానాసరి; .... నన్నెవుడైన సరే ఏంజెయ్యడు... ఈ రాజ్జెంలో ఈ కోటముందర నాకొడుకు బావుటా వెగరాలేగాని, మరోడి బావుటా ఎగరడానికిల్లేదు"[11] అని ఖచ్చితంగా తేల్చి చెప్పే తీవ్రస్థాయికి లచ్చయ్యమ్మ చేరుకుంటానికి కారణం ఆమె అనుభవించిన విపరీత అణచివేత జీవితమే. జాకీని ఆమె మీదికి ఉసిగొలిపితే దాన్ని నల్లిని నలిపినట్లే నలిపేసి "మీ యాట్లన్ని ఇయ్యాళ్ళితో కట్టు; నన్ను గొలుసులేసి కడితే వుక్కుదుక్కలైనా తెంపిసిరి పారేస్తాను.... నానియాల్టి కాణ్ణించి మీపాల్టి అమ్మోర్ని అసిరెమ్మని లచ్చయ్యమ్మని కాను... మరిడీ మాలచ్చిని" అని చెప్పటం గూడ ఆమె ఏ స్థాయికి చేరుకుందో తెలుస్తుంది.

"సమాజంలో స్త్రీకుండే స్వాతంత్ర్యాన్ని బట్టే సమాజమంతటి అభివృద్ధి ఆధారపడి ఉంటుంది. అనాగరిక సమాజంలో వలె నాగరిక సమాజంలో కూడ స్త్రీని హీనస్థితిలో వుంచటం ఒక ప్రధాన లక్షణం... స్త్రీ పురుషుడికి బానిసగా వున్నప్పుడు పురుషుడే స్త్రీకంటే యెక్కువ కష్టానికి గురౌతాడు"[12] ఈ విషయం లచ్చయ్యమ్మ విషయంలో నిజమవుతుంది. బానిస విధానాన్ని, దోపిడి, దుర్మార్గ పద్ధతుల్ని నాగరికమైన ఏ వ్యక్తి భరించలేడు.

యోగి కిరీటికి కొన్ని తన వర్గ లక్షణాలని; లోక ధర్మాలని గురించి చెప్తూ "తినేవి, తినబడేవి అని అవి రెండే రకాలు. చంపేవి చంపబడేవి అని అవి రెండు రకాలు.... కిరీటి బతికిచావటం నాకిష్టం లేదు. అందుచేత నేను చంపి బతుకుతాను.... లోకంలో ఓ చంపేజాతినుండి మరో చంపే జాతి పుట్టుకొస్తుంది. కాకపోతే..... కాకపోతే చచ్చేజాతి

వీటన్నింటిమీద తిరగబడి బతికేజాతిగా మారుతుంది. అదే నాభయం"[13] అని వ్యక్తం జేసిన మాటలు స్పష్టమైన వర్గ దృష్టికి చిహ్నాలు. లచ్చయ్యమ్మ లాంటి వాళ్ళని అంతం జేసి బతకటమే తనకిష్టమనే ధోరణిలో యోగి మాటాడాడు. అంటే వర్గ నిర్మూలనాధోరణి "తెగ మొదలెత్తిపోవ పగదీర్చగ వచ్చిన క్రౌర్యమందు" అని తిక్కన జెప్పిన సత్యవాక్కు ఇక్కడ గుర్తుకు రావటం సహజం. ఇంకా మనం దేనికైనా సిద్ధంగా ఉండాలని కిరీటితో రాజయోగి చెప్పి "పశువులకి పలుపులూ, కన్నెలూ ఉండాలంటాను. అందుకే అంటాను మనకీ పుల్లుకీ గొలుసులుండకూడదంటాను. చంపేజాతి జావకూడదంటాను. చచ్చేజాతి బతక్కూడదంటాను"[14] అని హెచ్చరిస్తాడు. రాజయోగి నిజతత్వం ఇక్కడ స్పష్టమవుతుంది. అంటే పులిలాంటి క్రూర మృగజాతి తమదని, అట్టడుగు ప్రజానీకానిది మేకపిల్ల జాతని; అమాయక పశుజాతని; అలాంటి సాధుజాతికి బంధాలుండి; గొలుసులుండి; బంధింపబడి; తమలాంటి పులిజాతికి మాత్రం ఏరకమైన బంధాలు లేకుండా స్వేచ్ఛగా దొరికిన పురుగును, దొరికినట్లు మింగేసేలా ఉండాలని కోరుకుంటంలోనే ఉంది. అతని రాక్షస ప్రవృత్తి, వర్గనీతి. ఈ దుర్మార్గపు వర్గతత్వం అంతం కావాలనే రావిశాస్త్రి కోరుకుంది.

కాని ఇంత భీకరంగా పైకి మాటాడినప్పటికీ "కాని కిరీటి నాకు భయం వేస్తుంది" అన్న యోగి మాటలను బట్టి ప్రజాశక్తి ముందు ఎంతటి పాషండ నిరంకుశుడైన తలవంచక తప్పదనే విషయం బోధపడుతుంది. తనకి ధనబలమున్న ప్రజాబలం లేదని; అసంఖ్యాకంగా వున్న లచ్చయ్యమ్మ వర్గం, ఆమెకు తాను అపకారం తలపెడితే తిరగబడతారనే భయం గూడ యోగిలో ఉంది.

ఇక రాజయోగి కోట కూలబోతుందనే విషయం గోదాసు కిరీటిని, ప్రభుదాసుని ఎదిరించి వెళ్ళిపోయినప్పుడే శాస్త్రి సూచనగా తెలియజేసినట్లు గ్రహించవచ్చు. సాయంత్రంలోగా తనబిడ్డను చూపించక పోతే కోట మొత్తాన్ని సర్వనాశనం చేస్తానని లచ్చయ్యమ్మ అల్టిమేటం పంపించేసరికి; రాజయోగి; మిగతా వాళ్ళంతా భయపడిపోతారు. ఆ తరువాత మూడురోజులు గడువు పెంచినా లచ్చయ్యమ్మ; ఇక అన్నింటికి తెగించి నిలబడింది. సత్యమూర్తిగూడ లచ్చయ్యమ్మకి అపకారం జరిగితే భూమి తలక్రిందులవుతుందని హెచ్చరిక జేస్తాడు. ఆవుల కిష్టయ్య; ప్రభుదాసులు మాత్రం కుట్రని వేగవంతం చేయటానికి ప్రయత్నిస్తారు. ఆవుల మంద జమిందారీ కోట ముందుకు చేరుకుంది. గో.దాసు; సత్యమూర్తి, తదితర గణమంతా లచ్చయ్యమ్మ రక్షణార్థం చేయవలసిన పనిలో మునిగిపోయారు. సాధు జంతువులైన ఆవుల మంద తిరగబడింది. లేడి కూనలు పులుల మూకపై పాదం మోపాయి తరతరాల అధికార, ధనమదం మట్టి కరిసింది అగ్రవర్ణ భూస్వామ్య దురహంకారం కుప్పగూలింది. చిరకాలంగా సాగుతున్న మనుసంస్కృతి మంట గలిసింది. 'జాతి తక్కువతనం' అట్టడుగు వర్గతనం అందలం ఎక్కి పల్లకీల్లో పైలా పచ్చీసుల్లా మిడిసి పడుతున్న సంపన్న వర్గం పై కాలు దువ్వింది "ఒక్కండును నీ మొర ఆలకింపడు' అన్న చందాన రాజయోగి అసహాయంగా దిక్కులేని కుక్కచావు చచ్చాడు. రావిశాస్త్రి సింబాలిక్‌గా చెప్పిన ఆలమంద తిరగబడి యోగిని అంతంజేసి అతని అనుచరగణాన్ని గూడ ధ్వంసం జేసాయి. అప్పటివరకు లచ్చయ్యమ్మని కట్టడి చేసుకుంటూ వచ్చిన జాకీ(కుక్క) నెత్తురు కక్కుకుంటు నేలకు "రాలిపోయింది. లచ్చయ్యమ్మ రాజయోగి చెరనుండి స్వేచ్ఛా విహంగంలా బయట ప్రపంచంలోకి అడుగుబెట్టింది. సాధుజంతువులైన ఆవులు రాజయోగిని అంతం జెయ్యటం

సాధారణ ప్రజానీకం యొక్క విజయంగా బావించాలి. "ఏ గోవులకైతే కన్నెలు తగిలించి బండాలు బిగించి, ఏ గోవులనైతే" పర్మనెంటు బందీలుగా ఉంచుకోవాలనుకున్నాడో రాజయోగి, ఆ గోవులచేత దిక్కులేని చావుచచ్చాడు. దురహంకారానికి పతనం తప్పదని గూడ ఋజువుచేసాడు. "ఒక జాతిని వేరొక జాతి. ఒక వ్యక్తిని వేరొ వ్యక్తి పీడించే సాంఘిక ధర్మం ఇంకా నా ఇకపై సాగదనే" చారిత్రక సత్యం ఇక్కడ ఋజువయ్యింది. అసంఖ్యాక పీడిత తాడిత ప్రజానీకం ఐక్యంగా నిలిచిపోరు సలిపితే అల్ప సంఖ్యాక సంపన్నవర్గం దిగిరాక తప్పదని వెల్లడయ్యింది. దెబ్బతిన్నవాడికే నొప్పి తెలుస్తుంది. ఆ బాదతో, ఆ జీవన అస్తిత్వంతో, తరుణోపాయాన్ని వెదుక్కొని చైతన్యం వైపు తొంగి చూస్తాడు. తాననుభవించిన వేదన, అణచివేత, అస్వాతంత్ర్యం; అమానవీయ స్థితి; కన్నబిడ్డను పోగొట్టుకున్న కడుపుకోత; కన్నవాళ్ళు కనుమరుగై పోయిన రోదన- ఇవన్నీ లచ్చయ్యమ్మలో తిరుగుబాటు స్వభావాన్ని ప్రేరేపించాయి. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' అనే పేరు సింబాలిక్‌గా పెట్టినా, "గోవులు గదిగదనీ వెతికి మరీ చంపాయి." అనేది సహజంగాలేదు. గోవుల్ని ఇతివృత్తం మొత్తంలో సింబలైజ్ చేసి చెప్పినట్లుగా పాఠకుడు గాఢమైన అనుభూతి పొందలేడు. వాస్తవిక దృష్టితో సమస్యను విశ్లేషించి; పరిష్కార మార్గాన్ని గూడ సూచించి, బాధిత పేద ప్రజల పక్షం వహించి, వారి విజయాన్ని కాంక్షించిన రావిశాస్త్రి అచ్చమైన మార్క్సిస్టు రచయిత. తన దృక్పథమేమిటో, ఏ వర్గ ప్రజల ప్రయోజనాలను పరిరక్షించటం కోసం కలం బట్టాడో; చెడుకు ఉపకారం మంచికి అపకారం జరక్కుండా తానెట్లా రచనలు జేస్తున్నాడో ఈ గోవులొస్తున్నాయి జాగ్రత్త" ద్వారా రావిశాస్త్రి బోధ పరిచారు. వాస్తవాన్ని విశ్లేషించి చూపేది సాహిత్యమైతే హితవు చెప్పేది మంచిసాహిత్యం పరిష్కార మార్గాన్ని సూచించగలిగింది మరీ మంచి సాహిత్యం; ఆ విధంగా మార్క్సిస్టు దృక్పథంతో రావిశాస్త్రి రచించిన 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' నవల విప్లవాత్మకమైంది.

## 2. సొమ్ములు పోనాయండి

స్పష్టమైన వర్గదృష్టితో, మార్క్సిస్టు అవగాహనతో, చిన్ననవలగా రావిశాస్త్రి దీనిని రచించినా; విలువ దృష్ట్యా శాస్త్రి నవలలన్నింటికంటే గొప్పది మితిమీరిన వర్ణనలు గాని, ఉపన్యాసాలుగాని దీనిలోలేవు. పాఠకుణ్ణి ఆలోచనా లోతుల్లోకి తీసుకెళ్ళి సామాజిక దురన్యాయానికి పరిష్కార మార్గాన్ని గూడ సూచిస్తుంది.

ఎకరం నలభై సెంట్ల భూమి గల బక్కరైతు దాసరిబోడియ్య. తన కాస్త నేలని పండించుకుంటూ ఇతర పొలం పనులు చేసుకుంటూ బతుకీడ్చుకొస్తున్న అట్టడుగు పేద వ్యక్తి బోడి. తన పొలానికి తన ఆధీనంలో వున్న 'సిన్నామూర్తి' పొలానికి మధ్య అడ్డంకిగా వున్న బోడి నలభైసెంట్ల భూమిని కాజేద్దామని ఊరి ప్రెసిడెంట్ 'సొమ్ములుపోనాయండి' కథని నడిపించాడు. కేసులో యిరుక్కొని, కోర్టుచుట్టూ తిరిగి, కూతురు 'సిలుక'ని పోగొట్టుకొని, నేల తల్లిని పోగొట్టుకోలేక సొంతమనుషులను బలిపెట్టుకొని ప్రెసిడెంటుపై భూపోరాటం జేసి జైలు పాలై జైల్లో ఉండే తన వృత్తాంతాన్ని తానే వివరించాడు బోడి.

జతపోతులు కొంటానికి బోడికి మూడొందలు అప్పుబెట్టి. నూటికి నెలకి పాతిక రూపాయల వడ్డీతో ఆరువందలకి నోటు రాయించటంతో మొదలయ్యింది ప్రెసిడెంట్ మోసం; దుర్మార్గత్వం; వడ్డీ వ్యాపారం వివిధ స్థాయిల్లో విస్తరించిన ఈ కాలంలో గూడ ఇంతవడ్డీ అంటే గుండెలు బాదుకోవలసి వస్తుంటే; 1981 పూర్వమే ఇంత వడ్డీ అంటే

ప్రెసిడెంటు బోడిని ఎంతటి దారుణ మోసపు ఊబిలోకి దించాడో ఊహించుకోవచ్చు. బోడి ఆ సొమ్ముని చెల్లించలేక; ఆ ఊబి నుండి బయటపడలేక; అందులోనే కొట్టుమిట్టాడి, చివరకు ఆ సొమ్ముకు బదులు తనకు కావలసిన పొలాన్ని కట్టబెట్టేలా పథకాన్ని సిద్ధం జేసుకున్నాడు ప్రెసిడెంట్. ధనదాహంతో పాటు. భూదాహం గూడ వ్యాపించింది.

ఒక వైపున భుక్తికోసం; బానిసత్వ విముక్తి కోసం; నేల తల్లిని చేజిక్కించు కోవటం కోసం విముక్తి ఉద్యమాలు కొనసాగుతుంటే మరోవైపు వాటిని నిరోధిస్తు ఉద్యమాలను నీరుగారుస్తూ, మొత్తం సంపదని, నేలని ఆక్రమించుకోవాలనే అత్యాశతో భూస్వాములు చట్టాన్ని, న్యాయ, పోలీసు వ్యవస్థలని తమ చంకలో ఇరికించుకొని, ప్రజల్ని పీడిస్తున్నారు. నక్సల్బరీ, శ్రీకాకుళ గిరిజ నోద్యమాలకి పూర్వం కూడ ఈ స్థితి వుంది; నేడూ ఈ పరిస్థితి వుంది.

"పెట్టుబడిదారీ సమాజంలోని వివిధ వర్గాలమధ్య చావు బ్రతుకుల పోరాటం లేకుండా యే ఒక్క పెట్టుబడిదారీ దేశమూ అంతో యింతో స్వేచ్ఛాయుతమైన, ప్రజాస్వామికమైన ప్రాతిపతికమీద అభివృద్ధి కాలేదు"[15] కనుక ఈ పోరు నిరంతరం సాగుతూనే ఉంటుంది. ఆవర్గ పోరాటం నుండి శ్రామిక శక్తులు విజయం పొంది; సామాజికాభివృద్ధికి తోడ్పడతారు. ఈ భూకబళింపుదార్లకి; దానిని పరిరక్షించుకొని పనిజేసుకొంటు పొట్టగడుపుకొనే సన్నకారు రైతులకి; రైతుకూలీకి; వర్గపోరు అనివార్యంగా జరుగుతుంది. ఆ భూకబళింపు పరిరక్షణ పోరే ప్రెసిడెంటుకి, బోడికి మధ్యసాగింది.

మూడొందలతో జతపోతులు కొంటే; వాటిని నెలతిరక్కుండానే మాయం జేయించాడు ప్రెసిడెంట్. పెత్తందారీ జులంతో చాటుగా జేసే నీచపు కార్యాలకి ఇదొక ఉదాహరణ. బోడికి వాస్తవంగా మూడొందలిచ్చి ఆనవాయితీగా ప్రోనోటులో రాసిన ఆరువందలు వారం రోజుల్లో యివ్వాలని పట్టుబడ్డటం ప్రెసిడెంట్ కుటిల నీతికి నిదర్శనం. ఈ అన్యాయానికి కడుపుమండి తిట్టిన బోడి భార్యని పెత్తందారీ, కండబలం, ధనబలంతో ప్రెసిడెంట్ తమ్ముడు కొడుకు సిన్నారావు అగౌరవపరచి కొట్టటం; వాళ్ళ దౌర్జన్యానికి సూచికం. భయపెట్టిగాని; దౌర్జన్యం చేసిగాని ఒకవర్గం మరోవర్గాన్ని అణచివేసే తీరులో ఇది భాగం.

ఊరిపెద్దలు వెన్నెముకలేని ప్రెసిడెంటుతొత్తులు; కాబట్టి ఈ తగువులో బోడికి వాళ్ళు న్యాయం చేయలేకపోయారు. కొద్దిరోజులు గడిచాక బోడిపై, భార్య, కూతురు సిలుకపై సిన్నారావు కేసుబెట్టటంతో ఇతని దుర్మార్గ స్వభావం వెల్లడవుతుంది; అర్ధరాత్రి స్టేషన్‌కొచ్చి తన ప్రతాపాన్ని చూపించి, బోడిని రెచ్చగొట్టిన కుయుక్తుడు సిన్నారావు.

బోడివాళ్ళ జామీను విషయాన్ని ఆసరా జేసుకొని రావిశాస్త్రి; పోలీసు; న్యాయవ్యవస్థల పనితీరుని ఎండగట్టారు. నిరపరాధుల్ని స్టేషన్‌లో నిర్బంధించి; చిన్న తగువుని ప్రెసిడెంటు వాళ్ళదగ్గర డబ్బు గుంజి భూతద్దంలో చూపించి పోలీసువాళ్ళు; ఆస్తి సర్టిఫికేట్లలో చిన్న లోపాల్ని, వాళ్ళ అమాయకత్వాన్ని ఆదుర్దాని కనిపెట్టి; జామీన్లకోసం డబ్బు గుంజి కోర్టు బ్రోకర్లు ఎలా మోసగించారో శాస్త్రి విశదం చేసారు.

ముఖ్యంగా డబ్బు, రాజకీయ పలుకుబడి; పోలీసు, కోర్టు పరిచయాలను ఉపయోగించుకొని ప్రెసిడెంటు బోడిని సర్వనాశనం చెయ్యటానికి ప్రయత్నించాడు. కేసులమీద కేసులు బెట్టించి బోడిని తనకాళ్ళ దగ్గరకు లాక్కొంటానికి కుయుక్తులు పన్నాడు. ఒక ప్రక్క సిన్నారావుతో తగువుకేసు, మరో ప్రక్కప్రోనోటు తాలూకా భూమి

జప్తు కేసు. ఇంకొకొక్క బైండోవరు కేసు ఇవన్నీ చాల వన్నట్లు జగిలీడు ప్రెసిడెంటుకి ట్రాన్స్‌ఫర్‌చేసిన నోటు పొలం రిజిస్ట్రేషను కేసు; కర్ణుడి చావుకు కారణాలెన్నో అన్నట్లు బోడి కుటుంబాన్ని అంతంజేసి ఆ పొలాన్ని కాజేయటానికి ఇన్ని విధాల వలపన్నాడు, ప్రెసిడెంటు. రాష్ట్రానికి ప్రభుత్వమంటే ఒక వర్గం మరొక వర్గాన్ని అణచి ఉంచేటందుకు ఉపయోగపడే నిర్బంధాత్మక శక్తి అట్టి ఆ ప్రభుత్వ అండతో, ప్రెసిడెంటు, అతని వర్గం బోడిని అతనికి అసరాగా నిలచిన అతని బావమరిదిని, జగిలీడును అణచటానికి తీవ్ర ప్రయత్నాలు చేసాడు. ఉపరితలంగానైనా పోలీసు, న్యాయశాఖల వత్తాసుతో బోడిని కుక్కిన పేనులా బడేటట్లు చెయ్యటానికి ప్రెసిడెంటు సరశక్తులు ఒడ్డాడు. పోలీసు, కోర్టు వ్యవహారాలు ప్రెసిడెంటు వాళ్ళకి కొట్టిన పిండి. ఏనాడు వీటి మొఖం చూడని బోడికి "తెలివినోళ్ళు లోను కెళ్ళటమంటే మేకపిల్ల అడవి కెళ్ళినట్టేనండి" అని అనిపించింది.

బోడి చెప్పినట్లే అతని కూతురు సిలుక, మేకపిల్ల, అడవికెళ్ళి బలైపోయినట్లే; జనారణ్యంలో మానవమృగాలకి బలైపోయింది. ఈ కోర్టు తగాదా వ్యవహారాలు ముక్కుపచ్చలారని మగువజీవితాన్ని మసిజేసాయి. అభం శుభం ఎరుగని అరిటాకుని తూట్లు బొడిచాయి. అమాయక అక్కుపక్షిని అమానుషంగా బలితీసుకున్నాయి. ప్రెసిడెంటు ఆస్తిదాహం, ప్రెసిడెంటు అణచివేత అతని ధనకాంక్ష, మోసం, ఇవన్నీ కలిసి బోడికూతురు బలైపోవటానికి దారితీసాయి.

స్త్రీని సుఖమిచ్చే ఒక యంత్రంగా, అందాన్ని అమ్ముకునే ఆటబొమ్మగా భావించే పెట్టుబడిదారీ ఆలోచనలతో, డబ్బుతో కొవ్వెక్కి! "నేరం జేసిన నంజాకొడుకుల్లో" ఒకడు తాసీల్దారు, ఇంకొకడు డియస్పీ, మరొకడు బ్రాందీ షాపువాడు వేరొకడు లారీ కాంట్రాక్టరు వీళ్ళతో పాటు ఇంకొకడున్నాడు. కోర్టులోని గచ్చకాయ గుమాస్తా సిలుక వీళ్ళ చెరలో చిక్కుకొని బలైపోవటానికి తార్పుడు ఆలోచనలు జేసాడు. కార్యనిర్వాహక న్యాయ అధికారాలు (మేజిస్ట్రేరియల్ పవర్స్ తాశీల్దారు కుంటాయి) గలిగి, మొత్తం పరిపాలనా యంత్రాంగాన్ని సక్రమంగా నిర్వహించ వలసిన తాశీల్దారు ఈ అఘాయిత్యంలో భాగస్వామి గావటం ఏహ్యమైన స్థితి. ఇలాంటి ఘోరాలు జరుగుతుంటే, ఏ కొద్ది సమాచార మందినా వెంటనే వెళ్ళి ఆపన్నులను కాపాడి: చట్టరక్షణ, భద్రత కల్పించవలసిన పోలీసు ఆఫీసర్ సాక్షాత్తు దీనిలో పాల్గొనటం; సిలుక ప్రాణాలు బలిగొంటం, దారితప్పిన వ్యవస్థ లక్షణాలకి ఉదాహరణ. లారీ కాంట్రాక్టరు ధనమదంతో, తన వ్యాపారలొసుగుల్ని బయటకు రాకుండా; ఎగుమతి దిగుమతుల రవాణా సాగించుకోవటం కోసం; ఇటు పరిపాలకుల; అటు పోలీసువాళ్ళ సహకారంకావాలి గనుక వాళ్ళతోజేరి ఈ ఘోరం చేశాడు. బ్రాందీ షాపువాడు అంతే; వ్యాపార ప్రయోజనాలను కాపాడుకోవటం కోసం; వీళ్లందర్నీ బాగా తాగించి; కైపెక్కించి; కామం కళ్ళకెగ దన్నినాక ఈ దుర్మార్గం చేసారు. ధనమదం, అధికరా జులుం; వ్యాపార సంస్కృతి ఈ సమాజంలో బక్కోళ్ళ నెలా బలితీసుకుంటుందో; స్త్రీలనెలా కాటువేస్తుందో రావిశాస్త్రి వాస్తవికంగా నమోదు చేసారు. అందంగా ఉండటం సిలుక చేసిన తప్పు; అయితే వీళ్ళందరితో కలియబడి; తిరగబడి మానభంగానికి తలొగ్గ కుండానే మరణించిందిగాని; 'దొంగలంజా కొడుకులసలే మసలే ఈ ధూర్తలోకంలో తలవంచుకు' వెళ్ళిపోలేదు. కాని 'అయిదు కుక్కల్తో మేకపిల్ల ఏటి పోట్లాడి'ద్ది. ఈ దుర్మార్గాన్ని బోడి దుఃఖిస్తూ ప్రశ్నించిన తీరు చీము, నెత్తురువున్నవాణ్ణి ఆలోచింపజేస్తుంది. సిగ్గు, లజ్జా గలవాణ్ని కుదిపేస్తుంది. "ఊరికో కలకటేరున్నాడు.

ఈదికో పోలీసోడున్నాడు. గాని అన్నేయం సేసినోళ్ళని అందుకున్నోడు ఒక్కళ్ళైక పోనాడండి"[17] అని బోడి ఈ వ్యవస్థపై కాండ్రించి ఉమ్మేస్తాడు. దుర్మార్గత్వం బలిసిపోయిన సమాజంలో పేదోళ్ళ ఇలాంటి ప్రశ్నలకి, ఏడుపులకి సమాధానాలుండవని గూడ అనుభవం మీద బోడి గ్రహించటం అతనిలోని ఆలోచనా పరిణామానికి సూచకం. అందుకనే "మంతరాలకి సింతకాయలు రాలవంటారండి. అలాగ్గే పేదోళ్ళ సోకాలగ్గూడ అయిరాలవండి. జెవజవరాళ్ళుచ్చుకొ దుళ్ళ గొడితేనే అయిరాల్తయండి"[18] అని చెప్పి; ఆ పని చెయ్యటానికి ఎవరూ ముందుకు రావటం లేదని వాపోతాడు. సాహసం; తెగువతో తిరగబడితేనే గాని; ఇలాంటి వాటికి పరిష్కారం దొరకదనే సూచన అతని ఆలోచనల్లో ధ్వనిస్తుంది.

బోడి జగిలీడుకి తన భూమిని అమ్మబోతున్నాడనే సాకు జూపించి; ప్రెసిడెంట్ ఆరువందల ప్రోనోట్ కేసుని అడ్డం బెట్టుకొని, బోడి భూమిని జప్తుచేసే సరికి బోడిలో కోపాగ్ని ప్రజ్వరిల్లింది కాబట్టే "నాకడుపుల తగులుకున్న అగ్గండి-అయ్యాళ-సన్న మంటగ మార్నాదండి" అని బోడి చెప్పాడంటే అతనిలో ప్రతీకార జ్వాల ఏ మేరకు పెరిగిందో ఊహించుకోవచ్చు. ప్రెసిడెంట్ తన భూమిని కాజేయటానికి పన్నాగాలు పన్నుతూన్నడనే సంగతి క్రమేపి బోడికి విశదమవుతుంది.

తనకు అప్పు పెట్టిన డబ్బుకు హామీగా బోడి తన నలపై సెంట్ల భూమిని నోటుగా జగిలీడుకు రాయించిస్తే, ఆ నోటుని జగిలీడు ప్రెసిడెంటుకి ట్రాన్స్‌ఫర్‌జేసి పెద్దచిక్కు తెచ్చిపెట్టాడు ఆ మిగిలిన డబ్బు కూడా ఇస్తాను, ఆ పొలాన్ని తనకు రిజిస్టర్ చెయ్యమని ప్రెసిడెంటు బోడికి నోటీసు పంపించే సరికి మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టయ్యింది. ఇంతకుముందు పొలాన్ని జప్తు చెయ్యటం; ఇప్పుడు ఆ పొలాన్ని రిజిస్టర్ చెయ్యమని నోటీసు పంపించటం ఇదంతా చూస్తుంటే ప్రెసిడెంట్ బోడి పొలానికి ఎసరు బెట్టాడనే సంగతి అర్థమవుతుంది. బోడిమాత్రం తన పొలాన్ని వదులుకుంటానికి సిద్ధంగా లేడు. ఆస్తి సంబంధాలు ఆస్తులు కాజేయటాలు; వ్యక్తుల్లో; వర్గాల్లో, కక్ష్యలు కార్పణ్యాలని పెంచుతాయి. ఆస్తుల ఆధిపత్యపోరు వర్గపోరుకు దారితీస్తుంది.

చిన్నారావు తగువుకేసులో బోడికి ఆర్నెల్లు శిక్షబడటమే గాకుండా, నాలుగొందలు జరిమానా గూడ బడింది. దీనిలో నష్టపరిహారంగా చిన్నారావుకి బోడిని రెండు వందలు కట్టమని కోర్టు తీర్పు ఇచ్చింది. బోడిమీద అణచివేత ఏ మేరకు పనిజేస్తుందో దీనిని బట్టి అవగాహన జేసుకోవచ్చు. తను, తనవర్గ బలప్రయోగమే గాకుండా పోలీసు న్యాయవ్యవస్థలని గూడ మచ్చిక చేసుకొని ప్రెసిడెంటు బోడిని పాతాళానికంట తొక్కేసి, అతని పొలాన్ని కాజేయడానికి ఈ తతంగమంతా నడిపిస్తున్నాడనేది యధార్థం. సంపన్నవర్గం అట్టడుగు పేద ప్రజానీకాన్ని అణచివేసి తమకాలికింద చెప్పుల్లా నలిపివెయ్యటానికి ప్రభుత్వం సాధనంగా ఉపయోగపడుతుందిగాని, ఈ ఉపరితలాంశాలేవి గూడ అశేష పేదప్రజల కుపయోగపడవని, తమకు జరుగుతున్న అన్యాయానికి తామే పరిష్కారమార్గాన్ని వెతుక్కోవాలనే వాస్తవాన్ని శాస్త్రి విశదం చేసారు. లేకపోతే తనభార్య తనకళ్ళముందే ఘోరావమానానికి గుర్రై దెబ్బలు దిని తనతల బొక్కబడిపోయి, అన్యాయానికి గురైన బోడికి జైలుశిక్షేమిటి జరిమానాలేమిటి? నష్టపరిహారాలేమిటి. దుర్మార్గం చేసినోడికి శిక్షలేకపోవటం ఏమిటి? ఈ అణచివేతని దుర్మార్గాన్ని, దురన్యాయాన్ని తట్టుకోలేక బోడి భార్య ఆ పల్లెటూరు విడిచిపట్నమెల్లి ఏదో ఒక పని జేసుకొని బతుకుదామని గోలెడుతుంది.

ఇక్కడి పెత్తందార్లు, తమని సజావుగా బతకనియ్యరనే దిగులుతోనే ఆమె అలాఅన్నదిగాని; పట్టణ జీవిత వ్యామోహంతో కాదు.

వరసనే దెబ్బమీద దెబ్బతోబోడి కుంగిపోతున్నాడు. ప్రెసిడెంట్ ప్రోనోట్ కేసు డిక్రీ అయి పొలం జప్తుకూడ నిర్ణయమయి పోవటంతో బోడికి మరో గండం ఎదురయ్యింది. ఏ మాత్రం ఊపిరి సలుపుకుంటానికి గూడ వీలులేని నిర్బంధకాండ బోడిమీద కొనసాగింది. ఈ తీవ్ర నిర్బంధమే బోడిని ప్రెసిడెంటు మీద తిరగబడేలా చేసింది.,

"బాగ్గెమంతుడి పల్లకి భగుమంతుడే మోస్తున్న రాజ్యంలో ప్రత్యక్షంగా నేరంచేసేవాడు ఒకడయితే దానికి సూత్రధారి; తెరవెనుక నాటక రంగాన్ని సిద్ధంజేసేది మరొకడు. బోడి, ప్రెసిడెంటు వ్యవహారంలో తెరవెనుక సూత్రధారి కర్ణం. బోడిమొండిగున్నాడని గ్రహించిన ప్రెసిడెంటు వర్గం అతన్ని రాజీసాకుతో లొంగదీసుకుంటానికి కర్ణాన్ని ప్రయోగించింది. డబ్బులు లెక్కగట్టుకొని బోడి తన నలపై సెంట్ల భూమిని ప్రెసిడెంటుకి రిజిస్టరు చేసేటట్లు; బోడికి ప్రెసిడెంటుకి మధ్య నలుగుతున్న కేసులన్ని రద్దు చేసుకునేట్టుగా ఒక ఒప్పందానికి వచ్చి; అన్నింటిమీద సంతకాలు చేయించుకొని కొలతల్లో తిరకాసుబెట్టి నలఫైసెంట్ల భూమిని ముప్ఫై సెంట్లే ఉందని కర్ణం మాయ జేయబోయాడు. కర్ణం తండ్రికి; తరువాత కర్ణానికి బోడివాళ్ళు నలఫై సెంట్లకి శిస్తు చెల్లిస్తూనే ఉన్నారు. కాని ఇప్పుడు మాత్రం కర్ణం నలఫైసెంట్ల భూమిని ముఫైసెంట్లే అనేసరికి బోడి వాళ్ళకి కోపం నసాళానికంటింది. బోడి బావమరిది కర్ణాన్ని తప్పుడు 'లుచ్చా'వని తిట్టటమేగాదు కర్ణం లుచ్చా బుద్ధితో చేసిన తప్పుడు పనులని ఏకరువు బెట్టాడు. తెరవెనుక సూత్రధారులు ఎంతటి దుర్మార్గాలు చేయిస్తారో; అమాయకుల్ని ఎలామోసగిస్తారో తెలుసుకుంటానికి కర్ణం ఉదంతం సాక్ష్యంగా నిలుస్తుంది. కర్ణం చాణుక్య పాత్రని పోషించాడు. నలఫై సెంట్ల భూమికైతేనే రాజీగానీ లేకపోతే రాజీ లేనేలేదని కరాఖండీగా బోడి, అతని బావమరిది కర్ణంతో చెప్పారు. కోర్టు డిక్రీ గురించి కర్ణం చెబితే "కోరుటు డిక్కిరీ కానీయండి కోటేశ్వర సోవిడిక్కిరీ గానీయండి అణ్ణిమట్టుకు నాభూమిల అడుగెట్టనీయును"[19] అని బోడి చెపితే; అందుకు కర్ణం ప్రెసిడెంటు నిన్ను ఆభూమిలో అడుగుబెట్ట నీయడంటాడు. అప్పుడు బోడి "పెసినెంటుగోడు గాదు, ఆడి అమ్మమొగుళ్ళు ఒందమందిరి పోలీసోళ్ళని ఆడు యెలకేసుకొచ్చినా ఆడ్ని నాభూమిల అడుగెట్టనియ్యను"[20] అని తెగేసి చెప్పటం బోడి నిర్ణయాన్ని తెలియజేస్తుంది. చావో బతుకో ప్రెసిడెంటుతో తలపడి తేల్చుకుందామనే నిర్ణయానికొచ్చి, బోడి ఆ మాటలు చెప్పగలిగాడు. అతని చుట్టూతా పరుచుకొని ఉన్న పల్లేరు గాయ వాతావరణం, నిప్పుకణాల మీద నిలబడ్డ జీవవేదన అతని చేత ఈ మాటలు పలికించింది. పొలం దున్నే దున్నపోతుల్ని పోగొట్టుకొని అప్పులపాలై, కన్నకూతుర్ని బలిబెట్టుకొని, ఉన్న నేల తల్లిని పోగొట్టుకొనవలసిన పరిస్థితి దాపురించేసరికి బోడి ఈ తీవ్ర వత్తిడిని తట్టుకోలేక, అతని బాధా తప్త అస్తిత్వం నుండి ఈ తెగింపు మాటలు బయటకొచ్చాయి. అందుకనే జబ్బున పడి కొద్దిగా తేరుకొనే సరికి ప్రెసిడెంటు మనుషులు తనపొలాన్ని ఆక్రమించారనగానే బోడి, ఆరోగ్యాన్ని గూడ లెక్కచెయ్యకుండా తన చేను వైపు పరుగులు దీశాడు

ప్రెసిడెంటు ప్లాను సిద్ధం జేసి సిన్నారావుని, ఇంకొంత మంది మనుషుల్ని లారీమీద పంపించి బోడి భూమిని ఆక్రమింపజేశారు. ఈ నేలతల్లి, పోరులో ప్రెసిడెంటు

ఆస్తిదాహంలో ఇరుపక్షాల తలలు నేలకొరిగాయి. మొదటిగా బోడి భార్య నేలకొరిగితే, అవతలి పక్షం నుండి మొదటిగా సిన్నారావు తల నేలవాలింది. అన్యాయానికి గురైన వాడే, అన్యాయాన్ని ఎదిరించేవాడు అవుతాడు గనుక, ఊరి ప్రజలందరు ప్రెసిడెంటు సంజాదెబ్బ రుచి చూసినవారే గనుక బోడిపోరులో ఊరు ఊరంతా తిరగబడి ప్రెసిడెంటువర్గాన్ని తరిమికొట్టి ఆలారీకి నిప్పుబెట్టారు. ప్రెసిడెంటు, ప్రజాశక్తిముందు తలవంచి ఊరువిడిచి పారిపోవటం ప్రజావిజయం; అట్టడుగు ప్రజల ధర్మవిజయం. కాని సంపన్న వర్గం మూతులు నాకే పోలీసు వ్యవస్థ మాత్రం ప్రెసిడెంటు ఆస్తులకి కాపాలాదారుగా ఉంది. ప్రెసిడెంటుకి జామీనిచ్చారు గాని బాధితులైన బోడికి అతని బావమరిదికి, సూరప్పడికి, మాత్రం జామీను ఇవ్వకుండా జైల్లో నిర్బంధించారు. పాలకవర్గం ఎవరి కొమ్ముగాస్తుందో దీనిని బట్టి అర్థమవుతుంది. అధికార అందలం ఎక్కటానికి అట్టడుగు ప్రజల అండదండలు కావాలి; కాని అణచివేసేది మాత్రం పేదప్రజానీకాన్నే. న్యాయ, పోలీసు వ్యవస్థలు పాలకవర్గ కనుసన్నలలో మెలుగుతూ పాలిత పేద ప్రజల కంట్లో కారం జల్లుతుందనటానికి బోడి ఉదంతమే ఉదాహరణ.

"ఆధునిక పెట్టుబడిదారీ సమాజంలో అందరూ అందరితో పోరాడితీరాలి ఇదే దాని ప్రధానలక్షణం. ఈ మహాసంగ్రామం పోటీ రూపంలో వ్యక్తమవుతుంది. ఈ భయంకర యుద్ధం-మనిషి ప్రపంచంలో బ్రతకటం కోసం జరిగే ఈ యుద్ధం అస్తిత్వం నిలబెట్టుకోటానికి జరిగే ఈ యుద్ధం నిరుపేదల విషయంలో ఆమరణాంతం కొనసాగవలసి ఉంది. ఈ యుద్ధం వివిధ వర్గాల మధ్య మాత్రమే కాకుండా ఒక్కొక్క వర్గంలోని వివిధ శక్తుల మధ్యకూడా జరుగుతుంది. పెట్టుబడిదారీ సమాజంలో ప్రతివ్యక్తి ఇతర వ్యక్తుల మార్గంలో అడ్డంగా నిలబడతాడు. ప్రతివ్యక్తి ఇతర వ్యక్తుల్ని నెట్టి వేసుకుంటూ, తన మార్గాని కడ్డంగా ఉన్నవారి స్థానాన్ని ఆక్రమించుకోజూస్తాడు. పెట్టుబడిదారులు ఒకరితో ఒకరెలా పోటీపడతారో, అలాగే కార్మికులలో గూడ ఒకరితో ఒకరు పోటీపడతారు"[21] అనిఏంగిల్స్ స్పష్టం చేసారు. బోడి తన అస్తిత్వం కోసం పోరుసలిపితే, తన భూవ్యాప్తికి, ఆస్తి దాహానికి, సంపద విస్తరణకి అడ్డుగా ఉన్నాడు గాబట్టి బోడిని, అతని వర్గాన్ని అన్యాయంగా అంతం చెయ్యాలని ఇంతకుట్ర జరిపాడు ప్రెసిడెంట్. బోడిది అస్తిత్వ పోరైతే; ప్రెసిడెంటుది ఆస్తిపోరు. ఎదుటివాళ్ళు ఏమైపోయినా తన ఆస్తులు పెరిగితేచాలు. తన సంపదలు విస్తరిస్తేచాలు అంతేగాని ఏమాత్రం మానవత్వపు ఆలోచనకి తావివ్వని వ్యక్తి ప్రెసిడెంట్. ఈ సంపన్న వర్గ ఉక్కు పాదాలకింద చలిచీమల్లా నలిగి నాశనమై పోతుంది, అట్టడుగు ప్రజానీకం. అయితే ఈ అణచి వేత, ఈ అంతంజేసే హత్యల వాతావరణం నిరంతరాయంగా కొనసాగదని; అట్టడుగు ప్రజలు చరిత్రను మార్చిరాస్తారనే సత్యాన్ని ప్రపంచ చరిత్ర ఋజువుజేస్తుంది. పెట్టుబడి దారుల పాలనలో పాలిత పీడిత ప్రజానీకానికి న్యాయం జరుగుతుందనేది పెరుగు తోటకూరలోని పెరుగులాంటిది. ఈ వ్యవస్థలో పోలీసు, న్యాయశాఖలు ఆవుల మందకి పులికాపలా లాంటివి. అందుకని ఎవరి బానిస సంకెళ్ళు తెంచుకుంటానికి వారు పోరు చెయ్యాలి. బాధలనుండి విముక్తి పొందటానికి; అణచివేత నుండి స్వేచ్ఛను పొందటానికి; దోపిడీ నుండి బయటపడటానికి, దురన్యాయం నుండి, దుస్థితి నుండి, దుర్మార్గం నుండి సమతా లోకంలో అడుగుబెట్టాలంటే అస్తిత్వ పోరుదప్పదు. అస్తిత్వ జీవనపోరు

చైతన్య మార్గం వైపు దారి చూపుతుంది. ఆ బాటలోనే చివరకు బోడి పయనించాడు. కాబట్టే "జామినిస్తె బైటికి ఎల్తాను. ఇవ్వకపోతే గోడలుగుద్ది బద్దలుకొట్టయినా బైటికెల్తాను. ఎల్తాను- ఎల్లి ఆపెసినెంటుగోణ్ని నరుకుతాను. నరికి ఆ నెత్తురు నాపెల్లం నేలకొరిగిన సొటా, నాజగిలీడు పేనాలిడిసిన సోటా నా బూదేవత మీనజల్లుతాను విందుకు తిరుగునేదు. విదినా మాట చిలాచ్చరాలమాట"[22] అని బోడి నేల బద్దలయ్యేట్టు, నింగి నిలువున చీలి పొయ్యేట్టు చెప్పగలిగాడు. కనుక అస్తిత్వపు పోరు జీవన చైతన్యానికి మార్గం జూపుతుందని రావిశాస్త్రి 'సొమ్ములు పోనాయండి' ద్వారా ఋజువు చేసారు. అన్యాయం అంతమవుతుంది. సంపన్నవర్గ దౌర్జన్యం, దోపిడి, కుప్పగూలిపోతుందని; అసంఖ్యాక అట్టడుగు ప్రజానీకానిదే అంతిమ విజయమని మార్క్సిస్ట్ అవగాహనతో రావిశాస్త్రి సూచించారు. ఖచ్చితమైన వర్గదృక్పథాన్ని రావిశాస్త్రి దీనిలో కనబరచారు. పాలిత పీడిత ప్రజల పక్షాన రావిశాస్త్రి, రచయితగా నిలవటమే గాదు ఆయన వ్యక్తిగా గూడ ఈ వర్గ పక్షాన నిలబడ్డవారే. ఈ దృష్ట్యా 'సొమ్ములు పోనాయండి' ఉత్తమ నవల.

'రత్తాలు-రాంబాబు'లోని కొంగరిక్షా అతను చేసిన ఉపన్యాసధోరణి మాటలన్నీ మార్క్సిస్ట్ దృక్పథం లోనివే. మార్క్సిస్ట్ సిద్ధాంత సారాంశాన్ని మాటల్లో దింపాడా అనే అంతగా అతని వాడిమాటలున్నాయి. రావిశాస్త్రి రచనా దృక్పథం ఈ కొంగమాటల్లో ద్యోతకమవుతుంది. ఆయన ఏవర్గం వైపు మొగ్గుచూపాడో, ఎవరి పక్షాన నిలబడ్డాడో గూడా స్పష్టమవుతుంది. "పులి మేకల్ని తినడం నోక దరమమైతే...... గుండెట్టి మనం పుల్ని కాల్సిసి నోక దరమం మార్చడం"[23] అసలైన ధర్మమవుతుందని కొంగయూనియన్ ప్రెసిడెంటుతో వాదిస్తాడు. దుర్మార్గం దౌర్జన్యం లోకధర్మంగా విస్తరించి, ఉన్నప్పుడు; వాటి కోరల్లో చిక్కుకున్న బాధితులు వాటినుండి విముక్తి పొందటానికి పోరాటాలు చేయవలసి ఉంటుందని; పీడనకు గురైనవాడు తప్పకుండా తిరగబడతాడనే వాస్తవాన్ని శాస్త్రి వెల్లడి చేసారు. అసంఖ్యాక బాధితులంతా చైతన్యంతో తిరగబడే రోజొస్తుందనే ఆశావాదాన్ని గూడా కొంగ వ్యక్తం జేస్తాడు. పీడిత ప్రజలను ఐక్యపరచవలసిన విద్యావంతులు చీలికలు పేలికలుగా చెల్లాచెదురవటాన్ని కొంగవిమర్శించటం గూడ సామాజిక వాస్తవిక మార్గాన్ని; నడుస్తున్న రాజకీయ బాటను పట్టి చూపినట్లైంది. బానిసగా బతకటం కంటే పోరాడి చావటం మేలని కొంగజెప్పటం మార్క్సిస్ట్ ధోరణి గాక మరేమవుతుంది. ఇది మార్క్సిస్ట్ మార్గమా? మరోమార్గమా అనే కంటే ఇది సామాజికంగా ఆశించవలసిన మార్గం అని మాత్రం నిర్ద్వందంగా చెప్పవచ్చు.

'ఇల్లు' నవలలోని నక్సల్స్ రాజకీయాలు వివాదాస్పదమైన వైనప్పటికీ సామాజిక మార్పును కాంక్షిస్తున్నాయి గనుక ఇది కూడా ఆశించదగ్గ పరిణామమే. అసలు సామాజిక ప్రయోజనం లేకుండా రావిశాస్త్రి రచనా వ్యాసంగం. కొనసాగదని ఒక్కమాటలో చెప్పవచ్చు. ముద్రతో ఉన్నా; ముద్రలు వేసుకొని తిరక్కుండా ఇజమ్స్‌లో ఇరుక్కోకుండా నిజాయితీగా మానవతా భావంతో మార్క్సిస్ట్ దృక్పథంతో రచనలు జేసి అసంఖ్యాక పీడిత, అట్టడుగు ప్రజల పక్షాన నిలిచి నిండుమనసుతో సామాజిక మార్పుని కాంక్షించిన ప్రగతివాద ప్రజారచయిత రావిశాస్త్రి. ప్రత్యేక శాస్త్రంగా మార్క్సిజాన్ని అధ్యయనం చేయలేదంటూనే మార్క్సిస్ట్ భావ జాలంతో రచనలు జేసిన ప్రగతి కాముకులు, రావిశాస్త్రి.

# 6. రావిశాస్త్రి-ప్రభావం

"గొప్పవ్యక్తులు ఒకేవిధంగా ఆలోచిస్తారు" అన్నట్లు తరాల వ్యత్యాసమున్నా; ఆలోచనా పరిధిలో సామీప్యతలుండవచ్చు. రావిశాస్త్రి తన కాలానికి చెందిన రచనలతోనే గాకుండా; ప్రాచీన సాహిత్యాన్ని గూడ అధ్యయనం జేసి, స్ఫూర్తి పొందారు. అలానే రావిశాస్త్రి రచనలు ఎందరికో స్ఫూర్తి నిచ్చాయి; ప్రేరణ గలిగించాయి. ప్రభావాన్ని చూపాయి.

1970 వరకు వచ్చిన డిటెక్టివ్, ఇతర ఆంగ్ల నవలల్ని హెచ్చుభాగం చదివినట్లు రావిశాస్త్రే చెప్పుకున్నారు. "పానుగంటి"ని గూడ బాగచదివినట్లు ఆయన చెప్పారు. చార్లెస్ డికెన్స్; చెహోవ్ అంటే రావిశాస్త్రికి విపరీతాభిమానం. జేమ్స్‌జాయిస్; శ్రీశ్రీల ప్రభావం గూడ తనపై ఉన్నట్లు శాస్త్రి అంగీకరించారు. తన సమకాలీన సాహిత్యాన్ని; ముఖ్యంగా వచన సాహిత్యాన్ని శాస్త్రి అధ్యయనం చేసి తద్వారా ఎంతో స్ఫూర్తి పొందారు. గురజాడ వారసత్వాన్ని రావిశాస్త్రి కొనసాగించారని విమర్శకుల అభిప్రాయం.

అలానే రావిశాస్త్రి కథా; నవలా, నాటక సాహిత్యం ఎందరికో స్ఫూర్తినిచ్చింది. ముఖ్యంగా రావిశాస్త్రి నవలల ప్రభావం 'బీనాదేవి'; 'పతంజలి'; అర్నాద్; భూషణం; అల్లం రాజయ్య; మొ॥వారిపై ఉంది. శాస్త్రి మాండలిక భాషలో చేసిన రచనలు 'నామిని'లాంటి వారికి స్ఫూర్తి నిచ్చి ఉండవచ్చు. రావిశాస్త్రి ఇతరుల నుండి పొందిన ప్రభావాన్ని ఆయన తన రచనల ద్వారా ఇతరులపై కలిగించిన ప్రభావాన్ని రేఖామాత్రంగా పరిచయం చేయటమే ఈ అధ్యాయంలోని ఉద్దేశ్యం.

## I. డికెన్స్- రావిశాస్త్రి

రావిశాస్త్రికంటే శతాబ్ది ముందు పుట్టిన (07-2-1812) చార్లెస్ డికెన్స్ నవలా సాహిత్యం (15) శాస్త్రిని బాగా ప్రభావితుణ్ణి జేసింది. సాహిత్య పరంగానే కాకుండా; వ్యక్తిగత జీవితాలు గూడ వీళ్ళిద్దరివి దగ్గరగా ఉన్నాయి. ఇద్దరూ సాధారణ కుటుంబీకులే. పేదల పట్ల ఆర్ద్రత; వ్యవస్థపై కసివున్నవారు. సామాజిక మార్పుని ఆశించారు. డికెన్స్ తన మరదలు మేరీని రెండవభార్యగా స్వీకరించే వాడేమోగాని; ఆమెతో ప్రేమాయణం మెదలుబెట్టిన సంవత్సరానికే ఆమె మరణించింది. రావిశాస్త్రి శ్రీమతి రామంగారిని రెండవభార్యగా స్వీకరించిన సంగతి తెలిసిందే;

"He was the friend of mankind, a philantrophist in the true sense, the friend of youth, the friend of the poor; the enemy of every form of meanness and oppression men seem to have lost, not a great writer only; but one whom they had personally known"[1]అని; అంతేగాక ఒకటాక్సీ అతను 'మాజీవితాలనుద్ధరిస్తాడనుకున్న మహానుభావుడప్పుడే కాలధర్మం చెందాడా' (9-6-1870) అని డికెన్స్ గురించి విలపించాడంటే; డికెన్స్ ప్రజాభిమానాన్ని ఊహించుకోవచ్చు. రావిశాస్త్రిని మిత్రులు, సాధారణ ప్రజానీకం, ఉద్యమకారులు ప్రజాసంఘాల కార్యకర్తలు అంతగా అభిమానించే వారనటంలో సందేహంలేదు.

పాఠకుల్లో గాఢానుభూతిని, రచనల్లో నిమగ్నతను కలిగించే శక్తి డికెన్స్‌కుంది. అందువల్లే డికెన్స్ రచనలు విశేష ప్రజాభిమానం పొందాయి. రావిశాస్త్రిలో గూడ ఈ

సమ్మోహనశక్తి ఉంది. 'దిపిక్ విక్ పేపర్స్', 'ఆలివర్ ట్విస్ట్', 'డేవిడ్ కాపర్‌ఫీల్డ్' డికెన్స్ నవలల్లో ప్రఖ్యాతి గాంచినవని విమర్శకుల అభిప్రాయం 'ఏ టేల్ ఆఫ్ టూ సిటీస్'; 'హార్డ్ టైమ్స్' కూడ ప్రసిద్ధ మైనవే. 'ది పిక్ విక్ పేపర్స్' అనే నవల అతి కొద్ది నెలల్లోనే నలభై వేల నుండి ఒకేసారి నాలుగు లక్షల కాపీలు ముద్రించవలసినంత పాఠక ఆదరణను పొందింది. రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు' కూడ అంతగా గాకపోయినా; విపరీత పాఠకాదరణ పొందింది. 'Living Shakespeare' అని డికెన్స్‌కు పేరుంది. అయితే రావిశాస్త్రి ఇలాంటి బిరుదులకు దూరం. ప్రభుత్వ అవార్డులకు మరీ దూరం. డికెన్స్ నవలల్ని చదివిన రష్యన్ సోదరులు డికెన్స్‌ని 'Gogols Brother' అని పిలిచేవారట. అలాగే శాస్త్రి నవలలు రష్యన్ భాషలోకి అనువదించబడితె; ఆయనను కూడ సోవియట్ ప్రజలు అలా ఆదరిస్తారనటంలో సందేహం లేదు.

కాఫ్కా తన 'అమెరికా' (1938) నవల డేవిడ్ కాపర్‌ఫీల్డును అనుకరిస్తు రాసానని చెప్పుకున్నారు. బాల్జాక్, దస్తవ (డోస్టా) యస్కీలంతటి గొప్పవాడు డికెన్స్ అని కాఫ్కా అభిప్రాయం. తెలుగు నవలా సాహిత్యంలో శాస్త్రి అనుచర గణంచాల ఉంది. డికెన్స్ స్థాయిగల నవలాకారుడు రావిశాస్త్రి. ఇంగ్లండులో షేక్స్పియర్ తరువాత అంతటి గొప్ప రచయిత డికెన్స్. ఫ్రాయిడ్ గూడ డికెన్స్‌ని అనుసరించాడు. 'డేవిడ్ కాఫర్‌ఫీల్డు'లో తండ్రీ బిడ్డల బాంధవ్యానికి ఫ్రాయిడ్ ఆకర్షితుడయ్యాడట.

19వ శతాబ్దిలో చాల అరుదైన ఉత్తమ పురుష కథన పద్ధతిని డికెన్స్ 'డేవిడ్ కాఫర్‌ఫీల్డు'లో ప్రవేశపెట్టాడు. రావిశాస్త్రి మూడు నవలల్ని ఈ పద్ధతిలో రాసారు. రాజునుండి పేదదాక డికెన్స్ నవలలు చదివేవారు. తమ కాలధర్మాలకి అనుగుణమైన సాహిత్యాన్ని డికెన్స్ ప్రచురించారు. శాస్త్రి కూడ తన జీవిత కాలపు యుగ ధర్మాన్ని ప్రతిబింబింపజేసారు.

పేదరికాన్ని, మధ్యతరగతి జీవితాలని ఇద్దరూ బాగా పరిశీలించారు. సామాజిక దుర్మార్గత్వాన్ని, రాజకీయ అవినీతిని. పోలీసు, న్యాయ వ్యవస్థల అక్రమ పనితీరును వీరిరువురు తమ రచనల్లో తూర్పార బట్టారు. తమ రచనల ద్వారా అశేష అభిమాన పాఠకుల్ని, ఆదరించే సాధారణ ప్రజానీకాన్ని సంపాదించుకున్నారు. కాలాను గుణమైన మార్పుల వల్ల రావిశాస్త్రి రచయితగానేగాక, వ్యక్తిగా కూడ ప్రజల పక్షాన నిలిచి, వాళ్ళ సమస్యల కోసం స్పందించి; తన శక్తి మేర పాటుబడి ప్రజాభిమానం పొందారు.

వర్ణనల్లో, వాక్య నిర్మాణంలో, సాధారణ ప్రజల జీవద్భాషని వాడటంలో, ఇతివృత్త స్వీకరణ, నిర్వహణల్లో, సాంఘిక అన్యాయాన్ని ఎండగట్టేట్టుగా రచనలు చెయ్యటంలో, డికెన్స్‌కి, రావిశాస్త్రికి దగ్గరి పోలికలున్నాయి. "It were in our openion an offence against humanity to place M.V. Dickens among the greatest novelist"[2] అని హెన్రీ జేమ్స్ డికెన్స్‌ని అంచనా వేశారు. రావిశాస్త్రి నవలలు గూడ మానవత్వానికి నీరాజనాలందించినవే.

'అల్పజీవి' పై జేమ్స్ జాయిస్ 'యులిసిస్' ప్రభావముంది. చెహోవ్ 'కెమీలియన్' కథని శాస్త్రి సరాసరి తన 'రత్తాలు-రాంబాబు'లో స్వీకరించి; చెహోవ్‌పై అభిమానాన్ని కనబరచారు. అలెగ్జాండర్ కుప్రిన్ ప్రభావం శాస్త్రిపై ఉంది.

## 2. యమకూపం - రత్తాలు-రాంబాబు

రష్యన్ రచయిత, నవలా కారుడు, విమర్శకుడైన అలెగ్జాండర్ ఇవానో విచ్ కుప్రిన్ (1870-1938) 1904వ సం॥లో 'యామాదిపిట్' (Yama Thepit) అనుప్రపంచ ప్రఖ్యాతి గాంచిన నవలను రచించాడు. ఈ నవల మొదటిసారిగా ప్రచురించబడినప్పుడు ప్రపంచాన్ని ఒక కుదుపుకుదిపింది. నాటి సోవియట్ జారు చక్రవర్తులు ఈ ప్రచురణతో అతలాకుతల మయ్యారు. వేశ్యరికాన్ని ఇతివృత్తంగా మలిచి వ్రాసిన ఈ నవల ప్రపంచంలోని పలుభాషల్లోకి అనువదింపబడింది. ఇది ప్రచురింపబడిన దాదాపు అర్థశతాబ్ది తరువాత తెలుగులోకి 'యమకూపం' పేర్న రెంటాల గోపాలకృష్ణ అనువదించారు.

రావిశాస్త్రి రచించిన నాలుగు సంపుటాల అంసపూర్ణ నవల 'రత్తాలు-రాంబాబు' లో గూడ వేశ్యల జీవితమే ప్రధాన ఇతివృత్తం. 'యమకూపం' నవల ఏ సమస్యమీదైతే నడిచిందో; ఆ సమస్య; ఆసాని కొంపలు; చివరకు ప్రభుత్వ ఉత్తరువుతో అంతమవుతాయి. ఒక పరిష్కార మార్గం లభించినట్లుగా నవల ముగింపు ద్వారా తెలుస్తుంది. అయితే 'రత్తాలు-రాంబాబు' అసంపూర్ణ నవల గనుక సానికొంపలు అంతరించినట్లుగాని; వేశ్యల జీవితాలు పరిపూర్ణంగా ఉద్ధరింప బడినట్లుగా గాని; దాఖలాలు లేవు.

అయినప్పటికీ 'యమకూపా'నికి, 'రత్తాలు-రాంబాబు'కి, చాల పోలికలున్నాయి. 'రత్తాలు-రాంబాబు'లో నరసమ్మ కంపెనీకి పోటీగా షేక్ బంగారప్ప కంపెనీ ఉన్నట్లుగానే 'యమకూపం'లో అన్నా మార్కోవనా సానికొంపకు పోటీగా (ట్రెప్పెల్సు), సోఫియా వాసిలెవనా కంపెనీ, 'కీస్' కంపెనీలు గూడ వున్నాయి. పేర్లు, ప్రాంతాలు, కాలం వేరుగాని, దుర్భరంగా దుఃఖమయంగా, అంతరించి పోతున్న స్త్రీల జీవితాల్లో అక్కడా, ఇక్కడా పెద్దగా తేడాలేదు. ఇక్కడో రత్తాలో; ముత్యాలో, జలజో, పైడితల్లో, సచ్చాలో, జాంబవతో, సరసో; సుబ్బులో కావొచ్చు; అక్కడో జెన్నీనో, పాషానో, మంకానో, టమారానో, ల్యూబానో, ఫెక్లానో; నైనానో; జోయానో ఇంకా ఎందరో వేశ్యలు కావచ్చు. ఎవరైనా వాళ్ళ జీవితాలు ముళ్ళ కంచెల్లో చిక్కుకు పోయాయనేది వాస్తవం.

ఈ నవల రాసినందుకు జారిష్టు రష్యా కుప్రిన్‌ను నానాయాతనలు బెట్టింది. నవలను తగలబెట్టించి, దాడులు చేయించింది. ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో 'ప్రజాస్వామ్య ప్రభుత్వం' రావిశాస్త్రిని నిర్బంధించింది. ఆయన జైలునుండే 'రత్తాలు-రాంబాబు' రచించారనేది తెలిసిందే. ఇద్దరూ పీడిత ప్రజల మేలు కోరుకునే ప్రగతి కాముక రచయితలు.

'యమకూపం' ఒక్క వేశ్యరికం మీదే నడిస్తే; 'రత్తాలు-రాంబాబు'లో కాలానుగుణ మైన ఇతర సన్నివేశాలు. గూడ చోటు జేసుకున్నాయి. వర్గదృష్టి. నడుస్తున్న చరిత్ర రావిశాస్త్రి నవలలో చోటు జేసుకుంటే; కేవలం వేశ్య జీవితాలకే పరిమితమైంది. కుప్రిన్ రచన 'సినిమా పోకడ' శాస్త్రి రచనలో చోటు జేసుకుంది.

సింహాచలం బ్రోకర్‌గా; దొంగగా; అమ్మాయిలను తార్చేవాడిగా; అమ్మాయిలను అమ్ముకునే వాడిగా; దగుల్బాజీ వెధవగా; దొంగ పెళ్ళిళ్ళ నాటకకర్తగా 'రత్తాలు-రాంబాబు'లో దర్శనమిస్తాడు. వీడే పరమ నికృష్టుడనుకుంటే ఇంతకుమించిన నీచాతి

నీచమైన దుర్మార్గుడు 'యమకూపం'లోని గోరిజాంట్. రకరకాల మారుపేర్లతో మోసాల నుండి సింహాచలం లాగే తప్పించుకు తిరుగుతాడు. రత్తాల్ని పెళ్ళి చేసుకుంటానని మోస గించి చేసుకోకుండా నరసమ్మ కంపెనీకి అమ్మి; తనతోపాటు మరోమిండగాణ్ణి సుఖపెట్ట మని; అతణ్ణి సింహాచలం; రత్తాలు దగ్గరికి తీసుకెళ్ళితే; గోరిజాంట్ తన భార్యనే (ఎన్నో భార్యో) ఖార్కోవసాని కొంపకి అమ్మిన ఘనుడు. సింహాచలం చరిత్ర గోరిజాంట్ ఘన చరిత్ర ముందు ఆగదు. స్త్రీలను వలవేసి పట్టుకొంటంలో, నమ్మించి మోసగించి, కంపెనీ లకి అమ్మటంలో; అవసరమైతే తాత్కాలిక భర్తగా నటించి; వాళ్ళను నట్టేట ముంచటంలో గోరిజాంట్‌కి అతనే సాటి. సింహాచలం షేక్ బంగారప్ప కంపెనీ దగ్గర ఎడ్వాన్సు తీసుకొని, రత్తాల్ని మాత్రం నరసమ్మ కంపెనీకి అమ్మినట్లు; గోరిజాంట్ గూడ ఈ వ్యాపారం జోరుగా జేస్తాడు. గోరిజాంట్ నలుగురు అమ్మాయిలను తెచ్చి వాళ్ళను వెయ్యిరూబుల్స్‌కి బేరం పెడతాడు. సింహాచలం గాని రత్తాల్ని వేయి రూపాయలకి నరసమ్మకి అమ్మినట్లు; చివరకి గోరిజాంట్ ఆ నలుగురిని ఐదువందల రూబుల్స్‌కి అమ్మిన నీచుడు. వీళ్ళను కొన్న కంపెనీ ఓనరమ్మని "దయచేసి నీవొకపని చేయాలి. నీవు నాపిన తల్లివని చెప్పు" అని ఒప్పించి ఈ బేరం సెటిల్ చేస్తాడు గోరిజాంట్. సింహాచలం గూడ నరసమ్మని "నరసమ పినమా" అని సంబోధిస్తాడు. సింహాచలం పెళ్ళి జేసుకోకుండానే ఈ వ్యాపా రాన్ని నెట్టుకొస్తే; గోరిజాంట్ పదిహేను పెళ్ళిళ్ళు వ్యాపారం కోసమే చేసుకున్న దుష్టపాత్ర. సింహాచలం; గోరిజాంట్‌లు ఇద్దరూ ఒకే వర్గంలోని వారే ఐన్నా; పాడవుల్లో కొద్దిగా హెచ్చు తగ్గులున్నాయి. ఇద్దరూ దగుల్బాజీ వెధవలే; డాఫర్లే, "డాకూనాకొడుకులే".

'యమకూపం'లో సిమన్ అమ్మాయిలపై నిఘావేసి కాపలాదారుగా; అవసరమైతే వాళ్లను చితకబాదే వాడిగా దర్శనమిస్తే; 'రత్తాలు-రాంబాబు'లో 'మాయ్య' కూడ దాదాపుగా ఇదే పని జేసేవాడు. బంధువుగా నరసమ్మకు దగ్గరై; ఆమె కంపెనీకి సంబంధించిన అంతర్గత వ్యవహారాలని చూస్తుండేవాడు ఆత్మహత్య చేసుకోబోయిన రత్తాల్ని చితకబాదిందీ ఇతనే; మొదటిసారి కంపెనీ నుండి తప్పించుకోబోయిన రత్తాల్ని బలవంతంగా రిక్షాలో ఎక్కించుకొచ్చి; మళ్ళీ ఆ నరకంలోకి నెట్టిందీ ఇతనే. కంపెనీ వ్యవహారాలపై ఇతని అజమాయిషి వుంటుంది.

కంపెనీ నుండి విముక్తి బొంది; మళ్ళీ తిరగి సానికొంపకే వచ్చిన ల్యూబాను అసహ్యించుకొని యజమానురాలు 'ఎమ్మా' ఆమెను తీవ్రంగా హింసిస్తుంటే సహించలేక జెన్నీ; ఆమెపై తిరగబడుతుంది. దాంతో సానికొంపలో సానుల మధ్య తీవ్ర గలాటా జరుగుతుంది. అప్పుడు కాపలాదారుడైన సిమన్, మరి కొంతమంది రౌడీలను కూడ, తీసుకొచ్చి; ఈ అమ్మాయిలను అమానుషంగా; చితకబాదుతాడు ఈ పాత్రల స్వభావంలో గూడ సిమన్‌కి 'మాయ్య'కి పోలికలున్నాయి.

ప్లాటునోవ్ పత్రికా రచయిత. వేశ్యల జీవితాల్ని; సాని కొంపల వ్యవహారాల్ని; పరిశోధిస్తుంటాడు. ఎప్పుడూ వాళ్ళతో శారీరక సంబంధాలకి లోనుగాలేదు. వేశ్యలతో శారీరక సంబంధాలు లేకుండా, ఈ సాని కొంపలో పడి వుండటమెందుకని; శృంగారాన్ని కొనుక్కుంటానికి సానికొంప కొచ్చి ప్రశ్నించిన లిఖోనిన్ అనే విద్యార్థికి ప్లాటునోవ్ చెప్పిన జవాబు వింటే గుండెలు తరుక్కుపోతాయి. "వీరి జీవితంలోని భయంకరమైన నగ్న

సత్యం నన్ను ఆకర్షించింది. సత్యాన్ని దాచిపెట్టే ముసుగులేదిక్కడ. అబద్ధం, ఆడంబరం, మోసం; డంబాచారం ఇవి మచ్చుకైనా ఇక్కడ అగుపించవు..... నేనొక పడువుకత్తెను...... రండి కావల్సిన వారంతా రండి. అనుభవించండి. సిద్ధంగా వున్నాను. ఎవరినీ కాదనను మిమ్మలను తృప్తిపరచటమే నావిధి.... ఈ క్షణికమైన ఆనందానికి ప్రతిఫలం నాకు ఏమి ఇవ్వాల్సి వుంటుందో తెలుసా! జబ్బు, డబ్బు, అసహ్యం, అవమానం, ఇవి మాత్రం ఇచ్చిపోవాలి. అంతే అంటుంది ప్రతిసాని"[3]

ఈ భావమే 'రత్తాలు-రాంబాబు'లో గూడ కనిపిస్తుంది. ముత్యాలు-రాంబాబుతో 'బాబూ! ఏది కంపెనీల సరుకునోకం, నరకనోకవేగాని దయగల దేవుడినోకం కాదు.... డబ్బిస్తాను రాయేనంజా అంటే ఒవుడు పిల్చినా ఎల్లాల! డబ్బిచ్చేసినాను పోయే నంజా అంటే పోవాల; పోనీ ఆడబ్బయిన ఉంటదా అంటే.... ఓనర్లకి నెక్కసెప్పాల, ఆళ్ళకి సకం వోటా ఇయ్యాల, ఆళ్ళు నన్ను కొన్న డబ్బుకి నానే ఒడ్డీ కట్టాల; నా కోకలు నానే కొనుక్కోవాల, నాతిండి నానే కొనుక్కు తినాల, నాజుల్మానా నానే కట్టుకోవాల-మరింక ఈ నంజపురుగులు పట్టేసిన పండు కుళ్ళిపోయినట్టు కుళ్ళు నంజయిపోనాది, దీనికి కర్సుల్దండగ తప్ప ఎంతపిండినా నాలుగు నెత్తురు బొట్లయినా రాలవన్సెప్పి జులమానాకి అప్పుయినా ఇయ్యక ఓనర్లొగ్గేసి నారంటే చెంట్రల్ జెయిలుకి నానెఎల్లాల"[4] అని హృదయ విదారకంగా చెప్పిన తీరు కాదనలేని సత్యం. ఈ సహానుభూతే ఈ రెండు నవలల మధ్య వ్యాపించి వుంది. కృష్ణ, రాంబాబులతో ముత్యాలు ఆసుపత్రిలో బాధాకరంగా మాటాడిన నగ్న సత్యాలన్నింటిని ఇక్కడ కోట్ చెయ్యవచ్చు; ఫెక్లా అనే వేశ్య ఒక్కరాత్రే ముప్ఫైఆరు (36) మంది విటులతో సంభోగాన్ని నెరపిన దుస్థితిని కుప్రిన్ వర్ణించాడు. రావిశాస్త్రి, కుప్రిన్ ఇద్దరూ వీళ్ళ దీనస్థితిగతులను వాస్తవంగా వివరించి, సామాజిక సానుభూతిని వాళ్ళపై మళ్ళించటంలో కృతకృత్యులయ్యారు.

మోసగాళ్ళ వలలో చిక్కుకుపోయిన రత్తాలు, ముత్యాలు, సచ్చాలు, రత్తాలు-రాంబాబులో కనిపిస్తే; విద్యార్థి మోసానికి గురైన న్యూరా; ల్యూబా; టీచర్ చెరలో చిక్కిన జ్యోసా; ప్రేమికుని మోసానికి గురైన టమారా, కన్న తల్లిదండ్రులే అమ్మేసిన దీనస్థితిలో చిక్కి, డాక్టరు కామదాహానికి బలైసానికొంపలో దిగబడిపోయిన జెన్నీలు, 'యమకూపం' లో దర్శనమిస్తారు. యువతుల దుస్థితి; వాళ్ళ దీనగాథలే రెండిటిలోను ఉన్నది.

జెన్ని తన దీనస్థితిని వివరిస్తూ "ఆనాటి నుండి ఈనాటి వరకు ఎన్ని చేతులు మారానో, చెప్పలేను ఇవానిచ్. కాని ఒక్కడైన కనీసం ఒక్కడైన నన్ను మనిషిగా స్వీకరించాడా! మనిషిగా ఆదరించాడా! లేదు వాళ్ళ దృష్టిలో నేనొక నులిపురుగును. అనాథకంటే, బిచ్చగత్తెకంటే, దొంగకంటే, హంతకుడి కంటే, హీనమైన దాన్ని నేను... నేనేమీ కాదు, పబ్లిక్ భోగందాన్ని;"[5] ఈ విశాల సృష్టిలో అందరూ నన్ను అనుభవించ వచ్చని ఎంతో ఆవేదనతో సాని జీవిత వాస్తవాలను బయలు పరచింది జెన్ని.

ముత్యాలు ఆసుపత్రిలో రాంబాబు, కృష్ణల దగ్గర లోకంలో చదువుకున్న వారితో పాటు అందరూ ఎవరి బతుకులు వారు జూసుకుంటున్నారే గాని; తమలాంటి బాధితుల గురించి ఎవరూ ఆలోచించటం లేదని బాధపడుతుంది.

"మీ ఉజ్జోగాలూ, మీ పెల్లం బిడ్లూ మీ సంసారాలూ మీ బోగ బాగియాలూ మీయి! మానిసాని పద్దులు, మా అరువు కేకలు, మాగెంజిసాలని బతుకులు, గంటగంటకీ ఏ

దొంగ నాకొడుకుతోనో ఒహిడితో మాబుకింగులు; సివరికి జబ్బులు కడాకి కాలవగట్టంటో, ఆసుపత్తిరి కొట్లంటో మాసావులూ మాయి"[6] అని ముత్యాలు కఠోసత్యాన్ని బయట బెట్టిన తీరు జెన్ని ఆలోచనల కన్న భిన్నమైనవి కావు.

జెన్ని లోకాన్ని, విటుల్ని ద్వేషించినంతగా ముత్యాలు ద్వేషించలేదు. తన జబ్బుకి; లోకస్థితికి విసిగెత్తిపోయి జెన్ని ఉరిపోసుక చనిపోయింది. అప్పుడు పోలీసులు రంగప్రవేశం చేసి నిర్వహించిన పాత్ర రత్తాలు-రాంబాబులోని నరసమ్మ కంపెనీకి, పోలీసులకి ఉన్న సంబంధాన్ని జ్ఞప్తికి తెస్తాయి. పోలీసాఫీసర్ కెర్బష్ డబ్బుతో జెన్నీ రిపోర్టును కంపెనీకి అనుకూలంగా మలచటం; నరసమ్మ కంపెనీకి, పోలీసులకు వున్న లాలూచీ వ్యవహారాలతో ముడిబడి వున్నట్టిదే.

టమారా అనే వేశ్య ఎమ్మా సానికొంప వ్యవహారాలని; యజమానురాలు స్థానంలో కొంతకాలం నిర్వహిస్తుంది. అలానే ముత్యాలు గూడ నరసమ్మ లేనప్పుడు సానికొంప వ్యవహారాలను నిర్వహించింది. శంకా టమారాని హృదయ పూర్వకంగా ప్రేమిస్తాడు. రిక్షాజోగులు కూడ ముత్యాల్ని తన హృదయాంతరాలలో దాచుకుంటాడు. ఆమెతో కాపురం చెయ్యాలని మనసుపడతాడు. ఆమె శరీరం మలినమైన మనసుమాత్రం ముత్యమేనని మరోసారి నమ్ముతాడు. శంకా, టమారాలు సాని కొంప నుండి బయటపడి సుఖంగా; అన్యోన్య దాంపత్య జీవితాన్ని గడపాలని కోరుకుంటారు. అందుకు కావలసిన ప్రయత్నాలు గూడజేస్తారు. అలానే రిక్షా జోగులు, ముత్యాలు గూడ నరసమ్మ కంపెనీ నుండి స్వేచ్ఛామయ లోకంలో అడుగుబెట్టి సాంసారిక జీవితాన్ని నిర్వహించుకోవాలని ఉవ్విళ్ళూరుతారు. అయితే ఆర్థిక పరిస్థితి అందుకు అనుకూలించదు. తెగించి బయటకు వెళదామనే ప్రయత్నాలు గూడ వీళ్ళు చేయలేదు. కాని నవల పూర్తైవుంటే రావిశాస్త్రి తప్పనిసరిగా రిక్షాజోగుల్ని, ముత్యాల్ని స్వేచ్ఛాలోకంలోకి తీసుకొచ్చి వుండేవారని; ఆ నవలా పోకడ తెలియజేస్తూంది. 'యమకూపం'లో శంకా, టమారాలు సాని కొంప నుండి బయటబడటం ఆహ్వానింపదగిన పరిణామం. వీళ్ళిద్దరు బయట పడటమే గాదు. చివరకు అందరి జీవితాలు ఆ సానికొంపల కబంధ హస్తలనుండి బయటపడి ఆ సానికొంపలే అంతరించి పోవటం సామాజిక చైతన్యానికి నిదర్శనం.

'యమకూపం' 'రత్తాలు-రాంబాబు'లలో ఇతివృత్తం సాని కొంపల చుట్టూ పరిభ్రమించింది. సాధారణ జీవితాల కంటె భిన్నమైన జీవితాల చీకటి తెరను తొలగించి; వాళ్ళ వాస్తవిక దైనందిన దీనగాథల్ని అక్షరబద్ధం చేసారు; ఈ రచయితలు, కొన్ని తేడాలున్న; ఎక్కువ భాగం కథకి, పాత్రలకి రెండు నవలల్లో దగ్గర పోలికలున్నాయి. నిర్వహణలో మార్పులున్నా; వస్తువు ఒకటే గనుక; ఇవి దగ్గరగా కనిపిస్తాయి. రచయిత లిద్దరి ప్రతిభ; లోకానుభవం; ప్రాపంచిక దృష్టిగూడ అందుకు బాగా దోహదం చేసింది.

### 3. పుణ్యభూమీ-కళ్ళుతెరు (హ్యాంగ్ మి క్విక్)

విషయ వివరణలో, ఒక అంశాన్ని కేంద్రీకృతంగా వివరించేటప్పుడు; విపరీతంగా ఉపమలు, వర్ణనలు చేసేప్పుడు రావిశాస్త్రి రచనా విధానానికి; బీనాదేవికి చాల దగ్గరి పోలికలున్నాయి. రావిశాస్త్రి రచనా ప్రభావం తమ రచనలంతటా పరుచుకొని ఉంటుందని

బీనాదేవిగారే స్వయంగా వివరించారు. ఒక భావాన్ని పాఠకుని మనసుపై చెరగని ముద్ర వేసేలా చెప్పటం కోసం ఎన్నెన్ని వస్తువుల్ని వాతావరణాన్ని రావిశాస్త్రి ఆ సన్నివేశానికి తీసుకొస్తారో, అలానే బీనాదేవి కూడ రచన సాగిస్తారు.

ఉత్తరాంధ్ర మాండలిక భాషని ఇద్దరూ సమగ్రంగా తమ రచనల్లో వాడారు. విశాఖ, శ్రీకాకుళ ప్రాంత పామర ప్రజానీకపు జీవద్భాషకు ప్రతినిధులైన పాత్రలు వీరిరువురి రచనలలో ఎక్కువగా కనిపిస్తాయి. స్త్రీ, పురుష అనే తారతమ్యమేమి లేదు.

'రాజు-మహిషి'కి 'పుణ్యభూమి-కళ్ళుతెరు'కి; ఇతివృత్త నిర్మాణ నిర్వహణల్లో కొన్ని పోలికలున్నాయి. డబ్బువల్ల జీవిత విధానంలో ఎలాంటి మార్పులు సంభవిస్తాయి? ఆ మార్పు చెడుకా? మంచికా? అంటే ఎక్కువ భాగం చెడుకే దోహద పడుతుందని ఈ రెండు నవలలు రుజువు చేసాయి. అదే డబ్బు అత్యవసరమైన జీవితావసరాలకు అందకపోతే జీవిత విధానంలో ఎన్ని అపశ్రుతులేర్పడతాయో; ఒకొకసారి ఆబడుగు జీవితాలెలా అంతమవుతాయో గూడ ఈ నవలలు తెలియజేసాయి.

అధికార జులుం, చట్టం న్యాయవ్యవస్థ సామాన్యులను యెంత క్రూరంగా అణచి వేస్తాయో గూడ ఇద్దరు వివరించారు. ధనమదాహంకారం, ఆస్తి, అంతస్తుల తేడాలు, జీవితాల్లో పల్లేరుల్లా గుచ్చుకునే తీరు కూడ ఈ నవలల్లో చూడవచ్చు, దుర్మార్గాన్ని దోపిడీని, అవినీతిని చాకిరేవు బెట్టిన విధానం గూడ మనం వీటిద్వారా గ్రహించగలం. సమాజాన్ని మాయ, మోసం, దగ మరేదైనాగాని జేసి రాత్రికి రాత్రే ఎదిగి పోవాలని; డబ్బు సంపాదనా మార్గంలో సిగ్గు, లజ్జ, పాపభీతి అనే మాటలకు తావేలేదని; ఎదుటి వాళ్ళకు తెలియకుండా నమ్మకంతో మోసగించాలని-ఇవి 'రాజు-మహిషి'లోని మందుల భీముడి ధర్మాలు.

'పుణ్యభూమి కళ్ళుతెరు'లోని గవర్రాజు గూడ సరిగ్గా ఇలాంటి భావాలకే ప్రతీకగా నిలుస్తాడు. తనను నమ్మిన గొర్రెల్లాంటి రాజమ్మ, సింహాచలంలు తామున్న ఇల్లు వాకిళ్ళు వదిలించుకొని, ఊరువిడిచి పట్నం వైపు పరుగులు దీయటానికి మొదటి కారకుడు గవర్రాజే. సింహాచలాన్ని ఆర్థికంగా ధ్వంసం జేసిందీ గవర్రాజే.

రాజు-రాజమ్మల్ని, ప్రసాదుకేసు ద్వారా ప్లీడరు ముకుందుడి దగ్గరకు తిప్పి, వాళ్ళ డబ్బుతో తన కేసులు నిర్వహించుకుంటూ, రాజమ్మని ఆర్థికంగా పీక్కుతింటాడు భీముడు. అక్కడి గవర్రాజు, ఇక్కడి భీముడు-ఇద్దరూ ఒకే నాణానికి బొమ్మా, బొరుసుల్లాంటి వాళ్ళు. సాధారణ కుటుంబాల నుండి ఎదిగి, ఆర్థికంగా, అధికారయుతంగా బలపడి తాము ఏ వర్గం నుండి పైకి ఎదిగారో, దాదాపు అదే వర్గానికి లేక ఆఛాయలున్న వర్గప్రజల్ని పీల్చి పిప్పిజేసి; అపునాదుల నుండి తమ ఎదుగుదలకు సోపాలనాలను నిర్మింపజేసుకున్నారు వీరు.

మందుల భీముడు కౌన్సిలరైనాక అతని జీవితంలో కొట్టవచ్చిన మార్పు కనిపించింది. అలానే గవర్రాజు కూడ కాంట్రాక్టరు నుండి కౌన్సిలరైనాడు. భీముడు ముకుంద ప్లీడరు ద్వారా వ్యవహారాలు చక్కబెడుతుంటే, గవర్రాజుకి వెంకట్రావు ప్లీడరు దొరికాడు. భీముడు, గవర్రాజులు వ్యక్తిగతంగా కాక పోయినా వ్యవస్థాగత దుష్టస్వభావానికి ప్రతినిధులు. వీళ్ళిద్దరికి స్త్రీవాంఛ అధికం. కోర్టులు, న్యాయవ్యవస్థ అవకతవకల్ని రెండు నవలల్లో గమనించవచ్చు.

హత్యలు, ఆత్మహత్యలు లేకుండా రావిశాస్త్రి నవలా నడక సాగలేదు. ఆదారిలోనే "పుణ్యభూమి" కూడ భాగస్వామ్యమయింది. నవలల్లోని ప్రధాన లక్షణమైన ఉత్సుకత రెండింటిలోను సమర్థంగా పోషించబడింది.

వ్యక్తుల్ని వర్ణించేటప్పుడు పురాణ, చారిత్రక పాత్రలను వారిపై ఆపాదింపజెయ్యటం; ఆ ప్రతీకల్ని వాడటం రావిశాస్త్రి తరచు చేస్తుంటారు. రాజును గురించి వర్ణిస్తు "ఎలా ఉన్నాడంటే ఇంద్రజిత్తూ ఘటోత్కచుడు కూడా సాల్లేకుండా, హిరణ్యాకశిపుడి తమ్ముళ్ళాగో హిరణ్యాక్షుడి అన్నలాగో ఉన్నాడు. చూసేరంటే హిట్లరు గాడూ, ముసోలిన్‌గాడూ ఊష్ణాలు పెట్టేసుకుని జాయింటుగా మంచం ఎక్కేవల్సిందే"[7] అని వర్ణించారు. బీనాదేవి గూడ కరణం, మున్సబులను వర్ణిస్తు "హిట్లరూ, ముసోలినీ ఒక చోట చేరినట్టు నిలబడ్డారు కరణం, మున్సబూ వాళ్ళకి తోడుగా శకుని లాంటి సురేంద్ర గుమస్తా తోడు నిలబడ్డాడు"[8] అని వర్ణించారు. ఇలా చాల చోట్ల వీళ్ళు గ్రహించే ప్రతీకల మధ్య సారూప్యత ఉంది.

పంతులు కుర్రాడు రాజమ్మతో సూర్యచంద్రరావుని గురించి చెపుతూ 'తెలకలి మాలక్ష్మి ఉంచుకుందీ, ఆబాబు" అని చెప్పటానికి-గవర్రాజు సింహాచలం, సరుకుదోలే సావుకారి గురించి ప్లీడరు వెంకట్రావుకు వివరిస్తూ-"సావుకారంటే ఎవడను కున్నావేటి? ఎనకేది నల్ల బంగారమ్మ కూతుర్ని సెరిసేసి, నీళ్ళాడించేసి, దాని సేతుల్తోనే దాని కాపరంలో నీళ్ళోయించేసినాడే-అడుగోఆడు"[9] సూర్యచంద్రరావుని, సావుకారిని- వీళ్ళిద్దర్ని కాముకులుగానే పరిచయం చేయటం ఈశైలిలోని ప్రాముఖ్యం. ఈ పోలికలున్న రచనా తీరుని ఈ నవలల్లో మనం గమనించగలం ప్రకృతికి సంబంధించిన పోలికల్ని, జాతీయాల్ని, సామెతల్ని, జానపద పలుకుబడుల్ని రావిశాస్త్రి సందర్భాను సారంగా వాడు తుంటారు. 'రాజమహిషి'లో నిండుచంద్రుడు చక్కని వెన్నెలలో కొత్తవెండి పళ్ళెంలా వెలుగుతున్నాడు"[10] అని వర్ణిస్తారు. బీనాదేవి పుణ్యభూమీ-కళ్ళు తెరులో రాజమ్మను గురించి చెప్తు "రాజమ్మ మాత్రం వెన్నెట్లో వెండి పళ్ళెంలా మిలమిల్లాడుతోంది"[11] అని అంటారు. ఇలా వీరిరువురు దాదాపుగా ఒకేవిధమైన ఉపమలను, సాదృశ్యాలను వర్ణించటం వీరి రచనలలో గమనించగలం. గొప్ప వ్యక్తుల ఆలోచనా ధోరణి ఒకేవిధంగా ఉంటుంది' ' అనడాన్ని ఈ ఉదాహరణలు బలం చేస్తున్నాయి.

దుర్మార్గాన్ని, దౌర్జన్యాన్ని నిరసించటంలో, అవినీతిని, అన్యాయాన్ని ఎండగట్టటంలో; పులి పంజా దెబ్బలకి రక్తం ఓడుస్తున్న బడుగు, బక్కజీవులకు అండగా నిలవటంలో, వ్యవస్థీకృత దౌష్ట్యాన్ని ఎదిరించటంలో, అధికార, చట్టలొసుగుల్ని, బయటబెట్టటంలో, రాజకీయ చదరంగపు విలాసాల్ని బట్టబయలు చేయటంలో దాదాపు వీరిరువురు రచనా పరంగా దగ్గరి మార్గంలోనే పయనించినట్లు ద్యోతకమవుతుంది.

ఇద్దరూ వ్యభిచారిణులపై సానుభూతిని ప్రకటించారు. వారు ఎలాంటి దుర్భర పరిస్థితులలో ఆ 'యమకూపా'ల్లో చిక్కుకుపోతున్నారో, అలా ఇరుక్కుపోవటానికి దారితీసిన సామాజిక వాతావరణాన్ని; యధార్థ పరిస్థితులను వర్ణించి; ఒళ్ళు కొవ్వెక్కి సాని వృత్తి చెయ్యటం లేదని, బతుకు తెరువుకి మరోమార్గం లేక; కొన్ని అనూహ్య, అనివార్య పరిస్థితుల కారణంగా వాళ్ళ బతుకులలా మాడి మసైపోతున్నాయని వివరించి;

ఆ వ్యక్తులపై సానుభూతి కలిగేలా వివరిస్తారు. 'పుణ్యభూమి కళ్ళుతెరు'లోని రాజమ్మ ప్రిన్స్‌పల్ గారికి లొంగిపోవటంగాని; చివర్లో జె.జె. దగ్గరకు వెళ్ళటంగాని; అలాగే 'రత్తాలు రాంబాబు'లోని ముత్యాలు గాని; అమాయకంగా; నిష్కారణంగా సాని కొంపలో చిక్కుకుపోయిన అనాథల జీవితాలు గాని ఈ కోవలోనివే. 'కెప్టెన్ కథ' ఇంకా బీనాదేవి రచనల్లో; రావిశాస్త్రి పోలికలు కనిపిస్తాయి.

**4. ఖాకీవనం**

'ఖాకీవనం' 1980, నవంబరులో 'చతుర' (మాసపత్రిక)లో ప్రచురితమైంది. పత్రికా రచయిత (Journalist) గా; రచయితగా శ్రీ పతంజలి సాహితీలోకానికి సుపరిచితులు. ఖాకీవనం నుండి 'ఇటీవలి' గోపాత్రుడు దాక ఆయన కలం నిరంతరం జలపాతంలా ప్రవిస్తూనే వుంది. పతంజలికి మంచిపేరు తెచ్చిన నవలల్లో 'ఖాకీవనం' ముఖ్యమైంది. అచ్చంగా పోలీసుశాఖపై; దాని అంతర్గత వ్యవహారాలపై; పై అధికార్లు క్రింది వారిపై చెలాయించే జులుంపై; ఈ శాఖ మీది రాజకీయ నీలి నీడలపై వాస్తవికంగా రచింపబడిన నవలల్లో 'ఖాకీవనం' ప్రముఖమైంది.

ఐ.జి. స్థాయి నుండి; క్రింది కానిస్టేబులు వరకు; అంచెలంచెలుగా ఒకరిపై మరొకరి అణిచివేత ఏ స్థాయిలో ఉంటుందో దీన్లో చూడవచ్చు. పై అధికారి తన పదవిని కాపాడుకుంటానికి క్రింది వారిని బలిపెట్టేతీరు; పోలీసులు ప్రజలపై చేసే పైశాచిక కృత్యాలు; స్త్రీల జీవితాల్లో పోలీసోళ్ళు కాటేసే విధానం; పై అధికార్ల స్వార్థానికి బలైపోతున్న క్రింది స్థాయి పోలీసుల తిరుగుబాటు-దీనిలో గమనించగలం.

పతంజలి రావిశాస్త్రిని 'గురువుగారు' అని సంబోధిస్తారు. ఆయనకు రావిశాస్త్రంటే విపరీత అభిమానం. 'రావిశాస్త్రి' రచనల్ని విపరీతాభిమానంతో చదివాను. తొలిదశలో (1978-80) శాస్త్రిగారిని అనుకరించాను. గురువుగారి శైలి నాకు కొంతవరకు పట్టుబడింది. 'ఖాకీవనం'లో 'సూరీడు' పాత్ర శాస్త్రి గారి రచనల ప్రేరణతో రాసాను"[12] అని శ్రీపతంజలి తెలిపారు.

"మార్క్సిజమన్నా, కమ్యునిస్టు విప్లవకారులన్నా ఆయనకు అభిమానం. అయితే జీవితాన్ని ఆయన ఎప్పుడు దేనికోసం కూడా వక్రీకరించలేదు. అలాగే జీవితాన్ని తాను దర్శించిన రీతిలో ప్రతిఫలించాల్సి వచ్చినపుడు ఆయన సాహిత్యమర్యాదల్ని ఏమాత్రము పట్టించుకోలేదు"[13] ఇలాగే పతంజలి కూడ దేశంలో జరిగిన పోలీసుశాఖా పరమైన వాస్తవిక విషయాల్ని పత్రికలద్వారా సేకరించి ఈ నవలని వక్రీకరణలు లేకుండా రచించారు.

పరోక్షంగా; ప్రత్యక్షంగా పోలీసు, న్యాయశాఖల ప్రస్తావన లేకుండా రావిశాస్త్రి నవలా ప్రపంచం నడవలేదు. 'రత్తాలు రాంబాబు'లోని గంగరాజు హెడ్డు; ఆయన శిష్యుడు పాత్రలు మరువలేనివి; అలానే 'మూడు కథల బంగారం'లోని 'సూర్రావెడ్డు' 'ఖాకీవనం'లోని పోలీసు పాత్రలు గూడ రావిశాస్త్రి రచనను తలపింపజేస్తాయి.

నారాయణన్ కానిస్టేబులు రిసెర్చి స్కాలర్ కమలిని పోలీస్ ఆఫీసర్ బలంవంతంపై లాడ్జిమీద రైడ్ జరిగినప్పుడు ముద్దు పెట్టుకున్న దృశ్యాన్ని తలంచుకొని కుమిలి కుమిలి బాధపడతాడు. "ఏ అన్నవరం సత్యానారాయణ మూర్తో, సింహాచల నరసింహుడో,

తిరుపతి వెంకటాచలపతో, బెజవాడ కనకదుర్గమ్మో, ఆకళ్ళల్లోంచి తనని ఉరిమి చూచినట్టు, కళ్ళెర్రజేసి చూచినట్టు అనిపించిందతనికి"[14] అని నారాయణ పరిస్థితిని వర్ణించిన ఘట్టం రావిశాస్త్రి శైలిని జ్ఞప్తికి తెస్తుంది. భావతీవ్రత కోసం రావిశాస్త్రి వాడే పోలికల తీరే ఇక్కడ గూడ కనిపిస్తుంది. రావిశాస్త్రి ప్రభావం శైలీపరంగా పతంజలిపై ఉందనటానికి ఇలాంటి ఉదాహరణలను పేర్కొనవచ్చు. సుబ్బారావనే కానిస్టేబుల్ మున్సిపల్ కార్మికుల్ని "ఫాకీలంజాకొడకా" అని తిడుతూ మాటాడిన సందర్భంలోని సంభాషణ గూడ రావిశాస్త్రి శైలిని జ్ఞపికి తెస్తుంది.

"సొమ్ములుపోనాయండి"లోని బోడి, చిలుక చనిపోయినప్పుడు; దుఃఖిస్తూ అన్నమాటలు 'ఖాకీవనం'లోని సూరీడు తన తమ్ముడు చనిపోయినప్పుడు గుండెలు బాదుకొని దుఃఖించిన సన్నివేశాన్ని గుర్తుకుదెస్తుంది. "కడుపున పుట్టిన పిల్లని కండకండలుగోసి అమ్ముతున్నార్రా అన్నయా"[15] అని సూరీడు తమ్ముడు; తన కూతురు గౌరి జీవితం పోలీసాఫీసర్ కాశీపతి వలన నాశనమై పోవటాన్ని తలచుకొని దుఃఖించిన తీరుగమనిస్తే మనకు కడుపు తరుక్కుపోతుంది. ఇది రావిశాస్త్రి బాటనిపిస్తుంది. సూరీడు ఈ సన్నివేశంలో విలపించిన విధంగూడ రావిశాస్త్రి నీడలోనే నడిచింది. ఖినన్నిక్కడ సఫాజేసి ఆగుంటపాపనక్కడ ముక్కముక్కలుగా నరికి పలావు చేసుకోండి. ఖాకీ బట్టలేసుకున్న లంజాకొడుకులంతా ఆపలావుతిని కిళ్ళీవేసుకోండి.ఖి అని గుండెలు బద్దలయ్యేలా సూరీడు పలికిన ములుకుల్లాంటి పలుకుల శైలి ఎలాంటిదో ఊహించుకోవచ్చు.

అలాగే కమిలి పోలీసాఫీసర్ ప్రభాకర్‌తో "ఇకపోతే మీ కాశీపతి నాకో పాఠం నేర్పారు. అడవిలో అమాయకంగా బతికే జింకలకు వాడి కొమ్ములుండాలి. తోటలో తెల్లగా బతికే వెర్రిముండా పావురాలకైనా ఉక్కుముక్కలుండాలి. పెరటిలో గంతులేస్తూ తిరిగే కుందేళ్ళకైనా పరమ విషపు కోరలుండాలి. వోట్లు వేయడానికి తప్పించి, ఇంకెందుకూ పనికిరాని ప్రజలందరూ ఆత్మరక్షణ కోసం విచ్చు కత్తులు పట్టుకొని తిరగాలి. స్త్రీలందరి దగ్గరా మిషన్‌గన్స్ వుండాలి"[16] అని చెప్పినశైలి 'సొమ్ములుపోనాయండి' గోవులొస్తున్నాయి జాగ్రత్త'లోని శైలికి దగ్గరగా వుంది. సూరీడు గౌరి నుద్దేశంచే-- "ఇది ఒళ్ళమ్ముకోని నాకు గంజిపోసి, సారాపోసి, ఇదిగో రక్తమమ్ముకొని నాకు ప్రాణాలు పొయ్యడానికి తయారయి, -- నేను దాని రక్తమాంసాలే తినిబతుకుతున్నాను. అదికూడా దాని రక్తమాంసాలే అది తింటున్నాది.
మొత్తం మీద మేమిపుడు మారక్తమాంసాలే తిని బతకాలి"[17] అని చెప్పిన సన్నివేశం రత్తాలు-రాంబాబులోని ముత్యాలు; కంపెనీ నరసమ్మతో నువ్వు మారక్తమమ్ముకొని బతుకుతున్నావు అని చెప్పిన సన్నివేశాన్ని గుర్తుకుదెస్తుంది. పతంజలి శైలి కూడ శాస్త్రి బాటలోనే నడిచింది.

పోలీస తిరుగుబాటుని పతంజలి సమర్థంగా చిత్రించి ఖాకీవనానికి వన్నె తెచ్చారు. చివర్లో జరిగిన కానిస్టేబుల్ సుబ్బారావు నారాయణల సంభాషణ, సుందరయ్య సుబ్బారావుని అసహ్యించుకున్న పద్ధతి సామాజిక వాస్తవికతని పరిణతితో వెల్లడించినట్లైంది. ఈ విధానం రావిశాస్త్రి వారసత్వం.

పోలీసులక్రౌర్యం, వాళ్ళ దుర్మార్గత్వం, స్త్రీలని లైంగికంగా హింసించటం; ఖద్దరు టోపీలకి; ఖాకీటోపీల సలాములు, కింది వాళ్ళని అణచివేసే ధోరణి ఇవి రావిశాస్త్రి రచనల్లో చోటు జేసుకున్నాయి. ఈ వాతావరణమే ఖాకీవనంలోగూడ కనిపిస్తుంది. జరుగుతున్న అన్యాయాలకి తట్టుకోలేక; చుట్టూ అలముకున్న ఘోరాలన్నీ భరించలేక సూరీడు తాగుడికి బానిసై; వాస్తవంకంటే; మత్తులో జీవించటానికి; బతకటం కోసం తాగుతున్నాడని గమనించాలి. అతను మాటాడిన ప్రతి అక్షరం వాస్తవికమైంది.

వస్తు నిర్వహణలో; కథా సంవిధానంలో; సంభాషణా చాతుర్యంలో; ముఖ్యంగా శైలిలో రావిశాస్త్రి ముద్ర పతంజలిలో కనిపిస్తుంది. పలానాదానికి; పలానాది ప్రతీక; ప్రతిధ్వని అని చెప్పటం కాదుగాని; రావిశాస్త్రి పోకడ 'ఖాకీవనం'లో, పతంజలి రచనల్లో, ప్రస్ఫుటమవుతుంది. 'పిలక తిరుగుడు పువ్వు' 'వీరబొబ్బిలి' పై గూడ శాస్త్రి ప్రభావం కనిపిస్తుంది.

## 5. చీకటోళ్ళు

అర్నాద్‌కి రావిశాస్త్రంటే విపరీతాభిమానం. వ్యక్తి గతంగానే గాక సాహిత్యపరంగా కూడ రావిశాస్త్రిని బాగా అభిమానించటం వల్లే 'చీకటోళ్ళు'ని రావిశాస్త్రికి అంకితమిచ్చాడు.

వస్తు స్వీకరణ, నిర్వహణల్లో 'చీకటోళ్ళ'పై రావిశాస్త్రి ప్రభావముంది. 'రత్తాలు-రాంబాబు', 'గోవులొస్తున్నాయి. జాగ్రత్త'; 'సొమ్ములు పోనాయండి' నవలల ప్రభావం 'చీకటోళ్ళ'పై కనిపిస్తుంది. రావిశాస్త్రి ఉపమలు, సన్నివేశ వివరణలు, విశాఖ మాండలిక భాషా, ఉత్సుకత రేకెత్తించేలా ఇతివృత్తాన్ని మలుపులు దిప్పిన తీరు రావిశాస్త్రిని తలపింపజేస్తాయి.

అప్పన్న కుటుంబం అంతమైన తీరు, వాళ్ళ ఆర్థిక ఇబ్బందులు, ఎర్రమ్మ ఆత్మహత్య- ఇవి 'సొమ్ములు పోనాయండి'లోని బోడియ్య వృత్తాంతాన్ని జ్ఞప్తికి దెస్తాయి. బంగారురాజు స్త్రీలోలత్వానికి; 'రత్తాలు-రాంబాబు'లోని రాథమ్మ భర్త గోపాలరావు స్త్రీలోలత్వానికి కొంతమేర సంబంధం ఉంది. వీళ్ళిద్దరు ఒళ్ళు కొవ్వెక్కి కామవాంఛతో స్త్రీలననుభవించారు. పాత్రల వ్యక్తిత్వాలను మలచటంలో అర్నాద్ రావిశాస్త్రి బాణీని అనుసరించారు.

పోలీసులకి కోర్టులకి రావిశాస్త్రి నవలలో తప్పనిసరిగా చోటు ఉంటుంది. 'రత్తాలు రాంబాబు'లోని గంగరాజు హెడ్డు కంపెనీ నరసమ్మతో సరదా తీర్చుకుంటే 'చీకటోళ్ళు'లోని పోలీసు ముత్యాలు సరాసరి కోడలుతోనే బలవంతపు సరసానికి దిగి ఒళ్ళంతా కుళ్ళ బొడిపించుకున్నాడు. విశాఖ ప్రాంతపు మాండలిక భాషని, ముఖ్యంగా సాధారణ ప్రజానీకం ఉపయోగించే సజీవభాషని రావిశాస్త్రి ఉపయోగించినట్లుగానే అర్నాద్ గూడ ఆయా పాత్రల ద్వారా సందర్భోచితంగా ప్రయోగించారు. ముత్యాలు- 'డాకూగాడే'; కుటమానం; అని అంటం; ఆదెమ్మ నుద్దేశించి జనం 'ఆరగుడీసుల ఏసికాలు' అని 'ఆళ్ళురగిడీసునాకొడుకులు' అని ఆదెమ్మ నూకరాజుతో చెప్పటం; ముత్యాలు సోములమ్మ నుద్దేశించి 'హమ్మముండా' అని; 'ఆదిబ్బముండ' అని, 'ఎర్రిగొర్రిజనం' అని ప్రజానీకాన్నుద్దేశించి సోములమ్మ అనటం; "నాను కుక్కలు పీకిన ఎంగిలిస్తరాకును అని ఆదెమ్మ నూకరాజుతో చెప్పటం- 'రత్తాలు-రాంబాబు'లోని ముత్యాలు నా బతుకు కుక్కల్సింపిన ఇస్తరి ఏనాడో అయిపోనది" అని అనటం- వీటిని ఉదాహృతులుగా గ్రహించవచ్చు. రావిశాస్త్రి గూడ ఇదే రకమైన భాషని తన రచనల్లో

ముఖ్యంగా 'రత్తాలు-రాంబాబు'లో ప్రయోగించారు. 'దిబ్బముండ' అనే పదాన్ని ఇటీవలి 'ఇల్లు'లో గూడ ఆయన వాడారు.

రావిశాస్త్రి శైలిని 'చీకటోళ్ళు' వెలుతురులా పట్టిస్తుంది. ఉపమలు; సన్నివేశ తీవ్రత కోసం ఒక విషయాన్ని అనేక రీతులుగా వర్ణించి చెప్పటం; వివిధ వస్తువుల్ని ఆలంబనగా స్వీకరించటమనే రావిశాస్త్రి పద్ధతిని అర్నాద్ గూడ పాటించారు. ఆదెమ్మ దుఃఖంతో తమ పద్ధతుల్ని జ్ఞాపకం చేసుకున్న సన్నివేశం ఇందుకు మంచి ఉదాహరణ. 'ఆమెకు స్మశానం, కాలిపోతున్న ఊరు, రక్తపు మడుగులో తండ్రిశవం, కటకటాల వెనుక సర్కసు పులుల గాండ్రింపులు, అడ్డుకున్న వాడి మెడను చుట్టుకున్న కొండచిలువ, రైలుపట్టాల మీద ఎవరో తనుచూసిన తలలేనిమొండెం, తనను బలాత్కరిస్తు ముత్యాలు, జుత్తు ఈడుస్తు అప్పలకొండా, కొరివి దెయ్యాల్లా నోట్లో చుట్టలతో సాపమ్మ, గైరమ్మలు రాక్షసంగా బాదుతూ అసిరయ్య, పాడెమీద ఎర్రమ్మ ముఖం, ఖంగు ఖంగుమని దగ్గు తున్న తల్లి, పసువుల వెనుక పేడ చేటపట్టుకొని చెల్లెలూ... కలగా పులగంగా, తెరలు తెరలుగా గుర్తుకొచ్చేయి ఆదెమ్మకు''[18] ఇది రాశిశాస్త్రి రచనా విధానానికి అతిసన్నిహితమైన శైలి.

రావిశాస్త్రిలాగే సామాజిక వాస్తవికతని ఫోటోతియ్యటమే గాకుండా, వ్యవస్థాగత దుర్మార్గాన్ని ఎండగట్టి తమ బతుకులు కాలి, మాడి మసై పోవటానికి, జీవితం అప్రశుతులు పలకటానికి ఎక్కువభాగం, సామాజిక స్థితిగతులేననే సత్యాన్ని పాత్రలద్వారా వ్యక్తం చేయించారు అర్నాద్. తాను పతితగా అవతార మెత్తటానికి తన దుర్భర దారిద్ర్యం, ఆకలి, కుటుంబ ఆర్తనాదాలేగాని శారీరక సుఖం కోసం గాదనే సత్యాన్ని; ఆదెమ్మ చాటి చెప్పటమే గాకుండా; ఇలా తను మారినందుకు గొంతులు చించుకుంటున్న పెద్దలు; మా కుటుంబమంతా ఆకలితో రోజుల తరబడి మలమల మాడిపోతుంటే ఎవరన్నా ఆదుకున్నారా; అలా ఆదుకోలేని వారికి నన్ను ప్రశ్నించే హక్కులేదని గూడ ఆదెమ్మ ప్రశ్నించింది. 'రత్తాలు-రాంబాబు'లోని 'ముత్యాలు'పాత్ర ఆలోచనలు, ఆదెమ్మలో కనిపిస్తాయి. శైలీ పరంగా, సన్నివేశ చిత్రీకరణలో, కథా నిర్వహణ రీత్య, మాండలిక పద ప్రయోగ దృష్ట్యా రావిశాస్త్రి ప్రభావం అర్నాద్‌పై ఉంది.

**6.**

శ్రీభూషణం రచనలకు సామాజిక ఉద్యమనేపథ్యముంది. విరసం వారసత్వం; గిరిజన పోరాటాల ప్రభావం శ్రీ భూషణ కథలపై ఉంది; ఉపాధ్యాయ నాయకులుగా, శ్రీకాకుళ గిరిజన పోరాటస్ఫూర్తి వెలుగుబాటలో ఉద్యమించిన ఉద్యమ కారునిగా ఆయనకున్న అనుభవం గూడ 'భూషణం కథల్లో' దర్శనీయమవుతుంది. స్పష్టత, నిబద్ధ ఆలోచనా ధోరణి భూషణం 'కొండగాలి'లో కనిపిస్తుంది. ఉత్తరాంధ్ర మాండలిక భాషలో కొండగాలి రచన సాగింది. రావిశాస్త్రి సాహిత్యం హెచ్చుభాగం ఉత్తరాంధ్ర మాండలిక భాషలోనే సాగిందనేది యధార్థం. ముఖ్యంగా శ్రీకాకుళ, విశాఖ మాండలికాలలో శాస్త్రి శ్రీ భూషణం రచనలు నడిచాయి. శ్రీభూషణం కొండగాలిపై రావిశాస్త్రి ప్రభావం భాషాపరంగా, భావపరంగా కనిపిస్తుంది.

దుర్మార్గం అంతమవ్వాలని, అవుతుందని అణగదొక్కబడుతున్న అసంఖ్యాకపు ప్రజానీకం, అధికార శక్తుల్ని అంతంజేస్తారనే ఆశ, అధికార రాజకీయ ఉక్కు పాదాల కింద నలిగిపోతున్న సన్నజీవాల మూగవేదన, రోదన అంతమై వ్యవస్థను నడిపించే శక్తి వారి హస్తగతమవుతుందనే ఆశావాదం రావిశాస్త్రి రచనల్లో కనిపిస్తుంది. ఈ సూత్రమే శ్రీభూషణం 'కొండగాలి'లో బలంగా వీచింది. ఇంకా స్పష్టంగా వర్గదృష్టితో ఎరుపెక్కింది.

ఈ సామీప్య లక్షణం, ఏకీకృతాలోచన, సహ వాతావరణం వీరిరువురి రచనల్లో ప్రస్ఫుటమవుతాయి. అయితే రావిశాస్త్రిలాగ విపరీత వర్ణనలు, ఉపమలు శ్రీభూషణంలో లేవు. రావిశాస్త్రి 'సొమ్ములు పోనాయండి'లోని బోడియ్య తన నేల తల్లిని ప్రెసిడెంటు మనుషులు ఆక్రమించు కుంటాన్ని సహించలేక జబ్బుతో ఉండి కూడ తిరగబడతాడు. తన సర్వస్వం నాశనమై పోయినాగాని తన భూమాతని వదులు కుంటానికి ఇష్టపడడు. 'కొండగాలి'లో గూడ బోడియ్యపాత్ర ఉంది. అయితే ఆపాత్రకిది నకలని చెప్పటం లేదు. దీనిలో గూడ తను నమ్ముకొని సాగు జేసుకుంటున్న భూమిలో ఫారెష్టు వాళ్ళు మొక్కలు వెయ్యటాన్ని బోడియ్య ఎదిరిస్తాడు. తిరగబడి వాళ్ళచేతుల్లో దెబ్బలు తింటాడు. ఈ రెండు చోట్ల ఒకే సాదృశ్యం ఏచిన్నవైనా తాను సాగుజేసుకుంటున్న చారెడు నేలను ఇతరులెవరైనా అక్రమంగా ఆక్రమించుకుంటే ఆగ్రహించి, తిరగబడతాడేగాని చూస్తు ఊరుకోడని ఆనేల కోసం తనప్రాణాలైన బలిస్తాడేగాని ఆనేల తన నుండి దూరమవటాన్ని మాత్రం సహించడు.

దుర్మార్గుడైన సొండి సాంబన్న అంతమవటం, లంపెన్ క్యారెక్టరైన సుక్కడు బలైపోవటం-దోపిడి, దుర్మార్గత్వం, కామందుల, పెట్టుబడిదార్ల దగ్గర కుక్కల్లా పడి ఉండి, తాము ఏవర్గం నుంచి వచ్చారో, ఆవర్గ ప్రజలను అంతం జేసే ద్రోహబుద్ధులకు గుణపాఠం చెప్పటమవుతుంది. సుక్కడు పాత్ర స్వభావరీత్యా 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'లోని ప్రభుదాసు పాత్రకు సన్నిహితంగా ఉంది.

"తూర్పు కొండమీద కరకరమని సూర్యుడు ఉదయిస్తున్నాడు. జేగురురంగులో వున్న కొండలన్నీ బంగారం రంగులోకి మారిపోయినట్లుగా మెరుస్తున్నాయి"[19] అని "బోడియ్య పాలుపొంగినట్లు పొంగిపోయాడు"[20] అని "కొండలూ, కోనలూ, గట్టులు, పుట్టలూ, చెట్టులూ, చేమలూ, వాగులూ, వంకలూ నడిచాయి. కొండలు కదిలాయి కొండగాలి దేశం నలుమూలలా పెనుప్రళయంగా వీచింది"[21] అని వర్ణించిన తీరు రావిశాస్త్రి రచనా పద్ధతికి సన్నిహితం.

శ్రీభూషణంలో రావిశాస్త్రి కంటే స్పష్టమైన వర్గ దృక్పథం ఉంది. వీళ్ళద్దరిలో పీడిత ప్రజల పట్ల సానుభూతి, లోక దురన్యాయం అంతమై, సమత వెల్లివిరియాలనే ఆకాంక్ష ఉంది. ఇద్దరిలో సామాజిక వాస్తవికతాదృష్టి, మార్క్సిష్టు దృక్పథం ఉన్నాయి. సామాజిక వ్యవస్థలో మార్పు జరిగి, సామ్యవాద భావాలు వ్యాప్తిచెంది. సమస్త ప్రజానీకం సుఖశాంతులలో వర్ధిల్లాలనే ఆశాభావం వీళిద్దరి రచనా సూత్రానికి మూల వస్తువులు. విరసం ఉద్యమ నేపథ్యం, ప్రభావం, చైతన్యం ఇద్దరి ఆలోచల్ని ఎరుపెక్కించాయి. ఈ భావసాన్ని హిత్యమే ఇద్దరి రచనలు సన్నిహితంగా ఉండటానికి, మూలకారణం. రావిశాస్త్రి ప్రతిభ, ప్రేరణ, రచనలు. శ్రీభూషణం రచనా మార్గాన్ని ఇంకా వర్గ దృష్టితో స్పష్ట పరిచాయి.

రావిశాస్త్రి కథన పద్ధతి డికెన్స్‌కీ, చెహోవ్‌కీ సున్నిహితమైంది ప్రాచీన ప్రబంధ సాహిత్యపువాసన ఆయన వర్ణనల్లో కనిపిస్తుంది. శాస్త్రి తన ప్రాపంచిక దృక్పథాన్ని సమకాలీన రచనలను అధ్యయనం చెయ్యటం ద్వారా మెరుగు పరచుకున్నారు. తన సమకాలీన రచయితలను శాస్త్రి బాగా ప్రభావితం జేసారు. ఆయన రచనలు తెలుగు ఎల్లలు దాటి ఆట్టే అనువాదాలకి నోచుకోకపోవటం వల్ల శాస్త్రిని సమగ్రంగా అంచనా వెయ్యలేక పోతున్నారు. ఇటీవలే 'అల్పజీవి' 'మూడు కథల బంగారం' ఆంగ్లంలోకి అనువదింపబడటం ముదావహం రావిశాస్త్రి-ప్రభావాన్ని ప్రత్యేకాంశంగా పరిశీలింపవచ్చు.

# 7. నవలాకారుడిగా రావిశాస్త్రి స్థానం

రావిశాస్త్రి నవలల ప్రస్థానం ఖచ్చితంగా నాలుగు దశాబ్దులు (1953-1993) సాగినా పట్టుమని పదినవలలన్నా రాక పోవటం ఆశ్చర్యమే. ఇందులోనే మళ్ళీ రెండు అసంపూర్ణ నవలలు. అయితే రావిశాస్త్రి ఎన్ని రాశారనే కంటే ఏమి చెప్పారనేది; ఎలా చెప్పారనేది ముఖ్యమైనది; వ్యక్తిగా రచయితగా వర్గదృష్టితో పేదల పక్షాన నిలిచారనేది వాస్తవం. ఆయన తన మొదటినవల ముప్ఫైవ సంవత్సరంలో రాస్తే; చివరి నవల తన డెబ్భైవ సంవత్సరంలో రాసారు. ఈ కాలవ్యత్యాసం నవలల రాచనాదృక్పథంలో గూడ కనబడింది. ఈ నాలుగు దశాబ్దులలో తెలుగు నవలా సాహిత్యంలో, సామాజిక సాంస్కృతిక; ఆర్థిక, రాజకీయ, సాహిత్య, ఉద్యమ రంగాలలో; ఎన్నో మార్పులు చోటు జేసుకున్నాయి. ఈ పరిణామాలు గూడ రావిశాస్త్రి రచనలపై ప్రభావాన్ని చూపాయి. ఆయన స్వీకరించిన వస్తువులో; దానిని నడిపించిన విధానంలో క్రమేపి మార్పులు చోటు జేసుకున్నాయి.

తెలుగు నవలావిర్భావం సహజ సిద్ధంగా జరిగినా, పాశ్చాత్య ప్రభావంతో జరిగినా; అనంతర కాలంలో; నవలా ఎదుగుదలలో చాల మార్పులు చోటు జేసుకున్నాయి."తెలుగులో నవలకు పురిటినొప్పులు ప్రారంభం కావటం, అణగారిన ప్రజల గురించి సహజ సిద్ధంగా వర్ణించిన ఛార్లెస్ డికెన్స్ మరణం (1870) దాదాపుగా ఒకేసారి జరిగాయి.'[1] కాని డికెన్స్ మరణించాక; వందసంవత్సరాల తరువాత రాసిన రావిశాస్త్రి నవలలపై డికెన్స్ ప్రభావం వుంది. జీవిత దుర్భరత్వాన్ని; వ్యక్తిగత ఇబ్బందుల్ని; డికెన్స్ చవి చూసినంతగా రావిశాస్త్రి అనుభవించక పోయినప్పటికి; పేదరికం; దాని పర్యవసానాన్ని; రావిశాస్త్రి గూడ రుచి చూసారు.

అసాంఘికమైన; నిష్ప్రయోజన కరమైన రచనలు శాస్త్రి చెయ్యలేదు. రచయితగా సాంఘిక బాధ్యతని; ప్రజలను చైతన్యపరచవలసిన ఆవశ్యకతని రావిశాస్త్రి గుర్తించి నవలలు రాసారు. చెడుకు ఉపకారం; మంచికి అవకారం జరగకుండా; ప్రజల్ని వెన్నుతట్టి మేల్కొల్పి; ప్రగతి బాటలో నడిపించటానికే జీవితాంతం రచయితగా; వ్యక్తిగతంగా శాస్త్రి పాటుబడ్డారు.

సమకాలీన నవలా రచయితల్లోన్నేగాదు; మొత్తం తెలుగు నవలా సాహిత్యంలోనే రావిశాస్త్రికి విశిష్ట స్థానముంది. ఆయన తన నవలల్లో ఉపయోగించిన వర్ణనాత్మక; ఆలంకారిక శైలివల్ల గాని; నవలల ఎత్తుగడలవల్ల గాని; నవలేతి వృత్తాల స్వీకరణ, నిర్వహణ, శిల్ప దృష్ట్యాగాని; విశిష్టశైలీ విన్యాసం వల్లగాని; ఉత్తరాంధ్ర మాండలిక సజీవ భాషా ప్రయోగదక్షత వల్లగాని; రావిశాస్త్రికి విశిష్ట స్థానముంది. ప్రజలకు దగ్గరగా మెలిగి; వాళ్ళ నాడిని పట్టుకొని; వాళ్ల భాషలోనే వాళ్ళ చరిత్రలను రాయటం కన్నా చెప్పినట్లు, వినిపించినట్లు వుండేలా మౌఖిక సంప్రదాయంలో నవలలు నడిపించి ప్రత్యేక ముద్రపొందిన ప్రజానవలా రచయిత శాస్త్రి. విపరీత ఉపమలు, వర్ణనలతో కథలు, నవలలు రాసారు. ఆయన ఆలంకారిక శైలిపై ప్రత్యేక పరిశోధన కొనసాగించవచ్చు. ప్రాచీన సాహిత్యాన్ని,

ముఖ్యంగా ప్రబంధ సాహిత్యాన్ని శాస్త్రి అధ్యయనం చేసారు. ఈ ప్రభావం గూడ ఆయన నవలా సాహిత్యం పై ఉంది.

రావిశాస్త్రి వర్ణనలు ప్రత్యేక ముద్రను కలిగి ఉన్నాయి. ప్రకృతికి సంబంధించిన వర్ణనలు, వివిధ భావ చిత్రాలు చిరకాలం మనస్సుని ముసురుకొని వుండేలా ఆయన వర్ణించారు. నవలా వస్తు నిర్వహణలో ఆయా సందర్భాల కనుగుణంగా హృద్యంగా, కవితాత్మకంగా వర్ణించిన వర్ణన లెన్నో వున్నాయి.

## I. వర్ణనలు

తోటలు ఏపుగా పెరిగి, పచ్చగా ఎదిగి, చూడముచ్చటగా ఉన్న సుందర దృశ్యాన్ని "పెద్ద ఉయ్యాల తొట్టిలో పిల్లలందరిని పడుకోబెట్టి చుట్టూ నిలబడి పరీక్షగా చూస్తున్న తల్లుల్లా ఆ తోటలు ముద్దుగా ఉన్నాయి"[2] అని అద్భుతంగా వర్ణించారు. అలానే "అక్కడక్కడా తాడిచెట్లు, ఆకుపచ్చ టోపీలు పెట్టుకున్న నల్ల సిపాయిల్లా నిశ్చలంగానూ; నిటారుగానూ నిల్చున్నాయి" ఆకుపచ్చ టోపీలు పెట్టుకున్న సిపాయిలు గాదు; నల్ల సిపాయిల్లా ఉన్నాయని తాటిచెట్టును వర్ణించటంలోనే వుంది శాస్త్రి ప్రత్యేకత.

వరిచేలని "ఆకుపచ్చ పరికిణీలూ, బంగారపు వోణీలు వేసుకున్న అందమైన ఆడపిల్లలు"[3] గా వర్ణించటం రావిశాస్త్రి ప్రకృతి నిశిత పరిశీలనా దృష్టికి నిదర్శనం. పండిన వరిచేను కంకులు బంగారు కాంతితో పైకి వొంగి కనిపిస్తాయి గనుక బంగారపు వోణీలు అని, అడుగు భాగం తగ్గుతున్న (పండుతున్నప్పుడు) పచ్చదనంతో వుంటుంది. గనుక చాల జాగరూకతతో, వాస్తవికంగా అలాశాస్త్రి వర్ణించారు.

లచ్చయ్యమ్మని శాస్త్రి ప్రబంధ పద్ధతిలో వర్ణించటం ఆయన ప్రాచీన సాహిత్య జ్ఞానాన్ని; కావ్య పద్ధతిని బయట బెడుతుంది. లచ్చయ్యమ్మని ఒకరాణిలా, దేవతా కారంలా, హారాలతో వర్ణించి; ఆవిడ కొప్పుని జాగ్రత్తగా బోర్లించిన పెద్దకుండతో వర్ణించారు. బోర్లించిన అని శబ్దప్రయోగం చెయ్యటమే శాస్త్రి ప్రత్యేకత. "ఆవిడ నుదుటి మీది బొట్టు ఉదయించిన సూర్యుళ్ళా ఉగ్రంగా" ఉందని ప్రాచీన ప్రబంధ పద్ధతిలో వర్ణించారు. "ఆమె కనుబొమ్మలను నల్లటి విల్లుల్లా" కళ్ళని సొరచేపల్లా, "కళ్ళలోని గుడ్లు ఫిరంగి గుళ్ళల్లా" ఉన్నాయని వాస్తవికంగా, అందంగా, ఆధునికంగా వర్ణించారు. ఆమె ముక్కుని పగబట్టిన బాకులా" నోరుని నెత్తుటి కైజారు"లా వర్ణించటంలో రావిశాస్త్రి ముద్ర ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. రాజయోగిని గురించి కూడ "మధ్యాహ్నపు మార్తాండుళ్ళా' ' ప్రకాశిస్తున్నాడని, పర్సనాలిటీకి సూర్యుడు; డబ్బుకి కుబేరుడు; చదువుకు సరస్వతులు; మంచికి శ్రీరామచంద్రులు; ఈవికి కర్ణులు; భోగ లాలసతకు దేవేంద్రులు అని వివిధ రీతులుగా వర్ణన చెయ్యటం రావిశాస్త్రి ప్రత్యేకశైలిలో భాగం.

విశ్వమోహినిని వర్ణిస్తూ; "ఆమె కనుబొమ్మలు కత్తుల్లా ఉన్నాయి; ఆమె చూపులు మెరుపు బాకుల్లా ఉన్నాయి. ఆమె ముక్కు ఉక్కు చాకులా ఉంది. ఆమె పెదవులు వంకర కైజారుల్లా ఉన్నాయి." ఆమె "ఓ విచ్చుకత్తిలా ఉంది"[4] అని శాస్త్రి అన్నింటిని కత్తులతోనే ముడివేసి ప్రత్యేకతను చాటుకున్నారు. ఇంకా "ఆమెను మంచు శిఖరంలా; నిప్పుల గోపురంలా నిలబడిం"[5]దని అద్భుతంగా, ఆమె జీవితానికి అచ్చు గుద్దినట్లు సరిపోయేలా వర్ణించారు. మంచు శిఖర; నిప్పుల గోపుర పోలికలు ఆయన ప్రతిభకు పట్టం గడుతున్నాయి.

"చుక్కలు చచ్చిన చేపల్లా తేలిపోతున్నాయి. శవాలు కొరడబారి బిగిసిపోయినట్టు గాలి బిగిసి పోయింది."[6] చుక్కల్ని చచ్చిన చేపలతో పోల్చి వర్ణించటం నిశిత లోక పరిశీలనకు; అద్భుత వాస్తవీకరణకు నిదర్శనం. ప్రకృతి గతమైన మంచి; మంచి పోలికలను ఆయా సందర్భాల కనుగుణంగా శాస్త్రి చాలా చోట్ల వర్ణించారు.

## 2. అలంకారిక శైలి

"వారి వెండి గడ్డం వజ్రాల పొడిని మెరుపు దూదిగా మార్చినట్టు మిలమిల మెరుస్తోంది"[7] అని ప్రయోగించారు. తెల్లని చిక్కని వెంట్రుకలతో ఉన్న గడ్డాన్ని వజ్రాల పొడితో ఉన్న మెరుపు దూదితో పోల్చటం; మిలమిల మెరిపించటం; సుందరమైన పోలిక. ఇంతటి సుకుమారమైన పోలికల్ని రావిశాస్త్రి చాల చోట్ల ప్రయోగించారు. ఇలానే "ఆయన పండు గెడ్డం వెలిగించిన వెండి కిరణాల సమూహంలా ఉండే"[8]దని రాజయోగి గడ్డాన్ని పోల్చారు.

"గదిలో వేళ్ళాడే దీపాల గాజు గుత్తి అలనాడే నాడో తెగిపోయిన భూతాల రాణీ తలలా"[9] కనిపించటం కిరీటి భయానక మనస్తత్వానికి; తరువాత పరిస్థితుల ఆనవాలుకి సూచకంగా వుంది; ఈ పోలిక జానపదధోరణిని ప్రతిబింబిస్తుంది. ముత్యాల హారాన్ని ముక్కలుగా తెంపినపుడు "చెదిరిపోయిన ముత్యాలు సాయంకాలపు పొయ్యి మంట వెలుగులో రక్తపు చుక్కల్లా మెరిసే"[10]యని ముత్యాల్ని రక్తపు చుక్కల్లా పోల్చారు. సాయంకాలం చీకట్లు ముసురుకుంటున్న సమయంలో ముత్యాలు రక్తపు చుక్కల్లా కనబడవచ్చు; ఆ ఉద్దేశంతోనే శాస్త్రి 'సాయంకాలపు పొయ్యి మంట' అని చేర్చారు. నిశిత పరిశీలనతో గూడిన అద్భుతమైన పోలికయిది.

"పండు జుట్టుని ఉడతలు పీకిన తాటిటెంకతో పోల్చటం"[11] స్వాభావికమైంది. ఎంతో పరిశీలనానుభవం; గ్రామీణ జీవన వాతావరణం తెలిస్తేనే గాని "ఉడతలు పీకిన తాటి టెంకతో" పండు జుట్టుని పోల్చటం కుదరదు. రాచకొండ రచనల్లో సిమిలీ అని శ్రీభద్రిరాజు కృష్ణమూర్తి, శాస్త్రివాడిన వివిధ రకాల సిమిలీలలను వివరించారు. శ్రీమతి సి. ఆనంద రామం గూడ 'అల్పజీవి'లో శాస్త్రి వాడిన సిమిలీల గురించి విశదం చేసారు.

"సూర్యరశ్మి ప్రపంచానికి వజ్రాల పొడి పూసినట్లుగా ఉంది"[12] సూర్యరశ్మిని వజ్రాల పొడితో పోల్చటం చక్కని ఉపమ. "నిండు చంద్రుడు చక్కని వెన్నెల్లో కొత్త వెండి పళ్ళెంలా వెలుగుతున్నాడు"[13] చంద్రుణ్ణి వట్టి వెండిపళ్ళెంతో గాదు; కొత్తవెండి పళ్ళెంతో పోల్చటం రావిశాస్త్రి సామర్థ్యానికి నిదర్శనం.

"వాకిట్లో ఎండవడబోసిన నీటిలా స్వచ్ఛంగా వుంది"[14] అని ఎండని వడబోసిన నీటితో పోల్చి స్వచ్ఛంగా వుందని వర్ణించటం శాస్త్రి లోక పరిశీలనా దృష్టిని; ఆయన ఉపమల మక్కువని తెలియజేస్తుంది. ఉగ్రవాది అని అనుమానించిన అమ్మాయి గురించి వర్ణిస్తూ; "పడగ ఎత్తిన నాగుపామయింది. కోరతెరచిన ఆడపులి అయింది. పెదవి బిగించిన కాళికాదేవి"[15] అని పదప్రయోగం చెయ్యటం శాస్త్రి నేర్పరితనాన్ని; ఆయన భాషా పటిమని; ఉపమల సామర్థ్యాన్ని సూచిస్తుంది.

బోడి భార్య సంద్రాలు దుఃఖాన్ని వర్ణిస్తు "ఒరదకి యేరు యేడ్చినట్టు యేడ్సినాదండి"[16] అని చాల సహజంగా గొప్పభావాన్ని వ్యక్తీకరించారు. వరదవచ్చినప్పుడు ఏరు పొంగినట్టుగా దుఃఖం పొంగివచ్చిందనే సహజ భావన దీనిలో ఉంది.

## 3. రావిశాస్త్రి ముద్ర

రావిశాస్త్రిది ప్రత్యేక ఆలంకారిక శైలి. అది ప్రజా హృదయాల్లోంచి జలపాతంలా పైకుబికి వాళ్ళ నాలుకపై నర్తిస్తుంది. అది, చేర్పాలు అవసరం లేని ప్రత్యేక రాత. పట్టుమని పదిలైన్లు చదవగానే సాహిత్య సంప్రదాయం తెలిసిన పాఠకునికి ఇది రావిశాస్త్రి రచన అని అవగతమవుతుంది. ఉపమానాలతో; వర్ణనలతో సాధారణ ప్రజల వాడుక భాషతో, ఆ ప్రజల యాసతో; ఉత్తరాంధ్ర మాండలికంలో రావిశాస్త్రిశైలి కొనసాగింది. ఆత్మీయులతో మాటాడినంత ఆహ్లాదంగా ఆయన శైలి హృదయాలను హత్తుకుంటుంది. అనితరసాధ్యమని అనలేముగాని; అనుకరణకు కష్టమైన శైలి. విమలను గురించి శాస్త్రి చేసిన వర్ణన ఆయన ప్రత్యేక శైలికి మంచి ఉదాహరణ''. తుఫానులా చెలరేగిపోయింది, సముద్రంలా పొంగిపోయింది; జలపాతంలా ఉరికిపోయింది. అగ్నిజ్వాలలా ఎగసిపోయింది. వెన్నలా కరిగిపోయింది; ఏటికాలువలా పారిపోయింది; పాములా బిగిసిపోయింది; చివరకి చంద్రకాంతిలా నా గుండెలమీద ఉండిపోయింది''[17] ఇదీ రావిశాస్త్రి సొంత ముద్రంటే; ఆయన ప్రత్యేకశైలంటే; ఆయన నవలల్లో ఉపయోగించిన అందమైన రచనా మార్గమంటే; ఆయన భావవ్యక్తీకరణంటే.

'రాజు-మహిషి'లో రాజమ్మను గురించి వర్ణిస్తూ "మరదలుపిల్ల పువ్వు విడినట్లు విడింది. పాలు పొంగినట్లు పొంగింది''[18] అని శాస్త్రి తనదైన ప్రత్యేక శైలిలో వర్ణించారు. రాజు గురించి గూడ శాస్త్రి తనదైన బాణీలో వివరించారు.

రావిశాస్త్రి వాక్య నిర్మాణం (Syntax) చాల విలక్షణంగా ఉంటుంది. 'ఇల్లు'లో "ఏక్‌నిరంజన్, దోసుకీ, తీన్‌గడ్ బిడ్, శార్‌లట్‌ఫిట్ '' అని అన్యభాషా పదాలతో కూడ వాక్యనిర్మాణంలో ప్రత్యేకతని కనబరచారు.

పోలికలతో, మంచి, మంచి పదబంధాలతో వాక్యాలని రాసేప్పుడు, పాఠకునికి ఆభావం, భాష, సందర్భం శాశ్వతంగా గుర్తుండేలా తన బాణీని ప్రయోగించారు. సోమయాజులు గురించి "సిలుకలా అవుపించే సిరుతపులి''[19] అని చక్కగా పోల్చి; అతని స్వభావానికనుగుణమైన పోలికలతో వర్ణించారు.

మందు పోలికలు గూడ ముచ్చటపడి శాస్త్రి చేసారు. "విస్కీ సీసాని కన్నకొడుకుని ఎత్తుకొచ్చినట్టు ఎత్తుకొచ్చి''; "అమ్మాయి నేటివ్ రమ్ములా ఉంటుందని నేననుకున్నాను. తీరా చూస్తే-స్కాచ్ విస్కీ''[20] అని రత్తాలి అందం గురించి శాస్త్రి వర్ణించారు.

'గోవులొస్తున్నాయి జాగ్రత్త'లో ఆలమందని వర్ణిస్తూ:

"అది కొమ్ముల కోటలా ఉంది. ఆ కొమ్ములు కత్తుల జంటల్లా ఉన్నాయి. ఆ జంటలు కెరటాల్లేచినట్టూ కొమ్ములు కదిలినట్టూ లేచి కదుల్తున్నాయి. ఆ కదిలే కొమ్ములు వింత వింత కళ్ళతో వికారంగా చూస్తున్నాయి. ఆ చూపుల్లో ఆకలి చాకులున్నాయి. ఆ చాకులకి పాముల మెరుపులున్నాయి. ఆ మెరుపుల వెనుక నిప్పుల నాలికలున్నాయి''[21] ఆకలి చాకులు, ఆ చాకులకి పాముల మెరుపులు, ఆ మెరుపులకి నిప్పుల నాలుకలు తగిలించటం రావిశాస్త్రికే తెలుసు. ఆ ప్రళయాగ్ని అంతటిని దహించి వేస్తుందని గూడ ఆయన సూచించారు. వివిధ ఉపమలతో, తను చెప్తున్న అంశంపై పాఠకుని విశేషంగా ఆకర్షించి; అతని మనసు ఆవిషయంపై కేంద్రీకృతమయ్యేలా రచన జేసిన, శైలీశిల్ప రహస్యమేస్త్రి రావిశాస్త్రి.

జాకీ, లచ్చయ్యమ్మపై దూకటాన్ని, మొరగటాన్ని, ఆమెను కబళించ బోవటాన్ని భావసాంద్రతతో వర్ణించారు. "నన్ను దూసుకుపోయింది, పిడుగులా మొరిగింది. యమకింకరుళ్ళా దాటింది. టార్పిడోలా పరిగెట్టింది; ఆ జాకీ ఆవిణ్ణి చంపేసేపోను; చీరేసిపోను; నెత్తురు తాగేసిపోను"[22] ఎక్కడ ఏపదాలని పోహళించాలో తెలిసిన; పద ప్రయోగశీలి శాస్త్రి. పుష్పమాలాకారుడుకి ఏపువ్వు తరువాత ఏ పువ్వు నుంచితే మాల అందంగా ఉంటుందో తెలిసినట్లు; రావిశాస్త్రి గూడ సందర్భానికనుగుణంగా ఎలా పద ప్రయోగం చెయ్యాలో బాగా తెలుసు. ఆపద విన్యాసాలతో ఆయనకు సాటి వచ్చే వారిని వేళ్ళపై లిక్కించవచ్చు.

సింహాచలం విషపు కోరల్లో రెండోసారి ఇరుక్కుపోబోతున్న రత్తాలు గురించి:

"మరోసారి, మరోసారి పట్టుకున్న పువ్వుల దండలు పసరిక పాముల యేయి మరోసారి మరోసారి; వర్షిస్తాయనుకున్న నీటిమబ్బులు చింతనిప్పుల్నే కురిపించేయి మరోసారి మరోసారి; నిండా పాలున్నాయని పట్టుకున్న కుండ; నూనె; నల్లమందులతో నిండా నిండుకుంది; మరోసారి మరోసారి; పచ్చని చల్లని పైరగాలి మంటలుగా మారి మారి బుసలు కొట్టింది. మరోసారి మరోసారి; పాపం తెలియదనుకున్న పండు వెన్నెల్లో కొస్తే అది సెగల పొగలుగా రేగిరేగి లేలేత గుండెల్ని కాల్చి మాడ్చింది"[23] అని కవిత్వ స్థాయిలో ఆదుర్మార్గాన్ని మనసుకు హత్తుకునేలా వర్ణించారు. పువ్వుల దండలు; నీటి మబ్బులు; పాలకుండ; చింతనిప్పుల; నూనె; నల్లమందులతో నిండుకున్న కుండల, మంటల సెగల పొగల ఉపమాన ధర్మాలని ఆరోపించి అలంకారిక శైలిలో మనోహరంగా వర్ణించారు. రాశిశాస్త్రి కమనీయ శైలికి ఇదొక మచ్చుతునక.

సచ్చాలు ఆత్మహత్య చేసుకున్నప్పుడు రత్తాలు ఆమెనుద్దేశించి- "పువ్వులా వికసించి వుంటుంది. దీపంలా వెలిగుంటుంది. చిలకలా పలికుంటుంది కలికిలా కులికుంటుంది. ఉదయారుణ రేఖల్ని, చలికాలపు నులివెచ్చని ఎండనీ, మబ్బుల్లో హరివిల్లునీ; చుట్టూ చుక్కలు చేరిన నెలవంకనీ, ఏటిమీద వెన్నెల జాలుని, మల్లెపూల సొగసునీ, చల్లగాలి హాయినీ, మనసిచ్చిన వాడి వెచ్చని కౌగిలింతనీ, అన్నీ చూసి, అన్నీ అనుభవించి ఈ దివ్యలోకంలోని అందాలకీ పుణ్యాలకీ; ఎంతో పరవశించిపోయి ఉంటుంది... కానీ, చివరకి, ఆసచ్చాలు; పిగిలిపిట్ట పాముపుట్టని వరించినట్టు, చీకటి నూతిలో నీళ్ళన్నీ, పాములు చుట్టుకున్నట్టు చట్టుకోగా, ఆచావు ఈ బతుక్కంటే ఎంతో సుఖమనిపించి"[24] వుంటుందని, మనసులో ఆవేదన పడటాన్ని హృద్యంగా వర్ణించారు. "పిగిలిపిట్ట, పాముపుట్టని వరించినట్టు" అనటంలోనే సచ్చాలు జీవితమంతా వుంది; ఈవిధమైన పదప్రయోగంలోనే రావిశాస్త్రి విశిష్టత వుంది. వచన రచనలో చక్కని కవితాత్మక ఛాయలు వ్యాపించి వుండటం కూడ శాస్త్రిశైలీ ప్రత్యేకత అందుకనే "వచనం పేరుతో రావిశాస్త్రి రాసింది ఈనాటి అత్యాధునిక కవిత్వంతో పోటీపడగల్గుతోంది అంటే ముప్పయ్; నలభై ఏళ్ళ క్రితమే ఆయన సాధించిన దేమిటో అర్థమవుతుంది"[25] అని ఈయనా ఫెయిల్డ్‌పోయట్‌లో పేర్కొనటం ఆశ్చర్యం కానేకాదు.

దురన్యాయాన్ని అమాయకంగా; సూటిగా ప్రశ్నించే తీరునుబోడి, తన కుమార్తె బలైపోయినప్పుడు పడ్డ ఆవేదనని శాస్త్రి ఆలోచనాత్మకంగా వ్యక్తపరచారు. "పాపం

సేసినోళ్ళని పట్టిచ్చీ వోడు ఒక్కడంటే ఒక్కడు నేకపోనాడండి సుక్కలున్నాయి. సూరెసెం దుర్లున్నరు. కొండమీన కోటల్లాగ్గ ఇంతమంది అధికార్లున్నరు, ఊరికోకలకటేరున్నడు. ఈదికో పోలీసున్నాడుగాని అన్నేయం సేసినోళ్లని అందుకున్నోడు. ఒక్కళ్ళేక పోనాడండి. ఆళ్ళే అన్నేయం జేస్తే మరిక్క ఆళ్ళని అందుకునే వోడెవుడండీ? భగమంతుడందుకోవాలండి. ఆడూ అందుకోకపోతే ఆడిడూటీ మనం దీసుకు మనవే అందుకోవాలండి"[26] నడుస్తున్న చరిత్రని రావిశాస్త్రి ఎంత అందంగా నగ్నంగా ఫోటో దీసారో గమనించవచ్చు. ఇలా నడిపించటమే రావిశాస్త్రి శైలీ విశిష్టత.

'రావిశాస్త్రిది దృశ్యశైలి.... రావిశాస్త్రిది ఆలంకారశైలి. మాండలికం దానిలయ. పద ప్రయోగ వక్రత, వాక్య విన్యాస వక్రత రావిశాస్త్రి శైలికి విన్యాసం. ఉపమ దానికి ఊపిరి, వర్ణన దానికి అలంకారం. వ్యంగ్యం దానికి కంఠస్వరం. రావిశాస్త్రిది ఈనాటి నవలా సాహిత్యంలో అత్యంత ఆకర్షణీయమైన శైలి. కాని రావిశాస్త్రి శైలికున్న అసాధారణ లక్షణాలు హద్దులు మీరిన సందర్భాలు కూడా లేకపోలేదు. ఈనాటి నవలా రచయితల్లో రావిశాస్త్రికున్న శైలీ వ్యామోహం కూడా మరెవరికీ లేదు"[27] ఇవి అక్షర సత్యాలు-రావిశాస్త్రి విశిష్టతకిది సమగ్రవ్యాఖ్యానం.

**4. జాతీయాలు-సామెతలు**

ఏజాతికైనా; ఆజాతికి సంబంధించిన ఆచార వ్యవహారాలను; సంస్కృతీ; సంప్రదాయాలను ప్రతిబింబించే వారసత్వం నుండి; జన జీవన స్రవంతి నుండి జాతీయాలు-సామెతలు పుట్టుకొస్తాయి. రావిశాస్త్రి సందర్భానుసారంగా తనరచనల్లో చక్కని జాతియాలని; సామెతల్ని ప్రయోగించారు.

జాతియాల్ని, సామెతల్ని, విశేష ప్రాచుర్యం పొందిన లోకోక్తుల్ని; రావిశాస్త్రి సందర్భానుసారంగా, ఆయా సన్నివేశాలకి అతికేట్టుగా రచించారు. ఆయన లోక పరిశీలనా దృష్టి; ప్రజా జీవితాలతోవున్న సాన్నిహిత్యసంబంధం, గ్రంథ పఠనానుశీలన - ఇవి ఆయనకు బాగా దోహద పడ్డాయి.

"సెరుగ్గళ్ళా ఉండీవోడు సింతదుక్కలా తయ్యారయ్యాడ"[28] నేది; సూదిలా వచ్చి దబ్బణంలా తయారయ్యాడనే దాని ప్రేరణతో వచ్చిందే "కడుపుల కాళ్ళు ముడుసుకు తొంగుడడిపోవటం"; "పచ్చుల్లా రెక్కలు ముడుసుకు పడుకోవటం"[29] ఇవి జనశ్రుతిలోని లోకోక్తులు. "పిల్లికి బిచ్చం పెట్టడ"[30] నేది ప్రసిద్ధంగా వ్యాపించిన సామెత. ఇలా చాలచోట్ల రావిశాస్త్రి జనప్రియమైన లోకోక్తుల్ని ప్రయోగించారు.

లోకం పోకడని తెలిపే కఠోసత్యాల్ని గూడ శాస్త్రి తనముద్రలో వ్యక్త పరచారు. "అందుచేత ఏంటంటే ఒకణ్నొకడు తినుకుంటూ పాపం చేస్తూనే అందరూ బతకాలి"[31] అని భీముడు చెప్పిన మాటలు లోకధర్మానికి సూచికాలు.

"పోలీసోడంటే గొప్ప డేంజరస్ మనిసని; దేశంలో సేంతి బద్రతలు సక్కగ" ఉండాలంటే "ఊరికి ఒకడే గూండా ఉండాల; ఆడుపోలీసోడే అవాల"[32] అని కఠోర సత్యాన్ని వ్యంగ్యాత్మకంగా వివరించారు. అలానే "రాజుకి రొండుకళ్ళూ, కాళ్ళు; సేతులు ఉన్నాయి. కళ్ళు పోలీసోళ్ళు. మిర్రీ కాళ్ళూ సేతులు"[33] అని రాజకీయాధికారం పోతున్న వెర్రిపోకళ్ళని, దానికి కారణభూతులైన వారిని చాల సహజంగా వివరించారు. "అలతి

అలతి తునియల కాహళి సంధించినట్లు" అన్న తిక్కన్న ఆలోచనను తలపింపజేసేటట్లుగా సంక్షిప్తంగా భావగాఢతతో విషయ వివరణ జెయ్యటం శాస్త్రి సొత్తు. మరోచోట; "ఆరం కోసం పులి అడివంత తిరగాల. తిరిగితే గాని దానికి ఆరం దొక్కదు. గానైతే ఆరంకోసం పీడరు కాలుకదపడు, కుర్చీదిగడు గాని ఆరం ఆణ్ణి ఎతుక్కుంటూ ఆడి ఆఫీసుకే ఒస్తి. అద్దీ పులికి పీడర్‌కీ తేడ"[34] వాస్తవికంగా; హాస్యచమత్కార ధోరణిలో ఇలా చెప్పటం శాస్త్రి నవలా మార్గం.

అనంతం పిసినారి తనాన్ని గురించి చెప్తూ; "ముడ్డికిసెంటూ; మూతికి పేడా రాసుకు తిరుగుతున్నాడు"[35] అని హాస్యభరితంగా; యధార్థంగా వ్యక్తీకరించటం శాస్త్రి సొంతమార్గం. "బాగ్గెమంతుడి పల్లకి బగుమంతుడె మోస్తంటే" అని "తల్లి పాదుగుల సెయ్యేట్టీ నంజికొడుకు" అని, "కందులు తిరగలంట దిప్పినట్టు"[36] అనేవి గూడ మంచి సత్యాలు; జాతీయాలు.

"పులిస్తరాకెళ్ళి పదూళ్ళు ముట్టించినాదన్నట్లు"[37] "తాడే పామవుతుంది"[38] "చేతులు కాలేక ఆకులు పట్టుకోవటం"[39] వంటివి గూడ విశేష ప్రాచుర్యాన్ని పొందిన జాతీయాలు. వీటిని సన్నివేశాలకనుగుణంగా చొప్పించటంలో శాస్త్రి నేర్పరితనాన్ని ప్రదర్శించారు. "కనకపు సింహాసనం మీద శునకం కూర్చుంటే"[40] అనేది ప్రసిద్ధ సామెత. అలాగే "ఈనగాచి నక్కలకి అప్పజెప్పినట్లు"[41] మంచి జాతీయం "నువ్వు నూతంట కప్పలాంటి దానివైతే; నానుసెర్లో సేపలాంటిదాన్ని"[42] జనశ్రుతి లోనిదే. ఇలా తెలుగు వారి జీవన సరళికి అతికేట్టుగా ఎన్నో జాతీయాల్ని; సామెతల్ని రావిశాస్త్రి తన నవలల్లో ప్రయోగించారు.

## 5. ఉత్తరాంధ్ర మాండలిక భాష

ఉత్తరాంధ్ర మాండలిక భాషలో అధికంగా రచనలు సాగించిన తొలి తరం వారిలో రావిశాస్త్రి ప్రముఖులు. శ్రీకాకుళ, విజయనగర, విశాఖ మాండలికాలలో కథలు, నవలలు రాసి వాటికి సాహిత్య ప్రాచుర్యాన్ని; గౌరవాన్ని కల్పించారు. ఈ మాండలికాలలో శాస్త్రి నవలలు రాసారనే కంటే నవలలు చెప్పారనేది యథార్థం. నవలా కారునిగా రావిశాస్త్రి ప్రత్యేక లక్షణాల్లో ఇదొకటి. "సొమ్ములు పోనాయండి" నవల పాఠకుని ఎదుట ఎవరో ఒకవ్యక్తి కూర్చుని ఆ వృత్తాంతాన్ని సినిమాలా చూపించి చెప్తున్నట్లుంటుందేగాని; చదువుతున్నట్లనిపించదు. అలానే "గోవులొస్తున్నాయి జాగ్రత్త"; "మూడు కథల బంగారం' ' నవలలు ఉత్తమ పురుషలో సాగాయి. రావిశాస్త్రి ఏడు నవలల్లోమూడునవలలు ఉత్తమ పురుష పద్ధతిలోనే వెలువడటం వల్ల ఆయన ఏ పద్ధతిని ఎక్కువగా అభిమానిస్తారో మనకు తేటతెల్లమవుతుంది. తన వృత్తాంతాన్ని; తనతోపాటు పెనవేసుకున్న ఇతివృత్తాన్ని; తానే వివరించటం ఉత్తమ పురుష పద్ధతి. దీనిని సమర్థమంతంగా రావిశాస్త్రి వినియోగించారు.

కళింగాంధ్ర ప్రజల యాసని; వాళ్ళ జీవద్భాషని, శాస్త్రి బాగా పట్టుకున్నారు. ఆ ప్రజలు వాడే వాడుకభాషలోనే నవలా రచన సాగించారు. 'సొమ్ములుపోనాయండి' నవల మొత్తం మాండలిక భాషలోనే నడిచింది. ఆయన మొదటి నవల 'అల్పజీవి', చివరి నవల 'ఇల్లు' లో మాండలికభాష; యాసతో కూడిన పాత్రలు; ఆ భాషా ప్రయోగం చాల

ఆరుదు. మిగిలిన అన్ని నవలల్లో ఆ భాష; ఆ సాంప్రదాయాన్నంటి పెట్టుకొని నడిచిన పాత్రలు. విరివిగా కనిపిస్తాయి.

ఉత్తరాంధ్ర మాండలిక భాషలో సామాన్య ప్రజానీకం ఎలా మాటాడు కుంటారో; వాళ్ళ సజీవ భాషలోనే వాళ్ళ జీవన గాథల్ని; వ్యథల్ని రావిశాస్త్రి చిత్రీకరించారు. మచ్చుకి "సొమ్మలు పోడవేటి, బూదేవత పోడవేటి అన్సెప్పి మీకిదంత కతలాగా అపుపించొచ్చండి. కాని మాదిక్కంట శానా మందిరికి ఇలాటియి నిచ్చెకతలండి. జనం నిలబడి సూసీవోరండి. పోతులంటే పోతులు గావండి. జోడెద్దులంత ఎత్తునుండీవండి జెనం నిలబడి సూసీవోరండి. ఇల్లకెల్లి సెప్పుకునీ వోరండి. అంత మంచి పోతులండి. తుంపాల సంతకెల్లి సవగ్గ మూడొందలక్కొని తోలుకొచ్చినారండి. దారిఖర్చు ఓ పదిరూపాయలయిందిగానండి, దాని మాట ఒగ్గేయండి-పోతుల కరీదు మాత్తరం నికార్సిగ (ఖచ్చితంగా) మూడొందలండి. చంద్రమానం ఎళ్ళ అయిదోనాడు తెల్లార్లెగిస్సూస్తె లేవండి"[43] బోడి మన ఎట్ట యెదుట సంభాషించినట్లుందేగాని; రాసినదాన్ని మనం చదువుతున్నట్లుగా ఈ సన్నివేశం అనిపించటం లేదు. ఆ ప్రాంత ప్రజలు మాటాడుకొనే తీరులో, యాసతో వాళ్ళ సాంప్రదాయాల కనుగుణంగానే వాళ్ళజీవితాలను రావిశాస్త్రి చిత్రీకరించారు; తన విలక్షణత్వాన్ని నిలుపుకున్నారు. ఇలాంటి ఉదాహరణలని కోకొల్లలుగా పేర్కొనవచ్చు.

స్త్రీలు పోట్లాడుకొనే సమయంలో నోటికి హద్దు; అదుపులేకుండా; తాళం లేకుండా; ఒళ్ళు మరచి వాడే పద ప్రయోగాలని రావిశాస్త్రి యధార్థంగా ఉపయోగించటమేకాదు; ఆ సన్నివేశాన్ని వాస్తవికంగా; రసవత్తరంగా చిత్రించిన తీరు గమనిస్తే ఆయన ప్రజల భాషకెంత పదును బెట్టారో తెలుస్తుంది. బంగారి, రాజమ్మ పోట్లాడుకొనే సన్నివేశంలో "ఇదినాకొట్టు ఇక్కడ ఓవుర్రైనా సరే; తాసీల్దారు పెల్లమైనా సరే; కలకటేరుంచుకున్న ముండైనా సరే; అప్పన్సంపి దాని మొగుణ్ణి పక్కల ఏసుకున్న ఏ బటాచోర్రైనా సరే నాకొట్టుకాడికీ ల్లేదు, ఇక్కడ జెట్టీలాడ్డానికీల్లేదు" అని తకతైతకతై మంటూ గెంతింది బంగారి. "ఓసెల్లవే! సవితినాయరాలా; నీకొట్టుకాడికి నీ రంకుమొగుళ్ళంతా రావొచ్చు! మరియాదస్తు్రలాకూడదే! ఓసి కొట్టు దిగిపోనావని మాకు బయివేటే॥? ఊరికోమొగుడేనీకు! ఈదికోమొగుడేనీకు! పేటకో మొగుడే నీకు"! అంటూ రాజమ్మ రెండు చేతుల్తోను లయగా తొడలు బాదుకొంటూ అరిచింది. "పోలీసోడో మొగుడు, ఏడ్డా మొగుడు, బావో మొగుడు; మందుల భీముడు మరో మొగుడు! "ఎల్లవే ఎల్లవే"[44] అని చాలా సహజ సిద్ధంగా శాస్త్రి ఈ సన్నివేశాన్ని వాళ్ళ నిత్య వ్యవహారిక భాషలోనే అద్భుతంగా చిత్రీకరించారు. ఈ సిన్నివేశం "ఖాళీసీసాల కథ"ని జ్ఞప్తికి దెస్తుంది.

" ఏ పెట్టో ఆనిక డొక్కడంలేద్దు. నువ్వెళ్తన్నావు గద్దా! ఏ పెట్టొ కనిపెట్టు, నీకది దొక్కపొద్దు. దొక్కిన్దాంట్లో నాకు ఓ కూరాకు ఇయ్యి. నీ దూది పుల్ని నీమావని మర్సిపోకు"[45] అని దూది పులి చెప్పిన మాటలు ఉత్తరాంధ్ర ప్రాంతీయ ప్రజల భాషకి సన్నిహిత మైంది. 'దొక్కుపొద్దు' 'కూరాకు' అనేవి ఆమాండలిక భాషని ప్రతిబింబిస్తున్నాయి.

విశాఖ ప్రాంతీయ సాధరణ ప్రజల పాత్రోచిత భాషకి కొంగరిన్గా అతని మాటలు మంచి ఉదాహరణ. "ముండ పాపలు పంట మొక్కలయితే ఆళ్ళని దోసుకొనిగదా

కలుప్మొక్క బలిసినట్టు బలిసిపోనాది మాయప్ప గోరి బొట్టె! సేనుకి సీడ ఒట్టుకుందంటే సేనున్దినేసి సీడ బలుస్ది! మరినోక వంట బలిసి నోళ్ళంతా బలివిలేనోళ్ని దోసుకునే బలిసినారు గాని ఉంకో బల్సినారేటి? ఉంకోలాబల్దం ఉంకోలా జరగనేదే. మరింక అంచేత ఏటంటే అందుకు ఉప్పాయం చింపులే! కలుప్మొక్కల్ని ఏరి పారేసినట్టు సీడపురుగుల్ని మందేసి కొట్టేసినట్టు, దోసుకు బలిసే నాకొడుకుల్ని ఏరిపారేసి కొట్టి పారేయాలి. కాని ఒచ్చిన సిక్కేటంటే! పంట మొక్కలన్నీ తలకోదారీ పోతావుంటే కలుప్మొక్కలన్నీ కల్సిపోయి నిలబడుతన్నాయి. సీడ పురుగులన్నీ సెదిరి పోకండ జట్టుకట్టుకు పెరుగుతున్నాయి".46 వర్గ దృష్టిని పంట మొక్కలు, కలుపు మొక్కలతో పోల్చి సాధారణ భాషలో, విడమరిచి కొంగచేత చక్కగా బోధపరిచారు రావిశాస్త్రి.

అలానే విశాఖ, శ్రీకాకుళప్రాంత గ్రామీణ ప్రజల భాషలోని మారు మూలల్లో వాడే పదాల్ని, వాళ్ళ సాంప్రదాయాలకనుగుణంగా వాడే పదాల్ని చాల చోట్ల రావిశాస్త్రి ప్రయోగించారు. 'కవుకులు పడ్డం' (కష్టపడ్డం) బెత్తాయించినారు (పురమాయించి నారు) థకరా (పొరబాటు) తగుమడిసి (పెద్దమనిషి) పాసుకుడుగాళ్ళు (బ్రోకర్లు) రోకు (ఇష్టం) కబ్బ (వోణి) కసాలా (తగువు) రగిడీసులు బేగెళ్ళి పాఠ్రా (తొందరగారా) చాగోరటం (పడుకుంటం) ఇసుళ్లూ కసుళ్లూ (ఇసురుకుంటం, కసురుకుంటం) బిగుల్లు (నీలిగి) సన్నివేశానుగుణంగా మాండలిక పదాలని ప్రయోగించారు.

రావిశాస్త్రి నవలల్లో ఉన్నత, మధ్యతరగతి, శ్రామిక, అట్టడుగు వర్గ పాత్రలున్నప్పటికి; ఆయన రాణింపు నిచ్చింది; జీవం పోసింది; ఇష్టపడిందీ మధ్యతరగతి; శ్రామిక అట్టడుగు వర్గ పాత్రలకే, జీవన పోరులో తాను పడ్డ బాధల్ని; సామాజికంగా నడుస్తున్న చరిత్రని నిశితంగా అధ్యయనం చేసారు గనుకే అద్భుత పాత్రల్ని సృష్టించటంగాదు; జీవింప జేసారు. అడ్డబుర్ర; కొంగరిక్షా అతను; రిక్షాజోగులు; బోడి, మొదలయిన శ్రామిక, అట్టడుగు వర్గ పాత్రల్ని వర్గ దృష్టితో; వాళ్ళ స్వభావ సిద్ధమైన వాతావరణ నేపథ్యాన్ని ప్రతిబింబిస్తు; సామాజిక వాస్తవిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని రచించారు. మరోదృక్కోణం నుండి సుబ్బయ్యని, మందుల భీమున్ణీ; బంగారయ్యని; సోమయాజుల్ని; రాజయోగిని చిత్రించారు.

## 6. విలక్షణత్వం

స్త్రీ పాత్రల్లో గూడ మధురవాణిని తలపింపజేసే ముత్యాలు; ఇంకా రత్తాలు; రాంబాబు తల్లి, లచ్చయ్యమ్మ, రాధ; బంగారి; సంద్రాలు, శాంతమ్మ; చిట్టెమ్మ, గిరిజ; మొదలయిన శ్రామిక అట్టడుగు వర్గ; మధ్య తరగతి మనస్తత్వంగల పాత్రలని సామాజిక బాధ్యతతో చిత్రీకరించారు. ముత్యాలు పాత్ర తెలుగు సాహిత్యంలోశాశ్వతంగా నిలిచిపోతుంది. విశ్వమోహిని; రాజమ్మలను గూడ వర్గ నేపథ్యంలోనే మలిచారు. తన నవల లన్నిట స్త్రీ పాత్రలకి ప్రాముఖ్య మిచ్చివాళ్ళ జీవితాలు మంచివైపు మళ్ళటానికే శాస్త్రి పాటు బడ్డారు. సమాజంలో; నిజజీవితంలో సగభాగమైన స్త్రీల సమస్యలపై, వాళ్ళజీవితాలకు సంబంధించిన విషయాలపై ఆయన బాగా స్పందించారు. ఇందుకు ప్రముఖంగా 'రత్తాలు-రాంబాబుని' 'గోవులొస్తున్నాయి జాగ్రత్తని' 'రాజు-మహిషి' నవలల్ని పేర్కొనవచ్చు.

లంపెన్స్; కేడీలు; బ్రోకర్లు; జేబు దొంగలు; ఏ దారీలేక ఒళ్ళమ్ముకొని బతికేవారు

- ఇలాంటి వాళ్ళ జీవితాలను గూడ సానుభూతితో పరిశీలించాలనే ధోరణిని కలిగించి; వాళ్ళకు తన నవలల్లో చోటిచ్చి; వాళ్ళ జీవితాలలాయెందుకు వక్రీకరించాయో కార్యకారణ సహితంగా వివరించారు. వీళ్ళగురించి రావిశాస్త్రి పట్టించుకున్నంతగా మిగతా నవలా కారులు స్పందించలేదు. రావిశాస్త్రి నవలలన్నింట పరోక్షంగానైనాసరే పోలీసు, న్యాయశాఖల; కోర్టుల ప్రస్తావన తప్పని సరి. గంగరాజెడ్డు; సుబ్రావెడ్డు; పోలీసాఫీసర్ చిట్టిబాబులను పోలీస్ శాఖాపరంగా మరవిపోలేని తీరులో శాస్త్రి చిత్రీకరించారు. 'రాజు-మహిషి'లోని న్యాయవాదుల-న్యాయమూర్తుల అంతర్గత విషయాలను ఆ శాఖ పనితీరుకు ప్రతీకలుగా వర్ణించారు. కోర్టు తీర్పుల భాగోతాన్ని 'సొమ్ములు పోనాయండి' ద్వారా విశదం చేసారు.

రాజకీయధాకారిక ప్రవేశంతో సామాజిక జీవితం; సన్నజీవాల బతుకులు ఎలా అస్తవ్యస్తమవుతాయో శాస్త్రి తన నవలల ద్వారా ఎరుక బరచారు.

మొక్కపాటి నరసింహశాస్త్రి "బారిష్టర్ పార్వతీశం" (1925) తో తెలుగులో ఉత్తమ పురుషలో నవలలు రాయటం మొదలైతే, దానిని బాగా పదునెక్కించారు. రావిశాస్త్రి. మొత్తం నవల నవలంతా మాండలికంలో ఉత్తమ పురుషలో సాగిన 'సొమ్ములు పోనాయండి' రావిశాస్త్రి నవలల్లో ఉత్తమోత్తమమైంది.

నవలేతి వృత్తాల స్వీకరణల్లో గూడ శాస్త్రి విశిష్టతని కనబరచారు. తెలుగు సాహిత్యంలో మొట్టమొదటగా మనో విశ్లేషణాత్మక మార్గంలో; ఆత్మన్యూనతా భ్రాంతితో రావిశాస్త్రి తన మొదటి నవల 'అల్పజీవి' ని రచించారు.

వ్యభిచారిణి కన్న, వ్యభిచారాన్ని ఇతి వృత్తంగా స్వీకరించి 'రత్తాలు-రాంబాబు' నవలని రచించారు. వ్యభిచార గృహాలని; ఆ కోరల్లో చిక్కుకుపోయిన అబలలజీవితాల్ని; వాళ్ళ దీనత్వాన్ని, ఆ జీవన దుర్భరత్వానికి గల కారణాల్ని విశ్లేషించారు. వీళ్ళ పక్షాన నిలచి; సానుభూతిని, జాలిని ప్రదర్శించిన రచయితల్లో రావిశాస్త్రే ప్రథములు.

ఇతివృత్త స్వీకరణల్లోనే గాదు; నిర్మాణ, నిర్వహణల్లో గూడ రావిశాస్త్రి తన ప్రత్యేకతని నిలుపుకున్నారు. కథాకథనంలో ఆయన మౌఖికసాంప్రదాయాన్ని పాటించారు. (Oral tradition). ఆయన నవలలు రాసినట్టు గాకుండా; చెప్పినట్లు ఉంటాయి. పాఠకునికి విన్నట్టు అనుభూతి కలుగుతుందేగాని; చదివినట్టు అనిపించదు. నవలా కారుడిగా రావిశాస్త్రి విశిష్ట లక్షణాల్లో ఇది ప్రముఖమైంది. 'కెన్యా' రచయిత 'గూగి' గూడ ఈ పద్ధతిలోనే, రచనలు జెయ్యటం విశేషం 'గూగి' 'మాటిగరి' మౌఖిక పద్ధతిలోనే నడిచింది. ఈ మౌఖిక విధానాన్ని, జానపద; నాటకీయ, కావ్య పద్ధతుల్లో నడిపించారు. నిర్వహణలో ఆయన ఉపయోగించే శైలీ విన్యాసం ప్రత్యేక మైంది. నవలేతి వృత్తాల స్వీకరణల్లో; రావిశాస్త్రి వైవిధ్యాన్ని పాటించారు. తన దైన బలమైన ముద్రని వస్తు; శిల్పపరంగా రెండింటిలోనూ ప్రదర్శించారు. ఈ విలక్షణత్వంతోనే సమకాలీన కథా, నవలా రచయితలని; సమకాలీన కథా, నవలా సాహిత్యాన్ని శాస్త్రి ప్రగాఢంగా ప్రభావితం జేసారు.

నవలల ఎత్తుగడలో; ప్రారంభించటంలో శాస్త్రి అద్భుత ప్రతిభని ప్రదర్శించారు. ముఖ్యంగా "సొమ్ములు పోనాయండి" నవల ప్రారంభవాక్యాలు ఏనాటికీ మరచి పోలేని మౌఖికసాంప్రదాయ పద్ధతిలో సాగాయి. చదివీ చదవగానే ఆవ్యాక్యాలు హృదయాలను హత్తుకునేలా; శాశ్వితంగా గుర్తుండేలా ఉన్నాయి.

నవలల ప్రారంభవాక్యాలు హృద్యంగా; ఆలోచనాత్మకంగా శాశ్వితంగా మనసులో ముద్రపడి ఉండేలా ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవి; లియోటాల్ స్టాయ్ 'అన్నాకరేనినా'; చార్లెస్ డికెన్స్ "దిటేల్ ఆఫ్ టూ సిటీస్"; (రెండు మహానగరాలు) పెర్ల్‌ఎస్‌బక్ "ది గుడ్ ఎర్త్"; లు. ఈ కోవలోనిదే; రావిశాస్త్రి 'సొమ్ములు పోనాయండి' గూడ. మౌఖిక బాణీలో చూస్తే శాస్త్రి 'సొమ్ములు పోనాయండి'లోని ప్రారంభవాక్యాలు పై నవలల కన్నా గొప్పవి. మాండలిక భాషా ప్రత్యేకత కూడ ఈనవలకుంది.

"అన్నాకరేనినా" ప్రారంభవాక్యాలు : "సుఖపడే సంసారాలన్నీ ఒకలాగే వుంటాయి. సుఖంలేని సంసారాలకి మాత్రం దేని బాధలు దానివి".[47] (All happy Families resemble oneanother, every unhappy family is unhappy in its own way[48] ...... మచ్చుకి)

"అబ్లాన్ స్కీల కాపరంలో ప్రతీదీకలగా పులగం అయిపోయింది. తమ పిల్లలకి అంతకు ముందు దాకా ఫ్రెంచి పంతులమ్మగా వున్నావిడతో భర్త ప్రేమకలాపం నడిపిస్తున్నాడని భార్య కనిపెట్టింది. ఒకే వెన్ను వాసం కింద తనింక కాపరం చెయ్యలేనని అతనితో చెప్పేసింది".[49]

"The Good Earth" ప్రారంభవాక్యాలు : "It was Wang Hungs marriage day. At first, opening his eyes in the blackness of the eurtains about his bed he could not think why the dawn seemed different from any other. The house was still except for the faint, gasping couhg of his old father; whose room was opposite to is own across the middle room. Every morning the old man's cough was the first sound to be heard. Wang hung usually lay listening to it and moved only when he heard it approaching nearer and when he heard the door of his father's room squeak up on its wooden hinges"[50] దీని తరువాతి వాక్యాలు గూడ చాల వర్ణనాత్మకంగా ఉంటాయి.

The Tale of two cities (రెండు మహానగరాలు) ప్రారంభవాక్యాలు అద్భుతంగా ఇలా సాగాయి: "అది ఒక వైభవోజ్వాల మహాయుగం; వల్లకాటి అధ్వాన్న శకం. వెల్లివిరిసిన విజ్ఞానం.....బ్రమ్మజెముడిలా అజ్ఞానం. భక్తి విశ్వాసాల పరమ పరిధవం. పరమ పాషండాల ప్రల్లదకల్లోలం. ఉజ్వల చైతన్యాల ఉత్ఫుల్ల మహోదయం - అంధాంధ తమసాల అవ్యక్త నిశీధం. ఆకాశ కుసుమాలు పుష్పించిన ఆ మధుర వసంతం....... నైరాశ్యపు చలి గుబుళ్ళు ఈచుకున్న శిశిరాస్యం. సర్వ సంవపత్సమృద్ధి-సర్వతో ముఖక్షామం. స్వర్గానికి రాచబాట పుచ్చుకున్నజనం - నడుస్తున్నారు, నరకానికి సూటిగా అరుస్తున్నాయ్ అధికార కంఠాలు - అంతా అమోఘంగా వుందని. సూక్ష్మంగా చెప్పాలంటే, నేటి పరిస్థితికి నకలుగా వుంది. నాటి పరిస్థితి"[51] గొప్ప కవితాత్మక శైలిలో నడిచాయి ఈ వాక్యాలు. ఈమూడు నవలల్లోని ప్రారంభ వాక్యాల కన్నుమిన్నగా; ఒకసారి విన్న వానికా మాటలు నిరంతరం గుర్తుండేలా చక్కని శైలిలో పొందు పర్చబడ్డాయి; రావిశాస్త్రి 'సొమ్ములు పోనాయండి' లోని ప్రారంభ వాక్యాలు :

'సొమ్ములుపోనాయండి' అదండి! అది ఆరాంబవండి. జెతపోతులండి! జెనం నిలబడిసూసీవోరండి. అలాంటి సొమ్ములు పోనాయండి. సొమ్ములు పోనాక, బూదేవత గూడా పోనాదండి. ఆ యెనకనించి సంసారఁవంతా సల్లారి పోనాదండి. బూదేవత

పోద్దేటండి? మనం బోతాంగాని, బూదేవత పోదండి మరంచేత, ఏటైనా దన్నమాటండి. నాబూదేవత ఉందిగానీ, అందు మీద నానులేనండి ఉంకోడున్నడండి. ఆడికి నాను అమ్మలేదండి ఆడు నాబూదేవతని బలివిని అక్కర మిచ్చీసుకున్నడండి. బలివిని అక్కరమిచ్చీసుకున్నోడు ఒవుడండి? మరొహుడూ; మరొహుడూగాదండి. మావూరు పెసినెంటు గోడేనండి. అవునండి. ఆడేనండి ఆడుతొల్త ఇలాగ్గలేడండి. ముండలాగ్గ ఉండేవోడంది - ఉప్పుడైతే కొండలాగ్గ ఎదిగిపోనాడు గాని''[52], ఇంకా తరువాత సాగిన వాక్యాలు గూడ ఆణిముత్యాల్లా మెరిసాయి. ప్రపంచ సాహిత్యంలోని ఏగొప్ప నవలా ప్రారంభవాక్యాల కన్న తీసిపోనివిధంగాకాదు. మిన్నగా, మెచ్చుకునేలా, హృదయాలకు హత్తుకునేలా రావిశాస్త్రిశైలి మనోహరంగా నడిచింది 'సొమ్ములు పోనాయండి'లో. మౌఖిక సాంప్రదాయ బాణిలో సాగిన ఈ శైలి సామాన్య ప్రజల వాస్తవిక జీవద్భాషకు అతి సన్నిహితమైంది. కళింగాంధ్ర అట్టడుగు ప్రజానీకం ఈ భాషలోనే మాటాడుకుంటారు. రావిశాస్త్రి శైలి విశాఖ, శ్రీకాకుళ మాండలికాలకు అద్దంపట్టింది. నవలల ఎత్తుగడ; ప్రారంభవాక్యాల విశిష్టతతో రావిశాస్త్రి విశ్వసాహిత్య పంక్తిలో మొదటి వరసలోనే ఉంటారనేది యధార్థం.

ఉదాత్త ప్రతిభతో, సాధారణ ప్రజావాడుకభాషలో ఉత్తమ నవలలు వెలువరించి; తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని పదిల పరచుకున్న రావిశాస్త్రిలో గూడ, రచనా మార్గంలో అక్కడక్కడ అపశ్రుతులు లేక పోలేదు. పొరపాట్లు మానవ సహజం; దిద్దుకుంటం మహాత్ముల సుగుణం.

కొన్ని పేజీలకు పేజీలే పాత్రల చేత ఉపన్యాసధోరణిలో నవలేతి వృత్తాలు నడిపించారు. కొన్ని సందర్భాలలో ఉపన్యాస ధోరణి గల ఆపేజీలను రచనా క్రమం నుండి తప్పించిన; ఇతి వృత్తానికి భంగం లేని పద్ధతిలో గూడ, ఈ ఉపన్యాసాలు కొనసాగాయి.

'రాజు-మహిషి'లో పీనుగ్గుమస్తా ఉపన్యాసం; పంతొమ్మిదవ భాగంలో మందుల భీముడు ప్రస్తావించిన విషయాలు, ఇంకా 'గోవులొస్తున్నాయి జాగ్రత్త', రత్తాలు-రాంబాబు లలో గూడ ఇలాంటి ఉదాహరణలు ఉన్నాయి.

విపరీతంగా, మితిమీరిన వర్ణనలు; నవలల కథాగమనానికి అడ్డుపడేలా కూడ సాగాయి. నవలేతి వృత్తం; పాత్రలు; అదుపు దప్పిన సందర్భాలు కూడ ఉన్నాయని రావిశాస్త్రే స్వయంగా పేర్కొన్నారు. "మూడు కథల బంగారం"; "గోవులొస్తున్నాయి జాగ్రత్త"ని ఇందుకు పరిశీలనగా పరిగణించవచ్చు.

లంపెన్స్‌కి, అసాంఘిక శక్తులకుఅధిక ప్రాముఖ్యమిచ్చారనే వాదన సాహితీ కారుల్లో ఉంది. ఇది రావిశాస్త్రి మీద దుమారం లేపినంతగా లేదుగాని, 'మూడు కథల బంగారం'లో కొద్దిగా కనిపిస్తుంది.

సినిమా మోజుకి ఆకర్షితులై రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు'ని రచించారు. సందేశం కన్నా వ్యాపార దృష్టి చలన చిత్రరంగంలో ఎక్కువ గాబట్టి; ఆ గాలి కొంత 'రత్తాలు-రాంబాబు' పైవీచింది. మొదట్లో "విప్రనారాయణ థీమ్‌ని ఆధారంగా మంచి-చెడుని తీసుకొని రత్తాలు-రాంబాబు ఇతి వృత్తాన్ని రాద్దామనుకున్నాను. విప్రనారాయణ కథ ఆధారంగా నవల రాద్దామంటే అది రత్తాలు-రాంబాబు నవలై కూర్చుంది. కాని తరువాత దీనిలో కొంత మార్పుజరిగింది. "ఏలూరు లక్ష్మీటాకీసు ప్రొప్రైటర్ శ్రీ గిరిబాబు

"పుణ్యాంకొద్ది పురుషుడు" అనే సినిమా తియ్యటం కోసం రావిశాస్త్రి 'రత్తాలు-రాంబాబు' నవలని రచించారు. కారణాంతరాల వల్ల సినిమా తీయటం వీలుపడలేదు".

ఈ దృష్టితో గూడ "రత్తాలు-రాంబాబు"ని చూడాలి.

అక్కడక్కడా కొన్ని అశ్లీల పదాలు, ఎబ్బెట్టుగా ఉండే మాటలు శాస్త్రి నవలల్లో చోటు జేసుకున్నాయి. 'రత్తాలు-రాంబాబు' లో జలజ సింహాచలంతో మాటాడిన విధం ఇందుకొక ఉదాహరణ. 'రత్తాలు-రాంబాబు' లోనే గాకుండ; శాస్త్రి చివరి నవల 'ఇల్లు' లో గూడ 'లంజ', 'లంజాకొడుకులు' లాంటి పదాలు చోటు జేసుకున్నాయి. సమాజంలో ఈ రకమైన సంభాషణాధోరణి ఉంది. అయితే తరచుగా ఈ పదాలను వాడవలసినంత అవసరంలేదు.

అలానే కులాల; శాఖల ప్రస్తావన ఇతర నవలల కంటే 'ఇల్లు' లో మరీ ఎక్కువగా ఉంది. రవిశాస్త్రి లాంటి ప్రగతిశీల రచయిత వాడకూడని తీవ్ర అభ్యంతర పదజాలాన్ని కూడ ఆయన రాయటం ఆక్షేపణీయం; "ఈ రోజుల్లో మాలోణ్ణి తిడితే ఆడూరుకోడు! అలాటప్పుడు దేవుణ్ణి తిడితే"[53] అని హెడియా ద్వారా రాజు-మహిషి లో అని పించిన మాటలు రావిశాస్త్రి స్థాయికి తగనివి. ఇంకా ఇతర కులాల ప్రస్తావన కూడ చాల చోట్ల వచ్చింది. ఆ ప్రస్తావనను అవసరానికి మించి వాడిన సందర్భాలు గూడ ఉన్నాయి. ఇంతకన్న ఈ విషయంపై ఎక్కువ చర్చ అనవసరం.

అయినప్పటికీ రావిశాస్త్రి వర్గదృష్టి గల ప్రగతి కాముక ప్రజారచయిత. నిజ జీవితంలో గూడ పీడిత ప్రజల పక్షాన నిలచి; వాళ్ళ అభ్యుదయం కోసం శ్రమించిన మానవతావాది. వడ్డించిన విస్తరి జీవితాలొకవైపు; ప్రేవులు నకనకలాడే దుస్థితి మరోవైపు కొనసాగుతున్న ఈ తూర్పు, పశ్చిమ దిశల విధానం అంతమవ్వాలని; రావిశాస్త్రి తన రచనల ద్వారా; జీవితం పరంగా ఆశించారు. అందువల్లే ఆయన రచనల్లో సామాజిక వాస్తవిక దృష్టి; మార్క్సిస్ట్ దృక్పథం మెండుగా కనిపిస్తుంది. అద్భుత శైలీవిన్యాసంతో; విలక్షణ వస్తు; శిల్ప సామర్థ్యంతో; సామాజిక చైతన్యానికి దోహదపడే నవలలే రావిశాస్త్రి రచించారు. పాఠకునిలో ఆలోచన రేకెత్తింపజేసి; చెడు నుండి మంచి వైపు మొగ్గేలా ఆయన నవలలు దోహదపడ్డాయి. నవలా కారునిగా "రావిశాస్త్రీయాన్ని" వ్యాపింపజేసారు. పరిపూర్ణంగా కాకపోయిన; తన పరిధి మేరకు అట్టడుగు ప్రజాజీవితాన్ని; వాళ్ళ బాధల్ని; వాటిమూలాన్ని తడమటంతోపాటు; మధ్యతరగతి ప్రజల జీవితాలని; వాళ్ళ దైనీయ పరిస్థితులను; అడకత్తెరలో పోకలా నలుగుతూ కూడ వాళ్ళల్లో చావని మానవతని; రావిశాస్త్రి తన నవలల్లో ప్రదర్శించారు. ఆలంకారిక వచన, రచనలో; అపూర్వ శైలీ విన్యాసంలో; మౌఖిక సాంప్రదాయ రీతిలో; పాఠకుల నాకర్షించి; విశిష్ట నవలా రచయితగా సాహితీ లోకంలో రావిశాస్త్రితన స్థానాన్ని సుస్థిర పరచుకున్నారు. కేవలం నవలాకారునిగానే గాకుండ, నాటక; కథా రచయితగా కూడా రావిశాస్త్రికి ప్రత్యేక స్థానముంది. విశిష్ట నవలా రచయితగా కేవలం తెలుగు సాహిత్యంలోనే కాదు వీలుపడి ఆంగ్లభాషలోకి ఆయన నవలల్ని, కథల్ని అనువాదం చెయ్యటం కుదరితే విశ్వసాహిత్యంలో ప్రత్యేక స్థాయి ఉన్న; నవలా, కథారచయితగా రావిశాస్త్రి చిరస్థాయిగా నిలిచిపోతారు. జ్ఞానపీఠ పుస్కారాన్ని పొందకుండానే ఈ లోకం నుండి కనుమరుగైపోవటం; తెలుగు సాహిత్య దురదృష్టం రావిశాస్త్రి కన్న ఆయన సాహిత్య మార్గం ఆదర్శవంతమైంది.

# సూచికలు (References)

## 1. రావిశాస్త్రి జీవన తరంగాలు


1. అత్తలూరి నరసింహారావు; (సం) 'జులై-30' పు: 2
2. పైదే - పు: 2
3. రాచకొండ విశ్వనాథ శాస్త్రి; "రావిశాస్త్రీయం" (విరసం) పు: 18
4. పైదే - పు: 19
5. పైదే - పు: 29
6. మొదటి సూచికలోనిదే - పు: 111
7. పైదే - పు: 111
8. పైదే - పు: 111
9. పై మూడో సూచిక లోనిదే - పు: 19
10. పైదే - పు: 20
11. - పు: 3,4
12. - పు: 17,18
13. పై మొదటి సూచిక లోనిదే - పు: 47
14. పైదే - పు: 51
15. మొదటి సూచికలోనిదే. పు: 127.
16. పైదే - పు: 157.
17. పైదే - పు: 177, 178.
18. పైదే - పు: 9
19. పైదే - పు: 2
20. పైదే - పు: 20
21. పై మూడో సూచికలోనిదే - పు: 20
22. పై మొదటి సూచికలోనిదే - పు: IV
23. పైమూడో సూచికలోనిదే - పు: 28
24. పైదే - పు: 64
25. కె.వి. రమణారెడ్డి (సం); 'సృజన' - 100' - పు: 11; 12;
26. " " (సం); 'నివాళి' - పు: 72.
27. పై మూడో సూచికలోనిదే - పు: 125
28. పై 26 లోనిదే - పు: 72.
29. పైదే - పు: 72.
30. 'అభిసారిక' సంపాదకులు స్వర్గీయ డా॥ రాంషా తన శ్రీమతి స్మృత్యర్థం 1982లో 'శిరీషా సాహిత్య అవార్డు' ని ప్రారంభించారు.
31. స్వర్గీయ త్రిపురనేని గోపీచంద్ కుటుంబంవారు; 'గోపీచంద్' స్మారక అవార్డుని ఏర్పాటు జేసారు. రావిశాస్త్రికి ఈ అవార్డుని 21-12-1987 న హైదరాబాదులో ప్రదానం చేసారు.

32. పైమూడో సూచికలోనిదే - పు: 19
33. మహీధర రామమోహన రావు; ఆహ్వానం; జనవరి 1994 - పు: 6
34. పై 26లోనిదే - పు: 82.
35. పై మూడో సూచికలోనిదే - పు: 58.
36. పై మొదటి సూచికలోనిదే - పు: 8.
37. పైదే - పు: 35.
38. పైదే - పు: 44.
39. రాచకొండ విశ్వనాథ శాస్త్రి ; 'రావిశాస్త్రీయం' (అరుణా పబ్లిషర్స్) - పు: 20.

## 2. నవలల ఇతివృత్తం

1. William Henry Hudson – An Introduction to the study of literature – పు: 131.
2. వై. రామకృష్ణారావు - "ఆధునికాంధ్ర సాహిత్యంలో చైతన్య స్రవంతి". పు:84
3. వల్లంపాటి వెంకటసుబ్బయ్య. "జులై - 30" - పు: 102.
4. రాచకొండ విశ్వనాథ శాస్త్రి - "అల్పజీవి" - పు: 199.
5. రాచకొండ విశ్వనాథ శాస్త్రి - "రాజు-మహిషి" - పు: 197.
6. రాచకొండ విశ్వనాథ శాస్త్రి. "రత్తాలు-రాంబాబు". మూడవ భాగం - పు: 242.

## 3. పాత్ర చిత్రణ

### 3.1. అల్పజీవి - పాత్రల వర్గీకరణ

సంపన్న వర్గ పాత్రలు.

పురుషులు : 1. వెంకట్రావు, స్త్రీలు : 1 సావిత్రి

మధ్యతరగతి వర్గ (దిగువ) పాత్రలు.

పురుషులు : 1. సుబ్బయ్య స్త్రీలు : 1. మనోరమ.

ఇతర పాత్రలు.

1. గవరయ్య 2. నరసయ్య 3. కామేశం. 4. అనధాని 5. నూకరాజు 6. పోతన్న

### 3.2. రాజు-మహిషి-పాత్రల వర్గీకరణ

సంపన్న వర్గపాత్రలు :

స్త్రీలు : 1. శ్యామల 2. పద్మ 3. విశ్వమోహిని

పురుషులు : చైర్మన్ భీమసేనరావు. 2. ప్లీడరు ముకుందరావు

మధ్యతరగతి వర్గ పాత్రలు

స్త్రీలు : 1. రాజమ్మ 2. గిరిజ 3. వర్ధనమ్మ 4. శాంతమ్మ

పురుషులు : 1. గంగరాజు. 2. మందుల భీముడు 3. రంగారావు 4.భవానీ శంకర ప్రసాద్ 5. చిట్టిబాబు

అట్టడుగు వర్గ పాత్రలు

స్త్రీలు : 1. రాధ 2. మంగ 3. అమ్మలు 4. బంగారి

### 3.3 గోవులొస్తున్నాయి జాగ్రత్త-పాత్రల వర్గీకరణ

సంపన్న వర్గ పాత్రలు : 1. రాజయోగి 2. కిరీటి
మధ్యతరగతి దిగువ వర్గ పాత్రలు :
స్త్రీలు : 1. లచ్చయ్యమ్మ 2. లచ్చయ్యమ్మతల్లి
పురుషులు : 1. లచ్చయ్యమ్మ తండ్రి, సోదరులు; 2. సత్యమూర్తి 3. గోదాసు.
లంపెన్ క్యారెక్టర్స్ : 1. ప్రభుదాసు 2. శివకేశవరావు.

### 3.4 రత్తాలు-రాంబాబు-పాత్రల వర్గీకరణ

సంపన్న వర్గ పాత్రలు :
స్త్రీలు : 1. రాధమ్మ
పురుషులు : 1. కృష్ణ 2. హనుమంతరావు 3.గోపాలరావు.
4. సన్యాసినాయుడు 5. (కారు) జోగులు.
మధ్య తరగతి దిగువ వర్గ పాత్రలు:
స్త్రీలు : 1. రాంబాబు తల్లి. 2. వసంత
పురుషులు : 1. రాంబాబు. 2. నారాయడు 3. మాధవరావు.
4. ముసలాయన
అట్టడుగు వర్గపాత్రలు:
పురుషులు : 1. (రిక్షా) జోగులు. 2. కొంగ 3. అడ్డబుర్ర.
లంపెస్ వర్గ పాత్రలు:
స్త్రీలు : నరసమ్మ
పురుషులు : 1. సింహాచలం 2. రాకెట్ 3. స్పుత్నిక్
4. మాయ్య 5. గల్లీపులి.

### 3.5. సొమ్ములు పోనాయండి - పాత్రల వర్గీకరణ

సంపన్న వర్గ పాత్రలు : 1. ప్రెసిడెంట్ 2. మిరపకాయల సిన్నారావు.
అట్టడుగు వర్గ పాత్రలు :
పురుషులు : 1. దాసరి బోడియ్య 2. బోడి బావమరిది 3. జగిలీడు
స్త్రీలు : 1. సంద్రాలు 2. సిలుక (చి) 3. జగిలీడు భార్య
ఇతర పాత్రలు : 1. కర్ణం 2. పోలీసు జవాను

### 3.6. మూడు కథల బంగారం-పాత్రల వర్గీకరణ

సంపన్న పాత్రలు : 1. బంగారయ్య.
మధ్యతరగతి వర్గ పాత్రలు : 1. బంగారిబాబు 2. కనకరాజు
3. వరహాలు, బంగారుబాబు, అక్క, బావ 4. శేషారావు. 5. బైరాగి
6. ధనాల వజ్రం 7. రామచంద్రయ్య
స్త్రీలు : 1. విమల 2. అమ్మలు 3. సరళ
లంపెన్ క్యారెక్టర్స్ : 1. సత్తరకాయ 2. సిత్తర్లేఖ 3. సిలకముక్క
4. దూదిపులి 5. బంగారిగాడు
6. నారాయణ, నాయుడు, ప్రెసిడెంటు, కర్రిపంతులు

## 3.7. ఇల్లు - పాత్రల వర్గీకరణ

పాత్రల వర్గీకరణ

1. సంపన్న వర్గ పాత్రలు.
   పురుషులు : 1. మనోహరం; స్త్రీలు : 1. సూర్యకాంతం
2. పెట్టుబడి దారీ ఆలోచనలున్న మద్యతరగతి వర్గ పాత్రలు.
   పురుషులు : 1. అనంతం 2. సోమయాజులు 3. గవర్రాజు
   4. చిట్టిబాబు 5. సూరిబాబు
   స్త్రీలు : 1. శాంతమ్మ
3. మధ్యతరగతి దిగువ వర్గ పాత్రలు (లేక సగటు జీవితాలు)

పురుషులు : 1. అరుణ ప్రకాశం 2. అనంతం తండ్రి 3. బేటామీను
స్త్రీలు : 1. వెంకటలక్ష్మి 2. జ్యోతిర్మయి 3. చిట్టెమ్మ 4. పెద్ది

4. విప్లవ పాత్రలు : 1. ఉదయం 2. ఝూన్సి
5. ఇతర పాత్రలు : 1. రెడ్డినాయుడు ప్లీడరు 2. ఇతర ప్లీడర్లు, నూకరాజు

### 3. పాత్రచిత్రణ

1. వల్లంపాటి. వెంకట సుబ్బయ్య; 'నవలాశిల్పం' పు: 32.
2. పై. రామకృష్ణారావు; "ఆధునికాంధ్ర సాహిత్యంలో చైతన్య స్రంవంతి" పు: 84
3. కాత్యాయనీ విద్మహే; మార్క యాదయ్య; "రావిశాస్త్రి సాహిత్య దృక్పథం" పు: 48.
4. పైదే - పు: 48

3.1.5. రాచకొండ విశ్వనాధనశాస్త్రి; "అల్పజీవి" పు: 182.

6. పై రెండవ సూచికలోనిదే పు: 96.
7. పై ఐదవ సూచికలోనిదే పు: 174.
8. పై రెండవ సూచికలోనిదే పు: 28.
9. పైదే - పు: 29.
10. పై ఐదవ సూచికలోనిదే పు: 32.
11. పైదే - పు: 33.
12. పైదే - పు: 125.

3.313. రాచ కొంద విశ్వనాథ శాస్త్రి "రాజు-మహిషి" పు: 9

14. పైదే - పు: 9
15. పూదే - పు: 132
16. పైదే - పు: 3
17. పైదే - పు: 9
18. పైదే - పు: 88.
19. పైదే - పు: 111
20. పైదే - పు: 111
21. పైదే - పు: 112
22. పైదే - పు: 293.

23. పైదె - పు: 63.
24. పైదే - పు: 64.
25. పైదే - పు: 65.
26. పైదే - పు: 66.
27. కొడవటి గంటి. కుటుంబరావు; "కళలు-శాస్త్రీయ విజ్ఞానం". పు: 158.
28. పై 5వ సూచికలోనిదే. పు: 74.
29. పైదే - పు: 76
30. పైదే - పు: 104
31. పైదే - పు: 210.
32. పైదే - పు: 293
33. పైదే - పు: 280
34. పైదే - పు: 217
35. పైదే - పు: 173
36. పైదే - పు: 183.
37. పైదే - పు: 110
38. పైదే - పు: 67
39. పైదే - పు: 212.
40. వివిన మూర్తి; "జులై - 30" - పు: 159
3.341. రాచకొండ విశ్వనాథ శాస్త్రి ; "గోవులొస్తున్నాయి జాగ్రత్త". పు:210
42. కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగిల్స్; "కమ్యూనిష్టు ప్రణాళిక" పు: 51.
43. పై 41 వ సూచికలోనిదే పు: 301
44. పైదే - పు: 297.
45. పై 42వ సూచికలోనిదే- పు: 54.
46. పై 41వ సూచికలోనిదే - పు: 368
47. పైదే - పు: 369
48. పైదే - పు: 370.
49. పైదే - పు: 445
50. అత్తలూరి. నరసింహరావు; (సంపా) 'జులై - 30' - పు: 105.
51. పైదే - పు: 105
52. పై 41 వ సూచికలోనిదే - పు: 276; 277
53. పైదే - పు: 333
54. పై 42వ సూచికలోనిదే- పు: 26
55. ఇల్యా ఎహ్రెన్ బర్గ్; "రచయితా శిల్పమూ" తుమ్మల. వెంకటరామయ్య (అను). పు: 39.
56. పై 41వ సూచికలోనిదే - పు: 381
57. పైదే - పు: 384.

58. పై 41వ సూచికలోనిదే - పు: 339
59. పైదే - పు: 251.
60. పైదే - పు: 255
61. పైదే - పు: 257
62. పై 55వ సూచికలోనిదే - పు: 18
63. పై 41వ సూచికలోనిదే - పు: 379, 380.
64. పైదే - పు: 241.
65. పైదే - పు: 410.

3.4.66. రాచకొండ విశ్వనాథ శాస్త్రి; "రత్తాలు-రాంబాబు" (1) పు: 116
67. పైదే - (2) - పు: 70.
68. పైదే - పు: 84.
69. పైదే - పు: 121.
70. పైదే (3) - పు: 72.
71. పైదే (4) - పు: 198.
72. పైదే (1) - పు: 105.
73. పైదే - పు: 228.
74. W.H.Hudson : "An Introdction to the study of English literature పు: 145.
75. పై 66వ సూచికలోనిదే (3) పు: 135.
76. పైదే (3) - పు: 51.
77. పైదే (3) - పు: 80.
78. ఆచార్య యస్. గంగప్ప; "వేయిపడగలు" పు: 42.
79. పై 66వ సూచికలోనిదే (3) పు: 187
80. పైదే - పు: 7.
81. పైదే - పు: 227.
82. పైదే - పు: 230
83. పైదే - పు: 242.
84. పైదే (2) - పు: 25.
85. పైదే (1) - పు: 131.
86. పైదే - పు: 133.
87. పైదే (2) - పు: 66.
88. పైదే - పు: 188, 189.
89. పైదే (4) - పు: 126.
90. పైదే (1) - పుం 82.

3.5.91. రాచకొండ విశ్వనాథ శాస్త్రి; "సొమ్ములు పోనాయండి" పు: 37.
92. పైదే - పు: 37

93. పైదే - పు: 52.
94. పైదే - పు: 80.
95. పైదే - పు: 81.
96. పైదే - పు: 47.
97. Karl marx ; "A contribution to the critic of political Economy పు: 21.
98. పై 91వ సూచికలోనిదే - పు: 95.
99. పైదే - పు: 85.
100. పైదే - పు: 61.
101. పైదే - పు: 77.
3.6.102. రాచకొండ. విశ్వనాథ శాస్త్రి; "మూడు కథల బంగారం" పు: 25
103. పైదే - పు: 51.
104. పైదే - పు: 30.
105. పైదే - పు: 252.
106. పైదే - పు: 273.
107. పి. లక్ష్మి (సంపా) "శ్రమవాదం" సంపుటి - 3; సూచిక 11/12 - పు: 7
108. పై 102వ సూచికలోనిదే పు:59.
109. పైదే - పు: 66.
110. పైదే - పు: 86.
111. పైదే - పు: 99.
112. పైదే - పు: 150.
113. పైదే - పు: 168.
114. పైదే - పు: 173.
115. పైదే - పు: 174.
116. పైదే - పు: 266.
117. పైదే - పు: 301.
118. పైదే - పు: 322.
3.7.119. రాచకొండ విశ్వనాథ శాస్త్రి "ఇల్లు" పు:17.
120. పైదే - పు:15.
121. పైదే - పు: 62.
122. పైదే - పు: 19.
123. పైదే - పు: 42.
124. పైదే - పు: 105.
125. పైదే - పు: 111.
126. పైదే - పు: 40. 41.
127. పైదే - పు: 40.

## 4. సామాజిక వాస్తవికత


1. వల్లంపాటి. వెంకట సుబ్బయ్య; "నవల - ప్రజలు" (అను) (మూలం రాల్ఫ్‌ఫాక్స్) పు: 78.
2. ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ "రచయితా-శిల్పమూ" తుమ్మల వెంకటారామయ్య (అను) పు: 33.
3. వరవరరావు; "తెలంగాణ వియోచనోద్యమం-తెలుగు నవల" పు: 13.
4. పి. సంజీవమ్మ; "తెలుగు నవలలో సామాజిక చైతన్యం" పు: 11.
5. చేకూరి, శ్రీనివాసరావు; "శ్రమ-సౌందర్యం" పు: 15.
6. వై. విజయ కుమార్; "సాహిత్యం-వాస్తవికత" (మార్క్సిస్టు పరిశీలన) పు:56.
7. పై మొదటి సూచికలోనిదే పు: 91.
8. A Ovehareno, "socialist Realismandthe Modern Literary process" పు: 248.
9. Anatoly lunacharsky; "On Literature and Art" పు: 11.
10. William Henry hudson"' An Introdction to the study of literature" పు: 170.
11. C. Vanghan James; "Soviet, socialist realism (Origens & Theory) పు: 88.
12. పై రెండవ సూచికలోనిదే పు: 36.
13. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "రాజు-మహిషి పు: 280.
14. పై మొదటి సూచికలోనిదే పు: 90, 91.
15. పైదే - పు: 91.
16. కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగిల్స్; "కమ్యునిష్టు ప్రణాళిక" (అను) కంభంపాటి. సత్యనారాయణ. పు: 50.
17. మక్సీమ్ గోర్కి, "మక్సీమ్ గోర్కి సాహిత్యవ్యాసాలు" పు: 182.
18. Pritchett. V.S, "The living Novel" పు: 8.
19. రాచకొండ. విశ్వనాథ శాస్త్రి; "ఇల్లు" పు:2.


## 5. మార్క్సిస్ట్ దృక్పథం


1. సారధి; " మార్క్సిష్టు సాహిత్య సిద్ధాంతం - ఒక పరిశీలన" -పు: 11.
2. వరవరరావు; "తెలంగాణా విమచనోద్యమం-తెలుగునవల" పు. 9
3. కారల్ మార్క్స్; ఫ్రెడరిక్ ఎంగిల్స్; "కమ్యూనిస్టు ప్రణాళిక" (అను) కంభంపాటి సత్యనారాయణ పు. 54
4. కొడవటిగంటి కుటుంబరావు; "కళలు-శాస్త్రీయ విజ్ఞానం పు. 151
5. Karl Marx; "Contribution to the Critic of Political Economy పు. 21
6. కారల్ మార్క్స్ "అర్థశాస్త్ర విమర్శకు చేర్పు" పు. 11
7. త్రిపురనేని మధుసూదనరావు; "మార్క్సిజం-సాహిత్య విమర్శ" పు. 13
8. పై మూడవ సూచికలోనిదే పు. 55
9. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "గోవులొస్తున్నాయి జాగ్రత్త" పు. 297
10. పైదే పు. 333; 334
11. పైదే పు. 257

12. పై మూడవ సూచికలోనిదే (వ్యాఖ్యలు)
13. పై '9'వ సూచికలోనిదే పు. 368; 369
14. పైదే పు. 370
15. మార్క్స్; ఎంగిల్స్; లెనిన్ "కమ్యూనిస్టు సమాజం గురించి" (సంక) పు. 80
16. పై మూడవ సూచికలోనిదే పు. 59
17. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "సొమ్ములు పోనాయండి" పు. 52
18. పు. 52
19. పైదే పు. 79
20. పైదే పు. 80
21. పై మూడవ సూచికలోనిదే (వ్యాఖ్యలు)
22. పై 17వ సూచికలోనిదే పు. 95
23. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "రత్తాలు-రాంబాబు" (1) పు. 133

### 6. రావిశాస్త్రి - ప్రభావం

6.1 1. Giants of literature - Dickens, Sampson law పు. 125
2. పైదే పు. 128

6.2 3. రెంటాల గోపాలకృష్ణ; "యమకూపం" (అను) (మూ. అలగ్జాండర్ కుప్రిన్) పు. 113
4. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "రత్తాలు-రాంబాబు" (2) పు. 133
5. పై మూడవ సూచికలోనిదే పు. 309
6, పై 4వ సూచికలోనిదే పు. 131

6.3 7. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "రాజు-మహిషి" పు. 132
8. బీనాదేవి; "పుణ్యభూమీ-కళ్ళుతెరు" పు. 31
9. పై 7వ సూచికలోనిదే పు. 293
10. పైదే పు. 89
11. పై 8వ సూచిక లోనిదే పు. 60

6.4 12. కె.ఎన్.వై. పతంజలితో; 'మహానగర్' పత్రికా కార్యాలయంలో 21-2-96న జరిపిన ముఖాముఖి నుండి
13. కె.ఎన్.వై.పతంజలి; 'ఆంధ్రజ్యోతి' (దిన) 30-7-1985
14. కె.ఎన్.వై. పతంజలి; "ఖాకీవనం" పు. 38
15. పైదే పు. 73
16. పైదే పు. 75
17. పైదే పు. 78

6.5 18. అర్నాద్; 'చీకటోళ్ళు' పు. 240

6.6. 19. భూషణం; "కొండగాలి" పు. 53
20. పైదే పు. 177
21. పైదే పు. 183

## 7. నవలాకారుడిగా రావిశాస్త్రి స్థానం

1. కేతవరపు రామకోటిశాస్త్రి; "వివర్శిని"(సం)(జనవరి 1978) పు. 3
7.1 2. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "గోవులొస్తున్నాయి జాగ్రత్త" పు. 228.
3. పైదే పు. 229
4. పైదే పు. 237
5. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "రాజు-మహిషి" పు. 151
6. రాచకొండ విశ్వనాథశాస్త్రి "మూడు కథల బంగారం" పు. 46
7.2 7. పై 2వ సూచిక లోనిదే పు. 443
8. పైదే పు. 210
9. పైదే పు. 244
10. పైదే పు. 288
11. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "రత్తాలు-రాంబాబు" (1) పు. 23
12. పై 5వ సూచికలోనిదే పు. 71
13. పైదే పు. 73
14. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "ఇల్లు" పు. 2
15. పైదే పు. 138
16. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "సొమ్ములు పోనాయండి" పు. 72, 73
7.3 17. పై 6వ సూచికలోనిదే పు. 278
18. పై 5వ సూచికలోనిదే పు. 2
19. పై 14వ సూచికలోనిదే పు. 92
20. పై 11వ సూచికలోనిదే పు. 120
21. పై 2వ సూచికలోనిదే పు. 429, 430
22. పైదే పు. 440
23. పై 11వ సూచిక లోనిదే (3) పు. 145, 146
24. పైదే (1) పు. 99
25. "ఎన్నెల్లో ఎన్నెల" (సం) పు. 34
26. వల్లంపాటి వెంకటసుబ్బయ్య; "నవలాశిల్పం" పు. 98
27. పై 16వ సూచికలోనిదే పు. 52
28. పై 6వ సూచికలోనిదే పు. 94
29. పై 16వ సూచికలోనిదే పు. 45
30. పై 14వ సూచికలోనిదే పు. 59
31. పై 5వ సూచికలోనిదే పు. 85
32. పై 6వ సూచికలోనిదే పు. 85
33. పైదే పు. 122
34. పైదే పు. 154
35. పై 14వ సూచికలోనిదే పు. 19
36. పై 16వ సూచికలోనిదే పు. 64

37. పై 11వ సూచికలోనిదే (1) పు. 84
38. రాచకొండ విశ్వనాథశాస్త్రి; "అల్పజీవి" పు. 32
39. పైదే పు. 157
40. పై 5వ సూచికలోనిదే పు. 271
41. పై 11వ సూచికలోనిదే (2) పు. 19
42. పైదే (3) పు. 51
43. పై 16వ సూచికలోనిదే పు. 7
44. పై 5వ సూచికలోనిదే పు. 134, 135
45. పై 6వ సూచికలోనిదే పు. 157
46. పై 11వ సూచికలోనిదే (2) పు. 186
47. టాల్‌స్టాయ్; "అన్నాకరేనినా" పు. 1
48. Tolstoy; "Annakarenina" పు. 1
49. పై 47వ సూచికలోనిదే పు. 1
50. Pearl's Buck; "The Good Earth" పు. 3
51. తెన్నేటిసూరి; "రెండు మహానగరాలు" (అను) పు. 1
52. పై 16వ సూచికలోనిదే పు. 5
53. పై 5వ సూచికలోనిదే పు. 102

## ఉపయుక్త గ్రంథాలు (Bibliography)


1. అర్నాద్ (హరనాథరెడ్డి. డి)
"చీకటోళ్ళు" అరుణా పబ్లిషింగ్ హౌస్; ప్ర. ముద్రణ, మే, 1978
2. ఆర్వియార్ (అను)
"ఆన్నాకరేనినా" లియోటాల్‌స్టాయ్ రాదుగ ప్రచురణ - 1990
3. కాత్యాయనీ విద్మహే
"చివరకు మిగిలేది"; సిద్ధాంత గ్రంథం - 1987
4. కాత్యాయనీ విద్మహే
"తెలుగు నవలా కథానికా విమర్శన పరిణామం" ప్ర. ముద్రణ 1995
5. కాత్యాయనీ విద్మహే, యాదయ్య మార్క
"రావిశాస్త్రి సాహిత్య దృక్పథం" జనవరి-1996
6. కుటుంబరావు, కొడవటిగంటి
"కళలు-శాస్త్రీయ విజ్ఞానం" వి.ర.సం; ప్ర. ముద్రణ-1969
7. కుటుంబరావు. బి.వి.
"ఆంధ్ర నవలా పరిణామము" - 1971
8. గంగప్ప. యస్. "వేయి పడగలు" విశ్లేషణాత్మక విమర్శ
శశీ ప్రచురణలు. ద్వి. ముద్రణ. నవంబర్. 1993
9. గోపాలకృష్ణ రెంటాల - (అను)
"యమకూపం" (కుప్రిన్) మొ. కూర్పు; ఏప్రిల్ 1979

10. జయప్రకాశ్. ఎస్.
"పరిశోధన విధానం" విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్. ప్ర. ముద్రణ. 1990
11. "తెలుగు నవల - నూరు సంవత్సరాలు" (సం)
ఆం. ప్ర. సాహిత్య అకాడమి - 1973
12. నరసింహారావు. అత్తలూరి (సంపా)
"రావిశాఖీయం" ప్ర. ముద్రణ. 1977
13. నరసింహరావు. అత్తలూరి (సంపా)
"జులై-30" - 1982 అరుణా పబ్లిషింగ్‌హౌస్
14. నాగభూషణశర్మ. మొదలి
"తెలుగు నవలా వికాసము" 1971
15. పతంజలి. కె.ఎస్.వై.
"ఖాకీవనం" "చతుర" నవంబర్ - 980
16. బాలగోపాల్
"రూపం-సారం" ఏప్రిల్ -1986
17. బీనాదేవి
"పుణ్యభూమీ కళ్ళుతెరు" విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్
ప్ర. ముద్రణ. జనవరి 1996
18. భూషణం
"కొండగాలి' ప్ర.ముద్రణ మార్చి 1987
19. మాక్సిమ్ గోర్కి
"మాక్సిమ్ గోర్కి సాహిత్య వ్యాసాలు" 'రాదుగ' ప్రచురణాలయం - 1985
20. మల్లికార్జునశర్మ. ఇంగువ (అను)
"పెట్టుబడి" కారల్ మార్క్స్ మొ. ముద్రణ. సెప్టెంబర్ - 1982
21. మధుసూదనరావు. త్రిపురనేని
"మార్క్సిజం-సాహిత్య విమర్శ" ఇంటర్వ్యూ
తిరుపతిరావు. బి; శివశంకర్. కె. 1995
22. యాదయ్య. మార్క
"రాచకొండ విశ్వనాథశాస్త్రి"బుక్కులు, కధలు-ఒక విశ్లేషణ" ఫిబ్రవరి-1992
23. రంగారావు. మాదిరాజు
"నవల స్వరూపసమాలోచనం" జులై 1984
24. రామకోటి శాస్త్రి. కె.వి.
"విమర్శిని" పరిశోధన పత్రిక -3
కా. విశ్వ విద్యాలయం, తెలుగు విభాగం, జనవరి 1978
25. రామకృష్ణారావు.వై.
" ఆధునికాంధ్ర సాహిత్యంలో చైతన్య స్రవంతి "
26. రామచంద్రారెడ్డి. రాచమల్లు.
"సారస్వత వివేచన"; విశాలాంధ్ర. విజయవాడ -1971

27. రామచంద్రారెడ్డి. రాచమల్లు (అను) మార్క్స్, ఎంగిల్స్;లెనిని.
"కమ్యూనిస్టు సమాజం గురించి" (సం)
ప్రగతి ప్రచురణాలయం-1976

28. వరవరరావు. వి.
"తెలంగాణ విమోచనోద్యమం తెలుగునవల"-సిద్ధాంత గ్రంథం మార్చి-1983

29. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"అల్పజీవి" అరుణా పబ్లిషింగ్ హౌస్. సెప్టెంబర్ 1981.

30. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"రాజు-మహిషి" రాచకొండ ప్రచురణలు; జులై-1994.

31. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"గోవులొస్తున్నాయి జాగ్రత్త" అరుణా పబ్లిషింగ్ హౌస్; మొ. ముద్రణ. 1987.

32. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"రత్తాలు-రాంబాబు"
1వ భాగం. ప్ర. ముద్రణ - 1978.
2వ భాగం. ము. ॥ - 1987.
3వ భాగం. ॥ ॥ - 1987.
4వ భాగం ప్ర ॥ - 1978.

33. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"సొమ్ములు పోనాయండి"అరుణా పబ్లిషింగ్ హౌస్. ప్ర. ము. మార్చి. 1981.

34. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"మూడు కథలబంగారం"అరుణాపబ్లిషింగ్ హౌస్. ప్ర. ము. డిసెంబర్ 1982.

35. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"ఇల్లు" ఆర్.కె.పబ్లికేషన్స్. నవంబరు 1993.

36. విశ్వనాథశాస్త్రి. రాచకొండ
"రావిశాస్త్రీయం" వి.ర.సం. ప్రచురణ. ప్ర. ముద్రణ. జులై-1982.

37. విశ్వనాథశాస్త్రి.; రాచకొండ
"రావిశాస్త్రీయం" అరుణా పబ్లిషింగ్ హౌస్; ప్ర. ముద్రణ. డిసెంబరు-1982.

38. విజయకుమార్. వై., "సాహిత్యం-వాస్తవికత" (మార్క్సిస్టు పరిశీలన)
స్మారక సంస్థ; అక్టోబర్-1986.

39. విజ్ఞాన వికాస సమితి
"కాపిటల్" (అను) మొ.భా. మార్చి-1988.

40. వెంకట రామయ్య. తుమ్మల
ఇల్యాఎహ్రెన్‌బర్గ్ ; "రచయితా-శిల్పమూ"
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; (అను) మే-1989.

41. వెంకట సుబ్బయ్య. వల్లంపాటి.
"నవల-ప్రజలు" (అను) మూలం. రాల్ఫ్ ఫాక్స్
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. ప్ర. ముద్రణ ఫిబ్రవరి 1992

42. వెంకటసుబ్బయ్య. వల్లంపాటి (అను)
"నవలాశిల్పం" విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ -ద్వి. ముద్రణ 1994.
43. వేమన
"వేమన శతకము" శ్రీ శైలజా పబ్లికేషన్స్-1991.
44. వేణుగోపాల్. అమ్మంగి
"నవలా రచయితగా-గోపీచంద్"
45. శ్రీరామమూర్తి. కోడూరి
"తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ" -1979
46. శ్రీనివాసరావు. చేకూరి
"శ్రమ-సౌందర్యం" కవితా పబ్లికేషన్స్ ; జనవరి-1986.
47. శ్రీనివాస్. త్రిపురనేని
"వెన్నెలో వెన్నెల;" రావిశాస్త్రికవిత్వం ప్రచురణలు; ప్ర. ము. జనవరి1991
48. సత్యనారాయణ. కంభంపాటి (అను)
కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగిల్స్ "కమ్యూనిస్టు ప్రణాళిక"
తృ. ముద్రణ. సెప్టెంబరు-1993.
49. సారధి.
"మార్క్సిస్టు సాహిత్యం-ఒక సిద్ధాంతం పరిశీలన." ఆగస్టు-1994.
"మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతం -ఒక పరిశీలన అని ఉండాలి.)
50. సంజీవమ్మ.పి
"తెలుగు నవలలో సామాజిక చైతన్యం" (2)
అభ్యుదయ రచయితల సంఘం. ప్ర. ముద్రణ. 1985.
51. సుదర్శనం. ఆర్.ఎస్.
"సమాజము-సాహిత్యము"(చి. జిల్లా రచయితల సహకార సంఘం) -1972
52. సూరి. తెన్నేటి
"రెండు మహానగరాలు" విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ -1986.
53. స్మైల్.
"ఖాళీసీసాలు"

## ఆంగ్ల గ్రంథాలు

54. Anatoly Lunacharsky.
"On Literature and Art"
Prog ress Publishers - Moscow.
Translated by Avril Pyman and fainna Glogolava^1973.
55. Davrd Lodge (Edit)
"20th Century literary Criti cism'
Longman
56. Dickens. Charless
"A Tale of Two cities"
57. Edwin Muir
"The structure of the Novel" B.i - Publications - 1979.

58. Forster. E.M.
"Aspects of the Novel" Harmonds Worth- 1927.
59. F.R. and Q.D. Leavis.
"Dicknes the Novelist" Penguin books -1983.
60. Leo tolstoy
"Anna Karenina
Translated by. S. Gurin and Jacob gurin
Washington square press -1966.
61. Meenakshi Mukherjee
"The Novel and society in India"
Oxford university press -1985.
62. Oveharenko. A
"Socialist Realism and the Modern literary Process"
Progress Publishers : Mosow, First Print -1978.
63. Pearl. S. Buck
"The Good Earth" U.S.A. -1967.
64. Pritchett.V.S.
"The Living Novel"
Chatto & Windus - 1946.
65. Sampson Low.
"Giants of literature Dickens", England -1977.
66. Mao-Tse-Tung.
"Selected works of Mao-Tse-Tung, Volume-III, Foreign Languages, Pecking-1975.
67. Vanghan James. C.
"Soviet, Socialist Realism", (Origens & Theory)
The Macmillen Press. First Published -1973.
68. William Henry Hudson.
An Introduction to the study of literature.

## పత్రికలు

69. "అభ్యుదయ" మే; జూన్ 1991.
70. "అరుణాతార", రావిశాస్త్రి ప్రత్యేక సంచిక; జనవరి 1994.
71. "ఆంధ్రజ్యోతి" (వార) 26-11-93.
72. ఆంధ్రజ్యోతి (దిన) 30-7-1985. 26-7-1993. 11-11-1993.
73. "ఆంధ్రభూమి" 11-11-1993. 26-11-1993.
74. "ఆంధ్రప్రభ" (దిన) 11-11-1993. 25-11-1993.
75. "ఆహ్వానం" (మాస) జనవరి 1994.
76. ఉదయం. 11-11-199. 22-11-1993.
77. "చిరునవ్వు", తానా మహాసభల ప్రత్యేకం; షికాగో; జులై 1-3; 1995.
78. "జాషువా" (రావిశాస్త్రికి నివాళి) 1994.
79. "నివాళి" (రావిశాస్త్రి స్మారక సంచిక) 30.-7-1994.
80. "ప్రగతి", ద్వైమాసపత్రిక డిసెంబర్; 1993; జనవరి-1994
81. "ప్రజాసాహితి", రావిశాస్త్రి సంచిక; డిసెంబరు-1993
82. "విశాలాంధ్ర" 10-2-1994. 3-3-1994.,
83. "శ్రమవాదం", సంపుటి-3. సంచిక 11/12-పు:7
84. "సృజన" 100, ఫిబ్రవరి; మే-1980.

# అనుబంధం

**1993 జూన్‌లో విశాఖపట్నంలోని రావిశాస్త్రిగారి ఇంట్లో జరిపిన ముఖాముఖి**

ప్ర: మీరు 'విరమించిన రచయితని' రైటర్స్ మెనోపాజ్ మీలో ఏర్పండిందనే వాదనతో మీరు ఏకీభవిస్తారా? 'ఇల్లు' కట్టటం పూర్తైందా?

జ. 'ఇల్లు' నవలను చిన్న కధగా రాద్దామనుకున్నా కాని చివరకు అది నవలై కూర్చుంది. 1992 ఫిబ్రవరిలో 'ఇల్లు' మొదలుపెట్టినా, రెండవభార్య రామం మృతి, పక్షవాతంతో దొరికిన విశ్రాంతి వలన 1992 మార్చిలో 'ఇంటి'పని ఎక్కువగా చూడగలిగాను. అస్తుల దురాక్రమణ వృత్తాంతమే ఇల్లు నవల. దాదాపు 12 సంవత్సరాల తరువాత (మూడు కధల బంగారం) దీనిని రాశాను. నాకు రాయటానికి సరైన సమయం లేక, మంచి వాతావరణం లభించక యింతకాలం రాయలేదు. రాజు-మహిషి, మూడు కధల బంగారంతో నాలో 'మెనోపాజ్' ఏర్పడిందని వాదించే వాళ్ళతో నేను ఏకీభవించను. వళ్ళ వాదనలకు నా 'ఇల్లు' ఒక విధంగా సమాధానం.

ప్ర. మీ రచనల్లో వర్ణనలు ఎక్కువనే భావం వుంది?

జ. అవును. ఇది కొంతమేరకు వాస్తవమే. విషయ పరిపుష్టికి, భావతీవ్రతా సూచకంగా, సమర్ధంగా వర్ణనలు చేస్తే తప్పేమీ లేదు, చుట్టూ వున్న వాతావరణాన్ని పరిచయం చెయ్యటానికి కూడ వర్ణనలు అవసరమే. ఆ వాతావరణ అనుభూతిని పాఠకునికి అందించటానికి గూడ వర్ణనలు అవసరమే. అయితే అది అదుపుదప్పిపోరాదు.

ప్ర. మీ నవలల్లో ఉపన్యాసధోరణి చోటుచేసుకుందనే అభియోగం వుంది. మీరు అంగీకరిస్తారా?

జ. చెడును తుంచాలని, మంచిన పెంచాలనే సదుద్దేశంతో కొన్నిచోట్ల అలాంటి ధోరణి చోటు చేసుకోవచ్చు. అయితే ఈ పద్ధతి నాకు చార్లెస్ డికెన్స్ నుండి అలవడింది. డికెన్స్ ప్రభావం నాపై చాలా గాఢంగా ఉంది. డికెన్స్ నవలల్ని విపరీతంగా చదివాను. చెహోవ్ అన్నా యిష్టమే. 1939 వరకు వచ్చిన గొప్ప నవలలన్నీ చదివాను. డిటెక్టివ్ నవలల్ని మక్కువతో చదివేవాణ్ణి. టాల్‌స్టాయ్, గోర్కీ, మపాసా, ఓహెన్రీ, పానుగంటి, కొడవటిగంటి, గురజాడ, శ్రీశ్రీ, చలం యింకా... అంతా యిష్టమే అయితే చలం ఉత్తరాలు చదివిన తరువాత ఆయనపై వుండే గౌరవభావం తగ్గిపోయింది.

ప్ర. చలం వచనం గురించి ప్రస్తావించారు గాబట్టి అడుగుతున్నాను. వచన కవిత్వంపై మీ అభిప్రాయమేమిటి?

జ. వచన కవిత్వం నాకు మింగుడు బడదు. పనిగట్టుకొని చదివినా ఏవచన కవిత్వం నాకు బోధపడదు. అయితే శ్రీశ్రీలాగా రాసే వారుంటే యిష్టపడతాను. కవిత్వం, రచన విషయాలలో నాకు విశ్లేషకుడిగా వ్యవహరించిన అబ్బూరి వరదరాజేశ్వరరావుని ఏనాటికి మరిచిపోలేను. ఆ'వరద' జీవయాత్ర చాలించినప్పుడు ఒక వ్యాసం రాద్దామనుకున్నాను కాని... ఇంకా రాద్దామనే ఉంది.

ప్ర. మీ రచనల్లో గొప్ప ఆలంకారికశైలి ఉంది గదా!

జ. అవును, ఇది వాస్తవమే. ఆలంకారశైలి రచనకు అలంకార ప్రాయంగా ఉండాలే కాని, కథాగమనానికి అవరోధంగా వుండకూడదనేది నా అభిమతం. అసలు

మనం రాసేటప్పుడు 'హౌబెస్ట్ వుయ్ కెన్ రైట్' అనేది ఆలోచించాలి. నేను రాసేప్పుడు అలా తపన పడేవాణ్ణి. ఎట్టాబడితే అట్టా, ఏది బడితే అది రాస్తే ఎలా? నేను చిన్నప్పుడే సంస్కృతం, తెలుగు చదువుకున్నా దేనిలోను నాకు మంచి పాండిత్యం అబ్బలేదు. అయినా నాది ప్రత్యేకమైన రచనా విధానం. ఒక ప్రత్యేక ముద్రనాది. బాగా రాయాలనే ప్రయత్నం; దాని కోసం సాధన నిరంతరం కొనసాగాలి. ఇలా అవసరమైన వర్ణనలు, అలంకారాలు వాడితే వాస్తవస్థితి దెబ్బతింటుంది గదా అనుకోవచ్చు. వాస్తవాన్ని వాటిద్వారా మరుగు పరచరాదు. వాటి తోటి అసలు పరిస్థితిని జోకొట్టి నిద్రబుచ్చరాదు.

ప్ర. వస్తురూపాలలో దేనికి ప్రాధాన్యత నివ్వాలంటారు?

జ. ఇంతకు ముందు చెప్పినట్లుగా చెప్పే విధానంలో ఒక ఆకర్షణ ఉండాలి. అయస్కాంత ఆకర్షణలా హృదయానికి హత్తుకుపోయే ప్రత్యేకత ఉండాలి. అయితే రచయిత ఎలా చెప్తున్నాడు అనే దానికంటే ఏమి చెప్తున్నాడు అనే దానికి ప్రాధాన్యత నివ్వాలి. కాబట్టి ముందు సబ్జెక్ట్ని నిర్ణయించుకోవాలి. దానిని ఎలా అందించాలి? ఏవిధంగా చెప్పాలనేది తరువాత విషయం. కాబట్టి వస్తువు ముఖ్యం. రచనా విధానం రచయిత సామర్థ్యాన్ని బట్టి ఉంటుంది. నాది ప్రత్యేకమైన రచనా విధానంగా రూపుదిద్దుకోవటానికి, న్యాయవాదిగా నా ప్రాక్టీసు, కోర్టు వాతావరణం, వివిధ ప్రాంతాల నాక్లయింట్స్, లోక పరిశీలను, నా జీవితానుభవం వీటన్నింటిని నాకు తెలిసిన భాషలో వ్యక్తం చేశాను. అది విశాఖ మాండలికమనుకోండి. ఉత్తరాంధ్ర భాష అనుకోండి, మరోటనుకోండి.

ప్ర. సాహిత్యం సామాజిక మార్పుకు ఏ మేరకు దోహదపడుతుంది?

జ. రచనల వలన సామాజిక మార్పు వస్తుందనుకోవటం వట్టి భ్రమ. ఎక్కడన్నా మార్పుకు రచన దోహదకారి అయితే కావచ్చు. కాని మొత్తం మీద సామాజిక మార్పు రచనల వల్ల జరిగే పనికాదు.

ప్ర. రచయితకు నిబద్ధత అవసరమంటారా?

జ. రచయితకు ఫలానా అనే కమిట్మెంట్ అవసరం. అయితే లేబిల్స్ తగిలించుకోకుండా రచయిత మంచికి నిబద్ధుడైతేచాలు. మరి ఏది మంచి అనేది వివాదాస్పద అంశం. ఇది సాపేక్షత్వంపై ఆధారపడి ఉంటుంది. రచయిత జీవితాన్ని బట్టి అతని జీవన దృక్పథాన్ని బట్టి మంచి అనేది ఉంటుంది. మళ్ళీ యిక్కడ రకరకాల దృక్పథాల గురించి చెప్తారు. అలానే మార్క్సిష్టు దృక్పథం లేక అవగాహన అనేది ప్రత్యేకంగా లేదు. నేను రాసేప్పుడు ఫలానా అవగాహనా దృష్టితో రాయాలి అనేమీ రాయలేదు. ఆయా కథా వస్తువుని బట్టి ఆయా పాత్రల రూపనిర్మాణం; సమాజాన్ని అనుసరించి ఆయా పాత్రల రూపశిల్పం ఉంటుంది. కాబట్టి "వుయ్ కెనాట్ ఛేంజ్ ది క్యారెక్టర్" అనేది నా అభిప్రాయం. దేనికైనా పునాది సమాజం. జీవితం వీటిని బట్టే యితివృత్తంగాని, పాత్రలుగాని, మరొకటిగాని వుంటుంది.

ప్ర. వి.ర.సం. ఆవిర్భావమప్పుడు మీరు ఉపాధ్యక్షులుగా ఉన్నారు గదా! విరసం మీ జీవితంలో మార్పుకు దోహదపడిందా?

జ. ఎవరేమనుకున్నా విరసం వల్ల నాలో ఏమార్పు కలగలేదు.

ప్ర. ఫెమినిస్టు సాహిత్యం, మహిళోద్యమాలపై మీ అభిప్రాయమేమిటి?

జ. ఈనాడు స్త్రీ విముక్తి అని, పురుషాహంకారమని, ఫెమినిజం అని రకరకాల వాళ్ళు రచనలు జేస్తున్నారు. స్త్రీ విముక్తిగాదు, సామాజిక బానిసత్వం నుండి ప్రజలందరికి విముక్తి లభించాలి. నేను స్త్రీని అనే ప్రత్యేక వాదం నాకు నచ్చదు. ఇలా అంటేనే నామీద విమర్శ వచ్చింది. స్త్రీలలో గూడ మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు వుంటారనేది విస్మరించగూడదు, అలానే పురుషులు. అన్యాయానికి గురైన వాళ్ళు స్త్రీలలో ఎక్కువగా వుండవచ్చు. అణచివేయబడుతున్నామనే భావన వారిలో వుండవచ్చు. అణచివేత విధానాన్ని, అప్రకటిత నిర్బంధాన్ని, దోపిడీ, దుర్మార్గాన్ని, పెత్తందారీ తనాన్ని, పరిస్థితుల ప్రభావం వల్ల మనిషిలో గలిగే పతనావస్థని, సమాజంలో సగభాగమైన స్త్రీల జీవితాల్ని, వాళ్ళ చైతన్యాన్నీ నేను వివిధ సందర్భాలలో వర్ణించాను.

ప్ర. రత్తాలు-రాంబాబులో దారుణ పరిస్థితులలో చిక్కుకున్న రత్తాల్ని మీరు సినిమా ఫక్కీలో శీలం చెడకుండా కాపాడుకొచ్చారనే అభిప్రాయం పాఠకలోకంలో వుంది మీరేమంటారు?

జ. రత్తాలు-రాంబాబులో రత్తాలు క్యారెక్టర్ ఆయా సన్నివేశ పరిస్థితులను బట్టి మలచబడాలి. కాని ఆ నవల రాస్తున్నపుడు నేను జైల్లో వున్నాను గదా. జైల్లో నాతోపాటువున్న మిత్రుల కోరిక మేరకు, కొంతమేరకు ఆదర్శం కోసం రత్తాల్ని అలా నగిషీగా చిత్రించుకుంటూ పోవాల్సి వచ్చింది. రత్తాలి కోసం ముత్యంలాంటి ముత్యాలు పాత్రం సృష్టి జరిగింది. ఒక మంచిని నిలబెట్టడం కోసం, పతనమవుతున్న సామాజిక విలువలకు ప్రతినిధులుగా వున్న పాత్రలను సృష్టించటం గూడ అవసరమే. విప్రనారాయణ థీమ్‌ని ఆధారంగా జేసుకొని, మంచి చెడులను విశ్లేషిస్తు ఒక రచన చేద్దామని తలంచాను. అదే చివరకు 'రత్తాలు-రాంబాబు'గా పరిణమించింది. దీనిని పూర్తి చేయాలనే తలంపు నాకు లేదు.

ప్ర. లంపెన్ క్యారెక్టర్స్ మీ రచనలలో ఎక్కువని, సమాజాన్ని నెగెటివ్ కోణం నుండి చూశారనే వాదం వుంది?

జ. సమాజంలో లంపెన్ విధానం వున్నంత వరకు లంపెన్ పాత్రల సృష్టి జరుగుతూనే ఉంటుంది. శూన్యం నుండి ఏ సృష్టి జరగదు గాబట్టి, సామాజిక పరిస్థితులను బట్టి సింహాచలం, అడ్డబుర్ర, నరసమ్మ మొదలయిన పాత్రలు ప్రాణం బోసుకుంటాయి. ఒక మంచిని ప్రబోధించటం కోసం చెడును గూడ చూపించాలని ఎమిలీ జోలా లాంటి వాళ్ళు ఏనాడో సూచించారు.

ప్ర. కాలమాన పరిస్థితుల కతీతంగా సాహిత్యం ఉంటుందా?

జ. సాధారణంగా ఉండదు. 20వ శతాబ్దపు ప్రథమ భాగం నాటికి వున్న బలాత్కార పద్ధతి; తనకు నచ్చిన స్త్రీని ఆవిడ ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా అనుభవించే పద్ధతి; అందునా ఆమెను వివాహం చేసుకోకుండా తన ఉంపుడు కత్తెగా అనుభవించే ఒక దుర్మార్గ పాశవిక విధానాన్ని తీవ్రంగా నిరసించటం

కోసం "గోవులొస్తున్నాయి జాగ్రత్త"ని రచించాను. అయితే ఆ వాతావరణం ఈనాడు లేదు. కాని అలాంటి వ్యక్తులు అక్కడక్కడా అవశేషాలుగా వుండటాన్ని మనం కాదనలేము. ఈనాటి సమాజం ఎక్కువభాగం గిరీశాలతో నిండిపోయింది. మంత్రులంతా గిరీశాలే. హర్షద్ మెహతా ఓ పెద్ద గిరీశం. రాజ్యాంగ యంత్రాంగాన్ని నడిపే వాళ్ళంతా గిరీశాలే. ఈ గిరీశాల వల్ల అల్పజీవులు ఆహుతై పోతున్నారు. 1950 నాటికి వస్తున్న కొన్ని నవలల్ని చదవటం వల్ల ముఖ్యంగా జేమ్స్ జాయిస్ మొ॥ వారి ప్రభావం వల్ల 'అల్పజీవి'ని సృష్టించటం జరిగింది. ఆనాడు సమాజంలో సుబ్బయ్యలాంటి అల్పజీవులు చాల ఎక్కువగా కనిపించారు. సుబ్బయ్యల గురించి తేలికగా రాయవచ్చు. ఒక టెక్నిక్‌ని ప్రవేశపెడదామనే ఉద్దేశంతో మాత్రం నేను అల్పజీవిని రాయలేదు.

ప్ర. ప్రస్తుతం వస్తున్న సాహిత్యంపై మీ ఉద్దేశం చెపుతారా?

జ. ఈనాడు బూతు సాహిత్యం టన్నుల కొద్ది ఉత్పత్తవుతోంది. ఈ విధానంలో మార్పురావాలి. పాఠకులలో, పత్రికలలో, రచయితలలో ఆరోగ్యకరమైన మార్పు రావాలి.

ప్ర. ఇంకేమైన రచనలు చేస్తున్నారా?

జ. ఆరోగ్యం పూర్తిగా పాడైపోయింది. పేజీ కథలు కొన్ని రాశాను. ఆరోగ్యం కుదుటపడితే (నమ్మకం లేదు) ఓ యాభైదాక వీటిని రాద్దామని ఉంది.

(ఆంధ్రజ్యోతి; 26-జులై; 1993; సాహిత్య వేదికనుండి)

## 2. అనుబంధం

**రావిశాస్త్రి కుటుంబసభ్యులతో విశాఖపట్నంలో 02-12-1995న జరిపిన ముఖాముఖి**

రావిశాస్త్రితో కలిపి మొత్తం వాళ్ళు ఐదుగురు కుటుంబ సభ్యులు. రైల్వేలో ఛీఫ్ ఇంజనీర్‌గా చేసిన మహాదేవశాస్త్రి, రావిశాస్త్రికి పెద్దన్నయ్య. ఈయన తరువాత రెండవసోదరునిగా రావిశాస్త్రి. సోదరుడు డా॥ నరసింహశర్మ అమెరికాలో 1967 నుండి డాక్టరుగా (M.D.) పనిచేశారు. ఆ తరువాత సోదరుడు సుబ్బారావు పంచదార పరిశ్రమలో పనిచేశారు. వీళ్ళందరి ముద్దుల చెల్లి డా॥ నిర్మల విశాఖలో మెడికల్ కాలేజి ప్రిన్స్‌పల్‌గా రిటైర్ అయ్యారు. కుటుంబసభ్యులేగాక; మొత్తం బంధువర్గమంతా పెద్ద పెద్ద చదువులు చదువుకున్నారు. సంప్రదాయబద్ధమైన కుటుంబంలో పుట్టిన వీళ్ళు, కులాంతర వివాహాలకు కూడ చోటివ్వటం హర్షణీయం. అభ్యుదయం భావాలకు ప్రోత్సాహమిచ్చారు.

రావిశాస్త్రి, చిన్ననాటి నుండే జాలిగుండె కలవాడని తెలుస్తుంది. శాస్త్రికి షుమారు 5 సం॥ వయసప్పుడు పేదల ఇళ్ళు తగలబడిపోతున్న దృశ్యాన్ని చూసి చలించి కన్నీరు పెట్టుకున్నారని శ్రీ నరసింహశర్మ చెప్పారు. మాటకి మాట ఎదురు బలకటం; తిడితే తిట్టటం; కొడితే కొట్టటం; పిల్లలతో తగాదా బడటం; రావిశాస్త్రి చిన్నప్పటి లక్షణాలంటే పెద్దయ్యాక; ఆయన స్వభావాన్ని చూసిన వారికి నమ్మకం కలగదు గాని, ఇది యథార్థమని శాస్త్రి సోదరుల స్పష్టీకరణ. ఇంకా పెద్దవాళ్ళమీద కోప్పడటం; తమ అనుకున్నది నెరవేరకపోతే ఇంట్లో ఉన్న సామాన్లను గిరాటు వేసి "ఇంట్లో తుఫాను వాతావరణం సృష్టించేవార"ని కుటుంబ సభ్యుల వివరణ.

చిన్నప్పటి నుండి పుస్తకాలు చదివే అలవాటు బాగా వున్న లెక్కల (మేథ్స్) సబ్జెక్టులో బాగా వెనుకబడి ఉండేవారట. మేథ్స్‌లో 15 మార్కులు రావటం కనాకష్టంగా ఉండేదట. వెండి కంచం తాకట్టుబెట్టి న్యాపతి శ్రీపతిరావు మాస్టారు దగ్గర మేథ్స్ ట్యూషన్ చదివితే మొదటిసారి 41 మార్కులు వచ్చాయని డా॥శర్మ చెప్పారు. ఈ ట్యూషన్ ప్రభావంతో యస్.యస్.యల్.సిలో మేథ్స్‌లో 63 మార్కులు వచ్చాయని శాస్త్రి తమ్ముడు డా॥నరసింహ శర్మ చెప్పారు. ఆ తరువాత ఎదిగినా తన తెలివి తేటల్ని శాస్త్రి ఏనాడు ఆర్భాటంతో బయటబెట్టేవారు గాదు.

చిన్నప్పటి నుండి శాస్త్రి స్నేహశీలి. టి.బి.జబ్బు అంటే భయపడే ఆరోజుల్లోనే బెనారస్ నుండి వచ్చిన ఒక టి.బీ రోగిని శాస్త్రి తన ఇంట్లో ఉంచుకొని సపర్యలు చేసారంటే దీనిని బట్టి ఆయన స్వభావాన్ని అంచనా వేసుకోవచ్చని డా॥ నిర్మలగారు వివరించిరు. రావిశాస్త్రి న్యాయవాదియైనాక; ఒక విదేశీ యాత్రికుణ్ణి రైల్లో ఎవరో చంపేస్తే; ఆకేసుని ఎవరూ స్వీకరించకపోతే ఆయన భుజాన వేసుకున్న మరొక సంఘటన గూడ శాస్త్రి ప్రవృత్తిని పట్టిస్తుంది. ఈ సన్నివేశం 'నిజం' నాటకానికి దోహదపడిందని శాస్త్రి సోదరుల వివరణ.

జ్యోతిష; హస్తసాముద్రిక, విషయాలపై ఆసక్తితోపాటు శాస్త్రికి దైవభక్తి ఉండేది. ఇదే విషయాన్ని శాస్త్రి దగ్గర దశాబ్దుల తరబడి గుమస్తాగా పనిచేసిన శ్రీకోలంకి బాబురావు; శాస్త్రి చెల్లి డా॥ నిర్మల తదితర కుటుంబ సభ్యులు కూడ ఈ విషయం ధృవీకరించారు. శాస్త్రి తన రచనల్ని తానే సొంతగా రాసుకొనే వారని, అయితే అర్ధరాత్రా, అపరాత్రా అనే నియమముండేది గాదని, ఆయన ఎల్లప్పుడు మల్లెపువ్వులా తెల్లగా ఉండేవారని, ఆఫీసులో సరస్వతీ ఫోటోకి నిత్యం పూజలు చేయించేవారని గుమస్తా వివరణ. ఇప్పటికీ ఆయన ఆఫీసులో పెద్ద సరస్వతీదేవి ఫోటో ఉంది.

శాస్త్రి స్వేచ్ఛా జీవని, ఏ చట్రంలో ఇమిడే స్వభావంలేదని, విరసానికి వెలుపల ఉన్న, పేదప్రజల అభ్యుదయాన్ని కాంక్షించి, సాంఘిక దురన్యాయాన్ని నిరసించేవారని, అవమానం జరిగిందని భావిస్తే ఎంతటి వారినైనా ఎదిరించే వారని శాస్త్రి సోదరి శ్రీమతి డా॥ నిర్మల స్పష్టీకరణ.

## 3. అనుబంధం

సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య మార్పుకోసం; విలువల కోసం నిరంతరం తపనపడే; మాజీ రాజకీయ శాస్త్ర ఆచార్య పర్యులు; 'విరసం ప్రసాద్' గా సుప్రసిద్ధులైన శ్రీ చలసాని ప్రసాద్ 3-3-96న విజయవాడలో అందించిన సమాచారం.

అమెరికన్ నవలా కారులు ఛార్టాన్ వైల్డ్ నవలల్లో మధ్య తరగతి జీవన చిత్రణ ఉంది; 'అల్పజీవి'కి ధార్టాన్ వైల్డ్ నవలలకి దగ్గిరి సంబంధముందని తెలిపారు.

'రాజు-మహిషి'లో వర్గ దృక్పథముంది. మధ్యతరగతి వర్గానికి గూడ డబ్బు సంపాదించే అవకాశం గాని వస్తే; ఆ ధనంతో వాళ్ళెలా దిగజారుడు తనానికి గురవుతారో రావిశాస్త్రి దీనిలో తెలియజేసారు. శ్రామిక వర్గంపై ప్రేమ; వెన్నెముక లేని మధ్యతరగతిపై అసంతృప్తి; సంపన్న వర్గంపై కసిని శాస్త్రి కనబరచారు. శాస్త్రి రచనల్లో స్పష్టమైన మార్పు ఇక్కణ్ణుంచే కనిపిస్తుందని వివరించారు. మౌఖిక సంప్రదాయంతో (oral) రాసిన నవల

'గోవులొస్తున్నాయి జాగ్రత్త' కెన్యా రచయిత 'గూగి' - 'మాటిగరి' గూడ ఈ ధోరణిలోనే సాగింది. శాస్త్రి నవలలు రాశారనటం కంటే చెప్పారనటం సముచితం. అహింస ద్వారా సమాజం మారదని శాస్త్రి నమ్మకం. 'రత్తాలు-రాంబాబు' సినిమా కోసం రాశారు. అందుకనే దానిలో వ్యాపార సంస్కృతి ఉంది. జైల్లో ఉండి రాసిన శాస్త్రి 'జైల్లోనే ఉన్న నాకు, శ్రీతుమ్మల వేణుగోపాలరావు తదితర మిత్రులకి ఈ నవలలు వినిపించేవారు; అని శ్రీ చలసాని వివరించారు. 'మూడు కథల బంగారం'లో మావో సాంస్కృతిక విప్లవ ప్రభావం ఉందని చెప్పారు. 'సొమ్ములు పోనాయండి' స్వచ్ఛమైన వర్గదృష్టితో రాసారు. అన్నాకెరేనినా; 'దిటేల్ ఆఫ్ టూ సిటీస్; ది గుడ్ ఎర్త్‌ల వలె సొమ్ములు పోనాయండిలోని నవలా ప్రారంభ వాక్యాలు గూడ విశ్వసాహిత్యంలో స్థిరంగా నిలుస్తాయని శ్రీ ప్రసాద్ విశ్లేషించారు. ఆస్తి దురాక్రమణ దాహానికి; 'ఇల్లు' ఉదాహరణ. 'వ్యాపార నాగరికత మీద పేల్చిన మరఫిరంగి 'ఇల్లు' నవల అని తెలిపారు. 'రవ్వ' 'బెదురు' పిపీలికం; వేతన శర్మ - కథలు రావిశాస్త్రి రచనా దృక్పథాన్ని; వర్గ దృష్టిని వెలువరిస్తాయి. ప్రజల జీవితాలతో సన్నిహిత సంబంధాలున్న రచయితలలో శాస్త్రి అగ్రగణ్యులని శ్రీచలసాని అభిప్రాయం. 'రత్తాలు-రాంబాబు'లోని ముత్యాలుని "ప్లెబియన్ మధువాణి" అని పిలిచారు, శ్రీ చలసాని ప్రసాద్. బీనాదేవి; పతంజలి అర్నాద్‌లపై రావిశాస్త్రి ప్రభావముందని తెలిపారు. రావిశాస్త్రికి అత్యంత ఆత్మీయ మిత్రులుగా ఆయన మనసెరిగి మసలుకొనే మంచి మనిషిగా శ్రీ చలసాని ప్రసాద్ పేరు తెచ్చుకున్నారు.

## 4. అనుబంధం

**22-4-96**న విజవాడలో శ్రీకాళీపట్నం రామారావుతో జరిపిన ముఖాముఖి

నిరాడంబర జీవితం రావిశాస్త్రిది. ఆయనకు ధనిక పేద, అనే భేదాలు తెలియవు. అందరి పట్ల సమదృష్టి. వ్యక్తిని ముందు మనిషిగా ప్రేమించేవారు, స్నేహానికి ప్రాణమిచ్చే వారు. నాకు 1953 నుండి శాస్త్రితో పరిచయముంది. దాదాపు ప్రతిరోజూ కలిసే వాళ్ళం. తన మీది నమ్మకంతో వచ్చిన వాళ్ళ కోసం ఏ సహాయం చేయటానికైన వెనుకాడేవారుకాదు. ఈ సందర్భంలో నాకొక సంఘటన కళ్ళముందు కదిలాడుతుంది. విశాఖ ప్రాంత గిరిజనులు కోర్టుకు హాజరయ్యారు. బాలగోపాల్ కూడ వాళ్ళ పక్షాన కోర్టు దగ్గరకు వచ్చారు. ఆ తరువాత వాళ్ళు తిరిగివాళ్ళ ఊరు వెళ్ళాలి. కాని ఈ కేసు తీవ్రత దృష్ట్యా పోలీసులు గూడ చాల మంది మఫ్టీలో హాజరయ్యారు. దీంతో గిరిజనులు భయపడి, రావిశాస్త్రి గారికి సమాచారం అందించారు. ఆయన ధైర్యం చెప్పి; కావలసిన భోజన, తదితర ఏర్పాట్లు చూసి; వేకువజామున నాలుగు గంటల ప్రాంతంలో నిర్మానుష్యంగా ఉండే చీకటి ప్రాంతం గుండా బస్‌స్టాండుకు చేరుకోవాల్సి ఉంటే; రావిశాస్త్రి ఆ సమయంలో పోలీసులు కాపుకాసి వున్నా; వాళ్ళను వెంటబెట్టుకొన బస్‌స్టాండుకు తీసుకువెళ్ళారు. అలావెళుతున్నప్పుడు పోలీసొకతను; ఏంటిగురూ ఎస్కార్ట్ వెళుతున్నావా? అని ప్రశ్నిస్తే రావిశాస్త్రి చిరునవ్వుతో "అబ్బేలేదు, చుట్టాలింటికి వెళుతున్నాను". అని సమాధానం చెప్పారు. శాస్త్రిగారి వాత్సల్యం, ఆదరణ అలా ఉంటుంది.

మరో ప్రేమ వివాహ సన్నివేశం గూడ నాకు జ్ఞాపకం వస్తుంది. సింహాచలం దగ్గర పెళ్ళైతే, ఆ ప్రేమికుల జంటకు ధైర్యం చెప్పి; కావలసిన అన్ని ఏర్పాట్లు జూసి; రాను

ఫోను అయ్యే ఆటోఖర్చులు వగైరా తనే భరించి; ఇలా ఆయన తనను నమ్ముకొన్న వారికోసం; స్నేహితుల కోసం; వేళాపాళా అనేది లేకుండా, డబ్బు విషయంలో కూడ రేపు అనేది లేకుండా ఖర్చుబెడుతూ; సహాయపడే వారు. పోలీసు, కోర్టు, ఆసుపత్రి వ్యవహారాలలో స్నేహితుల కోసం; సహాయ సహకారాలందించేవారు రిక్షాగాని, ఆటోరిక్షాగాని; ఎక్కితే బేరసారాలు లేవు. జేబులో డబ్బు, చేతికి ఎంత వస్తే అంత ఇచ్చి వెళ్లి పోవటమే.

శాస్త్రిగారు విపరీత వర్ణనలు చేసేవారుగదా! : రచన సాఫీగా సాగటానికవి అడ్డంకి గాదు; శాస్త్రిగారు కథకంటే కథనానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు; ఎవరేమనుకున్న, ఎన్ని విమర్శలు వచ్చినా తనకు నచ్చిన మార్గంలోనే ఆయన రచన సాగింది. తన ఆలోచనా తరంగాల్ని వెల్లడి జెయ్యటం కోసం; కొన్ని పాత్రల ద్వారా వ్యంగ్య పద్ధతిలో వర్ణనలు; ఉపన్యాసధోరణిని ఆశ్రయించేవారు. ఉదాహరణకి 'రాజు-మహిషి'లో పీనుగుమస్తాచేసే ఉపన్యాస దోరణి. ఇది ఆయన కావాలని చెయ్యరు. ఆ విషయ ప్రాధాన్యాన్ని బట్టి ఆధోరణిని ప్రవేశపెడతారు. సమాజాన్ని నెగిటివ్ కోణం నుండి చూసారనే విమర్శ వ్యాపించింది. అది విమర్శేగాని, వాస్తవంగాదు. ఎందకంటే ఆయన 1950 వరకు పోలీసు, న్యాయవ్యవస్థలు ప్రజల రక్షణార్థం, సామాజిక ప్రయోజనాలని పరిరక్షించటం కోసం ఉండేవని నమ్మేవారు. కాని 1950 తరువాత కోర్టులు, పోలీసు వాళ్ళతో తన అనుభవం ద్వారా ఆయనకు అవగతమయ్యిందే మంటే; పాలక వర్గ పరిరక్షణ కోసం; పని జేస్తున్నయేగాని; ప్రజల కోసం కాదనే విషయం బోధపడింది. అందుకనే తనకు అనుభవంలో ఉన్న; బాగా అవగతమైన ఈ పోలీసు, న్యాయవ్యవస్థల తాలూకా పాత్రల్ని, ప్రభుత్వ అణచివేత విధానాన్ని ముఖ్యంగా తన రచనల ద్వారా తూర్పార బట్టారు. 'రత్తాలు-రాంబాబు' నవల ద్వారా ఆయన ప్రేమ కథని కాకుండా; పడుపు వృత్తిని; దాని తాలూకా బాధల్ని బయటకు తీసుకొచ్చారు. కాలేకడుపుల్ని; కన్నీటి ఆకలి మంటల్ని చల్లార్చు కోవటం కోసం; ఏదారి లేక ఒళ్ళమ్ముకొని బతికే మార్గం ఎంచుకుంటే; వాళ్ళను అంటి పెట్టుకొని ఆ సొమ్ములో గూడ భాగస్వామ్యం పొందే వాళ్ళను, ఆయన అసహ్యించుకున్నారు. పడుపు వృత్తి చుట్టూ; పోలీసులు, లాయర్లు, డాక్టర్లు, రిక్షావాళ్ళు, బ్రోకర్లు, సారా అమ్మకందార్లు, కంపెనీ యజమానులు వీళ్ళంతా పరిభ్రమిస్తారు. ఆ కుళ్ళులో వీళ్ళంతా పాలు పంచుకుంటున్నారు.వీళ్ళంతా ఆ ఒళ్ళమ్ముకొనే వాళ్ళ 'సొదు' దాగి బతుకుతున్నారు. అందుకని శాస్త్రిగారు ఆయా సన్నివేశాలలో వీళ్ళందర్ని పాత్రధారుల్ని జేసారు. నెగెటివ్ విషయాల్ని బయట బెట్టారే గాని; వాటిని ఆయన సమర్థించలేదు.

మార్క్సిష్టు దృష్టి అంటూ ప్రత్యేకమైన మార్గాన్నేమి ఆయన అనుసరించలేదు. నేనూ అంతే. అయితే ఆయన్నకు మార్క్సిజమే వెలుగుబాటలాగా ఉపయోగపడింది. ఆ వెలుగు బాటలో ఆయన ముందుకు నడిచారు. లంపెన్ క్యారెక్టర్స్ అన్ని వర్ణాల్లో ఉన్నాయి. ఆ పాత్రల జీవితాల్ని; పోకడలని బయట పెట్టారే గాని; వాళ్ళను సమర్థించలేదు. వాళ్ళు అలా మారటానికి సమాజిక బాధ్యత చాలా ఉందని ఆయన ఆవేదన చెందారు.

## 5. అనుబంధం

పత్రికా రచయిత; కథ, నవలా రచయితైన శ్రీ కె. ఎస్. వై. పతంజలితో హైదాబాదులోని 'మహానగర్' పత్రికా కార్యాలయంలో 21-2-96న జరిపిన ముఖాముఖి. రావిశాస్త్రి రచనలు విజయనగరం, విశాఖమండలికాలలో నడిచాయని శ్రీపతంజలి

అభిప్రాయ పడ్డారు. రావిశాస్త్రిని తాను 'గరువుగారు' అని సంబోధిస్తానని; తన రచనలంతటలు ఆయన ప్రభావం కనిపిస్తుందని; అయితే 'ఈ విషయంలో' ఆయన ప్రభావం ఉందని కచ్చితంగా చెప్పలేనని శ్రీపతంజలి చెప్పారు. అయినప్పటికి "ఖకీవనం' 'లోని 'సూరీడు' పాత్రమాత్రం రావిశాస్త్రి ప్రభావం; ప్రేరణతో రాశానని; తొలిదశలో ఆయన ప్రభావం తనపై గాఢంగా వుందని వివరించారు.

'అర్జాద్'; 'భూఫణం'లపై రావిశాస్త్రి ప్రభావం ఉందని చెప్పారు. 'ఆత్మహత్యలు' శాస్త్రి రచనల్లో అధికమని శ్రీపతంజలి అభిప్రాయం. చెహోవ్; దస్తవ (డోస్టో)యస్కీ విక్టోరియన్ నవలా నిర్మాణానికి శాస్త్రి పాత్రలు దగ్గరగా ఉంటాయని విశ్లేషించారు. 'బీనాదేవి'పై రావిశాస్త్రి ప్రభావముందని; రావిశాస్త్రి వ్యక్తిగా మంచి స్నేహశీలి అని శ్రీ పతంజలి వ్యక్తపరిచారు.

## 6. అనుబంధం

'బీనాదేవి' పేరుతో న్యాయమూర్తియైన స్వర్గీయ బి. నరసింగరావు; ఆయన శ్రీమతి బి. సుందరమ్మ కలిపి కథలు, నవలలు రాసి తెలుగు పాఠకుల మన్ననలు పొందారనేది వాస్తవం. 22-2-96న హైదరాబాదులోని శ్రీమతి బి. సుందరమ్మ గారింట్లో; ఆమెతో జరిపిన చర్చా సారాంశం.

రావిశాస్త్రి గారిది; మాది విశాఖ ప్రాంతమే గనుక; ఆయనతో మాకు మంచి స్నేహ పూర్వక సంబంధాలున్నాయి. మా జడ్జిగారు (భర్త) గుంటూరు, తెనాలి...... ఇంకా ఎక్కడ పనిజేసిన రావిశాస్త్రి ఆ ప్రాంతాలకు వచ్చినప్పుడు తప్పని సరిగా మా ఇంట్లోనే దిగి; కుటుంబసభ్యునిగా కలిసిపోయే వారు. రావి శాస్త్రి ఎలారాస్తే; మేము అలారాయాలనే ఒక పిచ్చి భ్రమ మాకుండేది. ఆయన రచనల్ని విపరీతంగా చదవటం వల్ల; ఆయన ప్రభావం నుండి దూరంగా రాయలేక పోయాము. మారచనలపై అధికంగా రావిశాస్త్రి ప్రేరణ కనిపిస్తుంది. 'పుణ్యభూమీ కళ్ళుతెరు' నవల శాస్త్రి 'రాజు-మహిషి'కి నకలు కాదు; కాని దాని ప్రభావం మానవలపై ఉండవచ్చు. పేద ప్రజల అభ్యుదయాన్ని కాంక్షించిన మానవతామూర్తి రావిశాస్త్రి అని శ్రీమతి సుందరమ్మ శాస్త్రిని కీర్తించారు.

## 7. అనుబంధం

### రావిశాస్త్రి 'మహాప్రస్థానం'పై ప్రముఖుల నివాళి

'తెలుగు డికెన్స్ తెరమరుగుకు వెళ్ళిపోయాడు' - ఆరుద్ర;

ఆంధ్రప్రభ - 11-11-1993.

"సమాజంలో నోరులేని, న్యాయానికి నోచుకోలేని వారి కోసమే మేధావి వర్గం చివరి వరకు నిబడాలని చెప్పిన వ్యక్తి రాచకొండ విశ్వనాథ శాస్త్రి" అని అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీవరవరరావు నివాళి - ఆంధ్రప్రభ 25-11-93.

'రావి మహోన్నత జీవి' అని 'కాళోజి' పైదే

"సామాన్యులపై దయతో రాసిన రావిశాస్త్రి ఆగిపోలేదు. వాళ్ళ జీవితపు లోతుల్లోకి చొచ్చుకుపోయి, వాటిని అసామాన్యంగా రాశారాయన. శ్రమైక జీవన సౌందర్యాన్ని అశ్రామిక నుడిలో నానుడిలో పలుకులో, పలుకుబడిల్లో, చిత్రించిన తొలి తెలుగు

రచయిత రావిశాస్త్రి. 'ది మోస్ట్ ఒరిజినల్ రైటర్' " - అని శ్రీ చలసాని ప్రసాద్ అంజలి ఘటించారు. ఉదయం 22-11-1993.

'వచనాన్ని కవిత్వంగా మార్చిన మహామంత్రికుడు' రావిశాస్త్రి అని శ్రీ దాశరధి రంగాచార్య స్మరించారు. పైదే

'బడుగు జీవుల ఆర్తానాదాలకి గొప్ప ఆభరణాలు చేయించిన స్వర్ణకారుడు, డ్రమాటిక్ ....... తెలుగు సాహిత్యానికి సొమ్మలు పోనాయండి బాబు' అని ప్రముఖ కవి 'శ్రీ వేగుంట మోహన ప్రసాద్ రావిశాస్త్రికి నివాళులర్పించారు. - ఆంధ్రప్రభ - **11-11-1993.**

'జ్ఞానపీఠ అవార్డు అందుకోవలసిన ఏకైక తెలుగు రచయిత రావిశాస్త్రి' అని డా॥ కొమ్మూరి. వేణుగోపాలరావు శాస్త్రిని సంస్మరించారు. పైదే

రావిశాస్త్రి "వ్యక్తిగత జీవితం కన్నా ఆయన సాహిత్యం గొప్పది. ఆయన సాహిత్యం కన్నా ఆయన ఎంచుకున్న మార్గం. ఇంకా గొప్పది. - శ్రీకాళీపట్నం రామారావు. ఆంధ్రజ్యోతి. 11-11-93.

"కవిత్వం పేరుతో చాల మంది వచనం రాస్తే శాస్త్రిగారు మాత్రం వచనం పేరుతో అంతా కవిత్వమే రాశారు" ఆంధ్రభూమి(సం) 11-11-93.

"ఇతివృత్త స్వీకరణలో, రచనా శిల్పంలో, శైలీ విన్యాసంలో, ప్రత్యేకత నిలుపుకొని రావిశాస్త్రి ఎందరెందరికో మార్గదర్శకులయ్యారని జ్ఞానపీఠ అవార్డు గ్రహీత శ్రీ.సి. నారాయణరెడ్డి నివాళి.

"ఈ శతాబ్దపు గొప్ప రచయితగా" - శ్రీ ఆచార్య శ్రీ చేకూరి రామారావు నివాళి-

'గురజాడది మానవతా దృక్పథం; ప్రజాస్వామిక దృక్పథం, రావిశాస్త్రిది వర్గ దృక్పథం, మార్క్సిష్టు దృక్పథం, కమ్యూనిష్టు దృక్పథం" - అరుణ తార (సం) జనవరి **1994.**

"రావి శాస్త్రి కలం తన వాడిని, వేడిని సంతరించుకునే సమయానికి తెలుగు దేశంలో రాజకీయార్థిక రంగంలో తలెత్తిన మార్పుల ఫలితంగా ఆవిర్భవించిన నూతన దళారీ ధనిక వర్గం, కుహనా మధ్యతరగతి, లంపెన్ ప్రోలటేరియన్ పాత్రలనూ, మానవ సంబంధాలలో పడిపోతున్న విలువల చిత్రణనూ, అనివార్యంగా పోరాటంతప్ప మార్గంలేదని సంఘటిత పడుతున్న చైతన్యాన్ని జీవద్భాషలో రావిశాస్త్రి కలంలో సజీవతను సంతరించున్నవి" - ప్రజాసాహితి(సం) డిసెంబరు 1993.